శ్రీః

పింగళి - కాటూరి

# సౌందరనందము

అర్థతాత్పర్యములు–డా॥ చింతలపూడి వేంకటేశ్వర్లు



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారి, మోహనరావు దంపతులు

చీరాల.

# శ్రీః

# సౌందరనందనము - పింగళి - కాటూరి
# అర్థ తాత్పర్యములు
# డా॥ చింతలపూడి వేంకటేశ్వర్లు


ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : దీపావళి - 2016.

పుటలు : 187

వెల రూ. : 150/-





404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**



D.T.P.:
**Dr. CH. VENKATESWARLU**

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

# GLIMPSES OF BUDDHISM

## (compiled by N.Ramesan.M.A., I.A.S.)

## ఆధారంగా....

సౌందరనందం చదివేముందు గౌతమబుద్ధుని జీవితాన్ని గురించి కొంతైనా తెలిసికోవాలి. అందుకు మనకు ఐదు పుస్తకాలే ఉన్నాయి. ఇవి బాగా ప్రాచీనమైన రచనలు. వీటిలోవీటికి కొన్ని అభిప్రాయ భేదాలుకూడా ఉన్నాయి. అవి 1.మహావాస్తు, 2.లలితవిస్తర, 3.అశ్వఘోషుని బుద్ధచరిత్ర, 4.నిదానకథ, 5.అభినిష్క్రమణసూత్ర. ఇవేకాక సంస్కృతం లోను, పాళీభాష లోను కొన్ని సంఘటనలు కనిపిస్తున్నాయి. వీటన్నింటినిబట్టి బుద్ధునిచరిత్ర ఈవిధంగా చెప్పుకొనే అవకాశం ఉంది.

బుద్ధుని అసలుపేరు సిద్ధార్థుడు. వీనిది శాక్యవంశం. శాక్యులు కోసల రాజధాని సాకేతనగర వాసులు. సాకేతంనుండి హిమాలయపర్వత సానువులలోనికి ప్రవాసం పొందారు. సాకేతులే శాక్యులయ్యారేమో! వీరక్కడ కపిలవస్తు నగరం నిర్మించుకున్నారు. శ్రీలంక వ్రాతలనుబట్టి కపిలవస్తును ఏలిన తొలిరాజు జయసేనుడు. అతని కొడుకు సిహాహనుడు. అతని కొడుకు శుద్ధోదనుడు. శుద్ధోదనుడికి ఇద్దరు భార్యలు. వారు మహామాయాదేవి, మహాప్రజాపతి. వారిద్దరూ దేవదహుని కుమారుడైన అంజనుడి కూతుళ్ళు.

క్రీ.పూ. 623లో మహామాయకు సిద్ధార్థుడు జన్మించాడు. ప్రజాపతికి నందుడు పుట్టాడు. వీరి తండ్రివైపువారు, తల్లివైపువారు గౌతమకుటుంబంవారట. అందుకే సిద్ధార్థుని గౌతమబుద్ధుడన్నారు తరువాత. సిద్ధార్థునే సర్వార్థసిద్ధుడనీ, అంగిరసుడనీ, శాక్యముని అనీ బౌద్ధులు పిలుస్తూంటారు. సిద్ధార్థుడు పుట్టిన వారానికే తల్లి మహామాయాదేవి మరణించింది. తరువాత ప్రజాపతీదేవే సిద్ధార్థుని పెంచిపెద్దచేసింది.

పుట్టిన యాభైరోజులకు నామకరణ మహోత్సవం జరిపారు. అప్పుడా కుమారునికి పెట్టినపేరు సర్వార్థసిద్ధుడు లేక సిద్ధార్థుడు. ఆరోజున నూటయెనిమిది మంది బ్రాహ్మణులు వచ్చారు. వారిలో ఎనిమిదిమంది పుట్టుమచ్చలను చూచి జాతకం చెప్పారు. ఏడుగురు బాలునిచూచి ఇతడు అయితే చక్రవర్తి కాగలడు లేదా మహాజ్ఞాని అవుతాడని చెప్పారు. ఎనిమిదో బ్రాహ్మణుడు మాత్రం మహాజ్ఞాని కావడం తప్పదన్నాడు. తండ్రికిది రుచించలేదు. అలా కాకుండా ఏదైనా మార్గం చెప్పమన్నాడు. అందుకా బ్రాహ్మణుడు ఇతడు సన్యాసి కాకుండా ఉండాలంటే ఇతనికి ముసలివాడుకాని, రోగగ్రస్థుడుకాని, మృతమానవ కళేబరం కాని, మరొక సన్యాసికాని కనబడకుండా చేయమన్నాడు. రాజు ఆవిధంగానే తనపరివారాన్ని ఆజ్ఞాపించాడు.

కొన్నాళ్ళు గడిచాయి. అప్పట్లో రాజులు ఏరువాక పండుగను చాలాఘనంగా జరిపేవారు. అలాగే శుద్ధోదనుడు తనతో తనకుమారుని తీసికొని వెళ్ళాడు. కొడుకును ఒక నేరేడు చెట్టుక్రింద కూర్చోబెట్టి వానిని చూడటానికి కొంతమంది పరిచారికలను నియమించాడు. నూటెనిమిది అరకలు ఒక్కసారిగా సాగాయి. రాజు బంగారునాగలి పట్టు కున్నాడు. అధికారులు వెండి నాగళ్ళు, రైతులు కొయ్యనాగళ్ళు పట్టుకున్నారు. ఏరువాక మహోత్సాహంగా సాగుతోంది. ఉత్సవం మంచి పరాకాష్ఠకు చేరుకొంది. పరిచారికలు బాలుని వదిలేసి ఉత్సవం చూడబోయారు. బాలుడు ఒక్కడే ఉన్నాడు. అక్కడే బాచంపీట వేసికొని తన శ్వాసమీదే మనసుపెట్టి కూర్చుండిపోయాడు. పరిచారికలు తిరిగివచ్చేసరికి సాయంత్రమైంది. చెట్లనీడలన్నీ దూరంగా సాగిపోయాయి. కాని బాలుడు కూర్చున్న చెట్టు నీడమాత్రం కదలకుండా అలాగే ఉండిపోయింది. అదిచూచి అందరూ ఆశ్చర్యపోయారు. రాజుకుకూడా అనుమానం కలిగింది. కట్టడి పెంచాడు.

సిద్ధార్థుడు పదహారేళ్ళు వచ్చేదాకా సుఖంగా రాజభోగాలమధ్య పెరిగాడు. తండ్రి శుద్ధోదనుడు కొడుకుకు ఇక పెండ్లిచేసి రాజ్యం అప్పగిద్దామనుకున్నాడు. అందుకు అతనికో పరీక్ష ఉంది. వెయ్యిమంది బలంగల వింటికి నారితొడగాలి. సిద్ధార్థుడు నారితొడిగి మీటాడు. అందరూ ఏదో పిడుగు మీదపడిందనుకున్నారు. ఆ విధంగా రాకుమారుడు పన్నెండు అద్భుతమైన పనులు చేసిచూపించాడు. ఆదెబ్బతో రాజులంతా తమతమ కూతుళ్ళను ఇస్తామని ముందుకొచ్చారు. చివరికి శాక్య దండపాణి కూతురు యశోధరను రాకుమారుడు ఇష్టపడ్డాడు. ఆమెకే గోప, బింబ అనే పేర్లున్నాయి. పెండ్లి వైభవంగా జరిగింది.

తరువాత రాకుమారుని యౌవనమంతా యశోధర కౌగిళ్ళలో, సంగీత మంద్ర నాదాలనడుమ గడచిపోయింది. అతనికేవిధమైన ప్రపంచ చింతనా కలుగకూడదని రాజ శాసనం. ఇవన్నీ అనుభవిస్తున్నా సిద్ధార్థుని లోలోపల ఏదో తెలియని వేదన సలుపుతూనే ఉంది. అలాగే పన్నెండు సంవత్సరాలు గడచిపోయాయి. సిద్ధార్థునికి ఇరవైతొమ్మిదేళ్ళు నిండాయి. ఇక రాజ్యం కట్టబెట్టాలి.

ఒకరోజున సిద్ధార్థుడు సైంధవజాతి గుఱ్ఱాలు పూన్చిన రథంమీద తమతోటకు బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళాక దారిలో జుట్టుతెల్లబడి, పళ్ళూడిపోయి వంగబడి కఱ్ఱసాయంతో నడుస్తూన్న మనిషి కనిపించాడు. రాకుమారుడు సారథిని అతనలా నడుస్తున్నాడేమిటి అనడిగాడు. అందుకు సారథి చెన్నుడు రాజాజ్ఞ మరచిపోయి 'పుట్టిన ప్రతివాడూ చివరికింతేగదా' అని బదులిచ్చాడు. దీనిని ముసలితనం అంటారన్నాడు. అలా ఆరోజున బ్రాహ్మణుడు చెప్పిన ముసలివాని దర్శనం జరిగింది. ఇలాగే ఒకదాని తరువాత

ఒకటిగా మిగిలిన మూడు దర్శనాలూ జరిగాయి. సిద్ధార్థునిలో కలవరం బయలుదేరింది. చివరిదైన సన్యాసిదర్శనంతో తన లక్ష్యం ద్యోతకమైంది. అశాశ్వతమైన ప్రాపంచిక సుఖాలను ఏవగించుకొని ఈ జీవితానికి దూరంగా పోవడమేగదా సన్యాసమంటే!

ఒకరోజున తోటదగ్గర నాట్యకత్తెలమధ్య ఆనందంగా గడుపుతూన్నాడు సిద్ధార్థుడు. నాట్యకత్తెలు శృంగారభావాలు అభినయిస్తూన్నారు. ఒకర్తె అతని చెవుల్లో శృంగార భావనలు రేకెత్తించే పాటలు పాడుతోంది. కాని అతని ఆత్మకివేం అంటడంలేదు. తిరిగి రాజభవనానికి చేరుకున్నాడు. అప్పటికి భార్య యశోధర మగబిడ్డను ప్రసవించింది. అది విన్నంతనే సిద్ధార్థుని నోట 'రాహుల పుట్టింది' అనివచ్చింది. అతని దృష్టిలో రాహుల అంటే బంధం. కాని ఆ మాట విన్న శుద్ధోదనుడు ఆ పిల్లవానికి రాహులుడు అని పేరు పెట్టాడు.

తరువాత ఒకనాటి అర్ధరాత్రి సిద్ధార్థునికి మెలకువ వచ్చింది. చుట్టూ పాటకత్తెలు నిద్రపోతున్నారు. అతని కొక్కసారిగా ఈ భౌతిక ప్రపంచాన్నీ, ఇందులోని సుఖాల్ని అన్నిటినీ విడిచిపెట్టాలని బుద్ధిపుట్టింది. తన సారథి చెన్నుడిని పిలిపించి తన గుఱ్ఱం కంటకాన్ని సిద్ధం చేయమన్నాడు. ఈలోపల తన కుమారుని ఓమారు చూడాలనుకొన్నాడు. తన భార్య పరున్న గదిదగ్గరకు వెళ్ళాడు. మెల్లగా తలుపు త్రోసి లోపలికి తొంగిచూచాడు. లోపల మల్లెల సువాసనలు గుప్పుమన్నాయి. యశోధర కొడుకుమీద చేయివేసి పడుకుంది. లోపలికెళ్ళి కొడుకును దగ్గరకు తీసికోవాలనుకున్నాడు. కాని భార్యకు మెలకువ వస్తే తన ప్రయాణానికి అడ్డం వస్తుందనుకున్నాడు. తాననుకొన్నది సాధించినతరువాతే కొడుకును చూడాలని నిశ్చయించుకున్నాడు. కొడుకును ముద్దాడకుండానే అతని ప్రయాణం సాగింది.

ఆ విధంగా వెళ్ళిన సిద్ధార్థుడు తన తపస్సు ఫలించి తాను బుద్ధుడైన తరువాత తన ధర్మప్రచారం జరుపుకొంటూ, శిష్యులను కలుపుకొంటూ క్రమంగా కపిలవస్తు చేరాడు. తరువాత బుద్ధ నందుల సమావేశం గురించి ఆ పుస్తకంలో ఏముందో చూడండి....

Only the next day was the royal consecration of *Nanda*, half-brother of Buddha and son of *Mahaprajapati*, as heir-apparent, and also the occasion of his marriage. Buddha came and gave *Nanda* his bowl to hold, and then after uttering a *mangala* rose to go without taking back the bowl. *Nanda* had to follow him with the bowl to the monastery, and was unable to resist the Buddha, when he asked him to renounce the world. His love for the beautiful *Sundari* whom he was to have married, haunted him for long afterwards, but when Buddha took

him miraculously to heaven, and showed him the heavenly nymphs, the spell broke and he grew to be a good monk.

ఇక మహాయాన బౌద్ధప్రచారకుడు అశ్వఘోషుని సౌందరనందంలో కథ ఎంతవరకు పెంచబడిందో చూద్దాం. ఇది కావ్యరూపంలో వ్రాయబడింది. ఇది అశ్వఘోషుని రెండవ కావ్యం. కావ్యం అనగానే కొంత కల్పన తప్పదుకదా!

This is the second poem by *Asvaghosha* who might be considered to be the greatest master of *Sanskrit* of his day and who became a model for his own and future generations.

*Soundarananda* kavya deals with the history of the loves of *Sundari* and *Nanda*, the ordination by the Buddha of *Nanda*, his half brother, the sorrow of *Sundari* at the loss of her lover, *Nanda's* yearning for *Sundari*, his painful struggle to overcome his earth bound love and turn his mind to spiritual matters with the guidance and help of the Buddha and finally the success when he becomes an *arhat* and looks forward to attaining the *Parinirvana* at the end of this life.

Just as *Sundari*, the beautiful wife of *Nanda*, mourns and laments for her lost husband, so *Nanda*, too, longs to be back with his beloved. Vain are the attempts of the other monks to calm him. Even Buddha's words fail to change his mood. Then the Master takes him by the hand, and ascends with him to heaven. On the way they see in the *Himalayas* an ugly, one eyed female ape, and Buddha ask him whether *Sundari* is more beautiful than this, which *Nanda* of course enthusiastically affirms. Soon they see in heaven the Apsaras, the heavenly nymphs, and *Nanda* thinks that the difference between the last-named and his wife, is just as great as between her and the, one eyed ape. From the moment he has an ardent desire for heavenly women, and on his return to earth, devotes himself diligently to ascetic practices in order to reach heaven. Then *Ananda Nanda* is convinced, and goes to Buddha, in order to tell him that he no longer desires the heavenly women. Buddha

rejoices greatly at this, and preaches to him (in several cantoes) the principles of his doctrine. Now *Nanda* retires into the forest, practises the four great meditations, and becomes an *Arhat*. Thankfully he goes to Buddha and pays homage to him, but the Master exhorts him, now that he has attained his object, to preach the good doctrine to others, out of pity, and so as to lead them to liberation.

ఇదీ అశ్వఘోషుని కథాసారాంశం. దీనిని బట్టి మన పింగళి–కాటూరి కవులు ఎంత కల్పన చేసారో ఎక్కడ మార్పులు చేసారో తెలిసికోవాలంటే ఇక సౌందరనందం విపులంగా చదవండి....

శ్రీః

# సౌందరనందము

## పునరాగమనము

**యన్మహాత్యాగమహిమమ్ము నాలకించి**
**మూఁడుకాలముల్ రోమాంచమును వహించు**
**నేడుదీవులకున్ బ్రాఁకి యెవని ధర్మ**
**లతలు ననలెత్తె నాశాక్యపతిసుతుండు.**

**అర్థాలు:** యత్=ఎవరియొక్క, మహా=గొప్పదైన, త్యాగ=విడిచిపెట్టే గుణంయొక్క, మహిమమ్ము=ప్రభావం, ఆలకించి=విని, మూఁడుకాలముల్= గడచిన గడుస్తున్న గడవ బోయే కాలాలు మూడింటికి, రోమాంచమును= గగుర్పాటు, వహించు=కలగుతుందో; యెవని=ఎవనియొక్క, ధర్మలతలు=ధర్మం అనే తీగలు, ఏడుదీవులకున్= ఏడుదీవులకును వ్యాపించిన ప్రపంచమంతా, ప్రాఁకి=వ్యాపించి, ననలెత్తె=పూచాయో, ఆ=అటువంటి, శాక్యపతిసుతుండు=శాక్యదేశాధిపతి కుమారుడు.

**తాత్పర్యం:** *శాక్యదేశరాజకుమారుడు గౌతముడు. అతని దానగుణం మూడుకాలాల్లోనూ పొగడబడింది. అతని ధర్మగుణం ప్రపంచమంతా ప్రసిద్ధికెక్కింది.*

**తనతోడిదే లోకమని నమ్మి దరిద్రొక్కి**
**యున్నట్టి పితృదేవు నుజ్జగించి**
**యురమునవ్రాలి మైమఱచి నిద్దురచెందు**
**లలితాంగి స్నేహవల్లరిని ద్రెంచి**
**తనసేఁత కరమొద్పుఁగనుల నవ్వుచుఁ గూర్కు**
**పట్టిపైఁ జను కూర్మి పట్టి తిగిచి**
**తనమూఁపుపైఁ గేలుఁదలిరు చాఁపఁగజూచు**
**పుడమిచేడియకు దోబూచిచేసి**

**సత్యమార్గ గవేషణాసక్తుఁ డగుచు**
**నడవులం జొచ్చి తపముల నాచరించి**
**'నేతి నేతి' యటంచు ననేకగతుల**
**బడలి కనుఁగొనెఁ దుదకు నిర్వాణపథము.**

**అర్థాలు:** తనతోడిదే=గౌతముడితోనే, లోకము+అని= మిగిలిన జీవితం అనుకొని, నమ్మి= నమ్ముకొని, దరి=చివరి రోజుకు, త్రొక్కియున్నట్టి= ఎదురుచూస్తున్న, పితృదేవు=తండ్రిని, ఉజ్జగించి=వదిలిపెట్టి; ఉరమున వ్రాలి= గుండెలమీద పడుకొని, మైమఱచి= వళ్ళుమరచి, నిద్దురచెందు=నిద్రపొయ్యే, లలితాంగి= అందమైన భార్యయొక్క స్నేహవల్లరిని=ప్రేమ పాశాన్ని, త్రెంచి=తెంపివేసి; తనసేతకు=తనయొక్క అనురాగానికి, అరమోడ్పు కనుల= సగంమూసిన కళ్ళతో, నవ్వుచు+కూర్కు=నవ్వుతూ నిద్రపోయే, పట్టిపై+చను=కుమారునిపై ప్రసరించే, కూర్మి=ప్రేమను, పట్టి=బలవంతంగా, తిగిచి=వెనక్కుతీసికొని; తనమూపుపై= తనభుజాలపైన, కేలు+తలిరు= చిగురువంటి చేతులు, చాఁపఁగజూచు=ఊనుకోవడానికి ప్రయత్నించే, పుడమిచేడియకు=రాజ్యం అనే చెలికి, దోబూచిచేసి=దొంగతనంగా తప్పుకొని; సత్య మార్గ=శాశ్వతమైనదారిని, గవేషణ+ఆసక్తుఁడగుచు= వెదుకుటయందు కోరికతో, అడవులన్+చొచ్చి=అడవులలోకి వెళ్ళి, తపములను ఆచరించి= తపస్సులుచేసి, న+ఇతి, న+ఇతి=ఇదికాదు, ఇదికాదు, అటంచు=అని తర్కిస్తూ, అనేకగతుల=ఎన్నోవిధాలుగా, బడలి=శ్రమించి, తుదకు=చివరకు, నిర్వాణపథము=ముక్తికి దారిని, కనుఁగొనె=తెలిసికొన్నాడు.

**తాత్పర్యం:** *తనమీదనే ప్రాణాలుపెట్టుకొని బ్రతికే తండ్రిని విడిచిపెట్టి, నమ్మకంతో గుండెల మీద నిద్రపోయే భార్యను వదిలిపెట్టి, అరమోడ్పుకళ్ళతో నవ్వుతూ నిద్రపోయే కొడుకుపై ప్రేమను త్రెంపుకొని, భుజాలపై కుదురుకోనున్న రాజ్యాన్ని త్యజించి సత్యమార్గాన్వేషణలో అడవులబట్టి ఇదికాదు, ఇదికాదు అంటూ తపస్సుచేసి తర్కించి చివరకు ముక్తిమార్గాన్ని తెలిసికొన్నాడు గౌతముడు.*

**పరమపదామృత మ్మటులు పారణసల్పిన యాత్మబోధముల్**
**విరిసి తమంతటన్ హృదయవీథుల వెల్లువలై తొలంకెనా**
**నరుణసరోజసుందర తదక్షియుగమ్మున జాలువాఱె సం**
**సరణమహాబ్ధిమగ్నమగు మానవకోటిపయిన్ గృపాఝరుల్.**

**అర్థాలు:** పరమపద+అమృతము=మోక్షమనే అమృతాన్ని, అటుల=ఆ విధంగా, పారణ+ సల్పిన= నెమరు వేయగా, ఆత్మబోధముల్=తనంటే ఏమిటన్న ఎరుకలు, విరిసి=విప్పారి, తమంతటన్= వాటంతట అవే, హృదయ వీధుల=గుండెలదారులవెంట, వెల్లువలై= ప్రవాహాలుగా, తొలంకెనాన్=చిందాయా అన్నట్లు, కృపాఝరుల్= గౌతముని దయావాహినులు, సంసరణ=సంసారమనే, మహాబ్ధి=గొప్ప సముద్రంలో, మగ్నము+అగు= మునిగి పోతున్న, మానవకోటి=జనులందరి, పయిన్=పయిన, అరుణసరోజసుందర=ఎర్రతామరల వలె అందములైన, తత్+అక్షియుగమ్మున= ఆ కన్నులనుండి, జాలువాఱె=వెన్నెలవలె ప్రసరించాయి.

**తాత్పర్యం:** *గౌతముడు ఆవిధంగా మోక్షమనే అమృతాన్ని పారణచేయగా లోపలవిరిసిన ఆత్మబోధనలు వాటంతట అవే గుండెలవెంట కన్నులలోనికి ప్రవహించి సంసారమనే సముద్రంలో మునిగిపోతున్న మానవులమీదికి వెన్నెలజాలులా ప్రసరించింది.*

**అమ్మహితాత్ముఁ డంతట మహాద్భుతమైన వినూత్న ధర్మచ**
**క్రమ్మును గేలఁ ద్రిప్పుచుఁ బురమ్ములు చేరఁగవచ్చెఁ బాలసం**
**ద్రమ్మున నుద్భవించిన సుధాకలశమ్మును దాల్చి నాకలో**
**కమ్మునవారిఁ బ్రోచుటకుఁగా దరిచేరిన వెజ్జుకైవడిన్.**

**అర్థాలు:** ఆ+మహితాత్ముడు=ఆగొప్ప ఆత్మగల గౌతముడు, అంతట=సిద్ధిపొందినతరువాత, మహాద్భుతమైన=గొప్పప్రభావంగల, వినూత్న=సరిక్రొత్తదైన, ధర్మచక్రమ్మును=సత్యం అహింస అనే ధర్మచక్రాన్ని, కేలన్=తనచేతిలో, త్రిప్పుచున్= తిప్పుకొంటూ, పాలసంద్రమ్మునన్= పాలసముద్రంలో, ఉద్భవించిన=పుట్టిన, సుధా కలశమ్మును= అమృతపు గిన్నెను, తాల్చి=ధరించి, నాకలోకమ్మునవారిన్=స్వర్గంలోవుండే దేవతలను, ప్రోచుటకుఁగాన్= రక్షించుటకుగాను, దరిచేరిన=దగ్గరకు వచ్చిన, వెజ్జుకైవడిన్=వైద్యుడైన ధన్వంతరివలె, పురమ్ములు= పట్టణాలలో, చేరఁగవచ్చెన్=ప్రవేశించడానికి వచ్చాడు.

**తాత్పర్యం:** *సిద్ధిపొందిన గౌతముడు తన అహింస అనే సరిక్రొత్త ఆయుధాన్ని చేతబట్టుకొని అమృతపుగిన్నెతో పాలసముద్రంలో పుట్టిన ధన్వంతరి దేవతల్ని కాపాడటానికి వచ్చినట్లు పురప్రజల్ని కాపాడటానికి వచ్చాడు.*

**వారణాసీముఖక్షేత్రవరములందుఁ**
**బండిత సదస్సులంగూర్చి పరమనూత్న**
**ధర్మము నుపన్యసించె సదస్యులెల్లఁ**
**బదులుపలుక నెఱుంగక ప్రణుతిసేయు.**

**అర్థాలు:** వారణాసీముఖ=కాశీ మొదలైన, క్షేత్రవరములందున్=పుణ్యక్షేత్రాలలోని, పండిత సదస్సులంగూర్చి= పండిత పరిషత్తులందు, పరమనూత్న=మిక్కిలి కొత్తదైన, ధర్మమున్= గౌతముడు తెలిసికొన్న అహింసాధర్మం గురించి, ఉపన్యసించె=ప్రసంగించాడు, సదస్యులెల్లన్=ఆయాసభాసదులందరు, బదులుపలుకన్=సమాధానం చెప్పటం, ఎఱుంగక= తెలియక, ప్రణుతిసేయు=వానిని అభినందించారు.

**తాత్పర్యం:** *గౌతముడు కాశీ మొదలైన పట్టణాలలోని పండితులమధ్య తాను తెలిసికొన్న క్రొత్తధర్మాన్ని గురించి ప్రసంగించాడు. వారంతా సమధానం చెప్పలేక తలలు వంచారు.*

**పల్లెలఁ బట్టనమ్ముల నవారిగ నీగతి ధర్మబీజముల్**
**చల్లుచునేగుచో, నడుగుసాగఁగనీయక 'మాకు మా'కటం**

**చెల్లరుఁ జుట్టువాఱుదురఁటే! తినుబండము చేతనుండఁగాఁ**
**దల్లినిజేరు పిల్లల విధంబున, నా పలుకెంత తీపియో!**

**అర్థాలు:** పల్లెలన్=సామాన్య ప్రజలుండే గ్రామాలలోను, పట్టనమ్ములన్=నాగరికులుండే పట్టణాలలోను, ఈగతి=ఈవిధంగా, అవారిగ=ఎదురులేకుండా, ధర్మబీజముల్= తాను తెలిసికొన్న నీతివిత్తనాలను, చల్లుచున్ ఏగుచోన్= చల్లుకుంటూ వెడుతూంటే, అడుగు సాగఁగ నీయక= అడుగు ముందుకు పడనీయకుండా, తినుబండము=తినేవస్తువు, చేతన్+ ఉండఁగా=చేతిలో ఉన్నప్పుడు, తల్లినిజేరు= అమ్మచుట్టూచేరే, పిల్లల విధంబున=పిల్లలవలె, మాకు మాకు అటంచున్= మాకంటే మాకుపెట్టమంటూ, ఎల్లరు=అందరూ, చుట్టు వాఱుదురఁటే=చుట్టూచేరతారటకదా! ఆ పలుకు=ఆమాటల్లో, ఎంతతీపియో=ఎంత తీపి ఉంటుందో కదా!

**తాత్పర్యం:** *ఈ విధంగా గౌతముడు తనధర్మాన్ని ప్రచారం చేసికొంటూ వెడుతూంటే అన్ని వర్గాల ప్రజలు చుట్టూచేరి అమ్మచేతిలోని మిఠాయిచుట్టూ మూగే పిల్లల్లాగా మాకంటే మాకు చెప్పమని ఆయన్ని కదలకుండా చేస్తున్నారట. ఆమాటల్లో ఎంతతీపి ఉందోకదా!*

**పండితుఁడైన బ్రాహ్మణుఁడుఁ బామరుఁడైన నిషాదుఁడున్, ధరా**
**ఖండలుఁడున్ దదీయశిబికావహుఁడున్, రణధూర్వహుండు, భీ**
**రుండును, వారు వీ రనుచు రోయక యెల్లరుఁ గూడిమాడి కే**
**ల్దండలుపట్టి పోఁదగిన దారి ప్రజాళికిఁ జూపి చెప్పుచున్.**

**అర్థాలు:** పండితుఁడైన బ్రాహ్మణుండున్=అన్నీతెలిసిన బ్రాహ్మణుడు కాని, పామరుఁడైన నిషాదుఁడున్=ఏమీ తెలియని ఆటవికుడు కాని, ధర+ఆఖండలుఁడున్=భూమిమీది దేవేంద్రుడైనా, తదీయ శిబికావహుఁడున్= అతని పల్లకీమోసేవాడైనా, రణధూర్వహుండు= యుద్ధభారాన్ని మోసేవాడైనా, భీరుండును=పిరికివాడైనా, వారువీరనుచు= వాళ్ళూవీళ్ళంటూ, రోయక=విమర్శచేయకుండా, ఎల్లరున్=అందరూ, కూడిమాడి=కలసిమెలసి, కేల్దండలు పట్టి=చేయీచేయీపట్టుకొని, పోన్+తగిన=పోవడానికి తగిన, దారి=మార్గం, ప్రజాళికిన్= వచ్చిన జనులందరికి, చూపి=చూపిస్తూ, చెప్పుచున్=చెప్పుకొంటూ... పైపద్యంతో అన్వయం.

**తాత్పర్యం:** *పండితుడైనా, పామరుడైనా, రాజైనా, వాని బంట్రైనా, ధైర్యవంతుడైనా, పిరికి వాడైనా, ఎటువంటి భేదంలేకుండా అందరికీ కలిసిపోదగిన దారిగురించి చెప్పుకుంటూ...*

**నలుదెసలఁ బొంచిన వృకాళివలన భీతి**
**మాన్పి గొల్లఁడు గొఱియల మనుచురీతి**
**జననమరణరుజాభీతి జనులకెల్లఁ**
**బాపి సుగతుం దశోకమౌ పదముఁ జేర్చు.**

**అర్థాలు:** గొల్లఁడు=గొల్లవాడు, నలుదెసలన్=నాలుగువైపులనుండి, పొంచిన=పొంచివున్న, వృకాళి

వలన=తోడేళ్ళనుండి, భీతిమాన్పి=భయాన్నిపోగొట్టి, గొఱియల=తనగొఱ్ఱెలను, మనుచురీతి= కాపాడేవిధంగా, సుగతుండు=మంచిమార్గంలో ఉన్న గౌతముడు, జనులకు= ప్రజలకు, జనన మరణ రుజా భీతి=పుట్టుక, చావు, ముసలితనం వలనకలిగే భయాన్ని, ఎల్లన్ బాపి=మొత్తాన్ని పోగొట్టి, అశోకమౌ=దుఃఖంలేనట్టి, పదమున్+ చేర్చు=స్థితిని చేరుస్తాడు.

**తాత్పర్యం:** *గొల్లవాడెట్లాగైతే నాలుగువైపులా పొంచివున్న తోడేళ్ళనుండి తనగొఱ్ఱెల్ని కాపాడు కుంటాడో అట్లాగే గౌతముడు చావుపుట్టుకలనుండి, ముసలితనంనుండి ప్రజల్ని కాపాడి దుః ఖంలేనట్టి స్థితికి తీసికొనివెడుతున్నాడు.*

**తనమెట్టిన పల్లీ ప**
**త్తనములు తీర్థమ్ములగుచుఁ దనరఁగ భవతా**
**పనివారకబోధామృత**
**మును గురియుచుఁ గపిలవస్తు పురమున్ దరిసెన్.**

**అర్థాలు:** తనమెట్టిన=గౌతముడు తాను అడుగుపెట్టిన, పల్లీ పత్తనములు=పల్లెలు పట్టణాలు, తీర్థమ్ములు+ అగుచున్=పుణ్యదాయకాలు ఔతూ, తనరఁగ=పరిఢవిల్లగా, భవతాప=పుట్టుక వలనకలిగే బాధలను, నివారక= పోగొట్టే, బోధామృతమును=విజ్ఞానమనే అమృతాన్ని, కురియుచు=వర్షిస్తూ, కపిలవస్తు పురమున్=కపిలవస్తు అనే నగరాన్ని, దరిసెన్=చేరాడు.

**తాత్పర్యం:** *గౌతముడు అడుగుపెట్టిన చోటల్లా పుణ్యస్థలాలుగా మారుతూంటే జన్మవల్ల కలిగే బాధల్ని పోగొట్టే జ్ఞానామృతాన్ని వెదజల్లుతూ కపిలవస్తునగరాన్ని చేరుకున్నాడు.*

**అలనాఁటి నడిరేయి నశ్వరాజము వెన్ను**
**చమరి వీడ్కొనినట్టి స్థలము దాఁటి,**
**చెన్నతి దౌలఁ దోఁచిన రాజగృహలక్ష్మి**
**పుల్కు పుల్కునఁ దన్నుఁ బోల్చికొనఁగ**
**నెలగోలుమూఁకల యెల్గుల సౌధవా**
**తాయనమ్ము లపావృతములుగాఁగఁ**
**దలుపులు తెఱచి పౌరులు కిమితిబ్రువా**
**ణులగుచు వెఱగంది నిలిచిచూడ**

**నాత్తపరతత్త్వ బోధమౌ నాత్మతేజ**
**మానసేందుని బరివేషమై భజింపఁ**
**బురము చొత్తెంచి నిలిచిన బోధిసత్త్వుఁ**
**గనుకనిన్ గని పౌరులు గములుగూడి,**

# అర్థతాత్పర్యాలు

**అర్థాలు:** అలనాఁటి=ఆనాటి, నడిరేయిన్=అర్ధరాత్రిపూట, అశ్వరాజము=ఉత్తమమైన గుఱ్ఱాన్ని, వెన్ను చమరి=తనను తీసికొనివచ్చినందుకు కృతజ్ఞతగా వెన్నుతట్టి, వీడ్కొనినట్టి=విడిచిపెట్టిన, స్థలముదాఁటి=చోటును గడచి; చెన్నఱి=కళగోల్పోయి, దౌలన్=దూరంగా, తోఁచిన= త్రోసివేసిన, రాజగృహలక్ష్మి=అంతఃపురం అనే సంపద, పుల్కుపుల్కునన్=కనురెప్పలు మాటిమాటికి మూస్తూతెరుస్తూ, తన్నున్=తనను, పోల్చికొనఁగ= పోల్చిచూస్తుండగా; ఎలగోలు మూఁకల=సేనాసమూహంయొక్క, ఎల్గుల=కంఠధ్వనులతో, సౌధవాతాయనమ్ములు= మేడ కిటికీలు, అపావృతములు కాఁగన్=కప్పబడిపోగా, పౌరులు=పురజనులు, తలుపులు తెఱచి=తమతమ యిళ్ళతలుపులు తెరచి ఒక్కసారిగా చూచి, కిమితిబ్రువాణులు+అగుచు= ఇదిఏమనుకొంటూ, వెఱగంది= భయపడి, నిలిచిచూడన్=కళ్ళార్పకుండా చూస్తూండగా; ఆత్త=పొందబడిన, పరతత్త్వ=ఐహికానికి అతీతమైన భావాన్నిగురించిన, బోధమౌ= తెలియజెప్పే, ఆత్మతేజ=స్వంతకాంతితోకూడిన, మానస+ ఇందుని=మనస్సనే చంద్రుని, పరివేషమై=కాంతిమండలమై, భజింప=కీర్తిస్తూండగా; పురము=నగరాన్ని, చొత్తెంచి= ప్రవేశించి, నిలిచిన=నిలబడ్డ, బోధిసత్త్వున్=బలమైనబోధచేయగల గౌతముని, కనుకనిన్= సావధానంగా, పౌరులు= పురజనులు, గములుగూడి=గుంపులుగాచేరి, కని=చూచి; ముందుపద్యంతో అన్వయం.

**తాత్పర్యం:** *అడవికిపోతూ తన అశ్వాన్ని ప్రేమతో వదిలేసిన స్థలాన్ని దాటి, తను వద్దని వదిలి పెట్టినందుకు కళకోల్పోయిన రాజసౌధం తాను కనిపించినంతనే కళ్ళుచిట్లించి తన్ను పోల్చుకుంటుంటే, తనను చూచినవెంటనే గోలగోలచేస్తున్న సైన్యపు ధ్వనులతో నిండిపోయిన మేడల కిటికీలతో, ఏమిటీవింత అనుకుంటూ పురజనులు అవాక్కయిపోతే, తాను సంపాదించిన క్రొత్తసిద్ధాంతపు కాంతిచక్రంతో నగరంలో ప్రవేశించగానే సావధానంగా గుంపులుగూడిన జనం ఆగౌతముణ్ణి చూచి...*

**బోధిసత్త్వుఁ డనుచు మునికులమణి యంచు**
**భూపసుతుఁడు సంగముక్తుఁ డనుచు**
**శాక్యరత్న మనుచు శౌద్ధోదని యటంచు**
**నడుగడుగున విన్న యాజనమ్ము,**

**అర్థాలు:** బోధిసత్త్వుఁడనుచు=ఇతడే బోధిసత్త్వుడుగా మారిన గౌతముడు అనుకొంటూ, మునికులమణి యంచు=తపస్సుచేసినవారిలో గొప్పవాడనుకొంటూ, భూపసుతుఁడు= మా రాజకుమారుడు, సంగముక్తుఁ డనుచు=అన్ని బంధాలను త్రెంచుకొన్నవాడంటూ, శాక్యరత్న మనుచు=మాశాక్యవంశంలో రత్నంలాంటివాడంటూ, శౌద్ధోదనియటంచు=మా రాజు శుద్ధోదనుని కుమారుడనుకొంటూ, విన్న=ఆయనగురించి తెలిసికొన్న, ఆ జనమ్ము= ఆ పౌరజనం, అడుగడుగున=అడుగడుక్కూ... ముందుపద్యంతో అన్వయం.

**తాత్పర్యం:** *ఇతడే సిద్ధిపొందిన గౌతముడు, గొప్ప తపశ్శాలి, బంధాలకతీతుడు, శాక్యముని, మనరాజు శుద్ధోదనుని కుమారుడు అనివిన్న పౌరజనులు ఆయన్ని కదలనీయకుండా అడ్డుపడుతూ....*

**అతఁడఁటే, సుకృతాత్మయైన మాయాదేవి**
**కడుపారఁ గన్న బంగారుతండ్రి!**
**ఆలుబిడ్డలును రాజ్యముఁ దృణమ్ముగఁ గాన**
**కేగినట్టి విరక్తుఁ డీతఁ డఁటవె!**
**వీఁడెయౌనే, కన్నబిడ్డలవలె మమ్ము**
**రక్షించుననుకొన్న రాసుతుండు!**
**మనబోఁటి పాపులకును మోక్షము నొసంగ**
**నరుదెంచు పుణ్యాత్ముఁ డఁటవె యితఁడు!**

**ఎంతభాగ్యమె, యెన్నాళ్ళకే లభించె**
**సౌమ్యగంభీరమైన యీ చక్కనయ్య**
**నెమ్మొగము గాంచు పుణ్యమ్ము, నిఖిలజగము**
**లేలఁగలవాఁడు కాఁదగఁడే యితండు.**

**అర్థాలు:** అతఁడఁటే=అతడేకదా, సుకృతాత్మయైన=పుణ్యాత్మురాలైన, మాయాదేవి=మన మహారాణి మాయాదేవి, కడుపారన్=కడుపుపంటగా, కన్న=ప్రసవించిన, బంగారుతండ్రి= బంగారంవంటి సంతానం; ఆలుబిడ్డలును= భార్యాపిల్లల్ని, రాజ్యమున్=పాలనాధికారాన్ని, తృణమ్ముగన్=గడ్డిపోచవలె భావించి, కానకు+ఏగినట్టి=అడవికి వెళ్ళిన, విరక్తుఁడు=కోరిక లేనివాడు, ఈతఁడు+అఁటవె= ఇతడేకదా; వీఁడెయౌనే=ఇతడేకదా, కన్నబిడ్డలవలె=తన సంతానంలాగ, మమ్ము=మనలనందరిని, రక్షించును+అనుకొన్న= కాపాడతాడని భావించిన, రాసుతుండు= రాజకుమారుడు; మనబోఁటి=మనవంటి, పాపులకును=పాపాలుచేసిన వారికి కూడ, మోక్షమును+ఒసంగ= ముక్తినివ్వటానికి, అరుదెంచు=వస్తున్న, పుణ్యాత్ముఁడు= దయగలవాడు, ఇతడు+అఁటవె=ఈతడేకదా; ఇతండు= ఈమహానుభావుడు, నిఖిలజగము= లోకాలనన్నిటిని, ఏలఁగలవాఁడు=పాలించదగినవాడు, కాన్‌తగడే=కావడానికి తగినవాడు కదా, సౌమ్యగంభీరమైన=చల్లని బిగుతైన, ఈ చక్కని అయ్య=ఈ చక్కనివాని, నెమ్మొగము=అందమైన ముఖాన్ని, కాంచు=చూచే, పుణ్యమ్ము=మంచిపని, ఎన్నాళ్ళకే=ఎంతకాలానికి, లభించె=మనకు దొరికింది! ఎంత భాగ్యమె=మనం ఎంత అదృష్టవంతులమో!

**తాత్పర్యం:** *మనమహారాణి మనసుతీరా కన్న బంగారుతండ్రి ఇతడేకదా! భార్యను పిల్లల్ని రాజ్యాన్నికూడా గడ్డిపరకలా విడిచిపెట్టి అడవులకు వెళ్ళిన విరక్తుడు ఇతడేకదా! మనల్ని బిడ్డల్లా కాపాడతాడు అనుకున్న రాజకుమారుడు ఇతడేకదా! చివరకు మనబోటి పాపాత్ములకు ముక్తినివ్వడానికి సిద్ధిపొంది వచ్చినవాడు ఇతడేకదా! లోకాలన్నీ కాపాడే సమర్థుడైన ఈ చక్కనయ్య ముఖం చూచేభాగ్యం ఎన్నాళ్ళకు మనకు కలిగింది!*

**మున్ను గుఱాలజంటలను బూన్చిన బంగరుతేరి పగ్గముల్**
**చెన్నఁడు తాల్పఁగా సరిగచేలలు దాలిచి తూర్పుఁగొండపై**
**నున్న సరోజబాంధవునియొప్పున నేగెడి రాచబిడ్డకా!**
**ప్రన్నని మేనఁ గావియును, బాదచరత్వముఁ, గక్షపాలయున్.**

**అర్థాలు:** మున్ను=గతకాలంలో, గుఱాలజంటలను=జంటగుఱ్ఱాలను, పూన్చిన=కట్టిన, బంగరుతేరి పగ్గముల్=బంగారురథంయొక్క పగ్గాలు, చెన్నడు=చెన్నడు అనేసారథి, తాల్పఁగా=పట్టుకోగా, సరిగచేలలు= జలతారు వస్త్రాలు, తాలిచి=ధరించి, తూర్పుఁగొండపైనున్న= ఉదయపర్వతంమీదనున్న, సరోజబాంధవుని= సరోజాలకు బంధువైన సూర్యునికి, ఒప్పున= సరిపడునట్లుగా, ఏగెడి=వెళ్ళిన, రాచబిడ్డకా=రాజకుమారునికా, ప్రన్నని=లలితమైన, మేనన్=వంటిమీద, కావియు=కాషాయబట్టలు, పాదచరత్వమున్=కాలినడక, కక్షపాలయున్= సన్యాసుల సంచీనా!

**తాత్పర్యం:** *అప్పుడు చెన్నడు రథంతోలుతూంటే మంచి పట్టువస్త్రాలుధరించి ఉదయ సూర్యునిలా వెలిగిన మా రాజకుమారునికా ఈ కాషాయాలు, ఈ కాలినడక, ఈ సన్యాసుల సంచీ... ఆశ్చర్యంగా లేదూ!*

**మునుపటినాళ్ళఁ బౌరజనమున్ గనినంతనె పేరు పేరునన్**
**నెనరును జిందు చూపులను నెయ్యపు మాటలఁదేర్చు ఱేఁ 'డహో'**
**యనఁడు 'సుఖమ్మె' యంచడుగఁ డప్పటి కిప్పుడు చూచియున్; మఱే**
**మనఁగల, దీపురమ్ముదెస నాదృతిమానెనొ, విస్మరించెనో?**

అర్థాలు: మునుపటినాళ్ళన్=ఇదివరకటిరోజులలో, పౌరజనమున్=ఊరిజనాన్ని, కనినంతనె= చూచినంతనే, నెనరును జిందు=ప్రీతినివర్షించే, చూపులను=చూపులతో, నెయ్యపు=స్నేహపు, మాటలన్= మాటలతో, పేరు పేరునన్=పేరుపేరునా, తేర్చు=పలకరించే, ఱేఁడు=రాజు, అహో అనఁడు=పలకరించడు, అప్పటికిప్పుడు చూచియున్=ఇంతకాలం తరువాత చూచికూడా, సుఖమ్మె అంచు అడుగఁడు=బాగున్నారా అని అడగడు, మఱి+ఏమనఁగలదు= ఇంకేమనగలం? ఈ పురమ్ముదెస=ఈ నగరమంటే, ఆదృతి మానెనొ=ఆదరం తగ్గిందో, విస్మరించెనో=లేక ఊరినే మరిచిపోయాడో?

**తాత్పర్యం:** *ఇదివరకు ఈజనాన్ని చూచినంతనే పేరుపేరునా పలకరించే రాజకుమారుడు ఇంతకాలానికి తిరిగివచ్చికూడా పలకరించడు.. ఏమనగలం, ఈ ఊరంటే మొహంమొత్తిందో లేక మరచిపోయాడో కదా!*

**అనుచుఁ జేరనరిగి యక్కజంపడువారు**
**బుద్ధదేవ! మమ్ముఁ బ్రోవుమనుచుఁ**
**జక్క దౌల నిలిచి సాఁగిలపడువారు**
**దరియ నరిగి కుశల మరయువారు–**

**అర్థాలు:** అనుచున్=అనుకొంటూ, చేరన్+అరిగి=దగ్గరికిచేరి, అక్కజము+పడువారు= ఆశ్చర్యపడేవారు; బుద్ధదేవ=ఓ దైవమైన బుద్ధుడా, మమ్మున్=దీనులమైన మమ్మల్ని, ప్రోవుము+అనుచున్=రక్షించమంటూ, చక్కన+దౌల=కొంచెం దూరంలో, నిలిచి=నిలబడి, సాఁగిలపడువారు=సాష్టాంగపడేవారు; దరియన్+అరిగి= చనవుతో దగ్గరికివెళ్ళి, కుశలము=క్షేమాలు, అరయువారు=విచారించేవారు; ముందుపద్యంతో అన్వయం.

**తాత్పర్యం:** *అలా అనుకొంటూ దగ్గరకువెళ్ళి ఆశ్చర్యం వ్యక్తంచేసేవాళ్ళు కొందరు, బుద్ధదేవా మమ్మల్ని కాపాడమంటూ సాష్టాంగపడేవాళ్ళు కొందరూ, బాగాదగ్గరకు చేరి క్షేమసమాచారం కనుక్కునేవాళ్ళు కొందరూ....*

**అయిన స్త్రీబాలవృద్ధప్రజాళికతన**
**వెల్లివిరిసిన నదివోలె విరిసెఁ బురము**
**రాచవారెల్ల గౌతము రాక వినుచుఁ**
**దీర్థమున కేగుపగిది నేతెంచి రపుడు.**

**అర్థాలు:** అయిన=ఈవిధంగానైన, స్త్రీ+బాల+వృద్ధ+ప్రజాళి కతన= ఆడువారు, పిల్లలు, ముసలివారు అయిన జనులవలన, వెల్లివిరిసిన=పరుగులుపెట్టే, నదివోలె=ప్రవాహంలాగా, పురము=ఆనగరం, విరిసె=నిండిపోయింది. రాచవారెల్ల=రాజకుటుంబంవారందరూ, గౌతము=గౌతముడు, రాక వినుచున్=వస్తున్నాడని తెలియగానే, తీర్థమునకు=పుణ్యస్థలానికి, ఏగుపగిది=వెళ్ళేవిధంగా, అపుడు=ఆసమయంలో, ఏతెంచిరి=పరుగుపరుగున వచ్చారు.

**తాత్పర్యం:** *ఈవిధంగా ఆబాలగోపాలం పెద్దప్రవాహంలాగా నగరంమంతా నిండి పోయారు. గౌతముని రాకవిని రాజకుటుంబంవారంతా పరుగుపరుగునా వచ్చారు.*

**తడియాఱని కన్గవయున్**
**బొడియాఱిన నోరు నౌచుఁ బుత్రునికై చే**
**ద్పడియున్న వృద్ధభూపతి**
**తడఁబడుచున్ జేరవచ్చెఁ 'దనయా' యనుచున్.**

**అర్థాలు:** తడియాఱని=తడిచేవున్న, కన్గవతో=కనులతో, పొడియాఱిన=పొడిగామారిన, నోరున్+ఔచు=నోటితో, పుత్రునికై=తన కుమారునికై, చేద్పడియున్న=పరితపించుచున్న, వృద్ధభూపతి=ముసలివాడైన శుద్ధోదనమహారాజు, తనయా యనుచున్=నా కుమారా అంటూ, తడఁబడుచున్=పడుతూ లేస్తూ, చేరవచ్చెన్=దగ్గరకు వచ్చాడు.

**తాత్పర్యం:** *ఆరిపోని కళ్ళతో ఆరిపోయిన నోటితో కొడుకుకోసం తల్లడిల్లుతున్న ముసలి రాజు హా..కొడుకా అంటూ తడబడుతూ దగ్గరకు వచ్చాడు.*

**కజ్జలహీనమై కాంతిబాసిన కనుం**
**గొనలందు బాష్పాంబుకణము లురల**
**విగతసంస్కారమై వ్రేలు పెన్నెటికురుల్**
**సెదరి వెన్నునఁ జిక్కుజీరువడఁగ**

**వసివాళ్ళువాడిన పసిఁడిమైతీవ సం**
**భ్రమయానవశతఁ గంపమువహింపఁ**
**బాలినచెక్కిళ్ళ పయిపయిన్ జాలువా**
**టిన కంటినీరు చారికలు గట్ట**

**నంతిపురి వీడి వచ్చి శూన్యావలోక**
**నములఁ గాంతుని గనుచు, రూపము వహించు**
**శోకమున దౌల నిల్చె యశోధరయును**
**కొడుకుకూఁకటి నొకకేలఁ బుడికికొనుచు.**

**అర్థాలు:** కజ్జలహీనమై=కాటుకలేక, కాంతిన్+పాసిన=కాంతిపోగొట్టుకున్న, కనుంగొనలందు=కన్నుల చివరలందు, బాష్పాంబు కణములు=కన్నీటిబొట్లు, ఉరల=రాలిపడుతూండగా; విగత సంస్కారమై=దువ్వుకోకపోవడం వలన, వ్రేలు=వ్రేలాడుతున్న, పెను+నెఱికురుల్=పొడవైన బిరుసెక్కిన వెంట్రుకలు, సెదరి=చెదిరిపోయి, వెన్నునన్=వెనుకవైపున, చిక్కుజీరువడఁగ=పొడిబారిపోగా; వసివాళ్ళు వాడిన=బాగావాడిపోయిన, పసిఁడి మైతీవ=బంగారుచాయగల తీగవంటి శరీరం, సంభ్రమ= తొట్రుపాటుతో, యాన వశతన్=నడిచినందువల్ల, కంపము వహింపన్=వణికిపోతూండగా; పాలిన చెక్కిళ్ళ=పాలిపోయిన చెక్కిళ్ళకు, పయిపయిన్=మీదగా, జాలు వాఱిన=కారిన, కంటినీరు=కన్నీరు, చారికలు గట్ట=ఎండిపోయి చారలుకట్టగా; అంతిపురి=అంతఃపురాన్ని, వీడి వచ్చి=వదలివచ్చి, శూన్యావలోకనములన్=బేలచూపులతో, కాంతుని=మగని, కనుచు= చూస్తూ, యశోధర యును=గౌతమునిభార్య యశోధరకూడా, ఒకకేలన్=ఒకచేత్తో, కొడుకు కూకటి= కొడుకుజుట్టును, పుడికికొనుచు= మెదుపుతూ, రూపము వహించు=రూపుగొన్న, శోకమున= దుఃఖంతో, దౌల నిల్చె=కాస్తదూరంగా నిలబడింది.

**తాత్పర్యం:** *కాటుకలేక పేలవమైన కళ్ళనుండి కన్నీళ్ళు కారుతూండగా, దువ్వుకోక చెదరి పోయినజుట్టు వీపున పొడిబారిపోగా, వాడిపోయిన ఆమెశరీరం తొట్రుబాటులో కంపించి పోతూండగా, పాలిపోయిన చెక్కిళ్ళమీద కన్నీరు చారికలుకట్టగా, అంతఃపురాన్నివదలివచ్చి బేలచూపులతో మగనిచూస్తూ ఒకచేతిని కొడుకుజుట్టులోనికి పోనిచ్చి మూర్తీభవించిన శోకదేవతలా గౌతమునిభార్య యశోధర అంతదూరంగా నిలబడింది.*

**మమతావిరహితమున్ సం**
**భ్రమదూరముఁ గరుణరసతరంగితమున్ శాం**
**తమహోదారమగు కటా**
**క్షమునన్ దజ్జనముఁ గనుచు గౌతముఁ డనియెన్.**

**అర్థాలు:** మమతావిరహితమున్=నావారనే భావనలేని, సంభ్రమ దూరమున్=తొట్రుబాటు లేని, కరుణ రస తరంగితమున్=దయాగుణంతో తడిచిపోయిన, శాంత మహోదారము అగు=ప్రశాంతము సౌమ్యమైన,

కటాక్షమునన్=కడగంటిచూపుతో, తత్+జనమున్=ఆ వచ్చిన జనాన్ని, కనుచు=చూస్తూ, గౌతముఁడు=ఆ గౌతమ బుద్ధుడు, అనియెన్=ఇట్లా అన్నాడు.

**తాత్పర్యం:** *ఏ బంధమూలేని, తొట్రుబాటులేని, దయారసంలో తడిచిన, శాంతమూ సౌమ్యమూనైన కటాక్షంతో వచ్చినజనాన్ని చూచి గౌతముడిట్లా అన్నాడు.*

**సుతుఁడంచున్ బతియంచు బాంధవుఁడటంచున్ మోహవిభ్రాంతిసం**
**గతులై, దుస్తరశోకవార్ధిఁ బడి చీకాకైన యో జీవసం**
**తతులారా! కలిపాశబద్ధులగు నార్తప్రాణులారా! జను**
**ర్మృతిసంపీడితులార! సత్యపథమున్ మీరెల్ల రాలింపుఁడీ!**

**అర్థాలు:** సుతుఁడు+అంచున్=ఇతడు నా కొడుకు అనుకొంటూ, పతి+అంచు=ఇతడు మగడు అనుకొంటూ, బాంధవుఁడటంచున్=ఇతడు నాకు కావలసినవాడంటూ, మోహవిభ్రాంతి= అజ్ఞానం అనే భ్రాంతిలో, సంగతులై= మునిగిపోయి; దుస్తర=దాటరాని, శోకవార్ధిన్=దుఃఖం అనే సముద్రంలో, పడి=పడిపోయి, చీకాకైన= చిక్కుల్లో పడుతున్న, ఓ జీవసంతతులారా= ఓ జనులారా; కలిపాశ=కలికాలం అనే త్రాళ్ళతో, బద్ధులగు=కట్టుబడిన, ఆర్త=బాధనొందే, ప్రాణులారా=జీవులారా; జనుర్మృతి=చావుపుట్టుకలచేత, పీడితులార=పీడింపబడేనరులారా, మీరు+ఎల్లరు=మీరంతా, సత్యపథమున్=నిజమైనదారిగురించి, ఆలింపుఁడీ=వినండి.

తాత్పర్యం: ఇతడు నా కొడుకు, ఇతడు నామగడు, ఇతడు నాబంధువు అంటూ అజ్ఞానంలో పడి, భయంకరమైన శోకసముద్రంలో మునిగిపోయిన జీవులారా! కలిబంధాలతో కట్టుబడి దుఃఖిస్తున్న ప్రాణులారా! చావుపుట్టుకలచేత పీడింపబడే నరులారా! మీకు నిజమైన దారిని గురించి చెప్తాను వినండి.

**భావింపన్ క్షణభంగురమ్మయిన జీవవ్రాతమున్ నమ్మి, యే**
**లా విభ్రాంతమతిన్ భవాంధువునఁ ద్రెళ్ళన్‌జూతు రయ్యోయ్యో! యీ**
**చావుంబుట్టువులేల? కామ్యమృగతృష్ణావారికై పర్వులే**
**లా? వేభంగులసృష్టి నిత్యపదవాచ్యం బున్న విన్పింపుఁడీ!**

**అర్థాలు:** అయ్యోయ్యో=అయ్యో, భావింపన్=ఆలోచిస్తే, క్షణభంగురమ్ము+అయిన=రెప్పపాటులో మళ్ళీ కనిపించని, జీవవ్రాతమున్=ఈ ప్రాణిసమూహాన్ని, నమ్మి=నమ్ముకొని, విభ్రాంతమతిన్=చలించిన మతితో, భవాంధువునన్=జన్మ అనే అంధకారంలో, ఏలా= ఎందుకు, త్రెళ్ళన్ చూతురు=పడిపోవాలని కోరుకుంటారు! ఏల=ఎందుకు, ఈ చావుం బుట్టువులు=జననమరణాలు? ఏల=ఎందుకు, కామ్య=కోరికలనే, మృగతృష్ణావారికై= ఎండ మావులనీటికోసం, పర్వులు=పరుగులుతీస్తారు? వేభంగుల=వేయి విధాలుగానైనా, సృష్టి= ఈ లోకంలో, నిత్యపదవాచ్యంబు= శాశ్వతమైనదేదైనా, ఉన్న=ఉంటే, విన్పింపుఁడీ=చెప్పండి.

**తాత్పర్యం:** *అయ్యో! ఎందుకు క్షణంలో నశించిపోయే ప్రపంచంకోసం సంసారమనే చీకట్లో పడిపోతారు? ఎందుకీ చావుపుట్టుకలు? ఎందుకు ఎండమావుల్లో నీళ్ళు త్రాగాలని పరుగులు తీస్తారు? ఈ లోకంలో శాశ్వతమైనదేదైనా ఉంటే వేయివిధాలుగా ఆలోచించి చెప్పండి.*

**మొద లీ సంసృతి బంధకారణముఁదన్మోక్షమ్ము నూహింపలే**
**కెద హింసారతి నూని పాపమతులై యేలా చెడన్? ద్రొక్కఁగాఁ**
**గదరయ్యా! నవధర్మమార్గమును, వక్కాణింపుఁడీ సత్యభూ**
**తదయాశీల త్రిశబ్దయుక్తమగు మంత్రంబర్థి వేనోళులన్.**

**అర్థాలు:** మొదలు=మొదటగా, బంధకారణమున్=అన్ని చిక్కులకు కారణమైన, ఈ సంసృతి= ఈ సంసారాన్ని, తత్+మోక్షమ్మున్=దానినుండి విడుదలను, ఊహింపలేక=తెలిసికోలేక, ఎదన్=హృదయంలో, హింసారతిన్+ఊని= పీడించడమనే కోరికతో, పాపమతులై=చెడు ఆలోచనలతో, ఏలా చెడన్=ఎందుకు చెడిపోతారు? నవధర్మ మార్గమును=క్రొత్తదైన ఈ న్యాయమార్గంలో, త్రొక్కఁగాన్=నడవడానికి, కదరయ్యా=ప్రయత్నించలేరా! అర్థిన్= కోరికతో, వేనోళులన్=అందరూకలిసి, సత్య+భూతదయా+శీల=సత్యం, అహింస, సత్ప్రవర్తన అనే, త్రిశబ్ద=మూడు మాటలతో, యుక్తమగు=కూడిన, మంత్రంబు=ఈ మంత్రాన్ని, వక్కాణింపుడు=ఒక్కసారి అనండి.

**తాత్పర్యం:** *మొదట అన్ని చిక్కులకు మూలమైన ఈ సంసారం గురించి, దానినుండి విడుదల గురించి తెలిసికోలేక మీరు పాపమతులై ఎందుకు చెడిపోతారు? క్రొత్తమార్గాన్ని బోధిస్తాను, అవలంబించండి. మీరందరూ కలిసి మూడు మాటలతో ఉన్న ఈ మంత్రాన్ని పలకండి. నిజం మాట్లాడతాను. ఎవరికీ కీడు తలపెట్టను. మంచిగా నడచుకుంటాను.*

**యమనియమమ్ము లాకులు, యథార్థము నాభి, సమాధి నేమియై**
**యమరిన ధర్మచక్రము దయామతిఁ దాలిచి త్రిప్పరయ్య! యా**
**యమునకు బొమ్మవెట్టియు, భవాసురు నౌదల మెట్టి, మోక్షకాం**
**త మెడను తాలిగట్టుటకుఁ దారసిలున్ శుభతంతుసంతతుల్.**

**అర్థాలు:** ఆకులు=కమ్మలు, యమనియమమ్ములు=యమాలు పది, నియమాలు పది, నాభి=కేంద్రం, యథార్థము=సత్యం, సమాధి=ఏకాగ్రత, నేమియై=బండికట్టుగా, అమరిన= ఏర్పడ్డ, ధర్మచక్రము=ధర్మమనే చక్రాన్ని, దయామతిన్=దయగల మనసుతో, తాలిచి= చేతపట్టుకొని, త్రిప్పరయ్య=తిప్పకూడదా! ఆ యమునకు=ఆ యమధర్మరాజుకు, బొమ్మ వెట్టియు=పటం కట్టి, భవాసురున్=జన్మ అనే రాక్షసుని, ఔదలమెట్టి=దూరంగా త్రొక్కి, మోక్షకాంత మెడను=విముక్తి అనే సుందరి మెడలో, తాలిన్=మంగళసూత్రాన్ని కట్టుటకున్= కట్టేందుకు, శుభతంతు సంతతుల్=మంగళకరమైన దారపుపోగులు, తారసిలున్=సమకూడుతాయి.

**తాత్పర్యం:** *భారతజాతీయ పతాకంమీద ఉండేదే బుద్ధునిధర్మచక్రం. దాని రేకులే*

*యమనియమాలు. కేంద్రం సత్యం. చుట్టూ ఉన్నసున్నా ఏకాగ్రత. అలా ఏర్పడ్డ ధర్మచక్రాన్ని చేత త్రిప్పండి. ఫలితంగా మృత్యువుకు సున్న చుట్టవచ్చు. జన్మరాక్షసుని దూరంగా త్రొక్కెయ్య వచ్చు. అప్పుడు ముక్తికాంతమెడలో కట్టేందుకు మంగళసూత్రం సమకూరుతుంది.*

**భవమను నైంద్రజాలికుని పాణితలమ్మునఁ జిక్కి, నశ్వరం**
**బవు సుఖచంచలాద్యుతులకై వలపూని, సువర్ణశృంఖలల్**
**దవిలిచి యొండొకళ్ళకు సదా నటియింతురు కీలుబొమ్మలై;**
**తవిలి చరింపరాదె నవధర్మము జన్మ విముక్తి కల్గెడున్.**

**అర్థాలు:** భవము+అను=జన్మ అనే, ఇంద్రజాలికుని=గారడివాని, పాణితలమ్మునన్=చేతికి, చిక్కి=దొరికిపోయి, నశ్వరంబవు=నశించిపోయే, సుఖచంచలా=మెరుపులవంటి సుఖాల, ద్యుతులకై=కాంతులకై, వలపూని= ప్రేమ నింపుకొని, ఒండొకళ్ళకు=ఒకరికొకరు, సువర్ణ శృంఖలల్=బంగారపుసంకెళ్ళు, తవిలిచి=తగిలించుకొని, సదా= ఎప్పుడూ, కీలుబొమ్మలై= మరబొమ్మలుగా, నటియింతురు=నటనచేస్తున్నారు. నవధర్మము=ఈక్రొత్త ధర్మాన్ని, తవిలి= ఆచరించి, చరింపరాదె=నడచుకోకూడదా? జన్మ=ఈ పుట్టుకనుండి, విముక్తి=విడుదల, కల్గెడున్= కలుగుతుంది కదా!

**తాత్పర్యం:** *సంసారమనే గారడివాని చేతికి చిక్కి మెరుపులవంటి సుఖాలకోం ఒకళ్ళనొకళ్ళు ప్రేమ అనే సంకెళ్ళు తగిలించుకొని కీలుబొమ్మలై నటిస్తున్నారేల? నేను చెప్పే ఈ క్రొత్త ధర్మాన్ని ఆచరించకూడదా! ఈ జనన మరణాలనుండి ముక్తి కలుగుతుంది కదా!*

**చరియింపరే! పాపసంఘాత తిమిరప**
**లాయనమంత్ర మస్తేయపథము**
**పాలింపరే! యపవర్గదుర్గకవాట**
**పాటనమ్మిది సత్యవాఙ్నియమము**
**కైకొనరే! లోకకల్యాణ కృద్ధర్మ**
**సారభూతం బహింసావ్రతమ్ము**
**అంగీకరింపరే! యలరువింటికి దురా**
**సదమైన యీ బ్రహ్మచర్యదీక్ష**

**తాల్పరే! శాంతిదాంతినిధానములకు**
**మహిత సిద్ధాంజనమ్ము సమత్వబుద్ధి;**
**ఆమయ జరాపమృత్యువు లంటనీని**
**శీలకవచమ్ము దీనిఁ గైసేసికొనరె!**

**అర్థాలు:** పాప సంఘాత తిమిర=దుష్కార్యసమూహమనే చీకటిని, పలాయన మంత్రమ్= పారద్రోలేమంత్రమైన,

అస్తేయ పథము=దొంగతనం చేయకూడదనే దారిలో, చరియింపరే= నడువకూడదా! అపవర్గ దుర్గ= మోక్షమనే కోటయొక్క, కవాట పాటనమ్ము=తలుపులను తెరువగలిగిన, సత్యవాక్=నిజంచెప్పటమనే, నియమము=వ్రతం, ఇది=దీనిని, పాలింపరే= పాటించకూడదా! లోక కల్యాణ కృత్=లోకానికి మేలుచేసే, ధర్మ సారభూతమ్=ధర్మంలో నిగ్గైనది, అహింసా వ్రతమ్ము=కీడుచేయకూడదనే దీక్షను, కైకొనరే=చేపట్టకూడదా! అలరు వింటికి=మన్మథ బాణానికి, దురాసదమైన=మంటపుట్టించేదైన, ఈ బ్రహ్మచర్యదీక్ష= కుటుంబానికి దూరంగా ఉండే ఈవ్రతానికి, అంగీకరింపరే=ఒప్పుకోకూడదా! శాంతి దాంతి నిధానములకు=పుట్టుకతోవచ్చిన, తరువాత వచ్చిన బుద్ధులను అదుపులో ఉంచుకోవడమనే క్రియకు, మహిత సిద్ధాంజనమ్ము=గొప్ప మందు అయిన, సమత్వబుద్ధి= సమానంగా చూడటమనే బుద్ధిని, తాల్పరే=ధరించకూడదా! ఆమయ=రోగముగాని, జర=ముసలితనం కాని, అపమృత్యువు=ఆకస్మికమైన చావునుకాని, అంటనీని= దరికిరానీయని, శీల కవచమ్ము= అభ్యాసమనే పైతొడుగు, దీనిన్= దీనిని, కైసేసికొనరె=స్వంతం చేసికోకూడదా!

**తాత్పర్యం:** *పాపాలనే చీకట్లను తొలిగించే అస్తేయమనే దారిలో మీరు నడవకూడదా! మోక్షద్వారాలను తెరవగలిగిన నిజంమాట్లాడే వ్రతాన్ని పాటించకూడదా! లోకానికి మేలుచేసే పరమధర్మమైన అహింసాదీక్షను చేపట్టకూడదా! మన్మథుడి బాణాలనుసైతం కాల్చివేసే బ్రహ్మచర్య వ్రతాన్ని ఒప్పుకోకూడదా! పుట్టుకతో వచ్చిన బుద్ధులను, పుట్టినాకవచ్చే బుద్ధులను అదుపులో ఉంచుకోవడమనే ప్రక్రియకు పరమ ఔషధమైన సమానబుద్ధిని అలవాటు చేసికో రాదా! రోగాన్ని, ముసలితనాన్ని, హఠాన్మరణాన్ని దరికిరానీయని ఈ అభ్యాసాన్ని మీ స్వంతం చేసికోకూడదా!*

**ఇది సత్యం, బిది నిత్యం,**
**బిది భవలతికాలవిత్ర, మిది శితదంష్ట్రా**
**వదనయగు మిత్తియౌదలఁ**
**బదార్పణము, భవ్యమోక్షపద మియ్యదియే.**

**అర్థాలు:** ఇది సత్యంబు=ఇది నిజమైనది, ఇది నిత్యంబు=ఇది శాశ్వతమైంది, ఇది భవ లతికా లవిత్రము= ఇది జన్మ బంధాలను త్రెంచేకొడవలి, ఇది=ఈ సిద్ధాంతం, శిత=వాడియైన, దంష్ట్రా=పళ్ళు కలిగిన, వదనయగు= ముఖంతో ఉన్న, మిత్తియౌదల=మృత్యువు నెత్తిమీద, పదార్పణము=కాలుంచేది, భవ్య=శుభమైన, మోక్షపదము= ముక్తి అనే పదవి, ఇయ్యదియే= ఇది మాత్రమే.

**తాత్పర్యం:** *నా యీ సిద్ధాంతం నిజం, శాశ్వతం, భవబంధాలకు కొడవలి, వాడిపళ్ళ ముఖంతోనున్న మృత్యువు నెత్తిమీద కాలు. ఇదిమాత్రమే శుభకరమైన మోక్షానికి చేరే దారి.*

**అని చాలించిన, వింజ మాకిడినయట్లై శ్రోతృలోకమ్ము క**
**న్గొనలన్ హర్షజలమ్ము నిండఁ గనుగొంచున్, భక్తిరంగత్తరం**

**గనిమజ్జన్మృదితాంతరంగమగుచున్ గైమోడ్పుసంధించి, బు**
**ద్ధునిపాదమ్ముల వ్రాలె; వృద్ధనరనాథుం డంత మున్నాడుచున్,**

**అర్థాలు:** అని=ఈవిధంగా చెప్పి, చాలించిన=ముగించినంతనే, శ్రోతృలోకమ్ము=వినడానికి వచ్చిన ప్రజలు, వింజము= తమదారికి వింధ్యపర్వతం, ఆకిడిన+అట్లై=అడ్డుపడినట్లుగా, కన్గొనలన్= కళ్ళచివర్లలో, హర్షజలమ్ము= ఆనంద బాష్పాలు, నిండన్=నిండటాన్ని, కనుగొంచున్=చూస్తూండగా, భక్తిరంగత్=భక్తిరసం యొక్క, తరంగ= అలలలో, నిమజ్జన్=మునిగి, మృదితాంతరంగము= కరిగిపోయిన ఆత్మ, అగుచున్=కలిగినవారగుచూ, కైమోడ్పు సంధించి= రెండుచేతులతో నమస్కరించి, అంత=అప్పుడు, వృద్ధ=ముసలివాడైన, నరనాథుండు=రాజైన శుద్ధోదనుడు, మున్ను+ ఆడుచున్=ఈవిధంగా అంటూ, బుద్ధుని=బుద్ధభగవానుని, పాదమ్ముల=పాదాలపైన, వ్రాలె=వాలిపోయాడు.

**తాత్పర్యం:** *అనిచెప్పి బుద్ధుడు ఆగిపోగా వినేవారందరికీ వారి కోర్కెల ప్రవాహానికి వింధ్య పర్వతాలు అడ్డుపడినట్లుగా వారివారి కోర్కెలు మరచిపోయి, వారి కళ్ళనిండా ఆనంద బాష్పాలు కురవడం చూచాడు. అప్పుడు ఆ ముసలిరాజు శుద్ధోదనుడు భక్తిరసప్రవాహంలో మునిగిపోయి ఆయన స్వాంతం అందులో కరిగిపోగా, చేతులు జోడించి క్రిందివిధంగా చెప్పుకొంటూ బుద్ధుని పాదాలమీద వాలిపోయాడు.*

**'చిరకాలం బనపత్యతాకలుషశుష్కీభూతుఁడై యున్న నా**
**దురితమ్మున్ దొలఁగింపఁ బుట్టితని సంతోషించితిన్ దొల్లి, యో**
**కరుణాసాగర! కేవలమ్ము నపవర్గప్రాప్తిసంధాతయౌ**
**గురుఁడం చిప్పు డెఱింగికొంటి నినుఁ గన్గొంటి మిన్నంటితిన్.**

**అర్థాలు:** ఓ కరుణాసాగర=ఓ దయాసముద్రుడా! తొల్లి=పూర్వం, చిరకాలంబు=ఎంతోకాలంగా, అనపత్యతా= పిల్లలులేనందున కలిగిన, కలుష=దోషంచేత, శుష్కీభూతుఁడై+ఉన్న=దిగులుతో ఎండిపోయిన, నా=నాయొక్క, దురితమ్మున్=పాపాన్ని, తొలగింపన్=తొలగించడానికి, పుట్టితి+అని=పుట్టావని, సంతోషించితిన్=ఆనందపడ్డాను. ఇప్పుడు=ఇప్పటికి, అపవర్గ+ ప్రాప్తి=మోక్షముయొక్క పొందును, సంధాతయౌ=చేకూర్చే, గురుఁడు=మార్గదర్శి, కేవలమ్ము= మాత్రమే, అంచు=అని, ఎఱింగికొంటి=తెలిసికొన్నాను. నినున్=నీవంటే ఏమిటో, కన్గొంటి= కనుక్కున్నాను. మిన్నంటితిన్=ఆనందంతో పొంగి ఆకాశాన్ని అందుకున్నాను.

**తాత్పర్యం:** *ఓ దయాసాగరా! అప్పుడు పిల్లలులేరన్న దిగులుతో శుష్కించిపోగా నా పాపాన్ని పోగొట్టడానికి నీవు పుట్టావని సంతోషించాను. కాని, ఇప్పుడు ఈ లోకం మొత్తానికి మోక్షం కలిగించే మార్గదర్శివని తెలిసికొన్నాను. నీవంటే ఏమిటో తెలిసి ఆనందంతో పొంగి పోతున్నాను.*

**దేవ! యీ దీనునకు ధర్మదీక్ష యొసఁగు,**
**మనుచు నంజలిఁబట్టి యార్ద్రతముఁ దాల్పఁ;**

**దక్కు జన మంత నధికారతారతమ్య**
**ములకు ననురూపమైన దీక్షలు వహించె.**

**అర్థాలు:** దేవ=ఓ దైవసమానా! ఈ దీనునకు=ఈ దయనీయ జీవికి, ధర్మదీక్ష యొసఁగు= నీ తథాగత వ్రతాన్ని ప్రసాదించు, అనుచున్=అంటూ, అంజలిన్+పట్టి=దోసిలిపట్టి, ఆర్హతమున్=బౌద్ధసన్యాసికి కావలసిన యోగ్యతను, తాల్పన్=పుచ్చుకోగా, తక్కుజనమంతన్= మిగిలిన ప్రజానీకమంతా, అధికార తారతమ్యములకు= పదవులలో వ్యత్యాసములను బట్టి, అనురూపమైన=యోగ్యతానుసారంగా, దీక్షలు=తగిన సంస్కారాలను, వహించె= పొందారు.

**తాత్పర్యం:** *ఓ దైవసమానుడా! ఈ దయనీయునికి నీ తథాగత వ్రతాన్ని ప్రసాదించు అంటూ రాజు దోసిలిపట్టి బౌద్ధసన్యాసికి కావలసిన ఆర్హత యోగ్యతను స్వీకరించాడు. తరువాత మిగిలిన జనమంతా వారివారి యోగ్యతానుసారంగా తగినవిధంగా సంస్కారాలను స్వీకరించారు.*

**పతిపదాబ్జముల వ్రాలి, పాదధూళి**
**తనయునకు రక్షగా మోముఁదమ్మి నిలిపి,**
**'నీ కివే జోత' లనిపించె నిర్వికార**
**మానస యశోధర గుణప్రసూనలతిక.**

**అర్థాలు:** నిర్వికార మానస=భావశూన్యమైన మనసుకలదియైన, గుణ ప్రసూన లతిక=సద్గుణాలనే పూవులతీగ, యశోధర= గౌతమునిభార్య, పతి=భర్తయొక్క పద+అబ్జముల=పాదాలనే తామరపూలమీద, వ్రాలి=వంగి, పాదధూళి=ఆ పాదాలకంటిన మంటిరేణువులను, తనయునకు=చిన్నికుమారునకు, రక్షగా=రక్షణగా, మోముఁదమ్మి= ముఖమనే తామరపూవుమీద, నిలిపి=ఉంచి, నీకు+ఇవే జోతలు=నీకివే నా నమస్కారాలు, అనిపించె=అని చెప్పించింది.

**తాత్పర్యం:** *గుణవతి, భర్త తనకు చెప్పకుండా విడిచిపెట్టినందున భావరహిత అయిన గౌతముని భార్యయశోధర భర్త పాదాలమీదకు వంగి ఆ పాదధూళిని తీసి పసివాడైన కొడుకు ముఖాన పూసి తండ్రికి నమస్కారాలు చెప్పించింది.*

**శరణము బుద్ధదైవము, ప్రశస్తతరమ్ము తదీయ ధర్మమే**
**శరణము, సత్యవాఙ్నియమసార దయాపరతంత్రవృత్తియే**
**శరణము మా కటంచు, జనసంఘము లాడుచుఁ బాడుకొంచు మం**
**దిరముల కేగి ధర్మనిరతిన్ జరియింపఁ దొడంగె నొప్పుగన్.**

**అర్థాలు:** బుద్ధ దైవము=ఓ దైవమైన బుద్ధుడా! శరణము=ఆదుకో, ప్రశస్త తరమ్ము=శ్రేష్ఠమైన, తదీయ=నీ వాదానికి సంబంధించిన, ధర్మమే=న్యాయమే, శరణము=మాకు రక్ష, సత్య వాఙ్నియమ సార=నిజం మాట్లాడటం లోని సారమైన, దయా పరతంత్ర=కరుణా పరవశమనే, వృత్తియే=జీవనమే, మాకు=మాయెడల, శరణము= కాపుదల, అట+అంచు= కావాలనుకొంటూ, జనసంఘములు=బుద్ధునిబోధ విన్న ప్రజలు, ఆడుచున్= అనుకొంటూ, పాడుకొంచు=బుద్ధుని

కీర్తిస్తూ, మందిరములకు+ఏగి=తమతమ ఇండ్లకు వెళ్ళి, ఒప్పుగన్= అందరూ మెచ్చుకొనే విధంగా, ధర్మనిరతిన్=ఆ బుద్ధుడు చెప్పినవిధంగా, చరియింపన్= నడచుకోవడం, తొడంగెన్=మొదలు పెట్టారు.

**తాత్పర్యం:** *ఓ దేవుడవైన బుద్ధుడా! మా పాపాలనుండి మమ్మల్ని రక్షించు. ఇకపైన నీ మతానికి సంబంధించిన ధర్మమే మాకు రక్ష. నిజాన్ని మాట్లాడుతూ నీ కరుణకులోబడి జీవించడమే మాకు నిజమైన కాపుదల. ఇలా చెప్పుకొంటూ, బుద్ధుని పొగుడుకొంటూ ఆవూరి ప్రజలు తమతమ ఇండ్లకువెళ్ళి అందరూ ఔననేవిధంగా బుద్ధుని బోధనలప్రకారం నడచుకోవడం ప్రారంభించారు.*

**పరమపతివ్రతల్ కపిలవాస్తుపురిన్ గృహిణీమతల్లు లా**
**దరమున వేళదప్పక సదా తనరాక ప్రతీక్ష సల్పుచున్**
**సురుచిర భిక్షలన్ సలుపుచున్ భుజియింప, వసించెఁ దత్పురీ**
**పరిసరవృక్షవాటి భగవంతుఁడు శిష్యగణమ్ము కొల్వగన్.**

**అర్థాలు:** కపిలవాస్తు పురిన్=ఆ కపిలవస్తు నగరంలో, పరమపతివ్రతల్=గొప్ప పతిభక్తి కలవారైన, గృహిణీమతల్లులు=మగనాండ్రైన ఆ తల్లులు, ఆదరమున=అత్యంత గౌరవంతో, సదా=అన్నివేళల, వేళదప్పక= సమయానికి, తనరాక=తనయొక్క ఆగమనంకోసం, ప్రతీక్ష సల్పుచున్=ఎదురుచూస్తూ, సురుచిరభిక్షలన్= మంచిమంచి ఆహార ప్రదానాలను, సలుపుచున్= ఆచరిస్తూ, భుజియింప=భోజనాలు చేస్తూంటే, భగవంతుఁడు=భగవంతునితో సమానుడైన బుద్ధుడు, శిష్యగణము=ఛాత్రసమూహం, కొల్వన్=సేవిస్తూండగా, తత్పురీ= ఆ నగరానికి, పరిసర=చుట్టుప్రక్కలనున్న, వృక్షవాటి=చెట్లక్రింద, వసించెన్=నివసించాడు.

**తాత్పర్యం:** *ఆ కపిలవస్తు నగరంలోని గృహిణులంతా అత్యంత గౌరవంతో వేళతప్పకుండా తనరాకకోసం నిరీక్షిస్తూ, వెళ్ళినవెంటనే మంచిమంచి ఆహారపదార్థాలు తనకు సమర్పించిన తరువాత మాత్రమే వారు భోజనాలు చేస్తూంటే, ఆ నగర పరిసరాలలోని పెద్దపెద్ద వనాలలో భగవంతుడైన బుద్ధుడు శిష్యులు సేవిస్తూండగా తాను నివసించసాగాడు.*

ఇది

ప్రథమసర్గము

# భిక్షాగమనము

**చెవిదాఁకన్ గొనయమ్ము లాగు కడిఁదిన్ జేఁదుంట విల్లంది ప**
**ట్టు విలాసమ్మును లేఁతనవ్వొలయు చూడ్కుల్ మెప్పులందీయఁగా**
**నవలోకింపుచుఁ, బూవుటమ్ము రతినీకందింప, డెందమ్ములన్**
**గవియ న్నాటెడి లక్ష్యశుద్ధికి నమస్కారంబు మీనధ్వజా!**

**అర్థాలు:** మీనధ్వజా=చేపను పతాకంమీద కలిగిన ఓ మన్మథా! చెవిదాఁకన్=చెవికంటునట్లు, గొనయమ్మున్=వింటినారిని, లాగు కడిఁదిన్=లాగే నీ వీరత్వం; చేన్=అరచేత, తుంట విల్లు=చెఱకు వింటిని, అందిపట్టు=అందిపుచ్చుకొనే, విలాసమ్మును=నీ ఒయ్యారం; లేఁతనవ్వొలయు=లేతనవ్వులు చిందించు, చూడ్కుల్=నీ చూపులు, మెప్పులు+అందీయఁగా=మనసును ఉరకలేయించగా, అవలోకింపుచున్=చూస్తూ, రతి=నీ భార్య రతీదేవి, పూవుటమ్ము=కోమలమైన పుష్పబాణం, నీకు+అందింప=నీకు అందించగా, డెందమ్ములన్= జనులహృదయాలను, కవియన్=ముసరికొనునట్లు, నాటెడి=చొనిపే, లక్ష్యశుద్ధికి=నీ గురికి, నమస్కారంబు=ఒక కైమోడ్పు.

**తాత్పర్యం:** *ఈ పద్యం చెప్పబోయే సర్గానికి ప్రస్తావన. ఇందులో చెప్పబోయే శృంగార రసానికిది నాందిగా మన్మథ ప్రస్తావన తెచ్చారు కవివరులు. సుందరీ నందుల శృంగార కేళికి సూచనగా మదనోద్ధృతిని వర్ణించారు.. మదనుణ్ణే సంబోధిస్తూ ఈ విధంగా ఒక నమస్కారం పెట్టారు కవిపుంగవులు. ఓ మదనా! నీ వింటినారి చెవిదాకా లాగటంలో నీ వీరత్వం, అరచేతిలో చెరుకువిల్లు పట్టుకోవడంలో నీ ఒయ్యారం, నీ చూపుల్లో లేతనవ్వులు చూస్తూ మనసు ఉరకలు వేస్తూండగా రతీదేవి కోమలమైన పుష్పబాణం నీకందిస్తే, నీవు జనుల హృదయాల మీద దానిని గాఢంగా సూటిగా నాటుతావు సుమా! ఖచ్చితమైన నీ గురికి నమస్కారం.*

**కలఁడు మహితాత్ముఁడైన శాక్యర్షికొక్క**
**సవతి తమ్ముండు, కాంతినిస్తంద్రుఁ డతఁడు**
**నందుఁడను కోడెప్రాయపుటందగాఁడు,**
**సార్థకాఖ్య సుందరి వాని యతివమిన్న.**

**అర్థాలు:** మహితాత్ముఁడు+ఐన=గొప్ప ఆత్మగలవాడైన, శాక్యర్షికి=శాక్యవంశంలో పుట్టిన తపోధనుడికి, ఒక్క సవతి తమ్ముడు=పిన్నమ్మకు పుట్టిన తమ్ముడు ఒకడు, కలఁడు=ఉన్నాడు. అతఁడు=ఆ తమ్ముడు, కాంతి నిస్తంద్రుఁడు=అలసటలేని కాంతిగలవాడు. నందుఁడను=నందుడు అనే పేరుగల, కోడెప్రాయపు=పరువంలో ఉన్న, అందగాఁడు=మనోహరుడు. వాని=అతనియొక్క, అతివమిన్న=భార్య, సుందరి=సుందరి అనే పేరుగల, సార్థకాఖ్య= పేరుకు తగిన అందగత్తె.

**తాత్పర్యం:** *శాక్యవంశంలో పుట్టిన గౌతమునికి ఒక సవతితమ్ముడున్నాడు. తేజోమయుడు. మంచివయసులో ఉన్న అందగాడు. అతని భార్య సుందరి. పేరుకు తగ్గ చిన్నది.*

**కేళీమందిరమందుఁ బుష్పలతికా క్రీడానికుంజమ్ములన్**
**బాలాస్నిగ్ధకపోలదర్పణరుచిన్ భావింపుచున్ జుంబన**
**వ్యాలోలుండగు నందసుందరు స్మరధ్యానమ్మునన్ బుద్ధు ధ**
**ర్మా లాపమ్ములు వీనుదోయిఁ బడునో, యాత్మన్ బ్రవేశించునో!**

**అర్థాలు:** కేళీమందిరమందున్=మదన క్రీడాగృహంలోని, పుష్పలతికా=పూవుల తీగలతోకూడిన, క్రీడా= సయ్యాటలకు సంబంధించిన, నికుంజమ్ములన్=పొదరిళ్ళలో, బాలా= ప్రేయసి యొక్క, స్నిగ్ధకపోల=నునుపైన చెక్కిళ్ళను, దర్పణ రుచిన్=అద్దములకాంతిగా, భావింపుచున్=తలచుకొంటూ, చుంబనవ్యాలోలుండగు=ముద్దులలో ఆసక్తుడైన, నంద సుందరు=సుందరుడైన నందుని, స్మరధ్యానమ్మునన్=మదనక్రీడా కుతూహలంలో, బుద్ధు= బుద్ధునియొక్క, ధర్మాలాపమ్ములు=ధర్మంగురించినబోధలు, వీనుదోయిన్=చెవులజంటలో, పడునో=ప్రవేశిస్తాయా! ఆత్మన్= అంతరంగంలో, ప్రవేశించునో=చొరబడగలవా!

**తాత్పర్యం:** *క్రీడా గృహాంగణంలోని పూపొదరిళ్ళ మధ్య ప్రేయసి నునుపైనచెక్కిళ్ళను అద్దాలనునుపుగా భావించి ముద్దులలో మునిగిపోయి మదన క్రీడావ్యామోహంలోనున్న సుందరుడైన నందుని చెవులకు బుద్ధుని ధర్మబోధలు వినిపిస్తాయా! అతని అంతరంగం లోనికి ప్రవేశించగలవంటారా!*

**పంతము గర్వరేఖయును భాసిలుమానిని, మానసంపదన్**
**గాంతి దలిర్చుభామిని, వికాససుహాసిని, నాత్మసుందరిన్**
**సంతతసేవలం దనుపు నందునకున్ సుగత ప్రచార మొ**
**క్కింత యెఱుంగనైన, రుచియించునె వానికి ముక్తిమార్గముల్?**

**అర్థాలు:** పంతము=పట్టుదల, గర్వరేఖయును=పొగరుదనంతో, భాసిలు మానిని=దీపించే ఆడది; మాన సంపదన్=అభిమానధనంతో, కాంతిదలిర్చు=తేజరిల్లే, భామిని=ఆడది; వికాస= ప్రకాశమైన, సుహాసినిన్=ఎప్పుడూ నవ్వుతూండేదానిని, ఆత్మసుందరిన్=తనకు నచ్చినదానిని, సంతత=ఎల్లప్పుడు, సేవలన్=పరిచర్యలతో,

తనుపు=ఆనందం కలిగించే, నందునకున్= నందకుమారునికి, ఒక్కింత=ఏకొంచెమైనా, సుగత ప్రచారము=బుద్ధుని బోధనలు, ఎఱుంగనైన=వినిపిస్తేమాత్రం, వానికి=అటువంటి శృంగారంలో మునిగినవానికి, ముక్తి మార్గముల్= సదాగతికి దారులు, రుచియించునె=ఇంపితాలవుతాయా?

**తాత్పర్యం:** *పట్టుదల పొగరుదనం నిండినదానిని, అభిమానధనంతో ప్రకాశించేదానిని, చిరునవ్వులు చిందించేదానిని, తనకు నచ్చిన సుందరిని ఎప్పుడూ పరిచర్యలతో సంతోషపెట్టే నందునికి ఏకొంచెమో బుద్ధుని బోధనలు చెవినిబడితేమాత్రం ఇష్టపడతాడా?*

**పాతరలాడు తద్భ్రుకుటివల్లి యెటుల్ చలియించు నట్టులన్**
**జేతము తాండవింప మఱచెన్ నృపసూనుఁడు విశ్వమెల్ల, వే**
**లాతిగమౌ తదీయరుచిరాంగవిలాససుధాంబురాశివీ**
**చీతతిఁ దొప్పదోఁగి నిలిచెన్ జెలిచూపుల పాపపోలికన్.**

**అర్థాలు:** పాతరలాడు=ఉరుకులెత్తే, తత్+భ్రుకుటివల్లి=ఆ భామయొక్క కనుబొమలతీరు, ఎటుల్=ఏవిధంగా, చలియించున్=కదులుతుందో, అట్టులన్=ఆ విధంగా, చేతము=మనసు, తాండవింప=ఆడుతూంటే, నృపసూనుఁ డు=ఆ రాజకుమారుడు, విశ్వమెల్ల=ప్రపంచం మొత్తాన్ని, మఱచెన్=మరచిపోయాడు. వేల+అతి+గము+ఔ= ఎల్లలను అతిక్రమించేదైన, తదీయ=ఆమెయొక్క, రుచిర=కాంతివంతమైన, అంగవిలాస=అవయవముల వయ్యారముల, సుధ+అంబురాశి=అమృతసాగరములోని, వీచీతతిన్=వాయువుల సమూహములలో, తొప్పదోఁగి=మునిగినవాడై, చెలిచూపుల= సుందరి కనుచూపులపై, పాపపోలికన్=కనుబొమలవలె, నిలిచెన్=కదలకుండా ఉండిపోయాడు.

**తాత్పర్యం:** *ప్రేయశి కనుబొమలు ఆడించినట్లు తన మనసు ఆడుతూంటే ఆ రాజ కుమారుడైన నందుడు ఈ ప్రపంచాన్ని మొత్తం మరచిపోయాడు. హద్దులను దాటే ఆమె అంగసౌందర్యం అనే అమృతసాగరంలోని పిల్లతెమ్మెరలలో మునిగిపోయి తానే ఆమె కనుపాపలుగా నిలిచి పోయాడు.*

**నడపుల రాజహంస, తెలినవ్వుల వెన్నెలవాఁక, ప్రేమ లూ**
**రెడు నునుఁబల్కుఁ దేనెపెర, రెమ్మలువైచు విలాసవల్లి, వ్రే**
**ల్మిడి హృదయమ్ము నుచ్చిచను మేలిమిచూపు సుమాస్త్రమైన యా**
**పడఁతుక నందభాస్కరుని బాయఁగనోర్వదు ఛాయయుంబలెన్.**

**అర్థాలు:** నడపుల=నడకలలో, రాజహంస=మగ మరాళం వంటి; తెలినవ్వుల=మల్లె పూలవంటి నవ్వులకు, వెన్నెలవాఁక=నెలవెలుగుల చాలువంటి; ప్రేమలు ఊరెడు= అనురాగం చిందే, నునుఁబల్కున్=నయపు మాటలకు, తేనెపెర=తేనెతుట్టెవంటి; రెమ్మలు వైచు=విస్తరించే, విలాసవల్లి=సోయగపు తీగవంటి; హృదయమ్మున్=గుండెలమీద, వ్రేల్మిడి=చటుక్కున, ఉచ్చిచను=మీటివెళ్ళిపోయే, మేలిమిచూపు=వాలుతూపు, సుమాస్త్రము+ ఐన=మన్మథుని

పూబాణమైన, ఆ పడఁతుక=ఆ సుందరి, నందభాస్కరుని=తనజీవితానికి వెలుగైన నందుని, ఛాయయుంబలెన్= నీడలాగా, పాయఁగన్=వదిలిపెట్టడాన్ని, ఓర్వదు=సహించలేదు.

**తాత్పర్యం:** *నడకలలో రాజహంస, నవ్వులకు వెన్నెలవాగు, ప్రేమ పలుకులకు తేనెతుట్టె, విస్తరించే సోయగపుతీగ, గుండెలమీద చటుక్కున మీటివెళ్ళిపోయే వాలుచూపే మన్మథ బాణమైన ఆ సుందరి నందుని నీడలాగా విడిచిపెట్టలేదు.*

**పలుకుల్ సేఁతలు నెమ్మనమ్ము లొకటై, భావింపఁగారాని కూ**
**ర్ములపేర్ముల్, వలకాఁకలన్ గసరుటల్, రోషారుణాక్షమ్ముగాఁ**
**దిలకింపన్ బతిమాలుటల్, పులక లుద్దీపింపఁగాజేఁయు ము**
**ద్దులు, గిల్గింతలు కౌఁగిలింతలును ప్రొద్దుల్పుచ్చు నాజంటకున్.**

**అర్థాలు:** భావింపఁగారాని=ఊహించలేని, కూర్ముల పేర్ముల్=ప్రేమల ఆసక్తులు; వలకాఁకలన్=విరహాలచేత, గసరుటల్=కసిరికొట్టడాలు; రోషారుణ=కోపంచేత ఎరుపెక్కిన, అక్షమ్ముగాఁన్=కన్నులై, తిలకింపన్=కనిపిస్తే, బతిమాలుటల్=బ్రతిమిలాడుకోవడాలు; పులకలు=గగుర్పాటులు, ఉద్దీపింపగాజేఁయు=వృద్ధిచేసే, ముద్దులు= చుంబనాలు; గిల్గింతలు=గిలిగింతలు; కౌఁగిలింతలును=కౌగిళ్ళతో; పలుకుల్=మాటలు, సేఁతలు=చేతలు, నెఱి+ మనమ్ములు=స్థిరమైన మనస్సులు, ఒకటై=ఒకటిగా చేరి, ఆ జంటకున్= ఆ ఇరువురికి, ప్రొద్దుల్ పుచ్చు=కాలం గడుపుతున్నాయి.

**తాత్పర్యం:** *ప్రేమాసక్తుల మధ్య విరహాలలో కసిరికొట్టుకోవడాలు, ఒకరికి కోపంవస్తే ఒకరు బ్రతిమిలాడుకోవడాలు, పులకింతలు గుప్పించే ముద్దులు, కౌగిలింతలు మాటలను చేతలను మనసులను ఒకటిచేసి వారిద్దరికీ బాహ్యప్రపంచం తెలియకుండా చేసి కాలం గడిచిపోయేలా చేస్తున్నాయి.*

**తానా సుందరనందుఁ, డవ్వెలఁదియా తన్వంగలావణ్యలీ**
**లానందైకనిధాన, మొండొరుల ప్రేమాలాపకేళీవినో**
**దానూనానుభవమ్ములా మదనవిద్యాదైశికమ్ముల్, సముల్**
**కానన్రారు గదోయి, కామిజనలోకమ్మందు నాదోయికిన్.**

**అర్థాలు:** తానా=తను చూస్తే, సుందరనందుఁడు=అందమైన నందకుమారుడు, ఆ+వెలదియా=ఆమెయో, తను+అంగ=పలుచని అవయవాల, లావణ్య=మెరుగుదనంచేత, లీల=సొంపైన, ఆనంద+ఏక=సంతోషమొక్కటే, నిధానము=ఆధారమైనది; ఒండొరుల= ఒకరినొకరు, ప్రేమ+ఆలాప=అనురాగవచనముల, కేళీ వినోద= ఆటలయొక్క ఆనందాలవలన కలిగిన, అనూన=సాటిలేని, అనుభవమ్ములు=అనుభూతులు, మదనవిద్యా= శృంగారకేళియందు, దైశికమ్ముల్=బోధకులుకాగా, ఆ+దోయికిన్=ఆయిద్దరికీ, కామిజన లోకమ్మందు=మదన క్రీడాపరవశులందు, సముల్=సమానమైనవారు, కానన్రారు=కనిపించరు, కదోయి=కదా!

**తాత్పర్యం:** *అతడు అందగాడు. ఆమె సన్నని అవయవాలతో అంతకంటె అందమైనది. ప్రేమకలాపాలతో కరిగిపోయే వారి అనుభూతులు మదనవిద్యా బోధకాలు. ఇంక ఆయిద్దరికి కామిజనలోకంలో సమానమైనవారు ఎవరూ ఉండరుకదా!*

**చివురాకుబాఁకు దాల్చిన వజీరునకుఁ ద**
**త్ప్రమదకు లక్ష్యభూతమ్ము నాఁగ**
**నత్యంతమోదమ్ము నిత్యమాంగళ్యమ్ముఁ**
**దలదాఁచుకొన్నట్టి నెల వనంగ**
**నుపమింపఁగారాని యుత్సాహవిజయముల్**
**తోడునీడై కూడియాడె ననఁగఁ**
**గని విని యెఱుఁగని గగనపుష్పము నూత్న**
**సౌరభ మొక్కటఁ గూరె నాఁగఁ**

**గౌతుకము మొలపించు నొకళ్ళొకళ్ళ**
**హాసవీక్షణకిలికించితాదులెల్ల**
**మధురమధురముల్ గాఁగ నా మిథున మొప్పు**
**నాస తీవలు ననుచు ప్రాయంపువేళ.**

**అర్థాలు:** చివురాకుబాఁకు=చిగురాకును ఆయుధంగా, తాల్చిన=చేపట్టిన, వజీరునకున్= వీరునకు అనగా మన్మథునకు, తత్+ప్రమదకు=అతని పత్నికిని, లక్ష్యభూతమ్ము నాఁగన్= కొట్టవలసిన గురికాగా; అత్యంత మోదమ్ము=విపరీతమైన సంతోషం, నిత్య మాంగళ్యమున్=ఎప్పుడూ ఉండే శుభం, తలదాఁచుకొన్నట్టి=శరణు పొందినట్టి, నెలవు+అనంగన్=చోటుకాగా; ఉపమింపఁగారాని=సాటిలేని, ఉత్సాహ విజయముల్= తేకువ గెలుపులు, తోడునీడై=కలసిమెలసి, కూడియాడె ననఁగన్=జతకట్టాయనగా; కని విని యెఱుఁగని=ఎప్పుడూ చూడని వినని, గగనపుష్పము=ఆకాశంలో వికసించే పూవు, నూత్న సౌరభము=సరిక్రొత్త వాసనలు, ఒక్కటన్= ఒక్కసారిగ, కూరెనాఁ గన్=గుప్పించాయి అన్నట్టుగా; ఒకళ్ళనొకళ్ళ=ఆ యిరువురియొక్క, హాస=చిరునవ్వులు, వీక్షణ=చూపులు, కిలికించితాదులు=రతివేళ కలిగే మూలుగులు మొదలైనవి, ఎల్ల=అన్నీ కలిసి, కౌతుకము మొలపించున్=కుతూహలాన్ని కలిగిస్తాయి; మధురమధురముల్=తీయతీయగా, కాఁగన్= ఇవన్నీ శోభించగా, అస=ఆశలు, తీవలు ననుచు=తీగలుసాగే, ప్రాయంపువేళ=యుక్త వయసులో, ఆ మిథునము=ఆ జంట, ఒప్పున్= ప్రకాశిస్తోంది.

**తాత్పర్యం:** *రతీమన్మథులకు లక్ష్యంకాగా, సంతోష సౌఖ్యాలు తలదాచుకున్న చోటు అన్నట్లుగా, శౌర్యం విజయం జతకూడాయనగా, ఎవరూ ఎరుగని ఆకాశపుష్పాలు సువాసనలు గుప్పించాయన్నట్లుగా, ఇరువురి హాసవీక్షణకిలికించితాదులు వారికుతూహలాన్ని పెంచుతూండగా ఆశలు తీగలుసాగే పరువంలో ఆ జంట ప్రకాశిస్తోంది.*

**సడలని కౌఁగిలింతలకుఁ జందనచర్చలు పేఁటులెత్తఁగా**
**నెడపడనట్టి చూపులకు నిర్వుర మైజిగి విందుసల్పఁగా**
**నుడుగకపల్కు చాటుమధురోక్తుల నాత్మలు హత్త, సీమ మీ**
**ఱెడు ప్రణయాంబురాశి విహరించును దన్మిథునమ్ము వింతగన్.**

**అర్థాలు:** సడలని=ఏమాత్రం సందివ్వని, కౌఁగిలింతలకున్=వెచ్చని కౌగిళ్ళకు, చందన చర్చలు=చల్లనిమెత్తని చందనపు పూతలు, పేఁటులెత్తఁగాన్=పెచ్చులుకట్టి పగుళ్ళువారగా; ఎడపడనట్టి=త్రిప్పుకోలేని, చూపులకున్= ఆలోకనాలకు, ఇర్వుర=ఇద్దరియొక్క, మైజిగి= వంటికాంతులు, విందుసల్పఁగాన్=ఆనందమివ్వగా; ఉడుగక పల్కు=ఆపకుండా మాటలాడు, చాటు=రహస్యమైన, మధురోక్తులన్=తీయనిమాటలకు, ఆత్మలు=వారి అంత రంగాలు, హత్త=ఒకటికాగా; తత్+మిథునమ్ము=ఆ జంట, వింతగన్=ఆశ్చర్యకరంగా, సీమమీఱెడు= హద్దులు మించే విధంగా, ప్రణయాంబురాశి=ప్రేమ సముద్రంలో, విహరించును=తేలియాడును.

తాత్పర్యం: ఏమాత్రం సందివ్వని వెచ్చని కౌగిళ్ళకు చల్లని చందనపు పూతలు పెచ్చులుకట్టి పగుళ్ళువారినాయి. త్రిప్పుకోలేని చూపులకు ఇద్దరి మేనికాంతులు అంతులేని ఆనందాన్ని అర్పిస్తున్నాయి. ఆపకుండా పలికే రహస్యాలాపాలకు అంతరంగాలు కలిసిపోయి రెండు శరీరాలు ఒక్కటైపోయినాయి. ఆ విధంగా ఆ జంటజీవుల వింతజీవితాలు హద్దులుమీరి ప్రేమసముద్రంలో విహరించసాగాయి.

**మానవలోకనాయక కుమారవతంస మతండు నందనో**
**ద్యానవిహారి దైవతలతాంగియొ నాఁజను గాంతఁ గూడి, యీ**
**మానవకోటిఁ జేరక యమర్త్యులఁ గూడక యొప్పె భూతసం**
**తాన నవీనసృష్టి పరిణామ మిటుల్ నెఱవేఱెనో యనన్.**

**అర్థాలు:** అతండు=అతగాడు, మానవలోకనాయక=ఈ మనుష్యలోకంలోని రాజుల, కుమార వతంసము= కుమారులలో సిగబంతి, నందన+ఉద్యాన=ఇంద్రుని విహారవనంలో, విహారి= తిరిగే, దైవత=దేవతా సంబంధమైన, లతాంగియొ నాన్=సుందరీమణియా, చను=అనిపించే, కాంతన్ కూడి=భార్యతో కలిసి, మానవ కోటిన్ చేరక=ఇటు మానవులలో కలవక, అమర్త్యులన్ కూడక=అటు దేవతలలో కలవక, భూతసంతాన=ప్రాణికోటి సంతతి, నవీనసృష్టి= క్రొత్తపుట్టుకయొక్క, పరిణామము=మార్పు, ఇటుల్=ఈవిధంగా, నెఱవేఱెనో=నెరవేరిందా, అనన్=అన్నట్లు, ఒప్పెన్=ప్రకాశించెను.

**తాత్పర్యం:** *అతడుచూస్తే లోకంలోని రాజకుమారులలో అందగాడు. అతనిభార్యచూస్తే నందనవనంలో తిరిగే దివ్యసుందరి. వారిద్దరి కలయికచూస్తే అటు దేవతలూగాక ఇటు మానవులూగాక సృష్టిలో మార్పుసంభవించి క్రొత్తజాతిగా పరిణమించిందా అన్నట్లుంది.*

మేలేర్చి నందుండు పూలు గోసియొసంగ
సరము లందముగ సుందరి రచించు
మెలఁత వర్ణమ్ములు మేళవించియిడంగ
హరువుమై నతఁడు చిత్తరువు వ్రాయుఁ
బతి సుకుమారభావము వచించిన నను
రూపపద్యమునఁ గూర్చును లతాంగి
అతివ చక్కనిరాగ మాలపించిన వీణ
పలికించు నతఁడు మై పులకరింప

నెఱ్ఱసెరల నందునిచూపు లింతి యాన
నేందునకుఁ గెంపుల నివాళులెత్త, నతివ
కజ్జలపుఁజూడ్కి ప్రియుని వక్షఃకవాటిఁ
గట్టుఁ దోరణములు నల్ల కల్వపూల.

**అర్థాలు:** నందుండు=నందకుమారుడు, పూలు=పుష్పాలలో, మేలు+ఏర్చి=మంచివి ఏరి, కోసియొసంగ=కోసిస్తే, సుందరి=అతని ప్రియురాలు, అందముగ=సుందరంగా, సరములు= దండలు, రచించు=కడుతుంది; మెలఁత=ఆమె, వర్ణమ్ములు=రంగులు, మేళవించి=కలిపి, ఇడంగ=ఇస్తే, అతఁడు=అతగాడు, హరువుమై=అందంగా, చిత్తరువు వ్రాయున్=బొమ్మలు వేస్తాడు; పతి=భర్త, సుకుమారభావము=అందమైన ఆలోచన, వచించిన=చెప్తే, లతాంగి= ఆమె, అనురూప పద్యమునన్=అనుకూలమైనపద్యంలో, కూర్చును=పొదుగుతుంది; అతివ= ఆమె, చక్కని రాగము=మంచిరాగాన్ని, ఆలపించిన=పలికితే, అతఁడు=అతగాడు, మై పులకరింపన్=వళ్ళుమరచి పోయేలా, వీణపలికించున్=వీణవాయిస్తాడు; ఎఱ్ఱసెరల=ఎఱ్ఱ జీరల, నందునిచూపులు=నందుని చూడ్కులు, ఇంతి=ఇల్లాలు సుందరియొక్క, అననేందునకు=ముఖమనేచంద్రునికి, కెంపుల=పద్మరాగాల, నివాళులెత్తన్= దీపాలుపడితే, అతివ=సుందరియొక్క, కజ్జలపుఁజూడ్కి=కాటుకచూపులు, ప్రియుని=భర్తయొక్క, వక్షఃకవాటిన్= గుండెవాకిలికి, నల్లకల్వపూల=నల్లకలువలయొక్క, తోరణములు=సరములతో, కట్టున్=అలంకరిస్తుంది.

**తాత్పర్యం:** *ప్రియుడు మంచిపూలను కోసిస్తే ప్రియురాలు అందమైన దండలు కడుతుంది. ఆమె మంచిరంగులు కలిపిస్తే అతడు అందమైన బొమ్మలుగీస్తాడు. అతడు కోమలమైన భావాన్ని అందిస్తే ఆమె మంచిపద్యం అల్లుతుంది. ఆమె చక్కనిరాగాన్ని ఆలపిస్తే అతడు వీణమీద పలికిస్తాడు. అతని కంటి ఎఱ్ఱజీరలు ఆమె ముఖచంద్రునికి నివాళులెత్తితే ఆమె కాటుకచూపులు అతనియొక్క గుండెవాకిలికి నల్లకలువల తోరణాలు కడతాయి.*

ప్రాలేయగిరికందరావినోదవిహార
పరులైన సిద్ధదంపతు లనంగ

**విబుధతరంగిణీవీచికాడోలలఁ**
**దూఁగెడి రాయంచదోయి యనఁగఁ**
**గవిమనఃపంకజాసవసిక్తమై రసా**
**గ్రమున నాడెడి పదార్థము లనంగ**
**నానందపరిఫుల్ల మౌనీంద్రదహరతా**
**రాధ్వమం దాడు జీవాత్మ లనఁగఁ**
**జీకుచింతల దిగఁద్రావి, చెన్నుమిగిలి,**
**హృదయసంవేద్యమయ్యు, నా త్మైకగమ్య**
**మైన యద్వయసౌఖ్యరసామృతమ్ము**
**ననుభవింతురు వారు నిరంతరముగ.**

**అర్థాలు:** ప్రాలేయగిరి=హిమాలయముల, కందరావినోద=గుహలలో వేడుకగా, విహార పరులైన=తిరుగుటలో ఆసక్తులైన, సిద్ధదంపతులనంగ=ఆలుమగలైన సిద్ధులవలె; విబుధ తరంగిణీ=దేవతలనదియైన గంగానదియొక్క, వీచికాడోలలన్=అలల ఊయలల్లో, తూఁగెడి=ఊగే, రాయంచదోయి యనఁగన్=హంసలజంటవలె; కవి=కైతగాని యొక్క, మనఃపంకజ=మనస్సనే పద్మంయొక్క, ఆసవసిక్తమై=మధువులో తడిచినవైన, రసాగ్రమునన్= అనురాగపు టంచులలో, ఆడెడి=వినోదించే, పదార్థములనంగన్=శబ్దాలవలె; ఆనంద పరిఫుల్ల=సంతోషంతో సంతృప్తులైన, మౌనీంద్ర=మునీంద్రులయొక్క, దహర=హృదయాకాశంలోని, తారాధ్వమందు=నక్షత్రాలత్రోవలో, ఆడు=ఆడుకొనే, జీవాత్మలనంగ=చైతన్యాలవలె; చీకుచింతల=కష్టాలను, దిగఁద్రావి=దిగమ్రింగి, చెన్నుమిగిలి=విలాసం నింపుకొని, హృదయసంవేద్యమయ్యు=మనసులకు తెలిసినప్పటికీ, నిరంతరముగ=ఎల్లప్పుడు, వారు=ఆ జంట, ఆత్మైక గమ్యమైన=అంతరంగాలకుమాత్రమే ఎరుగదగిన, అద్వయసౌఖ్యరసామృతమ్మున్=ఒక్కటై అనుభవించే ఆనంద మకరందాన్ని, అనుభవింతురు=అనుభవిస్తున్నారు.

**తాత్పర్యం:** *హిమాలయగుహలలో వినోదించే సిద్ధదంపతులవలె, ఆకాశగంగాతరంగాలలో విహరించే అంచలజంటలవలె, కవుల ఆలోచనామృతంలో తడిచిన శబ్దపల్లవాలవలె, మునీంద్రుల హృదయాకాశంలో నక్షత్రాలమధ్య ఆడుకొనే జీవాత్మలవలె, కష్టాల ఊసులేక, మనసులకు తెలిసినప్పటికీ సంతోషం నింపుకొని, వారిద్దరూ ఎప్పుడూ వారిహృదయాలకు మాత్రమే తెలిసిన ఆనందమకరందాన్ని అనుభవిస్తున్నారు.*

**బ్రతుకు నిక్కమ్మయేని యవ్వారిపట్ల**
**విరతిలేని స్వప్నమ్ముగా జరుగఁబోలు,**
**బ్రతుకు నిక్కముగాక స్వప్నమగునేని**
**సత్యమై తోఁపఁబోలు నా జంపతులకు.**

**అర్థాలు:** ఆ జంపతులకు=అటువంటి ఆలుమగలకు, బ్రతుకు=జీవితం, నిక్కమ్మయేని=నిజమైతే, ఆ+వారిపట్ల=ఆదంపతుల విషయంలో, విరతిలేని=విరామంలేని, స్వప్నమ్ముగా=కలమాదిరిగా, జరుగన్= గడచుటకు, బోలు= అనుకూలపడుతుంది. బ్రతుకు=అదేజీవితం, నిక్కమ్ముగాక=నిజంకాకుండా, స్వప్నమగునేని= కలే అయితే, సత్యమై=శాశ్వతంగా, తోఁపన్ పోలు=అనిపిస్తూ అనుకూలిస్తుంది.

**తాత్పర్యం:** *అలా అనుభవించే దంపతులకు జీవితం నిజమైనదే ఐతే విశ్రాంతిలేని కలగా గడచిపోతుంది. నిజంగాక కలేగనక అయితే అదీ శాశ్వతంగానే అనిపిస్తుంది.*

**ఐహికవిచారముల నెల్ల నవలఁద్రోచి**
**భంగమెఱుఁగని యానందపరమయోగ**
**రతి మెలంగుచు, భానుని రాకవోక**
**లరయనేరని వేళ సుందరియు నొకట.**

**అర్థాలు:** ఐహిక=ఇహలోక సంబంధమైన, విచారములను+ఎల్లన్=ఆలోచనలన్నిటిని, అవలన్=ప్రక్కకు, త్రోచి=తప్పించి, భంగము+ఎఱుఁగని=ఎడములేని, ఆనంద=అమిత సంతోషమనే, పరమయోగరతి= అద్వితీయమైన యోగాన్ని పొందేదారిలో, మెలగుచు= కాలం గడిపేస్తూ, భానుని=సూర్యభగవానుని, రాకపోకలు= ఉదయ సాయంసమయాలుకూడా, అరయనేరనివేళ=గమనించని సమయంలో, ఒకట=ఒకసారి, సుందరియు= సుందరికూడా...

**తాత్పర్యం:** *ఈ లోకపు ఆలోచనలు దగ్గరకు రానీయకుండా పరమానందాన్ని అదేపనిగా అనుభవిస్తూ రాత్రింబవళ్ళుకూడా మరచిపోయిన సమయంలో ఒకసారి సుందరి....*

**తనకున్ బాపట చక్కదిద్ద, సుమనోదామమ్ము వేణీభర**
**మ్మునఁ గూర్పన్, గలపమ్ము లద్దఁ, దిలకమ్మున్ దీర్ప, వింజామర**
**మ్మును దాల్పన్ సడిసన్న నందుని కరాంభోజాతయుగ్మమ్మునన్**
**వనితారత్నము దర్పణమ్ము నిడి నిల్వంజేసి తానంతటన్.**

**అర్థాలు:** తనకున్=తనకు, పాపట=సీమంతాన్ని, చక్కదిద్ద=సరిచేయగా; సుమనోదామమ్ము= పూలదండను, వేణీభరమ్మునన్=ఒత్తయిన జడలో, కూర్పన్=సవరించగా; కలపమ్ములు= చందనాలు, అద్దన్=పూయగా; తిలకమ్మున్=బొట్టును, తీర్ప=దిద్దగా; వింజామరమ్మును= వీవనను, తాల్పన్=వీయగా; వనితారత్నము=రత్నంవంటి ఆమె, సడిసన్న=సైగతో, నిల్వంజేసి=ఆపి, నందుని=ప్రియుడైన నందుని, కరాంభోజాతయుగ్మమ్మునన్= తామరల వంటి చేదోయిలో, దర్పణమ్మున్+ఇడి= అద్దాన్నుంచి, తాన్+అంతటన్=ఆమె ఆతరువాత....

**తాత్పర్యం:** *వనితారత్నమైన ఆసుందరి తనప్రియుడు తనకు పాపట సరిచేస్తూ, జడలో పూదండ సవరిస్తూ, చందనాలు పూస్తూ, బొట్టుపెడుతూ, వీవనవీస్తుండగా సైగతో ఆపి నందుని చేతులలో అద్దాన్నుంచి ఆ తరువాత....*

**అద్దములోన నీడయును, నద్దము దాల్చిన నాథుమోమునన్**
**ముద్దులుగుల్కు మీసముల పొల్పుఁ గనుంగొనుచున్, మృగీమదం**
**బద్దిన యంగుళీకిసలయమ్మునఁ జెక్కులఁ బత్రభంగముల్**
**దిద్దుకొనందొడంగె సుదతీమణి నేరుపుమీఱ నవ్వుచున్.**

**అర్థాలు:** సుదతీమణి=ఆ సుందరీమణి, అద్దములోన=ఆ దర్పణంలో, నీడయును=తన బొమ్మను, అద్దము దాల్చిన=అద్దం పట్టుకొన్న, నాథుమోమునన్=మగని ముఖంమీది, ముద్దులుగుల్కు=ముద్దొచ్చే, మీసములపొల్పున్= ఆ మీసాలసొంపును, కనుంగొనుచున్= గమనిస్తూ, నవ్వుచున్=నవ్వుకొంటూ, నేరుపుమీఱ= నిపుణత తెలిసేలా, మృగీమదంబు= కస్తూరి, అద్దిన=అంటిన, అంగుళీకిసలయమ్మునన్=కోమలమైన వ్రేళ్ళతో, చెక్కులన్= తనచెక్కిళ్ళపై, పత్రభంగముల్= మకరికా రేఖల్ని, దిద్దుకొనందొడంగె=చిత్రించుకోసాగింది.

**తాత్పర్యం:** *ఆ సుందరీమణి అద్దంలో తనముఖాన్ని, ముద్దొచ్చే భర్త మీసాల్ని చూచి నవ్వుకొంటూ, తనచెక్కిళ్ళమీదమునివ్రేళ్ళతో కస్తూరి అద్దుకొని మకరికల్నిచిత్రించుకోసాగింది.*

**లలన కపోలదర్పణములన్ రచియించెడి పత్రభంగముల్**
**తెలితళుకొత్తు ముత్తియపు దీధితులన్ గడకొత్తు లేఁతన**
**వ్వొలయఁగఁ జూచునందుఁ డపు డుహ్వనియూఁదిన నూర్పుతుంపురుల్**
**తళతళలాడుచున్ మెఱయు దర్పణమున్ గనుమాయఁజేసినన్.**

**అర్థాలు:** లలన=ఆమెయొక్క, కపోలదర్పణములన్=బుగ్గలనే అద్దాలమీద, రచియించెడి= దిద్దేటువంటి, పత్రభంగముల్=మకరికాపత్రాలు, తెలి తళుకొత్తు=తెల్లదనాన్ని విరజిమ్మే, ముత్తియపు=ముత్యాలయొక్క, దీధితులన్= కాంతులను, కడకొత్తు=తిరస్కరిస్తూ, లేఁత= అలతియైన, నవ్వు+ఒలయగ=నవ్వులతోచేర్చి, చూచు=చూస్తున్న, నందుఁడు=ప్రియుడు, అపుడు=ఆసమయాన, ఉహ్వా+అని=ఉహ్ అనిగట్టిగా, ఊఁదిన= ఊదితే, ఊర్పుతుంపరల్= పూత్కారానికి బయటపడ్డ లాలాజలపుజల్లు, దర్పణమున్=బుగ్గఅద్దంమీద, తళతళ లాడుచున్=తళతళమని, మెఱయు=మెరుస్తూ, కనుమాయన్=కనిపించకుండా, చేసినన్=చేసినప్పుడు...

**తాత్పర్యం:** *భార్య తనబుగ్గలమీద దిద్దుకొనే మకరికాపత్రాలు విరజిమ్మే తెల్లనికాంతుల్ని తలదన్నేలాంటి లేనవ్వులతోటి చూస్తూన్న నందుడప్పుడు ఉఫ్ఫుమని ఊదితే ఆ తుంపరలకు అద్దంలో తళతళామెరిసే బుగ్గ అద్దాలు మాయమైపోయాయి. అప్పుడు...*

**నాతియు నాథు తుంటరితనమ్మునకున్ మది మెచ్చుపుట్టియున్**
**జేతము దాఁచి, తెప్పతుదఁ జిందెడు చిర్నగవప్పళించి, రో**
**షాతికషాయవీక్షణశితాస్త్రపరంపర జాఱఁ గెంపుదాల్**
**వాతెఱ కంపమందఁ గుటిల భ్రుకుటీక లలాటపట్టయై.**

**అర్థాలు:** నాతియు=ఆమెకూడా, నాథు=భర్తయొక్క తుంటరితనమ్మునకున్=ఆకతాయిచేష్టకు, మది=లోపల, మెచ్చుపుట్టియున్=సంతోషించికూడా, చేతముడాఁచి=హృదయాన్నిదాచుకొని, ఱెప్పతుదన్=కనురెప్పలచివర, చిందెడు=బయటికొచ్చే, చిర్నగవు=చిరునవ్వును, అప్పళించి= అదచుకొని, రోషాతికషాయ=కోపంచేత ఎఱ్ఱబడిన, వీక్షణ=చూపులనే, శితాస్త్రపరంపర= వాడియైన ఆయుధాలవరుస, జాఱన్=వదిలే, కెంపుడాల్=ఎరుపువర్ణానికి, వాతెఱ=క్రింది పెదవి, కంపమందన్=వణికిపోతూంటే, కుటిల భ్రుకుటీక=సన్ననికనుబొమలు ముడివడ్డ, లలాట పట్టయై=నొసలుకలిగినదై....

**తాత్పర్యం:** *ఆమె భర్త ఆకతాయిచేష్టకు లోపలసంతోషించికూడా బయటకు కనపడకుండా రెప్పలనవ్వులను అణచుకొని ఎఱ్ఱబడినచూపులనే వాడి అమ్ములుకురిసే ఎరుపుకు క్రింది పెదవి అదురుతూంటే కనుబొమలుముడివడ్డ నొసటిఫలకంతో....*

> **'ఈ పలుగాకిసేఁత లివియెల్లను నేర్తువు లెస్సలాయె, నే**
> **నోపనుజు' మ్మటంచు శ్రవణోత్పలమున్ గొని వైచెఁ గాంతునిన్;**
> **నూపురకంకణక్వణమనోహరయానము మీఱ మారుమో**
> **మై పెడఁబాసిపోవుసతి కడ్డముగాఁ జనుదెంచి నందుఁడున్.**

**అర్థాలు:** ఈ పలుగాకిసేఁతలు=ఇటువంటి తుంటరి పనులు, ఇవియెల్లను=అన్నింటినీ, నేర్తువు=బాగానే నేర్చుకుంటావు, లెస్సలాయె=బాగున్నాయి కాని, నేన్=నేనైతే, ఓపనుజుమ్ము= భరించలేను సుమా, అటంచు=అని అంటూ, శ్రవణోత్పలమున్గొని=చెవిలోనికలువపూవుతో, కాంతునిన్=భర్తను, వైచెన్=కొట్టింది. నూపురకంకణ క్వణ=అందెల మురుగుల ధ్వనులతో, మనోహరయానముమీఱ=నడకల అందాలు అతిశయించగా, మారుమోమై= ముఖం త్రిప్పుకొని, పెడఁబాసిపోవు=వదిలి వెళ్ళిపోయే, సతికి=భార్యకు, అడ్డముగాన్=అడ్డుపడుతూ, నందుఁడున్=ఆ నందుడుకూడా, చనుదెంచి=వచ్చి...

**తాత్పర్యం:** *ఇలాంటి తుంటరిపనులు బాగానే ఉంటాయికాని నేనైతే భరించలేనంటూ తన చెవిలోని కలువతో భర్తనుకొట్టి, అందెలధ్వనులు ఆమె నడకలకు మెరుగులు దిద్దుతూండగా ముఖంత్రిప్పుకొని పోతున్న భార్యకు భర్తనందుడు అడ్డుపడి....*

> **పైఁటచెఱంగు పట్టి నిలుపన్, జెలికొంగు తెమల్చికొంచు 'ము**
> **మ్మాటికి నన్ను ముట్టెదుసుమా! యిదె యొ'ట్టని ముట్టఁబల్క, 'స**
> **య్యాటకు నుహ్వాటన్న యలుకా? ములుకుల్ వలె దెంద ముచ్చిపో**
> **నాటెదు వాడిచూపు లలనా!'యని ముట్టెను దత్పదద్వయిన్.**

**అర్థాలు:** పైఁటచెఱంగుపట్టి=పవిటకొంగును పట్టుకొని, నిలుపన్=ఆమెను ఆపగా, చెలి= ఆమెకూడా, కొంగు తెమల్చికొంచు=చీరపవిటను సర్దుకొంటూ, నన్ను=నాశరీరాన్ని, ముమ్మాటికి=ఏమాత్రం, ముట్టెదు

సుమా=ముట్టుకోవద్దు ఆగు, ఇదెయొట్టు+అని=ఇదే ఆన అంటూ, ముట్టcబల్కి=అంటుకోవద్దని చెప్పగా, లలనా= ఓ భామా, సయ్యాటకు=సరదాకు, ఉప్పొటన్న=ఊదినందుకు, అలుకా=ఇంతకోపమా, వాడిచూపు=పదునైన చూపులను, ములుకుల్‌వలె=మళ్ళమాదిరిగా, డెందము ఉచ్చిపోన్=నాహృదయం పగిలిపోయేలా, నాటెదు= గుచ్చుతున్నావు, అని=అంటూ, తత్పదద్వయిన్=ఆమె పాదములను, ముట్టెను=పట్టుకున్నాడు.

**తాత్పర్యం:** *ఆమె పవిటకొంగును పట్టి ఆపాడు. ఆమెకూడా తనచీరకొంగును వదిలించు కొని సర్దుకొంటూ నన్ను ముట్టుకున్నావంటే ఒట్టేసుమా! ఇది నా ఆన అంటూ ఒట్టేసింది. భామా! ఏదో సరదాకి నీ బుగ్గమీద ఊదినందుకే ఇంతకోపమా? నా హృదయం గాయపడేవిధంగా వాడియైన నీచూపులతో గ్రుచ్చిపోతున్నావు.... అంటూ ఆ భర్త నందుడు తనభార్య పాదాలు పట్టుకొని ఆపాడు.*

**మౌళితలప్రఫుల్ల కుసుమమ్ములు మున్నుగ రాల, నాగతిన్**
**వ్రాలి తదంఘ్రులన్, వెఱపు పైకొనుచూడ్కి మొగమ్ము నెత్తి 'న**
**న్నేలిన దేవి! చూపుటురు లేల బిగించెదు మోము ద్రిప్పి, గ**
**గ్గోలుగc ద్వన్మనఃప్రియశకుంతము నాహృదయమ్ము కూయిడన్.**

**అర్థాలు:** మౌళితల=నెత్తిమీది, ప్రఫుల్ల కుసుమమ్ములు=వికసించినపూలు, మున్నుగరాలన్= ముందుగానే రాలిపోగా, తదంఘ్రులన్=ఆమెపాదాలమీద, ఆగతిన్=ఆవిధంగా, వ్రాలి= పడిపోయి, వెఱపు పైకొను=భయంతో నిండిపోయిన, చూడ్కి=చూపుతో, మొగమ్మునెత్తి= ముఖంపైకెత్తి, నన్ను+ఏలినదేవి=నన్నుపాలించే ఓప్రేయసీ, మోముద్రిప్పి=ముఖంత్రిప్పుకొని, చూపుటురులు=నీ చూపులనే ఉరిత్రాళ్ళతో, ఏలబిగించెదు=నన్నెందుకు బిగిస్తావు? నాహృదయమ్ము=నాగుండెలో, త్వన్మనః=నీ మనసనే, ప్రియశకుంతము=నాకిష్టమైన పక్షి, గగ్గోలుగన్= క్షోభించేలా, కూయిడన్=కూతపెడుతుంది.

**తాత్పర్యం:** *తన తలమీది పూలు క్రిందపడిపోతూండగా ఆమె పాదాలమీద పడిపోయి భయంనిండిన చూపులతో ముఖంపైకెత్తి ఇలా అంటున్నాడు. ఓ ప్రేయసీ! నీవు ముఖం త్రిప్పుకొని నీ చూపులనే ఉరిత్రాళ్ళతో నన్నెందుకు బిగిస్తావు? నీ మనసనే శకుంతపక్షి నాగుండె క్షోభించేలా కూతపెడుతుంది.*

**దోసముగల్గె నావలన దోసిలియొగ్గితి నేలుకొమ్ము, నీ**
**దాసుcడ' నన్న కాంతుcగని, తన్వి పకాలున నవ్వి, 'యింతలో**
**నే సడలన్ గదోయి. యిసిసీ! మన బింకము లింతపాటివా,**
**కాసరకూసరైతి' వని, కౌcగిటికిం డిగి చెక్కు దువ్వుచున్.**

**అర్థాలు:** నావలన=నా అనుచితచర్యచేత, దోసముగల్గె=తప్పుజరిగింది, దోసిలియొగ్గితిన్= చేతులుజోడించి

ఒప్పుకుంటున్నాను, ఏలుకొమ్ము=నాతప్పు మన్నించు, నీ దాసుఁడను= నీ సేవకుడను, అన్న=అని బ్రతిమిలాడే, కాంతుఁగని=భర్తను చూచి, తన్వి=ఆ భార్య, పకాలున నవ్వి=ఫక్కుమనినవ్వి, ఇంతలోనే=ఇంతమాత్రానికే, సడలన్= జారిపోయావు, గద+ఓయి=కదా! యిసిసీ=ఛఛా! కాసరకూసరైతివి=తోటకూరకాడలా మెత్తపడిపోయావు, మన బింకములు=మనలోని పస, ఇంతపాటివా=ఇంతేనా? అని=అంటూ ఆమె, కౌఁగిటికిన్=భర్తకౌగిలిలోనికి, డిగి= ఒదిగిపోతూ, చెక్కు దువ్వుచున్=తలసరిచేస్తూ....

**తాత్పర్యం:** *నావలన తప్పుజరిగింది, చేతులు జోడించి ఒప్పుకుంటున్నాను, నన్ను క్షమించి వదిలిపెట్టు అని బ్రతిమిలాడే భర్తను చూచి ఫక్కున నవ్విన ప్రేయసి ఇంతమాత్రానికే ఇలా జారిపోయావుకదా! ఛఛ, నీలోని పసంతా ఏమైంది, ఇలా మెత్తబడిపోయావు? అంటూ భర్తకౌగిలిలోనికి ఒదిగిపోయి తలసరిచేస్తూ...*

**'కటకట! పాపపుంగినుక గైకొని, యబ్రపుఁ గెంపువన్నియన్**
**బుటపుటనైన మత్ప్రియు కపోలము వెల్వెలవాఱఁజేసితిన్**
**గటికయెడందదాన' నని, కందిన నందుని నిండుడెంద మూ**
**ఱటగొనఁజెక్కుటద్దముల రాగము చిందఁగ ముద్దు పెట్టుచున్.**

**అర్థాలు:** కటకట=అయ్యో! పాపపు+కినుక=పాపిష్టి కోపం, కైకొని=పొంది, అబ్రపున్= ఆశ్చర్యంగొలిపే, మత్+ప్రియు=నాకిష్టమైన భర్తయొక్క, కెంపువన్నియన్=ఎర్రనికాంతిచేత, పుటపుటనైన=గొప్పగా ప్రకాశించే, కపోలము=బుగ్గలు, వెల్వెలవాఱఁజేసితిన్=పాలిపోయేలా చేసాను. కటికయెడందదానన్=కఠినమైన గుండె కలదానిని, అని=అంటూ, నందుని=భర్త నందుని, కందిన=గాయపడ్డ, నిండుడెందము=నిండుహృదయం, ఊఱట గొనన్=ఓదార్పు పొందేలా, చెక్కుటద్దముల=మృదువైన బుగ్గలమీద, రాగము చిందఁగ=తిరిగి పూర్వపు ఎరుపుదనం వచ్చేలా, ముద్దు పెట్టుచున్=ముద్దులు కురిపిస్తూ....

**తాత్పర్యం:** *అయ్యో! పాపిష్టి కోపంచేత నా ముద్దుల ప్రియుని కెంపులవంటి అందమైన బుగ్గల్ని పాలిపోయేలా చేసాను... కటికగుండె గలదాన్ని అనుకొంటూ భర్తయొక్క గాయపడ్డ హృదయం సేదదీరేలాగా అతని మెత్తనిబుగ్గలు పూర్వపుకాంతిపొందేలా ముద్దులు కురిపిస్తూ...*

**'సాంత్వనమృదూక్తిచతుర! విస్రంభకార్య**
**నిపుణ! మన్నాథ! దరిలేని నీ యగాధ**
**హృదయరాజ్య మేకచ్ఛత్ర మేలఁజూతు,**
**నెట్లు మన్నింతొ? యీ లఘుహృదయురాలి.**

**అర్థాలు:** సాంత్వన=ఓదార్చే, మృదూక్తిచతుర=మెత్తని మాటలందు నేర్పుకలిగినవాడా! విస్రంభకార్య=నమ్మకం కలిగించటంలో, నిపుణ=మెలకువలు తెలిసినవాడా! మత్+నాథ= ఓ నా ప్రియుడా! దరిలేని=అంతు తెలియని,

నీయగాధ=నీయొక్క లోతైన, హృదయరాజ్యము=మనోమండలాన్ని, ఏకచ్ఛత్రము=ఒకేగొడుగుక్రింద, ఏలఁజూతున్= పరిపాలించాలనుకొంటున్నాను, ఈలఘుహృదయురాలి= ఈ చిన్ని గుండెగలదానిని, ఎట్లు=ఏవిధంగా, మన్నింతొ= దయచూపుతావో?

**తాత్పర్యం:** *నా ప్రియనాథుడా! మెత్తనిమాటలతో ఓదార్పుగలిగినవాడా! నమ్మకం కలిగించే చర్యలలో మెలకువలు బాగాతెలిసిన వాడా! అంతులేని నీ లోతైన హృదయసామ్రాజ్యాన్ని మొత్తాన్ని నేనే పరిపాలించాలనుకొంటున్నాను. ఈ అమాయకమైన లేత హృదయంగల దాన్ని ఏవిధంగా అంగీకరిస్తావో కదా!*

**అపరాధ ప్రియకారితా నవనవంబౌ ప్రేమలీలాసుధన్**
**గృపమై మచ్చపలాంతరంగమున నిక్షేపించి, యీ దాసురా**
**లిపయిన్ జూపు ననుగ్రహమ్మునకుఁ గల్పింతున్ మదాత్మాంబుజ**
**మ్ముపచారమ్ముగ నల్పమంచనక యెట్లో స్వీకరింపంగదే'.**

**అర్థాలు:** అపరాధ=చేసినతప్పుకు, ప్రియకారితా=ఇష్టపడి నీకింపుకూర్చడంలో, నవనవంబౌ= క్రొత్తక్రొత్తదైన, ప్రేమలీలాసుధన్=వలపుసోయగమనే అమృతాన్ని, మత్=నాయొక్క, చపల= నిలకడలేని, అంతరంగమున= మనసులో, నిక్షేపించి=దాచి, కృపమై=దయతో, ఈ దాసురాలి=ఈ సేవకురాలి, పయిన్=మీద, చూపున్=చూపించే, అనుగ్రహమ్మునకున్=దయకు ప్రతిగా, మత్+ఆత్మాంబుజమ్ము=నా మనసనే కమలాన్ని, ఉపచారమ్ముగన్= సమ్మానంగా, కల్పింతున్=సమర్పిస్తాను, అల్పమంచు=తక్కువని, అనక=భావించకుండా, ఎట్లో=ఏదోవిధంగా, స్వీకరింపంగదే=అంగీకరింపవూ!

**తాత్పర్యం:** *నేను చేసినతప్పుకు ప్రతిక్రియగా నా చపలమైన అంతరంగంలో క్రొత్తక్రొత్తదైన వలపుసోయగమనే అమృతాన్ని దాచి సమర్పించేందుకు అంగీకరిస్తూ ఈసేవకురాలిపై చూపేదయకు ప్రతిఫలంగా నా హృదయమనే కమలంతో సన్మానిస్తాను. ఇది చాలాతక్కువే, అయినా అలా అనుకోకుండా నామీద దయతో అంగీకరిస్తావుకదూ!*

**అని మనఃప్రియముగ్ధభాషణము లలర**
**నక్కునన్ వ్రాలిన లతాంగి నాత్మఁజేర్చి,**
**పాపటన్ జక్కదిద్దుచు ఫాలతలము**
**ముద్దుగొని, తేరుకొన నాతిమోము గాంచి.**

**అర్థాలు:** అని=ఇలా అంటూ, మనఃప్రియ=మనస్సుకు ఇష్టమైన, ముగ్ధభాషణములు=బేల పలుకులతో, అలరన్=సంతోషపెడుతూ, అక్కునన్=గుండెలమీద, వ్రాలిన=పడిపోయిన, లతాంగిన్=ప్రియురాలిని, ఆత్మన్+ చేర్చి=ఆలింగనం చేసికొని, పాపటన్=కేశవీథిని, చక్కదిద్దుచు=సరిచేస్తూ, ఫాలతలము=నుదుటిమీద, ముద్దుగొని= చుంబించి, తేరుకొన= తేటపడిన, నాతిమోముగాంచి=ఆమె ముఖాన్నిచూచి....

**తాత్పర్యం:** *ఇలా అంటూ మనసునకిష్టమైన అమాయకపుమాటలతో తనను సంతోష పెడుతూ గుండెలమీద వాలిన ప్రియురాలిని ఆలింగనం చేసికొని, పాపట సరిచేస్తూ, నుదుటిమీద చుంబించి, తేటపడిన ఆమె ముఖాన్ని చూచి...*

**'అలుక మొయిళ్ళమాటునఁ ద్వదాస్యవిధుండు ముహూర్తముండి యు**
**జ్జ్వలదరహాసచంద్రికలు పర్వఁగ వెండి ప్రసన్నుఁడౌట యో**
**కలికి! వినూతనోత్సవముగాదొకొ? యిర్వుర మిట్లు సాఁకు పె**
**న్వలపుల కల్పవల్లి కతివా! యివియేగద దోహదక్రియల్.**

**అర్థాలు:** ఓ కలికి=ఓ సుందరీ! అలుకమొయిళ్ళమాటునన్=కోపమనే చీకట్లచాటున, త్వత్+ ఆస్య విధుండు= నీముఖం అనే చంద్రుడు, ముహూర్తము+ఉండి=క్షణకాలం దాగి, ఉజ్వల=దీప్తిమంతములైన, దరహాస చంద్రికలు= నవ్వులవెన్నెలలు, పర్వఁగ=ప్రసరించడానికి, వెండి= తిరిగి, ప్రసన్నుఁడు+ఔట=కనిపించడం, వినూతన+ ఉత్సవము=క్రొత్తపండుగ, కాదొకొ= కాదా? అతివా=ప్రేయసీ! ఇర్వురము=ఇద్దరం, ఇట్లు=ఈవిధంగా, సాఁకు=పెంపొందించే, పెను+వలపుల=విస్తారమైన ప్రేమ అనే, కల్పవల్లికి=ఈవులతరువుకు, ఇవియేగద=ఇవే కదా, దోహదక్రియల్=పోషణకార్యాలు!

**తాత్పర్యం:** *ఓ సుందరీ! నీ ముఖచంద్రుడు కోపమనే చీకట్లచాటున కొద్దిసేపుండి అంతకంటే కాంతివెన్నెలలు కురవడానికి తిరిగి కనిపించడం.. ఇదొక పండుగవంటిదికదా! మనిద్దరం ఇలాపెంచే ప్రేమకల్పవృక్షానికి ఇవేకదా దోహదక్రియలు!*

**పాణిద్వంద్వము నూని కౌఁగిటఁ గదింపన్ జూతు నిన్, నీదు వి**
**న్నాణంబున్ మఱి దోయిలింపఁదలఁతున్ నాచూడ్కులన్ ద్రావుదున్**
**నీ నవ్యామృతవీక్షణమ్ములను, నీ నిశ్వాససౌగంధ్య మా**
**ఘ్రాణింతున్ మెయియెల్ల ఘ్రాణములుగాఁ గైమోడ్పు నీ చెల్వుకున్.**

**అర్థాలు:** నిన్=నిన్ను, పాణిద్వంద్వమునూని=రెండుచేతులా బంధించి, కౌఁగిటన్=ఆలింగనంలో, గదింపన్ జూతు=హత్తుకుంటాను, నీదు=నీయొక్క, విన్నాణంబున్= పరువానికి, మఱి=మరొకసారి, దోయిలింపఁదలతున్= చేతులుజోడిస్తాను, నీ నవ్యామృత= సరిక్రొత్త అమృతాన్నికురిపించే నీయొక్క వీక్షణమ్ములను=చూపులను, నాచూడ్కులన్=నా కళ్ళతో, త్రావుదున్=తాగేస్తాను, నీ నిశ్వాస సౌగంధ్యము=నీవు వదిలే గాలిగంధాలను, మెయియెల్ల=నాదేహమంతా, ఘ్రాణములుగాన్=ముక్కులుకాగా, ఆఘ్రాణింతున్= పీల్చుకుంటాను, నీ చెల్వుకున్=నీ అందానికి, కైమోడ్పు=నమస్కారం.

**తాత్పర్యం:** *నిన్ను రెండుచేతులా బంధించి ఆలింగనంతో హత్తుకుంటాను. అద్భుతమైన నీ పరువానికి మరొక్కసారి చేతులుజోడిస్తాను. సరిక్రొత్త సుధలుకురిపించే నీచూపులను*

*నాచూపులతో త్రాగేస్తాను. నీవు వదిలే గాలిలోని సుగంధాన్ని నా ఒళ్ళంతా ముక్కులుచేసికొని అనుభవిస్తాను. నీ అందానికి నా నమస్కారం.*

**రాగరంజితమన్మనోరత్న మింత**
**యింత శకలమ్ము లొనరించి యింతి! నీదు**
**కంఠహారమ్ము నొనరింతుఁ, గడమయిడక**
**వినుతు హృదయప్రబంధమ్ము విశదఫణితి!**

**అర్థాలు:** ఇంతి=ప్రేయసీ! రాగరంజిత=అనురక్తిచే ఎర్రబడ్డ, మత్+మనోరత్నము=నామనసనే రత్నాన్ని, ఇంతయింత=చిన్నచిన్న, శకలమ్ములొనరించి=ముక్కలుచేసి, నీదు=నీయొక్క, కంఠహారమ్మున్=మెడకు ఆభరణంగా, ఒనరింతున్=చేస్తాను. కడమయిడక=మిగిల్చకుండా, విశదఫణితి=వివరంగా, హృదయప్రబంధమ్ము= ఎదకావ్యాన్ని, వినుతు=వినిపిస్తాను.

**తాత్పర్యం:** *ఓప్రేయసీ! రాగరంజితమైన నా మనోరత్నాన్ని చిన్నచిన్నముక్కలుచేసి నీ మెడలో హారంగావేస్తాను. నాహృదయంగురించిన గాథను వదిలిపెట్టకుండా వివరంగా చెబుతాను.*

**వెలఁది! యీ రాగలతలు పుష్పించునట్టు**
**లీ మనోరథములు ఫలియించునట్లు**
**దరులొరసి పాఱు నీ మమతాస్రవంతిఁ**
**దేలిపోదము పెఱతలం పేల మనకు?**

**అర్థాలు:** వెలఁది=ప్రేయసీ! ఈ రాగలతలు=ఈ అనురాగం అనే పూతీవలు, పుష్పించు నట్టులు=పూచేవిధంగా, ఈ మనోరథములు=ఈ మన కోర్కెలు, ఫలియించునట్లు=తీరేటట్లు, దరులొరసి పాఱున్=పొంగి ప్రవహించే, ఈ మమతాస్రవంతిన్=ఈ ప్రేమనదిలో, తేలిపోదము= ఈదులాడదాము, పెఱతలంపు=వేరేచింత, ఏలమనకు= మనకెందుకు?

**తాత్పర్యం:** *ప్రేయసీ! మన అనురాగపు తీవలుపూచేవిధంగా, మనకోర్కెలు తీరేవిధంగా పొంగిప్రవహించే ఈ అనురాగఝరిలో ఈతలుకొడదాము. వేరేచింత మనకెందుకు?*

**అరమరలేని కూరుముల నాడుచుఁ బాడుచుఁ బ్రేమశీధుపా**
**న రతులమై చరింతము, మనస్విని! చెక్కులఁ బత్రభంగముల్**
**విరచన సల్పుకొమ్మనుచు, వెండియు మండనసాక్షిభూతమున్**
**సరసుఁడు దాల్చి నిల్చెను హసన్ముఖుఁడౌచు మెఱుంగుటద్దమున్.**

**అర్థాలు:** మనస్విని=మనసుగలదానా! అరమరలేని=చాటుమాటులేని, కూరుములన్= ఇష్టాలతో, ఆడుచున్ పాడుచున్=ఆడుతూపాడుతూ, ప్రేమశీధు=అనురాగామృతాన్ని, పాన రతులమై=త్రాగడంలో నిమగ్నులమై,

చరింతము=గడిపేద్దాం, చెక్కులన్=నీ బుగ్గలపైన, పత్రభంగముల్=మకరికాలతలను, విరచన సల్పుకొమ్ము= అందంగా తీర్చిదిద్దుకో, అనుచు= ఇలా అంటూ, సరసుఁడు=రసికుడైన నందుడు, హసన్ముఖుఁడౌచు= నవ్వు ముఖంతో, వెండియు=మరల, మండన=అలంకారానికి, సాక్షిభూతమున్=నిదర్శనంగానిలిచే, మెఱుంగు టద్దమున్=మంచి దర్పణాన్ని, తాల్చి=పట్టుకొని, నిల్చెను=నిలబడ్డాడు.

**తాత్పర్యం:** *మనసుగల ప్రేయసీ! చాటుమాటులేని మనసులతో ఆడుతూపాడుతూ ప్రేమామృతాన్ని త్రాగుతూ గడిపేద్దాం, ఇంక నీ బుగ్గలమీద మకరికాలతలు దిద్దుకో అంటూ రసికుడైన నందుడు మరల దర్పణాన్ని పట్టుకొని నిలబడ్డాడు.*

**దర్పణముఁదాల్చి నిల్చినం ధవునిమోము**
**నెడనెడఁ గనుంగొనుచు రచియించుకొనియెఁ**
**జెలియ నునుఁజెక్కులందు విశేషకమ్ము**
**నెమ్మొగమ్మున శైవలాబ్జమ్ము దొరయ.**

**అర్థాలు:** చెలియ=ప్రియురాలు, ఎడనెడన్=అప్పుడప్పుడు, దర్పణమున్=అద్దాన్ని, తాల్చి= పట్టుకొని, నిల్చినన్=నిలబడ్డ, ధవునిమోము=భర్తముఖాన్ని, కనుంగొనుచు=చూస్తూ, నెమ్మొగమ్మున=అందమైన ఆముఖం మీద, శైవలాబ్జమ్ము=తామరపువ్వం, దొరయ=కనిపించేవిధంగా, నునుఁజెక్కులందు=నున్ననిబుగ్గలమీద, విశేషకమ్ము=చిత్రాన్ని, రచియించుకొనియె=చిత్రించుకొంది.

**తాత్పర్యం:** *అప్పుడాప్రియురాలు అద్దంపట్టుకొన్న భర్తముఖాన్ని అప్పుడప్పుడు చూస్తూ తనముఖంమీద పద్మాలు వికసించాయా అన్నట్లు నున్నటిబుగ్గలమీద పత్రాలు చిత్రించు కొంది.*

**ఉడురాజోపలఘట్టనా సుభగమై వ్యోమమ్ముఁ జుంబించు మేల్**
**పడకింటన్ లలితోపభోగకలనా పారీణుఁడై నందుఁడా**
**మడఁతిన్ గూడి యిటున్నవేళఁ, బిలిచెన్ మధ్యాహ్నభిక్షార్థియై**
**గడపన్మెట్టిన గౌతముండు 'మమ భిక్షాందేహి'యన్ వాక్కునన్.**

**అర్థాలు:** ఉడురాజ=చంద్రుడనే, ఉపల=మొరపరాతిపై, ఘట్టనా=అరగదీయడంవలన, సుభగమై= అందాలీనుతూ, వ్యోమమ్మున్=ఆకాశాన్ని, చుంబించు=ముద్దాడే, మేల్=ముచ్చటైన, పడకింటన్=పడకటింటిలో, లలితోపభోగ=అందమైన అనుభవాన్ని, కలనా పారీణుఁడై=పొందడంలో అంతుచూచినవాడై, నందుఁడు= నాయకుడైన నందుడు, ఆ మడతిన్=తనపడతిని, కూడి=కలిసి, ఇటున్నవేళ=ఇలా ఉన్నప్పుడు, మధ్యాహ్న భిక్షార్థియై= నడిప్రొద్దు కబళంకోరి, గడపన్మెట్టిన=ఇంటిముందుకువచ్చిన, గౌతముండు=బుద్ధుడు, మమభిక్షాం దేహియన్ వాక్కునన్=నాకుభిక్షపెట్టమంటూ, పిలిచెన్=పిలిచాడు.

**తాత్పర్యం:** *చంద్రునిపై సానబట్టిన కాంతులతో ఆకాశంలో తేలిపోతూ పడకటింటిలో తన*

*సతితో ఆనందసాగరంలో నందుడు మునిగిపోయిన ఆ నడిప్రొద్దున భిక్షకైవచ్చిన బుద్ధుడు భిక్షపెట్టమంటూ పిలిచాడు.*

**అనుజన్మావసథం బఁటంచు మది నెయ్యంబూనునో లోనికిన్**
**జనునో నెమ్మొగమెత్తి కన్గొనునొ నిస్సంగుండు శాక్యర్షి ని**
**ల్చెను దద్గేహళి నన్యగేహములఁబోలెన్ ఱెప్పపాటంత, పో**
**యెను దారింబడి 'యస్తి నాస్తి' యను పల్కెందున్ వినన్ రామిచే.**

**అర్థాలు:** అనుజన్మావసథంబఁటంచు=తమ్ముని ఇల్లుకదా అని, మది=మనసులో, నెయ్యంబూనునో=స్నేహం ప్రకటిస్తాడో, లోనికిన్=ఇంటిలోపలికి, చనునో=కాలుపెడతాడో, నెమ్మొగమెత్తి=అందమైన ముఖాన్ని పైకెత్తి, కన్గొనునొ=చూస్తాడో, శాక్యర్షి=ఋషికల్పుడైన శాక్యవంశపు గౌతముడు, నిస్సంగుండు=బంధాలకతీతుడుకదా, తద్గేహళి=ఆయింటిముందు, అన్యగేహములఁబోలెన్=ఇతరియిండ్లముందువలె, ఱెప్పపాటంత=ఒక్కక్షణమాత్రం, నిల్చెను=నిలబడ్డాడు. అస్తినాస్తియను=ఉందిలేదు అనే, పల్కు+ఎందున్=మాట ఎక్కడా, వినన్‌రామిచే=వినిపించ నందున, దారింబడి=తనదారినతాను, పోయెను=వెళ్ళిపోయాడు.

**తాత్పర్యం:** *తమ్మునిల్లుకదా అని ముఖమెత్తి చూస్తాడా లేక లోపలికి అడుగుపెడతాడా అనుకొనే లోపలనే బంధాలకతీతుడైన ఆ శాక్యముని ఇతర ఇండ్లముందులాగానే ఒక్క క్షణం నిలబడి లోపలినుండి ఏమాటా వినిపించక అక్కడనుండి బయలుదేరాడు.*

**అగురుగందమును లొద్దుగ పూలపిండితో**
**నలుఁగులు నూఱును జెలువ యోర్తు**
**నీహారవారి పన్నీరు సాఁబాళ్ళుగా**
**నీరాటకై కల్పు నెలఁత యోర్తు**
**కమ్మకస్తురిని సాంకవగంధమును గూర్చి**
**కలపమ్ము మేదించుఁ గలికి యోర్తు**
**పచ్చకప్పురము జాపత్రిఁజేర్చి త**
**మ్ములపుఁజిల్కలు చుట్టు మెలఁత యోర్తు**

**పూవుటెత్తులు గ్రుచ్చుఁ బూఁబోడి యోర్తు**
**భర్తృకార్యార్థ మటునిటుఁ బఱచు నోర్తు**
**ఊడిగపుఁగాంత లిట్లు నియుక్త లగుట**
**నెవరు విందురు బుద్ధయోగీంద్రుపిలుపు?**

**అర్థాలు:** చెలువయోర్తు=ఒకచెలికత్తె, అగురుగందమును=అవురుగడ్డి, చందనం, లొద్దుగ పూలపిండితో=

లోధ్రపూలపిండితోకలిపి, నలుఁగులునూఱును=వంటికి పట్టించే నలుగుపిండి నూరుతోంది. నెలఁతయోర్తు= మరొకచెలికత్తె, నీహారవారి=మంచునీరు, పన్నీరు=గొజ్జగనీరు, సాఁబాళ్ళుగా=సమపాళ్ళుగా, నీరాటకై= స్నానానికని, కల్పు=కలుపుతుంది. కలికియోర్తు= మరొకచెలికత్తె, కమ్మకస్తురిని=మంచికస్తూరిని, సాంకవ గంధమును=జవ్వాదిని, కూర్చి=కలిపి, కలపమ్మమేదించున్=గంధసారాన్ని పిసుకుతోంది. మెలఁతయోర్తు=వేరొక చెలికత్తె, పచ్చకప్పురము= పచ్చకర్పూరం, జాపత్త్రిరిన్=జాపత్రితో, చేర్చి=కలిపి, తమ్ములపున్ చిల్కలు=తాంబూలపు చిలుకలు, చుట్టు= తయారుచేస్తోంది. పూఁబోడియోర్తు=ఒకచెలి, పూవుటెత్తులు=పూలదండలు, గ్రుచ్చున్= కూరుస్తోంది. ఓర్తు= ఇంకొకతె, భర్తృకార్యార్థము= యజమాని చెప్పేపనులకొరకు, అటునిటుఁ=అక్కడికి ఇక్కడికి, పఱచు= పరుగులుతీస్తుంది. ఊడిగపుఁగాంతలు=పనికత్తెలు, ఇట్లు=ఈ విధంగా, నియుక్తలగుటన్=ఎవరిపనుల్లో వాళ్ళుంటే, బుద్ధయోగీంద్రు పిలుపు=గౌతముని పిలుపు, ఎవరు విందురు=ఎవరువింటారు?

**తాత్పర్యం:** *ఒకచెలికత్తె నలుగుపిండి నూరుతోంది. ఒకచెలికత్తె స్నానానికి నీరుసిద్ధం చేస్తోంది. మరొకతె కస్తురిని జవాదిని కలిపి కలపం సిద్ధంచేస్తోంది. ఇంకొకతె పచ్చకర్పూరం జాపత్రులతో తాంబూలపుచిలకలు చుడుతోంది. ఒకతె పూలు దండలుగా గుచ్చుతోంది. ఒకతె యజమాని చెప్పేపనులకు అటూయిటూ తిరుగుతోంది. ఇలా అందరూ అన్నిపనుల్లో తీరికలేకుండా ఉంటే పాపం బుద్ధుని పిలుపు ఎవరు పట్టించుకుంటారు?*

**చెంగు చెంగునఁ బర్యాయసేవకొఱకు**
**నగరి కప్పుడు చనుదెంచు నాతి యొకతె-**
**యీ చరిత్రమ్ము నిటు వెరయింపనున్న**
**దైవవశమున- ముని నివర్తనము గాంచి,**

**అర్థాలు:** ఈ చరిత్రమ్మున్=ఈకథను, ఇటు వెరయింపనున్న=ఇలా జరుపనుండగా, దైవవశమున= దేవుడు పంపినట్లు, అప్పుడు=ఆసమయంలో, పర్యాయసేవకొఱకు= తనంతుపనికోసం, నగరికి=నగరానికి, చెంగు చెంగునన్=పరుగుపరుగున, చనుదెంచు= వచ్చే, నాతియొకతె=చెలియొకర్తె, మునినివర్తనము=బుద్ధుడు తిరిగి వెళ్ళిపోవడం, కాంచి=చూచి...

**తాత్పర్యం:** *ఇదిలావుండగా వేగంగా వంతుపనికివస్తున్న చెలికత్తె బుద్ధుని పోకనుచూచి...*

**'గడితపుఁ జెట్ట పుట్టెఁగదె, కార్యనిమగ్నతఁ జేసి యింటిలో**
**నుడిగపుఁజేడియల్ కనఁగనోపరు గావలయున్, మహానుభా**
**వుఁడు చనుచున్నవాఁడురక, పూజ్యనిగర్హణనింద స్వామిపైఁ**
**బడునొ మతేమొ యేఁ దెలిపివచ్చెదఁగా' కని నందుచెంతకున్.**

**అర్థాలు:** గడితపున్=పెద్ద, చెట్టపుట్టెఁగదె=అనర్థం జరిగిపోయందిగదే, ఇంటిలో=మనింట్లో, ఉడిగపున్ చేడియల్= పనికత్తెలు, కార్యనిమగ్నతన్ చేసి=పనులలో ఉండటాన, కనఁగన్+ ఓపరు+కావలయున్= చూడలే దనుకుంటాను,

మహానుభావుఁడు=బుద్ధభగవానుడు, ఉరక= వట్టిచేతులతో, చనుచున్నవాఁడు=వెడుతున్నాడు, పూజ్య నిగర్హణ నింద=గౌరవించాల్సిన వాళ్ళను తిరస్కరించిన పాపం, స్వామిపైన్ పడునొ=మనయజమానిమీద పడుతుందో, మఱేమొ=ఏమో, ఏన్=నేను, తెలిపివచ్చెదన్ గాక=చెప్పివస్తాను, అని=అంటూ, నందుచెంతకున్= నందునిదగ్గరకు....

**తాత్పర్యం:** *పెద్ద అనర్థం జరిగిపోయిందికదా! పనివాళ్ళంతా పనులలోమునిగి ఉండటాన చూడలేదుకాబోలు, బుద్ధభగవానుడు రిక్తహస్తాలతో వెళ్ళిపోతున్నాడు. పూజ్యులను వెళ్ళగొట్టిన పాపం యజమానికి చుట్టుకుంటుందో ఏమో.. నేవెళ్ళి చెప్పివస్తాను అనుకొంటూ నందుని దగ్గరకు....*

**చని విన్నవింపఁగా, ని**
**ల్చిన నీరయి రాసుతుండు, పుల్కుపులుకునన్**
**దనప్రాణకాంత మోమును**
**గనుఁగొనుచున్ బలికె నిట్లు, కళవళపడుచున్.**

**అర్థాలు:** చని=వెళ్ళి, విన్నవింపఁగా=జరిగింది చెప్పగా, రాసుతుండు=రాజకుమారుడు, నిల్చిన నీరయి= ఒళ్ళంతా చమటలుపట్టి, కళవళపడుచున్=కలతపడుతూ, తన ప్రాణకాంత=తననువిడిచి బ్రతుకలేని అర్థాంగి, మోమును=ముఖాన్ని, పుల్కుపులుకునన్=రెప్పలుమూసిమూసి తెరుస్తూ , కనున్గొనుచున్=చూస్తూ, ఇట్లు= ఈవిధంగా, పలికెన్=మాట్లాడాడు.

**తాత్పర్యం:** *వెళ్ళి జరిగినవిషయం చెప్పగా ఆ రాజకుమారుడగు నందుడు ఒళ్ళంతా చెమటలు పట్టి బాధపడుతూ తనప్రాణసమాన అయిన అర్థాంగిముఖాన్ని పులుకుపులుకునా చూస్తూ ఇలా మాట్లాడాడు.*

**'అన్నయఁటే మహామహిముఁడట్టె, జగమ్మునవార లెంతయున్**
**మన్ననసల్పుచున్ గురుఁడు మాకన దైవమునాఁ జెలంగు లో**
**కోన్నతుఁడట్టె, యిట్లు నిలయోపగతుండయి, భిక్షవేఁడి, య**
**న్నన్న-, మఱేమనన్- మగిడెనట్టె, చెలీ! కను, నాయభాగ్యతన్.**

**అర్థాలు:** అన్నయఁటే=మా అన్నగారుసుమా! మహామహిముఁడు అట్టె=గొప్పమహిమలు గలవాడట, గురుఁడు మాకు=మాగురువుగారని, జగమ్మునవారు=ఈ ప్రపంచంలోని వారంతా, ఎంతయున్=ఎంతోగొప్పగా, మన్నన సల్పుచున్ అన=గౌరవిస్తూంటే, దైవమునాన్ చెలంగు=సాక్షాత్ పరమాత్ముడిలాగా పూజింపబడే, లోకోన్నతుఁడట్టె=ఈ లోకానికే పూజనీయుడట, ఇట్లు=ఇలా, నిలయ+ఉపగతుండు+అయి=ఇంటికి వచ్చి, భిక్షవేఁడి=భోజనం కోసం అర్థించి, అన్నన్న=అయ్యో, మగిడెనట్టె=తిరిగి వెళ్ళిపోయాడట, మఱేమనన్=ఇంకేం చెప్పమంటావు? చెలీ=ప్రేయసీ! నా అభాగ్యతన్=నాయొక్క దురదృష్టాన్ని, కను=చూడు.

**తాత్పర్యం:** *వచ్చింది మా అన్నగారట, గొప్ప మహిమలుగల వాడట, లోకంలో అందరూ మా గురువుగారంటే మాగురువుగారని ఎంతోగొప్పగా గౌరవిస్తూంటే సాక్షాత్తు పరమాత్ముడిలా పూజింపబడే మహోన్నతుడట. ఇలా మనయింటిదాకా వచ్చి భిక్ష అడిగి తిరిగి వెళ్ళిపోయాట. అయ్యో... ప్రేయసీ! ఏమిచెప్పమంటావు? నా దురదృష్టాన్ని చూడు.*

**ఎంతప్రమాదము పుట్టెన్**
**గాంతా! న న్ననుమతింపఁగదె, పూజ్యుఁడతి**
**క్రాంతుఁ డగుమున్న చని ప్రా**
**ర్థింతున్ బాదముల వ్రాలి, తెచ్చెద మగుడన్.'**

**అర్థాలు:** కాంతా=ప్రేయసీ! ఎంతప్రమాదము=ఎంతటి ఆపద, పుట్టెన్=కలిగింది! పూజ్యుఁడు=పెద్దవాడగు మా అన్నగారు, అతిక్రాంతుఁడు+అగు=దాటివెళ్ళడానికి, మున్న=ముందే, చని=నేనువెళ్ళి, పాదములవ్రాలి= ఆయనపాదాలమీద పడి, ప్రార్థింతున్=తిరిగివచ్చి భిక్ష గ్రహించమని వేడుకుంటాను, మగుడన్=తిరిగి, తెచ్చెద= తెస్తాను, నన్ను=ఈ దీనుడిని, అనుమతింపన్ గదె=వెళ్ళడానికి ఒప్పుకోవూ!

**తాత్పర్యం:** *ఎంతపని జరిగింది ప్రేయసీ! పూజింపదగిన మా అన్నగారు వీధి దాటిపోవడానికి ముందే వెళ్ళి పాదాలమీదపడి తిరిగిరమ్మని ప్రార్థించి మరీ తెస్తాను. నేను వెళ్ళడానికి దయచేసి ఒప్పుకోవూ!*

**అని సరసీజకల్పమగు నంజలిపట్టి యనుజ్ఞ వేఁడు కాం**
**తుని గని, వెచ్చనూర్చి, నవతోయజచారువిలోచనమ్ములన్**
**దొనదొన బాష్పముల్ దొఱఁగఁ, దొయ్యలి 'నన్నెడఁబాసియేగెదే'**
**యని మెయితీవ తూలఁ బ్రియునక్కున వ్రాలి సగద్గదమ్ముగన్.**

**అర్థాలు:** అని=ఇలా అంటూ, సరసీజకల్పమగున్=కమలంవంటి, అంజలిపట్టి=దోయిలి పట్టి, అనుజ్ఞవేఁ డు=అనుమతిని కోరే, కాంతునిగని=భర్తనుచూచి, తొయ్యలి=ఆ మగువ, వెచ్చనూర్చి=వేడినిట్టూర్పు వదిలి, నవతోయజ=క్రొత్తతామరలవంటి, చారువిలోచనమ్ములన్= అందమైన కనులనుండి, దొనదొన=దొనదొనమంటూ ప్రవాహంలా, బాష్పముల్దొఱగన్= కన్నీరు రాలగా, నన్నెడఁబాసి యేగెదే=నన్ను వదిలిపెట్టి వెళ్ళిపోతావా, అని=అంటూ, మెయితీవ తూలన్=సన్నటి మేను తూలిపోతూండగా, ప్రియుని=తనను ప్రేమించేవాని, అక్కున= కౌగిట్లో, వ్రాలి=పడిపోయి, సగద్గదమ్ముగన్=గొంతు బరువెక్కగా....

**తాత్పర్యం:** *ఇలా అంటూ కమలంవంటి దోయిలిపట్టి అనుమతికోరే భర్తనుచూచి ఆమె వెచ్చటి నిట్టూర్పువదిలి కొత్తతామరలవంటి కనులనుండి కన్నీరు ప్రవాహంలా కారుతూండగా నన్నువదిలి వెడతావా అంటూ సన్నటిమేను తూలిపోతూండగా ప్రియుని కౌగిట్లో వాలిపోయి బరువైన గొంతుతో...*

**'నా మనోనాథ! నానిదానమ్మ! నాదు**
**కంఠహారమ్మ! నా కనుంగవ వెలుంగ!**
**గురుచరణసేవ గావింప నరుగునిన్ను**
**నెట్లు వారింతుఁ, గాక నిన్నెట్లు పనుతు?**

**అర్థాలు:** నా మనోనాథ=నా మనస్సుకు ప్రభువైనవాడా! నా నిదానమ్మ=నా తపస్సుకు ఫలమైనవాడా! నాదు= నాయొక్క, కంఠహారమ్మ=మంగళసూత్రమైనవాడా! నా=నాయొక్క, కనుంగవ వెలుంగ=కనులజంటకు వెలుగైన వాడా! గురుచరణ=పెద్దవారి పాదాలకు, సేవగావింపన్=పరిచర్య చేయడానికి, అరుగునిన్నున్=వెళ్ళేనిన్ను, ఎట్లు వారింతున్=ఎలా అడ్డుకొనేది? కాక=కాకపోతే, నిన్ను+ఎట్లు=నిన్ను ఏవిధంగా, పనుతు=పంపించేది?

**తాత్పర్యం:** *నేను నమ్ముకొన్నవాడా! నా తపస్సుకు ప్రతిరూపమా! నాకు మంగళం కలిగించే వాడా! నా కనులకు వెలుగైనవాడా! పెద్దవారి పరిచర్యకు వెళ్ళేనిన్ను ఎట్లా వారించేది? అలాగని నాకు సర్వమూనైన నిన్నెట్లా పంపించేది?*

**అనుకొననట్టి యీ విరహ మక్కట! తారసిలెన్ గదా! ప్రియా!**
**మనసు వశమ్ముగాక పలుమాఱు ననర్థము శంకచేసెడున్,**
**జని యటనే విలంబనము సల్పకుమా! యిట నున్నయట్ల నా**
**యనుఁగ! విశేషకమ్ము తడియాఱకమున్ జనుదేరఁగావలెన్.**

**అర్థాలు:** అక్కట=అయ్యో! అనుకొననట్టి=ముందే మనకుతెలియని, ఈ విరహము=ఈ ఎడబాటు, తారసిలెన్ గదా=ఎదురైందికదా! ప్రియా=ప్రియుడైనవాడా! మనసు వశమ్ముగాక= మనస్సు అదుపులోలేక, పలుమాఱున్= మాటిమాటికీ, అనర్థము=కీడును, శంకచేసెడున్= అనుమానిస్తోంది. చని=అక్కడకు వెళ్ళి, అటనే=అక్కడనే, విలంబనము=ఆలస్యం, సల్పకుమా=చేయవద్దు సుమా! నా+అనుఁగ=నన్నునుసరించేవాడా! ఇటన్=ఇక్కడే, ఉన్నయట్ల=ఉన్నట్లుగా, విశేషకమ్ము=నా మకరికా పత్రాలు, తడియారకమున్=ఆరిపోకముందే, చనుదేరఁ గావలెన్=తిరిగిరావాలి సుమా!

**తాత్పర్యం:** *అయ్యో ప్రియుడా! ఇప్పుడే ఈ ఎడబాటు ఎదురుకావాలా! అదుపులోలేని మనస్సు మాటిమాటికీ కీడును శంకిస్తోంది. వెళ్ళుకాని, అక్కడే ఆలస్యం చేయబోకు. ఇక్కడే ఉన్నట్లుగా నేను దిద్దుకున్న మకరికలు ఆరిపోకముందే తిరిగిరావాలి సుమా!*

**పలుకుబడి నింతలో నేగివచ్చి తేని**
**విడని గోర్వెచ్చ కౌఁగిలివిందు, ముద్దు**
**దొంతరలు, దొంతరలముద్దు-, లింతయేల**
**కానిపించెద నా యనుగ్రహమహమ్ము,'**

**అర్థాలు:** పలుకుబడిన్=ఇచ్చిన మాటప్రకారం, ఇంతలోన్=నేను చెప్పిన ప్రకారంగా, ఏగివచ్చితేని=వెళ్ళి వచ్చితివా,

విడని=నిన్ను విడిచిపెట్టనివిధంగా, గోర్వెచ్చ=గోరువెచ్చని, కౌఁగిలి=గాఢాలింగనం, విందు=నీకు విందుగా ప్రసాదిస్తాను. ముద్దు దొంతరలు=చుంబన పరంపరలు, దొంతరల ముద్దులు=కాదు కాదు వరుసముద్దులే, ఇంతయేల=ఇవన్నీ ఎందుకు, అహమ్ము=ప్రతిరోజూ, నా అనుగ్రహము=నీకు అనుకూలంగా కావలసినన్ని భోగాలతో, కానిపించెదన్=కనిపిస్తాను.

**తాత్పర్యం:** *ఇచ్చినమాట ప్రకారం వెళ్ళినవెంటనే వచ్చితివా, నీవు కోరుకున్నవిధంగా వెచ్చని ఆలింగనం విందుచేస్తాను. ముద్దుదొంతరలు..కాదుకాదు, దొంతరలుగా ముద్దులే... ఇంత ఎందుకు... నీకు కావలసినవిధంగా ప్రతిరోజూ ఆనందపుటంచులు రుచిచూపిస్తాను.*

**అని యనురాగలాలనము లారఁగఁ గూరిమిమేరయైన చం**
**దన ఘనసార గంధకలనాకమనీయదృఢోపగూహబం**
**ధన మెటులెట్లొ విప్పియును, దన్నెడవీడఁగ లేక, వేణుని**
**స్వనమధురోక్తి వేఁడు చెలువన్ బ్రియుఁ డల్లన బుజ్జగించుచున్.**

**అర్థాలు:** అని=ఇలా అంటూ, అనురాగ=ప్రేమతోగూడిన, లాలనములు=బుజ్జగింపులు, ఆరఁగన్= నిండేవిధంగా, కూరిమి మేరయైన=ఇష్టానికి ఎల్లయైన, చందన=శ్రీఖండం, ఘనసార=కర్పూరం, గంధకలనా= కలిపిన సారంచేత, కమనీయ=మనోహరమైన, దృఢ= గట్టి, ఉపగూహబంధనము=కౌగిలి పెనవేతను, ఎటులెట్లొ= ఎలాగైతేనేం, విప్పియును= వదిలికూడా, తన్ను=తనను, ఎడవీడఁగలేక=వదలలేక, వేణునిస్వన= పిల్లనగ్రోవి శబ్దంవంటి, మధురోక్తి=తియ్యని పలుకులతో, వేఁడు=బ్రతిమాలు, చెలువన్=ప్రియురాలిని, ప్రియుఁడు=జతగాడైన నందుడు, అల్లన=మెల్లగా, బుజ్జగించుచున్=నచ్చజెపుతూ...

**తాత్పర్యం:** *ఇలా అంటూ ఇష్టోక్తులు పొంగేలా, ఇష్టానికి మేరయైన చందన కర్పూరాది కలపాలతో మనోహరమై గాఢమైన ఆలింగనబంధాలనుండి బయటపడుతూకూడా పూర్తిగా వదలలేక వేణునాదంవంటి మధురోక్తులతో బ్రతిమాలు చెలియకు నందుడు మెల్లగా నచ్చజెపుతూ...*

**'వలవని జాలి పూని నను వారణసేయకు, బేలవై కనుం**
**గొలుకుల నీరునింప కదిగో! గురుదేవుఁ డతిక్రమించెడున్**
**జెలి! కనుచూపుమేర, ననుఁ జెచ్చెర నంపినఁ దత్సపర్యలన్**
**సలిపి భవత్పదాంబురుహ సన్నిధికిన్ జనుదెంతు నింతలో.'**

**అర్థాలు:** చెలి=ఓ ప్రియా! వలవని=భరించలేని, జాలిపూని=దయతో, నను=నన్ను, వారణసేయకు= అడ్డగించవద్దు, బేలవై=పేదవై, కనుంగొలకుల=కళ్ళచివరల, నీరునింపక= నీళ్ళుపెట్టుకోకుండా, అదిగో=అదిగో చూడు, కనుచూపుమేర=మనచూపులకు, గురుదేవుఁడు=భగవానుడు, అతిక్రమించెడున్=దాటిపోతున్నాడు, ననున్=నన్ను, చెచ్చెరన్+అంపినన్= వెంటనే పంపిస్తే, తత్+సపర్యలన్=వానికి పరిచర్యలు, సలిపి=చేసి,

ఇంతలో=ఇక్కడున్నట్లుగా, భవత్+పద=నీపాదాలనే, అంబురుహ=పద్మాల, సన్నిధికిన్=చెంతకు, చనుదెంతున్= వచ్చేస్తాను.

**తాత్పర్యం:** *ప్రియా! భరింపరాని ప్రేమచూపి నన్ను అడ్డుపెట్టవద్దు. పిరికిదానిలా కళ్ళవెంట నీరుపెట్టుకోవద్దు. అదిగో... మనగురుదేవుడు మనచూపులకు దాటిపోతున్నాడు. నన్ను వెంటనే పంపిస్తే వానికి భిక్షాది పరిచర్యలు చేసి నీ చరణకమలాలవద్దకు ఇక్కడున్నట్లే వస్తాను.*

**అనుచు నూరార్చి, పత్రసమంచితమగు**
**నాననమ్మును దడవి ముద్దాడి, రాజ**
**సాతిరంజిత చిత్రాంబరాళితోడ**
**నందుఁ డున్నట్టులే పయనమ్ముగాఁగ.**

**అర్థాలు:** అనుచున్=ఇలా బతిమాలుతూ, ఊరార్చి=ఊరడించి, పత్ర=లేతాకుతో, సమంచితమగున్= సమానమైన, అననమ్మును=ముఖాన్ని, తడవి=మెత్తనివ్రేళ్ళతో నిమిరి, ముద్దాడి=ముద్దుపెట్టుకొని, రాజస= రజోగుణంచేత, అతిరంజిత=బాగా ఎర్రబడిన, చిత్రాంబరాళితోడ=ఆమె గీసిన బొమ్మలంటుకున్న బట్టలతో, నందుఁడున్=రాకుమారుడు, ఉన్నట్టులే=ఎలా ఉన్నవాడు అలాగే, పయనమ్ముగాఁగ=ప్రయాణం కాగా...

**తాత్పర్యం:** *ఇలాబతిమాలి ఊరడించి, తలిరాకువంటి ఆమెముఖాన్ని తడిమి ముద్దాడి, అప్పటిదాకా జరిగిన ప్రణయానికి గుర్తులుగా ఎర్రబారిన వస్త్రాలతో ఉన్నవాడున్నట్లే నందుడు ప్రయాణం కాగా...*

**నిక్కిన వీనులున్, జడత నెక్కొను చూపులు, విన్నబాటునన్**
**స్రుక్కిన మోమునై పరక త్రుంచక నిల్చు కురంగియో యనన్**
**జక్కెరబొమ్మ యంతఁ జలనమ్మఱు చూడ్కుల ధ్యానమగ్నయై**
**చెక్కిటఁ జేయిచేర్చి నిలిచెన్ బికుబిక్కని, కాంతుఁ డేగఁగన్.**

**అర్థాలు:** చక్కెరబొమ్మ=పంచదారచిలుకవంటి ఆచిన్నది, అంతన్=అప్పుడు, కాంతుఁడు+ఏగఁగన్=భర్త అటుపోగానే, నిక్కినవీనులన్=అతనివైపు రిక్కించిన చెవులతోను, జడతన్=కదలిక లేకనే, ఎక్కొను చూపులు= ఉసిగొనే కళ్ళతోను, విన్నబాటునన్=తెల్లబోవడంచేత, స్రుక్కిన=వాడిన, మోమునై=ముఖంకలదై, పరక=గడ్డిపరకలు, త్రుంచక నిల్చు=కొరకకుండా నిలబడ్డ, కురంగియో యనన్=జింకవలె, చలనము=చైతన్యం, అఱు=నశించిన, చూడ్కుల=చూపులతో, ధ్యానమగ్నయై=మనసెక్కడో ఉన్నట్లు, చెక్కిటన్=బుగ్గమీద, చేయిచేర్చి=చేతినుంచి, బికుబిక్కని=బిక్కుబిక్కుమంటూ, నిలిచెన్=నిలబడింది.

**తాత్పర్యం:** *ఆ అందాలచిన్నది భర్త అలా వెడుతూంటే అతనిమనసు మారుతుందేమోనని అతనివైపు రిక్కించిన చెవులతోను, కదలికలేకనే ప్రేరణపొందే చూపులతోను, తెల్లబోయి వాడిపోయిన ముఖంతోను, ఎదురుగా ఉన్న గడ్డిపరకలు కొరక్కుండా నిలబడిపోయిన*

*జింకలాగా చైతన్యంకోల్పోయిన నిరీక్షణతో మనసుమనసులో లేకుండా బుగ్గమీద చేయిపెట్టుకొని బిక్కుబిక్కుమంటూ నిలబడిపోయింది.*

**బుద్ధగతమైన పెనుభక్తి ముందు లాగ,**
**వెలఁదిపై రక్తి లాగె వెన్వెనుక కతని;**
**నూర్మికలమధ్య హంసనా నొప్పె నపు డ**
**నిశ్చయమ్ముగఁ గదలక నిలవ కతఁడు.**

**అర్థాలు:** అతఁడు=ఆ నందుడు, అపుడు=ఆసమయంలో, బుద్ధగతమైన=అన్న బుద్ధుని మీదనున్న, పెనుభక్తి= గొప్పదైన గౌరవం, ముందులాగ=ముందుకు లాగుతూంటే, వెలఁదిపై=అందాల భార్యపైనున్న, రక్తి=ప్రేమాసక్తి, అతనిన్=వానిని, వెన్వెనుకకు=వెనక్కి వెనక్కి, లాగె=గుంజుతోంది, అనిశ్చయమ్ముగన్=ఏమిచేయాలో పాలుపోక, కదలక=అక్కడనుండి అడుగు ముందుకు వేయలేక, నిలువక=అక్కడే ఉండిపోలేక, ఊర్మికలమధ్య=అలల నడుమ, హంసనాన్=నీటిపక్షి హంసలా, ఒప్పెన్=ప్రకాశించాడు.

**తాత్పర్యం:** *అప్పుడానందుడు అన్నమీది భక్తిగౌరవాలు ముందుకు లాగుతూంటే, భార్య సుందరిమీది ప్రేమాసక్తి వెనక్కి వెనక్కి లాగుతోంటే... ఏమిచేయాలో పాలుపోక అక్కడనుండి అడుగు ముందుకు వేయలేక, అక్కడే ఉండిపోలేక, ఏనిశ్చయానికి రాలేక కదలనీయని కెరటాలనడుమ హంసలా కనిపించాడు.*

**ఎడయని ధర్మరాగ మెటులే నొక ముందడుగేయ, రెండుమూఁ**
**దడుగులు ప్రేమధర్మ మపుఁ డాతని వెన్కకుఁ ద్రోయు, నీ గతిన్**
**విడువక యొయ్యనొయ్యఁ బెనువెల్లువపై నెదురేగునట్టి య**
**య్యుఁడుపమువోలె నేగె నెటులో యడుగడ్గున వెన్క త్రొక్కుచున్.**

**అర్థాలు:** ఎడయని=తొలగిపోని, ధర్మరాగము=ధర్మంపట్ల అనురక్తిచే, ఎటులేన్=ఏదోవిధంగా, ఒక ముందడుగేయ=ఒక్కడుగు ముందుకేస్తే, అపుఁడు=ఆవేళ, ఆతని=అతడిని, ప్రేమధర్మము=అనురాగాసక్తి, రెండు మూఁడడుగులు=అంతకంటే ఎక్కువగా, వెన్కకున్ త్రోయున్=వెనక్కులాగేస్తుంది. ఈగతి=ఈవిధంగా, విడువక= విడిచిపెట్టకుండా, ఒయ్యనొయ్యన్=మెలమెల్లగా, పెనువెల్లువపై=పెద్ద ప్రవాహంలో, ఎదురేగునట్టి= ఎదురువెళ్ళే, ఆ+ఉఁడుపమువోలె=ఒక తెప్పలాగా, అడుగడ్గున=మాటిమాటికీ, వెన్కత్రొక్కుచున్=వెనక్కి వెళ్ళకుండా బలవంతంగా ముందడుగువేస్తూ, ఎటులో=ఏదోవిధంగా, ఏగెన్=ముందుకు వెళ్ళాడు.

తాత్పర్యం: వదిలిపెట్టని ధర్మానురక్తి ఏదోవిధంగా ఒకడుగు ముందుకేయిస్తూంటే, అదే సమయంలో భార్యపట్ల ప్రేమానురక్తి మూడడుగులు వెనక్కులాగుతోంది. అలాగని ప్రయత్నం విరమించకుండా మెలమెల్లగా పెద్ద ప్రవాహంలో ఎదురెళ్ళే చిన్న పడవలాగా అతిప్రయత్నం మీద ఏదోవిధంగా ముందుకు వెళ్ళాడు.

**ఇటు లొకకొంత యేగి, తుద కేమనునో గురుcడన్న భీతి యొ**
**క్కటc, దడియాఱునో మకరికాలత యన్న భయంబొకంట ను**
**త్కటమయి పై కొనంగ వెసcగాల్కొలదిన్ జనcజొచ్చెcదా హుటా**
**హుటిc బెదపెద్ద యంగలిడి యూర్పులు తోరములై చెలంగcగన్.**

**అర్థాలు:** ఇటుల=ఈవిధంగా, ఒకకొంతయేగి=కొంతముందుకెళ్ళి, ఒక్కట=ఒకవైపు, గురుcడు=అన్నగారు, తుదకు=తీరావెడితే, ఏమనునో అన్న=ఏమంటాడోనన్న, భీతి=భయం; ఒకంట=మరొకవైపు, మకరికాలత= భార్య దిద్దుకున్న మకరికాలత, తడియాఱునో=ఎండి పోతుందేమో, అన్న=అనే, భయంబు=భయం, ఉత్కటమయి= మదపుటేనుగు మాదిరిగా, పైకొనంగ=మీదపడుతూండగా, తాన్=నందుడు, హుటాహుటిన్=తొందరతొందరగా, పెదపెద్ద=బాగాపెద్దవైన, అంగలిడి=అంగలువేసుకొంటూ, ఊర్పులు=తానువదలిన గాలులే, తోరములై=స్వాగత తోరణాలుగా, చెలంగcగన్=రమ్మని పిలుస్తూంటే, వెసన్=వేగంగా, కాల్కొలదిన్=కాలికొద్దీ, చనన్ చొచ్చెన్= పరుగిడసాగాడు.

**తాత్పర్యం:** *ఇలా కొంతదూరం ముందుకెళ్ళి, తీరా వెడితే అన్న ఏమంటాడోనని బెంగ ఒకవైపు, మకరికాలతల తడి ఆరిపోతుందేమోనని భార్యపెట్టిన గడువు మరొకవైపు మదపుటేనుగలై మీదపడుతూంటే, నందుడు వేగంగా తన ఊర్పులే తనకు స్వాగతాలు చెబుతూండగా పెద్దపెద్ద అంగలువేసుకొంటూ కాలికొద్దీ పరుగుతీసాడు.*

ఇది

ద్వితీయసర్గము

# పరివ్రాజనము

**హితము నహితమ్ము నుచితానుచితములనెడి**
**హద్దుల నతిక్రమించి, ఫలానుమేయ**
**ములగు నార్యశుభారంభములకు స్వస్తి**
**యగుత, విశ్వమ్మునకు శ్రేయమగునుగాత!**

**అర్థాలు:** హితమున్=మేలుచేకూర్చేది, అహితమ్మున్=కీడుచేకూర్చేది, ఉచితానుచితములనెడి= తగినది తగనిది అనే, హద్దులన్=ఎల్లలను, అతిక్రమించి=దాటి, ఫల=ఫలితములను, అనుమేయములగు=ఊహించదగిన, ఆర్య=పెద్దలచేతి, శుభ=అభ్యుదయకారకాలైన, ఆరంభములకు=ప్రయత్నాలకు, స్వస్తియగుత=మంచిజరుగుగాక, విశ్వమ్మునకు=ఈ చరాచర ప్రపంచానికి, శ్రేయమగునుగాత=మంగళమగునుగాక!

**తాత్పర్యం:** *కథ రెండవఘట్టంలోకి ప్రవేశిస్తోంది. శృంగారఘట్టానికి నిలుపుదల, సన్యాస ఘట్టానికి ఆరంభం జరుగబోతున్నాయి. ఇదిమేలు, ఇదికీడు, ఇది తగినది, ఇది తగనిది అనే హద్దులు దాటి విశ్వానికి అభ్యుదయం జరుగబోతోంది. అంతా మంచే జరుగబోతోంది. ఈ ప్రపంచానికి మంగళం జరగాలని కవి ఆశీర్వదిస్తూ ద్వితీయసర్గను ప్రారంభిస్తున్నాడు. బౌద్ధభిక్షు ప్రవేశం జరుగబోతోంది. అందుకు సూచన ఈ ప్రారంభపద్యం.*

**గౌతమమునీశ్వరుండు నివాతదీప**
**కళికపోలిక నిశ్చలకాంతిరాశి**
**యై వెలుంగుచు మేరుమహాద్రి నడచు**
**పొలుపు దోఁపఁగ నరుదెంచె పురమువీథి.**

**అర్థాలు:** గౌతమ మునీశ్వరుండు=గౌతముడనే యోగిపుంగవుడు, నివాత=గాలికదపనప్పటి, దీపకళికపోలిక= దీపశిఖలాగా, నిశ్చలకాంతిరాశియై=కదలని వెలుగుకుప్పలాగా, వెలుంగుచు=కాంతిని వెదజల్లుతూ, మేరుమహాద్రి= మేరుమహాపర్వతంమీద, నడచు=నడచే, పొలుపుదోఁపఁగన్=పరిఢవిల్లగా, పురమువీథి=పట్టణం మధ్యకు, అరుదెంచె=వచ్చాడు.

**తాత్పర్యం:** *గౌతముడనే బుద్ధభగవానుడు గాలిసోకని దీపశిఖవలె కదలని కాంతిరాశి కాంతిని విరజిమ్ముతూ మేరుపర్వతంమీద నడుస్తూన్నట్లుగా ఆ పట్టణంలోనికి వచ్చాడు.*

**ఆడుచుఁ బాడుచున్ బురమహాపణభాగ్యవినోదవైఖరుల్**
**వేడుకఁ జూచుచున్ బురికిఁ బెట్టనిసొమ్ములువోలె వాహనా**
**రూఢత నొప్పు రాచకొమరుల్ దవుదవ్వులఁ జూచి ముగ్ధులై**
**'వాఁడె గురుండు రం'డని యవారిగ నొండొరు మూదలించుచున్.**

**అర్థాలు:** పురికిన్=ఆ కపిలవస్తునగరికి, పెట్టనిసొమ్ములువోలె=పుట్టుకతో వచ్చిన ఆభరణాల్లా, వాహనా రూఢతన్+ఒప్పు=గుఱ్ఱాలు మొదలైన వాహనాలపై తిరిగే, రాచకొమరుల్= రాజకుమారులు, ఆడుచున్ పాడుచున్= ఆడుతూపాడతూ, పురమహాపణ=పట్టణంలోని అంగడివీధియొక్క, భాగ్య=సంపదచేత, వినోదవైఖరుల్=కలిగిన వింతపోకడలను, వేడుకన్= సంతోషంగా, చూచుచున్=దర్శిస్తూ, దవుదవ్వులన్=దూరంగా కనిపించే, చూచి=బుద్ధ భగవానుని గమనించి, ముగ్ధులై=ఆత్మానందం పొందినవారై, వాఁడె=ఆ కనిపించేవాడే, గురుండు=బుద్ధుడైన మనరాకుమారుడు గౌతముడు, రండి+అని=వెళ్ళిచూద్దాం రమ్మంటూ, అవారిగన్=అడ్డులేని ఆనందంతో, ఒండొరు=ఒకరినొకరు, మూదలించుచున్=ఆవచ్చేది గౌతముడే అని నిరూపించుకొంటూ....

**తాత్పర్యం:** *ఆ కపిలవస్తు నగరానికి సహజాలంకారాల్లా విపణివీధిలో తమగుఱ్ఱాలమీద ఆడుతూపాడుతూ అంగడివీధి ఐశ్వర్యాన్ని వింతవింతగా చూచుకొంటూ తిరుగుతూన్న రాజకుమారులు దూరంగా వచ్చే బుద్ధభగవానుని చూచి ఆత్మానందంపొందినవారై 'అతడే కదా మనరాకుమారుడు గౌతముడు... రండిరండి వెళ్ళి పలుకరిద్దాం' అనుకొంటూ వారిలో వారు అతడు గౌతముడే అని నిర్ధారించుకొంటూ అడ్డులేని ఆనందంతో...*

**కడువడి వాహనములు డిగి**
**నడుములు బిగియించి వినయనమ్రులగుచు మ్రొ**
**క్కిడి రెల్లరు సాఁగిలఁబడి**
**పడుచుఁదనము రాచదనము ప్రక్కల కొదుగన్.**

**అర్థాలు:** ఎల్లరు=అలా వెళ్ళినవారందరు, కడువడి=మిక్కిలివేగంగా, వాహనములుడిగి=తమ తేరులనుండి దిగి, నడుములు బిగియించి=ఉత్తరీయాలు నడుములకు చుట్టి, వినయ నమ్రులగుచు=వినయంగా వంగి, పడుచుఁ దనము=పరువపు పొగరును, రాచదనము= రాజకుమారులమనే ఆభిజాత్యాన్ని, ప్రక్కలకొదుగన్=రెండూ ప్రక్కనపెట్టి, సాఁగిలఁబడి= భూమిమీదపడి, మ్రొక్కిడిరి=నమస్కరించారు.

**తాత్పర్యం:** *అలావెళ్ళి వారందరు వెంటనే వాహనాలనుండి క్రిందికిదిగి కండువాలు నడుముకు*

*చుట్టుకొని వినయం ఉట్టిపడేలా, వయసుతోవచ్చిన పొగరును రాజకుమారు లైనందుకు గొప్పతనాన్ని ప్రక్కనపెట్టి సాష్టాంగప్రణామం చేసారు.*

**మునియును గేలు సాఁచి, 'భవమోచనమ'స్తని వారికెల్ల దీ**
**వనలిడి, ముందు సాగి నడవన్ గమకించెడునంతలోన, నా**
**పణముల నమ్మువారుఁ గొనువారుఁ దటాలునఁ జూచి సంభ్రమం**
**బున నెటులున్న వారటుల మూఁగిరి తత్కరుణాబ్ధి చెంగటన్.**

**అర్థాలు:** మునియును=బుద్ధభగవానుడుకూడా, కేలుసాఁచి=చేయిపైకెత్తి, వారికి+ఎల్ల= వారందరికి, భవమోచనమస్తు+అని=జన్మరాహిత్యం కలుగుగాక అంటూ, దీవనలిడి= ఆశీర్వాదాలు కురిపించి, ముందుసాగి= ముందుకు కదలి, నడవన్=అడుగువేసేందుకు, గమకించెడునంతలోనన్=ప్రయత్నించేలోపల, ఆపణములన్= దుకాణములలో, అమ్మువారున్=విక్రయించేవాళ్ళు, కొనువారున్=సరుకులుకొనడానికి వచ్చినవారు, తటాలున= అదాటుగ, చూచి=బుద్ధుని చూచి, సంభ్రమంబునన్=అదురుపాటున, ఎటులున్నవారు=ఎట్లా ఉన్నవారు, అటుల= అట్లాగే, తత్+కరుణాబ్ధి చెంగటన్=ఆ దయాసముద్రుని ముందు, మూఁగిరి=చుట్టూచేరారు.

**తాత్పర్యం:** *బుద్ధభగవానుడుకూడా చేయెత్తి వారందరిని జన్మరాహిత్యం కలగాలని ఆశీర్వదించి ముందుకు అడుగువేసేలోగా చుట్టుప్రక్కల దుకాణాలలో అమ్ముకొనేవాళ్ళు, కొనుక్కొనేవాళ్ళు అదాటున బుద్ధభగవానుని చూచి, ఆ చూచిన హడావిడిలో తొట్రువడి ఎలా ఉన్నవారు అలాగే బుద్ధుడైవచ్చిన తమరాజకుమారునిముందు, ఆ దయాసాగరుని ముందు కదలనీయకుండా మూగిపోయారు.*

**అతిముతి నొండొరున్ గదచి యంఘ్రులపైఁ బడి లేచువారు కొం**
**దఱు, నెఱచూడ్కులందక పెనంగుచు బాహుల నొత్తువారు కొం**
**దఱు, కనుగొన్న మాత్ర నయనమ్ముల బాష్పము లుప్పతిల్ల నాం**
**తర పరిపూర్ణ భక్తిసుఖతాక్షణసిద్ధులు కొంద ఱాజనుల్.**

**అర్థాలు:** అతిముతిన్=కలవరపాటుతో, ఒండొరున్=ఒకరినొకరు, కదచి=దాటుకొని, అంఘ్రులపైఁబడి= పాదాలమీద పడిపోయి, లేచువారు కొందఱు=పైకిలేచేవారు కొంతమంది, నెఱచూడ్కులు+అందక=తిన్నగా చూడటానికి వీలుగాక, పెనంగుచు=నెట్టుకొంటూ, బాహులన్=తమచేతులతో, ఒత్తువారు=ప్రక్కవారిని తోసివేసే వాళ్ళు, కొందఱు=కొంతమంది, కనుగొన్నమాత్ర=చూచినంత మాత్రంచేత, నయనమ్ముల=కనులవెంబడి, బాష్పములు=ఆనందంచేత వచ్చే కన్నీరు, ఉప్పతిల్లన్=పొంగిపోయేందుకు, ఆంతర=లోలోపల, పరిపూర్ణ=పూర్తిగా, భక్తి=భక్తిభావం చేత, సుఖతాక్షణ=ఆనందానుభవాలతో, సిద్ధులు=సిద్ధిపొందినవారు, కొందఱు=కొంతమంది, ఆజనుల్=ఆ వచ్చినవారిలో ఉన్నారు.

**తాత్పర్యం:** *అదాటుగా చూచి వచ్చిన ఆ జనంలో కలవరపాటున ఒకరొనొకరు దాటుకొని వెళ్ళి పాదాలమీదపడి లేచేవారు కొంతమంది, ఎత్తు తక్కువకావడాన తిన్నగా చూడలేక ముందువారిని నెట్టుకొంటూ పక్కనున్నవారిని చేతులతో తోసేవారు కొంతమంది, చూచిన వెంటనేలోపలనిండావున్న భక్తిభావంతో ఆనందం అనుభవించేవారు కొందరూ ఉన్నారు.*

> **క్రందదరన్ గతానుగతికమ్ముగ మూఁగుజనమ్ము నశ్రువుల్**
> **చిందెడిచూపులన్ నెనరుచిల్కెడి పల్కుల నాదరించి, మౌ**
> **నీందుఁడు నల్దెసల్ కలయ నీక్షణపంక్తులు సాఁచునంతలో**
> **సుందరి ప్రాణనాథుఁ డొకచోఁ గననయ్యె ససంభ్రమాత్ముఁడై.**

**అర్థాలు:** క్రందు=కనిపించనివాడు కనిపించాడని బాధపడటం, అడరన్=ఎక్కువకాగా, గతానుగతికమ్ముగ= ఒకరితరువాత ఒకరుగా, మూఁగుజనమ్మున్=అక్కడచేరేవారి, అశ్రువుల్ చిందెడి=కన్నీరునిండిన, చూపులన్=వారి చూపులను, నెనరుచిల్కెడి=ప్రేమకురిపించే, పల్కులన్=వారిమాటలను, ఆదరించి=గౌరవించి, మౌనీందుఁడు= మునిచంద్రుడు, నల్దెసల్= నాలుగుదిక్కులా, కలయన్=కలిసేలా, ఈక్షణపంక్తులు=చూపులు, సాఁచునంతలో= ప్రసరించగా, ఒకచోన్=ఒకచోట, సుందరి ప్రాణనాథుఁడు=సుందరిభర్త నందుడు, ససంభ్రమాత్ముఁడై=కలత చెందిన మనసుతో, కననయ్యె=కనిపించాడు.

**తాత్పర్యం:** *బాధపడుతూ ఒకరితరువాత ఒకరు తనచుట్టూచేరేవారిని, వారి నీరునిండిన చూపులను, ప్రేమనిండిన మాటలను గౌరవిస్తూ నాలుగుదిక్కులా కలయచూస్తూండగా ఆ బుద్ధ మూర్తికి కలతనిండిన మనస్సుతో ఒకచోట నందుడు కనిపించాడు.*

> **విడివడి వ్రేలు పెన్నెఱులు వీథికిఁ బూల నివాళి యెత్త, నొ**
> **ప్పెడు వదనమ్మునన్ బొడము స్వేదకణమ్ములఁ దోఁగి చండభా**
> **నుఁడు బహువర్ణతన్ బహుమనోహరరూపములన్ నటింప, నం**
> **దుఁడు గురుఁడున్న యయ్యెడకుఁ దొందరగాఁ జనుదెంచి ముందటన్.**

**అర్థాలు:** విడివడి వ్రేలు=విడిపోయివేలాడే, పెన్నెఱులు=పొడుగుపాటి కురులు, వీధికిన్= ఆ విపణివీధికి, పూలనివాళియెత్తన్=పూలహారతులీయగా, ఒప్పెడు=అందాలుచిందే, వదనమ్మునన్=ముఖంమీద, పొడము స్వేద కణమ్ములన్=పట్టేచెమట బిందువులందు, తోఁగి=మునిగి, చండభానుఁడు=మండేసూర్యుడు, బహువర్ణతన్= రంగురంగులుగా విడిపోయి, బహుమనోహరరూపములన్=అన్ని అందమైన భంగిమలతో, నటింప= అనుసరిస్తూంటే, నందుఁడు=నందకుమారుడు, గురుఁడున్న=తన అన్న ఉన్న, ఆ+ఎడకున్=ఆచోటికి, తొందరగాన్=వేగంగా, చనుదెంచి=చేరి, ముందటన్=తనకెదురుగా....

**తాత్పర్యం:** *తన పొడవైన వెంట్రుకలు విడిపోయి విపణివీధికి పూలహారతులిస్తూండగా, ఆ*

*అందాలుచిందే మోముపైని చెమటబిందువులలో సూర్యుడు మునిగి రంగురంగులుగా విడిపోయి నర్తిస్తూన్న నందుడు తన అన్నదగ్గరకు తొందరగా చేరి తనకెదురుగా....*

**దిక్కులకెల్లఁ జాలి, మఱి దివ్యులకైనను దేఱిచూడఁగా**
**వెక్కసమైన తేజమున వెల్గుచుఁ బుట్టువులేని దారికిన్**
**డెక్కెమువోలె నున్న గురునిం గని, పుల్కలుదేఱి, సుందరిన్**
**దక్క సమస్తమున్ మఱచె నందుఁడు బాహిరవస్తుజాలమున్.**

**అర్థాలు:** దిక్కులకెల్లన్=దిక్కులన్నీ, చాలి=నిండిపోయి, మఱి=ఇంకా, దివ్యులకైనను= మానవాతీతులకైనా, తేఱిచూడఁగా=కన్నెత్తిచూడటానికి, వెక్కసమైన=అసాధ్యమైన, తేజమున= ప్రకాశంతో, వెల్గుచున్=వెలిగిపోతూ, పుట్టువులేనిదారికిన్=తిరిగిజన్మలేని మార్గానికి, టెక్కెమువోలెనున్న=ధ్వజంలా ఉన్న, గురునింగని=పూజ్యుడైన అన్ననుచూచి, పుల్కలుదేఱి= ఒడలు పులకించిపోగా, నందుఁడు=నందుడు, సుందరిన్దక్క=భార్యసుందరిని తప్పించి, బాహిరవస్తుజాలమున్=ఈ ప్రపంచంలోని అన్నివస్తువులను, సమస్తమున్=మొత్తాన్ని, మఱచె= మరచిపోయాడు.

**తాత్పర్యం:** *దిక్కులన్నీ తన ప్రకాశంతో నింపివేసి దేవతలకైనా తేరిపారచూడటానికి వీలులేకుండా వెలిగిపోతూ మోక్షమార్గానికి సూచికలా ఉన్న పూజ్యుడైన అన్నగారినిచూచి నందుడు శరీరం పులకలెత్తగా తన సుందరిని తప్ప ఈ ప్రపంచంలో అన్నింటిని మరచి పోయాడు.*

**తేఱి, 'యకట! తడసితిన్ గదే' యనుకొని,**
**మునివరుని సమీపమునకు నేగఁ**
**దొడరి, సందులేమి దోబూచులాడు నా**
**సరణి జనములోనఁ దిరుగుచుండె.**

**అర్థాలు:** తేఱి=పులకలనుండి తెప్పరిల్లి, అకట=అయ్యో, తడసితిన్గదే=ఆలస్యంచేసానుగదా, అనుకొని= అనుకొంటూ, మునివరుని సమీపమునకున్=బుద్ధభగవానుని దగ్గరకు, ఏగన్=వెళ్ళడానికి, తొడరి=ప్రయత్నించి, సందులేమి=దారిచేసుకోవడానికి వీలులేక, దోబూచులాడున్=దాగుడుమూతలాడుకొనే, ఆసరణి=ఆవిధంగా, జనములోనన్=వచ్చిన ప్రజలమధ్యన, తిరుగుచుండె=అటూయిటూ తిరుగుతున్నాడు.

**తాత్పర్యం:** *అన్ననుచూచిన సంరంభంనుండి తేరుకొని, అయ్యో ఆలస్యం చేసానుగదా అనుకొంటూ అన్నగారి దగ్గరగా వెళ్ళడానికి ప్రయత్నించి వెళ్ళేసందులేక దాగుడు మూతలాడుకొనే విధంగా నందుడు ఆ జనంలో అలా తిరుగుతున్నాడు.*

**స్థిరమతి దక్కి పెన్ గజిబిజిన్ గొనియున్న నృపాత్మజున్ మునీ**
**శ్వరుఁ డపుడే కనుంగొనె, నపారమహాజనతాప్రవాహసం**

**తరణకృతప్రయత్నుఁడయి దాఁటి వివిక్తపథమ్ము చేరె నొం**
**టరియయి తమ్ముగుఱ్ఱ కచటన్ దగుదర్శన మిచ్చు కోర్కిమై.**

**అర్థాలు:** మునీశ్వరుఁడు=ఆ బుద్ధభగవానుడు, స్థిరమతిదక్కి=కుదురుకోల్పోయి, పెన్ గజిబిజిన్= పెద్ద కలవర పాటులో, కొనియున్న=చిక్కిపోయిన, నృపాత్మజున్=రాజకుమారుడు నందుని, అపుడే=అప్పుడే, కనుంగొనెన్= చూచాడు. తమ్ముగుఱ్ఱకు= తమ్ముడైన వానికి, అచటన్= అతడున్నచోటునే, తగుదర్శనమిచ్చు= తగినవిధంగా కనపడే, కోర్కిమై=కోరికతో, ఒంటరియయి=ఒక్కడే, అపార=అంతులేని, మహాజనతా ప్రవాహ=ఆ ప్రజావెల్లువకు, సంతరణ=తీరందాటే, కృతప్రయత్నుఁడయి=ప్రయత్నంచేసి, దాఁటి=తరించి, వివిక్తపథమ్ము= ఏకాంతమైన ప్రదేశానికి, చేరెన్=చేరాడు.

**తాత్పర్యం:** *అప్పుడా బుద్ధభగవానుడు పరిసరాలు చూస్తూ కుదురులేక ఆ జనప్రవాహంలో గజిబిజిగా తిరుగుతున్న తమ్ముడు నందుని అప్పుడే చూచాడు. తమ్ముడిదగ్గరకు వెళ్ళి తానే కనిపించాలనే తలంపుతో అపారమైన ఆ ప్రజావెల్లువను దాటివెళ్ళే ప్రయత్నంచేసి సఫలీకృతుడై అతడున్న చోటికి ఒంటరిగా వెళ్ళాడు.*

**ఆ యవకాశలబ్ధికి ధరాధిపసూనుఁడు సంతసించి, భ**
**ద్రాయతమూర్తి గౌతముని దాపునకుంజని, వక్షమందుఁ గే**
**ల్దోయి ఘటించి, కొంకున నధోముఖుఁడై, యపరిస్ఫుటాక్షరం**
**బై యెలుఁ గింత తొట్రువడ నా గురువర్యునితోడ నిట్లనున్.**

**అర్థాలు:** ఆ అవకాశలబ్ధికి= అలా వీలు దొరికినందుకు, ధరాధిపసూనుఁడు=రాజకుమారుడైన నందుడు, సంతసించి=ఆనందించి, భద్రాయతమూర్తి=సుదీర్ఘమైన శుభాలకు ఆకారమైన, గౌతముని=గౌతముడైన బుద్ధుని, దాపునకుంజని=దగ్గరకు వెళ్ళి, వక్షమందున్=హృదయం మీద, కేల్దోయి ఘటించి=రెండుచేతులు మోడ్చి, కొంకునన్=తప్పుచేసిన జంకుతో, అధోముఖుఁడై=తలవాల్చినవాడై, అపరిస్ఫుట=సరిగ్గావినిపించని, అక్షరంబై= మాటలుగలదైన, ఎలుఁగింత=గొంతు కొంత, తొట్రువడన్=తడబడగా, ఆ గురువర్యునితోడన్=ఆ పూజ్యుడైన అన్నగారితో, ఇట్లనున్=ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** *అలా వీలుదొరికినందుకు నందుడు సంతోషించి శుభకరుడైన గౌతముని దగ్గరకు వెళ్ళి రెండుచేతులూ గుండెలకానించి నమస్కరించి తప్పుచేసానన్న జంకుతో తల దించుకున్నవాడై మాట సరిగ్గాబయటకురాని గొంతు కొంత తడబడుతూండగా తన అన్నగారితో ఇలా అన్నాడు.*

**'పొరపా, టపరాధము, దే**
**వర వాకిటి కరుగుదేరఁ బ్రాసాదతలాం**
**తరవర్తి నౌట నెఱుఁగన్**
**గరుణామయ! నన్ను సైఁపఁగాఁదగు నిందున్.**

**అర్థాలు:** కరుణామయ=దయతో నిండినవాడా! పొరపాటు=తప్పయింది, అపరాధము= దోషంచేసాను, దేవర= దేవునితో సమానులైన తమరు, వాకిటికి=నా ఇంటిముందుకు, అరుగుదేరన్=వచ్చినప్పుడు, ప్రాసాద=అంతఃపురంలో, తలాంతరవర్తిన్+ఔటన్=లోపల ఎక్కడో ఉండటంవలన, ఎఱుఁగన్=నిన్ను తెలిసికోలేక పోయాను, ఇందున్=ఈ విషయంలో, నన్ను=నా తప్పును, సైఁపఁగాఁదగున్=మన్నింపగోరుచున్నాను.

**తాత్పర్యం:** *ఓ దయాసముద్రుడా! నీయెడల తప్పుచేసాను. పెద్ద దోషమే చేసాను. భగవత్ స్వరూపులైన తమరు నాయింటిముందుకు వస్తే నేనెక్కడో అంతఃపురంలో ఉండరానిచోట ఉండి నిన్ను గమనించలేకపోయాను. ఈ విషయంలో నాతప్పును క్షమించమని వేడుకొంటున్నాను.*

**మరలి చనుదెంచి యర్థిమై మఱఁద లొసఁగు**
**భిక్ష గ్రహియింపవే! నిను వేఁడుకొందుఁ,**
**బాదమూలమ్ము చేరి పెంపేదియున్న**
**ఛాయ చూడుము, సరి రెండు జాము లయ్యె.'**

**అర్థాలు:** నిను=పూజ్యుడవైన నిన్ను, వేఁడుకొందున్=ప్రార్థిస్తాను, మరలి=తిరిగి, చనుదెంచి= ఇంటికివచ్చి, అర్థిమై=అపేక్షతో, మఱదలు+ఒసఁగు=నీ మరదలు పెట్టే, భిక్ష=భోజనాన్ని, గ్రహియింపవే=తీసికోవా! పాదమూలమ్ము చేరి=చెట్టుక్రిందకు చేరి, పెంపు+ఏదియున్న= పెరుగుదల పూర్తిగా కోల్పోయిన, ఛాయ చూడుము=నీడ చూడు, సరి=సరిగ్గా, రెండు జాములయ్యె=మిట్టమధ్యాహ్నం అయింది.

**తాత్పర్యం:** *నిన్ను ప్రార్థిస్తున్నాను, మళ్ళీ ఇంటికిరా. నీ మరదలు ఇష్టంతోపెట్టే భోజనాన్ని స్వీకరించు. అప్పుడే మిట్టమధ్యాహ్నం అయింది. ఆ చెట్టుక్రింద నీడచూడు. దాని పొడుగంతా మాయమైంది. ఇక ఆలస్యం చేయవద్దు.*

**అని వినయమధురముగఁ బ**
**ల్కిన, గౌతమబుద్ధుఁ డతనిఁ గ్రీఁగంటఁ గనుం**
**గొని, నాఁటి కింక భిక్షా**
**శన మొల్లమిఁదెల్పె హస్తసంజ్ఞామాత్రన్.**

**అర్థాలు:** అని=ఇలా ప్రార్థించి, వినయమధురముగన్=అణకువతో తీయనిమాటలు, పల్కిన= చెప్పినంత, గౌతమబుద్ధుఁడు=బుద్ధభగవానుడు, అతనిన్=తమ్ముని, క్రీఁగంటన్=ఓరకంట, కనుంగొని=చూచి, హస్త సంజ్ఞా మాత్రన్=చేసన్నమాత్రంచేత, నాఁటికి=ఆరోజుకు, ఇంక=ఇకపైన, భిక్షాశనము=భోజనభిక్ష, ఒల్లమిన్=అవసరం లేదని, తెల్పె=చెప్పాడు.

**తాత్పర్యం:** *అణకువతోను తీయనిమాటలతోను నందుడిలా ప్రార్థించినా, గౌతమబుద్ధుడు తమ్ముని ఓరగంటచూస్తూ చేసన్నతోనే తనకానాటికిక భోజనంతో పనిలేదని తెలిపాడు.*

**తెలిపినఁ 'జిన్నబుచ్చుకొని దేవర చిత్తము, పోయివచ్చెదన్**
**సెల'వని ప్రేయసీముఖవిశేషకదర్శనధర్మలోపసం**
**చలితమనస్కుఁడై వెనుకచక్కికి మైమయి జాఱుచుండఁగా**
**నిలు నిలు మన్న చూపొకటి నెక్కొనఁజేసి మునీంద్రుఁ డంతటన్.**

**అర్థాలు:** తెలిపినన్=అన్న ఆవిధంగా చెప్పితే, చిన్నబుచ్చుకొని=ముఖమంతా చిన్నబోగా, దేవరచిత్తము=మీ దయ, పోయివచ్చెదన్=ఇక వెళ్ళివస్తాను, సెలవు+అని=అనుజ్ఞనిమ్మని, ప్రేయసీ=తనప్రియురాలియొక్క ముఖవిశేషక=ముఖమునందలి మకరికాపత్రాల, దర్శన= చూడటమనే, ధర్మ=గృహస్థధర్మానికి, లోప=లోపం కలుగుతుందనే, సంచలితమనస్కుఁడై= కలతచెందిన మనస్సుకలవాడై, వెనుకచక్కికి=వెనుకవైపుకు, మైమయి= మెలమెల్లగా, తప్పుకోబోతూండగా, మునీంద్రుఁడు+అప్పుడు=అదిచూచి బుద్ధభగవానుడు, నిలునిలు మన్న= ఆగమన్నట్లుగా, చూపొకటి=ఒకచూపు, నెక్కొనఁజేసి=అతనిపై ప్రసరించి...

**తాత్పర్యం:** *అన్న ఆవిధంగా చెప్పేసరికి ముఖమంతా చిన్నబుచ్చుకొని ఇక మీదయ ఏంచేయగలను వెళ్ళివస్తానని అనుజ్ఞవేడి తన ప్రియురాలి ముఖమునందలి మకరికా పత్రాలు చూడాలనే ఆతృతతో ఎక్కడ శృంగారధర్మానికి లోపం కలుగుతుందోననే ఆవేదనతో ఒక్కొక్క అడుగు వెనక్కివేయబోతూండగా అది గమనించిన బుద్ధభగవానుడు ఆగమన్నట్లుగా ఒకచూపుతో సైగచేసి...*

**పూజయు శ్రద్ధయున్ వెలయఁ బుణ్యసతీజన మన్నదానపున్**
**వ్యాజమునన్ మహాసుకృత మాదట దాఁచెడి పెట్టెనాఁ, బరి**
**వ్రాజక దీక్షకున్ దొలి శుభంబన నొప్పెడి చేతి భైక్షపుం**
**భాజన మానరేంద్రసుతు పాణితలమ్మునఁ బెట్టి మౌనియై,**

**అర్థాలు:** పూజయు=ఆరాధన, శ్రద్ధయున్=ఆసక్తి, వెలయన్=ఈ రెండుగుణాలు ప్రకాశింపగా, పుణ్యసతీ జనము=సాధ్వులైన గృహిణీలలామలు, అన్నదానపున్=అన్నదానమనే, వ్యాజమునన్=వంకతో, మహాసుకృతము= గొప్పపుణ్యాన్ని, ఆదటదాఁచెడి=ఆసక్తితో దాచుకొనే, పెట్టెనాన్=మందసంలాగా; పరివ్రాజక దీక్షకున్=సన్యాస వ్రతానికి, తొలి=మొదటి, శుభంబనన్=మంగళకార్యంలా, ఒప్పెడి=ప్రకాశించే, చేతి=చేతిలోని, భైక్షపుంభాజనము= భిక్షాపాత్రను, ఆ నరేంద్రసుతు=ఆ రాజమారుని పాణితలమ్మునన్=చేతిలో, పెట్టి=ఉంచి, మౌనియై= మాట్లాడకుండా....

**తాత్పర్యం:** *పుణ్యసతులందరు ఆరాధన ఆసక్తులతో అన్నదానం అనే వంకతో గొప్ప పుణ్యాన్ని దాచుకొనే పెట్టెవంటి సన్యాసదీక్షకు తొలిపోడిమిలా వెలిగే చేతిలోని భిక్షాపాత్రను నందుని చేతిలో ఉంచి మాట్లాడకుండా....*

**సాగినడచుచుండ జననాథనందనుం**
**డట్టె చూచి, గురుని యాశయమ్ము**

**పోల్చలేక రెండుమూఁడడుగుల మేర**
**వెంటనేగి మరల వెనుక దిరిగి,**

**అర్థాలు:** సాగి నడచుచుండ=ముందుకు వెళ్ళిపోతూంటే, జననాథనందనుండు=ఆ రాజ కుమారుడు, అట్టెచూచి=అలాగే కొంచెంసేపు చూచి, గురుని ఆశయమ్ము=అన్నగారియొక్క అభిప్రాయం, పోల్చలేక= తెలిసికోలేక, రెండు మూఁడడుగుల మేర=రెండుమూడడుగుల దూరంవరకు, వెంటనేగి=వెనుకనే నడిచి, మరల=ఆ వెంటనే, వెనుక తిరిగి=వెనక్కితిరిగి...

**తాత్పర్యం:** *అలా ముందుకు వెళ్ళిపోతోంటే నందుడు అలాగే చూస్తూండిపోయి అన్నగారి అభిప్రాయం అర్థంకాక రెండుమూడడుగులు వెనకేవెళ్ళి వెంటనే వెనక్కితిరిగి...*

**సదనము మొగమై, మఱి య**
**య్యది రెండవ తప్పగున్‌గదా యనుకొని, బె**
**ట్టిదముగఁ గటకటఁబడి, యా**
**సదయుని వెనువెంట మరలసాగి నడచుచున్,**

**అర్థాలు:** సదనము మొగమై=ఇంటికి తిరిగి, మఱి=మళ్ళీ ఆలోచించి, అయ్యది=అలాచేయడం, రెండవ తప్పగున్‌గదా=రెండోమారు తప్పుచేయడం అవుతుంది కదా, అనుకొని=అనిభావించి, బెట్టిదముగన్=తీవ్రంగా, కటకటన్ పడి=బాధపడి, ఆ సదయుని=ఆ దయామయుని, వెనువెంట=వెనుకనే, మరలసాగి=మళ్ళీబయలుదేరి, నడచుచున్=నడుస్తూ...

**తాత్పర్యం:** *ఇంటివైపు తిరిగి... మళ్ళీ అలాచేయడం రెండోతప్పవుతుందని భావించి బాగా బాధపడి అన్నగారి వెంటనే మళ్ళీబయలుదేరి నడుస్తూ...*

**తనకోస మెదురుతెన్నులు**
**గను నెచ్చెలి బిక్కమొగము కలఁగించుచు నె**
**మ్మనమునఁ బాఱఁగ కానీ**
**యనుకొని వెనుకంజ వైచి, యదికాదనుచున్.**

**అర్థాలు:** తనకోసము=తనరాకకోసం, ఎదురుతెన్నులుగను=ఎదురుచూచే, నెచ్చెలి=ప్రియురాలియొక్క, బిక్కమొగము=దీనంగాపెట్టిన ముఖం, కలఁగించుచు=కలచి వేస్తూ, నెమ్మొగమునన్=అతని అందమైన ముఖాన, పాఱఁగ=నిండారగా, కానీ=ఏమవుతుందో అదికానిమ్మని, అనుకొని=అనుకొంటూ, వెనుకంజవైచి=వెనుకడుగు వేసి, అదికాదనుచున్=మరలా అది బాగుండదనుకొని....

**తాత్పర్యం:** *తనరాకకోసం ఎదురుచూచే తన ప్రియురాలి బిక్కముఖం అతనిని కలచివేస్తూ అతని ముఖంమీద బొమ్మకట్టగా ఏమైతే అదవుతుందనుకొని అడుగువెనక్కువేసి మళ్ళీ అలా కాదనుకొని అన్నగారి వెంటవెడుతూ...*

**మునివర్యు నిలిపి, 'ప్రభూ! యిదియే'మని**
**నొక్కి ప్రశ్నింపఁగా నోరు రాక**
**అవిధేయతాశంక ననుసరింపంగ ముం**
**దడుగువెంబడి వెన్క యడుగు రాక**
**పత్రలాంఛితమైన ప్రణయిని చెక్కుట**
**ద్దమ్ముల నిల్చు చిత్తమ్ము రాక**
**ఎండలో రేయెండ లీనెడి తన సౌధ**
**గోపురమ్ముల నిల్చు చూపు రాక**

**అంతరింద్రియ బహిరింద్రియముల కించు**
**కయును నానుకూల్యములేని గతియెకాఁగ,**
**ఎటకొ తనపోక, మరల నెప్పటికొ రాక**
**యరయనేరక యవశుఁడై యరుగుచుండె.**

**అర్థాలు:** మునివర్యు=అన్నగారైన బుద్ధుని, నిలిపి=నిలబెట్టి, ప్రభూ=స్వామీ, ఇదియేమని= ఏమిచేస్తున్నావని, నొక్కి ప్రశ్నింపఁగా=గట్టిగా అడగడానికి, నోరురాక=మాటపెగలక, అవిధేయతాశంకన్=అలా అడిగితే వినయం తప్పినట్లవుతుందనే అనుమానంతో, అనుసరింపంగ=ఆయనవెంబడి వెడదామంటే, ముందడుగువెంబడి= అడుగు ముందుకు వేస్తే దానిని అనుసరించి, వెన్కయడుగు రాక=మరొక అడుగు పడక, పత్రలాంఛితమైన= మకరికలు దిద్దుకున్న, ప్రణయిని=ప్రియురాలి, చెక్కుటద్దముల నిల్చు=నునుపైన బుగ్గలమీద నిల్చిన, చిత్తమ్మురాక= మనసు మరలకపోవడంచేత, ఎండలో=మంచి ఎండలోకూడా, రేయెండలు= వెన్నెలలు, ఈనెడి=ప్రసరించే, తనసౌధ గోపురమ్ముల=తనమేడ పైభాగాలలో, నిల్చు=నిలబడ్డ, చూపురాక=తనచూపులు తిరిగిరాక, అంతరింద్రియ= మనస్సుకు, బహిరింద్రియములకు=కనులు చెవులు మొదలైన జ్ఞానేంద్రియ కర్మేంద్రియాలకు, ఇంచుకయునున్= ఏమాత్రంకూడా, ఆనుకూల్యములేని=సంబంధంలేనివిధంగా, గతియెకాఁగ=తనప్రవర్తనం తయారుకాగా, ఎటకొ తనపోక=ఎక్కడకు వెడుతున్నాడో, మరలన్=తిరిగి, ఎప్పటికొరాక=ఎప్పుడొస్తాడో, అరయనేరక=అర్థంగాక, అవశుఁడై=తనకు తెలియకుండానే, అరుగుచుండె=పోతున్నాడు.

**తాత్పర్యం:** *అన్నగారిని నిలబెట్టి ఇదేమిస్వామీ అని అడగడానికి నోరురాక, అడిగితే అవిధేయత అవుతుందేమోనని వెడదామంటే అడుగువెనక అడుగుపడక, ఒకవైపు ప్రియురాలి బుగ్గల మకరికలమీద నిల్చిన మనస్సు వెనక్కిరాక, ఎండలోకూడా వెన్నెలలుకురిసే తనసౌధ గోపురాలమీది చూపులు మరల్చుకోలేక, మనస్సుకు కాలుచేతులకు సంబంధంలేక, ఎక్కడకు పోతున్నాడో ఎప్పటికి వస్తాడో తెలిసికోలేక, తనమీద తనకే స్వాధీనం తప్పి నందుడు అన్నవెనక అయోమయంగా పోతున్నాడు.*

**నృపసుతు నవ్యవస్థత నెఱింగియు వాని ననుగ్రహించు స**
**త్కృప మది నిండి, వేఱుతలఁపించుక లేని మహానుభావుఁడా**
**తపసి మనోబలమ్మునను ధర్మబలమ్మునఁ గట్టితెచ్చి, తా**
**నవగత పుష్పసాయకవిహారవిహారముఁ జేర్చె నాతనిన్.**

**అర్థాలు:** నృపసుతున్=రాకుమారుడు నందుని, అవ్యవస్థతన్=నిలకడలేనితనంగురించి, ఎఱింగియు= తెలిసి కూడా, వానిన్=అటువంటివానిని, అనుగ్రహించు=మంచిమార్గంలోపెట్టే, సత్కృప=దయ, మదినిండి= లోపల కలిగినవాడై, వేఱుతలఁపించుకలేని=వేరే ఆలోచనలేని, మహానుభావుఁడు=భగవానుడైన, ఆతపసి= ఆబుద్ధుడు, మనోబలమ్మునను=మానసికబలంతో, ధర్మబలమ్మునన్=తాను ప్రచారంచేయదలచిన ధర్మపాశంతో, కట్టితెచ్చి=బంధించితెచ్చి, తాన్=స్వయంగా, అవగత=లొంగదీసికొన్న, పుష్పసాయక విహార=మదనక్రీడాసదనమైన, విహారమున్=బౌద్ధారామానికి, ఆతనిన్=ఆనందుని, చేర్చెన్=తీసికొనివచ్చాడు.

**తాత్పర్యం:** *రాకుమారుడు నిలకడలేనివాడని తెలిసికూడా వానిని అనుగ్రహించేదయతో మరేమీ ఆలోచనలులేని మహానుభావుడు బుద్ధుడు తన మనోబలంతో ధర్మబద్ధుడినిచేసి మన్మధుడిని జయించిన తన ఆశ్రమానికి తమ్ముని తెచ్చాడు.*

**చేరఁజీరి, యచట శిరము దువ్వుచుఁ జిఱు**
**చెమట పోవఁదుడిచి, చెక్కు నిమిరి,**
**యక్కు గదియఁజేర్చి, మిక్కుటమగు జాలి**
**కతన నిట్లు పలికె గౌతముండు.**

**అర్థాలు:** అచట=అక్కడ తన ఆశ్రమంలో, చేరన్ చీరి=తెచ్చిన తమ్ముని ఆదరంతో దగ్గరకు పిలిచి, శిరము దువ్వుచున్=తలమీది జుట్టు సరిచేస్తూ, చిఱుచెమట=మార్గాయాసంతోపాటు ఏమవుతుందోనన్న బెదురుతో ఏర్పడ్డ స్వేదబిందువులను, పోవన్ తుడిచి=గుడ్డతో అద్ది, చెక్కునిమిరి=తమ్ముడిబుగ్గలను ఆదరంతో పుడికి, అక్కున గదియన్ చేర్చి= గట్టిగా ఆలింగనం చేసికొని, గౌతముండు=పెద్దవాడైన గౌతమబుద్ధుడు, మిక్కుటమగు= అత్యధికమైన, జాలికతన=పిన్నవాడు అప్పుడే పెండ్లయినవాడు అంగనా ప్రేమధర్మం తప్ప సామాజికమైన ప్రేమధర్మం గురించి ఆలోచనలేనివాడు అమాయకుడైన తమ్మునిపై అమితమైన దయతో, ఇట్లు పలికె=ఈవిధంగా బుజ్జగించాడు.

**తాత్పర్యం:** *తాను మన్మథుని జయించిన తన ఆశ్రమంలో అక్కడకు చేరిన బుద్ధుడు మన్మథబాధితుడై నిలకడ కోల్పోయిన తనతమ్ముని స్వస్థపరచడానికై ఆదరంతో దగ్గరకు పిలిచి, తలమీద చేయివేసి నిమురుతూ, బెదురుతో ఏర్పడ్డ చెమటబిందువులను మెత్తగా అద్ది, నున్ననిబుగ్గలు తడుముతూ గట్టిగా ఆలింగనంచేసికొంటూ ఇలా బుజ్జగించాడు.*

**'ఉడుగని నడకల నెండన్**
**గడు బడలితి వన్న! యెండకన్నెఱుఁగవు, నిన్**

**విడలేక కరుణ పెంపునఁ**
**దొడితెచ్చితి నిటకు నింత దూరము తండ్రీ!**

**అర్థాలు:** తండ్రీ=పెద్దవారు పిన్నల్ని వాత్సల్యంతో పిలిచేపిలుపు తండ్రీ, ఎండకన్నెఱుఁగవు=ఎప్పుడూ ఎండముఖం చూడనివాడవు, అన్న=అటువంటి తమ్ముడూ, ఉడుగని=వేగం తగ్గని, నడకలన్=అడుగులతో, ఎండన్=ఎండలోబడి నడిచి, కడుబడలితివి=బాగా అలసిపోయావు, నిన్=అంత సుకుమారుడవైన నిన్ను, విడలేక= విడిచి ఉండలేక, కరుణ పెంపునన్=నీ మీది వాత్సల్యంచేత, ఇంతదూరము=ఊరిచివరిదాకా, ఇటకున్= ఇక్కడకు, తొడితెచ్చితిన్=నడిపించి తీసికొచ్చాను సుమా!

**తాత్పర్యం:** *ప్రియమైన తమ్ముడూ! ఎప్పుడూ సౌధంవీడి ఎండలో నడిచి ఉండవు. అటువంటి నిన్ను ఎండలో ఇంతదూరం తీసికొచ్చాను. బాగా ఆయాసపడిపోయావు. ఇదంతా ఎందు కనుకుంటున్నావు.. అమాయకమైన నిన్ను విడిచి ఉండలేకనే సుమా!*

**ఆయెఁబో, దానికేమి మేలాయెఁగాక,**
**భద్రమగుఁగాక నీకు, నీ వాసనా ప**
**రంపరలు మాసి విషయోప రాగరహిత**
**దివ్యవిజ్ఞానకళిక సిద్ధించుఁగాక.'**

**అర్థాలు:** ఆయెన్+పో=అయితే అయిందిగాని, దానికేమి=దానిదేముందిలే, మేలాయెన్+కాక=మంచే జరుగు తుందిలే, నీకు=అమాయకుడవైన నీకు, భద్రమగున్+కాక= మేలు జరుగాలి, నీ=ఐహికానుభవాలలో చిక్కుకున్న నీయొక్క, వాసనా=సహజాతోద్వేగాల... రాగద్వేషాదుల అనుభవాల, పరంపరలు=ఒకదానివెనుక ఒకటి వరుసగా వెంటబడే పరిస్థితులు, మాసి=పూర్తిగా తొలగిపోయి, విషయ=శబ్ద స్పర్శ రూప రస గంధాది భోగ పదార్థాల, ఉపరాగ=సంబంధమైన నిందాదులు, రహిత=దరిచేరని, దివ్య=మరణంలేని పదార్థానికి సంబంధించిన, విజ్ఞానకళిక=తెలివిడి అనే నేర్పు, సిద్ధించున్+కాక=నీకు సమకూరుతుంది సుమా!

**తాత్పర్యం:** *జరిగిందేదో జరిగింది, దానికేముందికాని... ఇకపైన నీకు మేలే జరుగుతుంది కదా! అందులో అమాయకుడవైన నీకు మంచే జరుగుతుందిలే! ఐహికానుభవాలలో చిక్కుకున్న నీయొక్క రాగద్వేషాల దొంతరలు పూర్తిగా తొలగిపోయి ఇకపైన శబ్ద స్పర్శ రూప రస గంధాది భోగపదార్థాదులవలన కలిగే నిందాదులు దరికిచేరని పరమపావనమైన అకళంక తత్త్వప్రాప్తి నీకు సమకూరుతుంది సుమా!*

**అని కడు నాదర మ్మెసఁగ నాడి, వచోనిధి యోగిపుంగవుం**
**డనియెను వెండియున్, 'వినఁగదయ్య, కుమారక! యర్థవంతమై**
**యెనయు విశేషమున్ వినుతు, నీ పడినట్టి పరిశ్రమమ్ము దా**
**నన ఫలవంతమై తుద కనంతసుఖమ్ము లొసంగఁజాలెడిన్.**

**అర్థాలు:** అని=ఇలాచెబుతూ, కదున్=మిక్కిలి, ఆదరమ్మెసంగన్=ప్రేమతో, ఆడి=మాట్లాడి, వచోనిధి=మాటకారి ఐన, యోగిపుంగవుండు=మునిశ్రేష్ఠుడైన బుద్ధుడు, వెండియున్=మళ్ళీ, అనియెన్=ఇలా అన్నాడు. కుమారక= నందకుమారా! అర్థవంతమై యెనయు=నీకు ప్రయోజనకారి ఐన, విశేషమున్ వినుతు=ప్రబలవిషయం ఒకటి చెబుతాను, వినగదయ్య= వింటావుకదూ! నీ పడినట్టి=నీవుపడిన, పరిశ్రమమ్ము=బడలిక, దానన=దానిచే, ఫలవంతమై=పండి, తుదకు=చివరకు, అనంతసుఖమ్ములు=అంతులేని సుఖాలను, ఒసంగఁజాలెడిన్= సమ కూరుస్తుంది.

**తాత్పర్యం:** *ఇలా చాలాప్రేమతో మాట్లాడి మాటకారి అయిన బుద్ధభగవానుడు మళ్ళీ అన్నాడు... నందకుమారా! నీకుపయోగమైన విషయమొకటి చెబుతాను విను.. నీవు పడిన శ్రమకుతగిన ఫలితం ఉంటుందిసుమా! అదినీకు అంతులేని సుఖాలను సమకూరుస్తుంది.*

**పగగొను త్రాచుఁబామువలెఁ బ్రాణి జనించినదాది వెంబడిన్**
**దగిలి చరించు మృత్యువు, విధాతయు దాని వశంబె యన్నచో**
**మిగిలిన భూతజాలము ప్రమేయము చెప్పఁగనేల, నిత్యమై**
**నెగడెడి దొండులేదు, కననేరదు లోకము కన్ను లుండియున్.**

**అర్థాలు:** మృత్యువు=చావు, పగగొను=పగబట్టిన, త్రాచుఁబామువలెన్=త్రాచుపాములా, ప్రాణి=జీవుడు, జనించినదాది=పుట్టినది మొదలుగా, వెంబడిన్ దగిలి=వెంటపడి, చరించు= నడుస్తూనే ఉంటుంది, విధాతయు= సృష్టికర్తకూడా, దానివశంబె యన్నచో=దానికి లోబడ్డాడంటే, మిగిలిన=మిగతా, భూతజాలము=జీవసమూహం, ప్రమేయము=సంగతి, చెప్పఁగనేల=ఏంచెప్పాలి? నిత్యమై=శాశ్వతంగా, నెగడెడిది=నిలబడేది, ఒండులేదు=ఒక్కటీ లేదుగదా! లోకము=ఈ ప్రపంచం, కన్నులుండియున్=నేత్రాలున్నా, కననేరదు=చూడలేదు.

**తాత్పర్యం:** *చావనేది పగపట్టిన త్రాచుపాములా జీవుడు పుట్టింది మొదలు వెంటబడి తరుముతూనే ఉంటుంది. చివరకు సృష్టికర్త బ్రహ్మకైనా చావునుండి తప్పించుకోవడం చేతకాదంటే ఈ మిగిలిన జీవకోటి సంగతి చెప్పేపనేముంటుంది? చివరకు శాశ్వతంగా ఈ లోకంలో ఉండిపోయే జీవి ఒక్కటీలేదు. ఈ లోకానికి అంతా తెలుసు, కాని అర్థం చేసికోలేదు.*

**తల్లి యొడిలోని బిడ్డను దస్కరించు,**
**బిగువుఁగౌఁగిలి తెగఁద్రెంచి ప్రియులఁ బాపు**
**నకట! మృత్యువు నిర్దయురాలు, దాని**
**లీలకుం బ్రతికారముల్ లేవు జగతి.**

**అర్థాలు:** అకట=అయ్యో, మృత్యువు=చావనేది, నిర్దయురాలు=దయలేనిది, తల్లియొడిలోని= అమ్మపొత్తిళ్ళలో ఉన్న, బిడ్డను=పసిపాపను, తస్కరించు=దొంగిలించుకుపోతుంది, బిగువున్= గట్టిగా బిగించిన, కౌఁగిలి=

ఆలింగనాన్నికూడా, తెగఁద్రెంచి=విడగొట్టి, ప్రియులన్=ప్రేమికులను, పాపున్=తొలగిస్తుంది. దాని=ఆ మృత్యువు యొక్క లీలకున్=విలాసానికి, జగతి=ప్రపంచంలో, ప్రతికారముల్ లేవు=ప్రతిచర్యలు లేవు.

**తాత్పర్యం:** *అయ్యో! చావు దయలేనిది. పొత్తిళ్ళలోని బిడ్డను దొంగిలిస్తుంది. బిగుతైన కౌగిళ్ళు త్రెంచి ప్రేమికుల్ని విడదీస్తుంది. దానిచర్యలకు ప్రతిచర్యలనేవి కనిపించవుకదా!*

**నేఁడు గాకున్న రేపుగానీ, మఱొక్క**
**నాఁడుగానీ, వియోగమున్నదియె సుమ్ము**
**జంతుకోటికి మృత్యువశమ్ముకతన;**
**నాఁడు విలపించి లాభ ముండదు కుమార!**

**అర్థాలు:** కుమార=నందకుమారా, జంతుకోటికి=జీవప్రపంచానికి, మృత్యువశమ్ముకతన= చావుచేత, నేఁడుగాకున్న=ఈవేళకాకపోతే, రేపుగానీ=రేపైనాగానీ, మఱొక్కనాఁడుగానీ= మరొకనాడైనాగానీ, వియోగమున్నదియె సుమ్ము=ఎడబాటు తప్పనిది. నాఁడు=ఆరోజున, విలపించి=ఏడిచి, లాభముండదు=ప్రయోజనంలేదు.

**తాత్పర్యం:** *కుమారా! ఈ జీవకోటికి ఈవేళకాకపోతే మరోరోజున చావుచేత ఎడబాటు తప్పదు. ఆ వేళ ఏడ్చి ప్రయోజనం లేదుకదా!*

**జరయు రుజయును ఘోరరాక్షసులు మృత్యు**
**దేవతానేత్రసంజ్ఞ వర్తిల్లు సఖులు,**
**ప్రాణహరణమునెడఁ జేయవలయునట్టి**
**కార్యమును ముందె చేయు ప్రగల్భురాండ్రు.**

**అర్థాలు:** జరయు=ముసలితనం, రుజయును=రోగం, ఘోరరాక్షసులు=వీరిద్దరూ భయంకర రక్కసులు, మృత్యుదేవతా=చావనే దైవికశక్తికి, నేత్రసంజ్ఞవర్తిలు=కనుసన్నలలో నడిచే, సఖులు=స్నేహితులు, ప్రాణ హరణమునెడన్=ప్రాణాలుతీసికోవడంలో, చేయవలయునట్టి= చేయవలసిన, కార్యమును=పనిని, ముందెజేయు= ముందుగానేనిర్వర్తించు, ప్రగల్భురాండ్రు=నేర్పరులు.

**తాత్పర్యం:** *ముసలితనం రోగం అనే రాక్షసులిద్దరూ మృత్యుదేవత కనుసన్నలలో నడిచే మిత్రులు. ప్రాణాలుతీయడంలో మంచి నేర్పరులుసుమా!*

**మరువముమొల్క, పుష్పసుకుమారము నా తను వంచు భ్రాంతులై**
**మురియుదు రింతెకాని గుణమున్ గననేరరు, చెప్పినన్ గ్రహిం**
**పరు, గడియల్ దినమ్ములును మాసములున్ ఋతువుల్ గ్రసించుచున్**
**జర పయికొన్న వేళ నెఱచక్కఁదనమ్ములు వట్టిపోయెడిన్.**

**అర్థాలు:** నా తనువు=నా శరీరం, మరువముమొల్క=మంచి వాసనగలమరువం చివురు, పుష్ప సుకుమారము=పూవులా కోమలమైనది, అంచు=అనుకొంటూ, భ్రాంతులై=మోహితులై, మురియుదురింతె కాని= మురిసి పోతారేగాని, గుణమున్ గననేరరు=నిజాన్ని తెలిసికోలేరు, చెప్పినన్=పోనీ ఒకరుచెప్పినా, గ్రహింపరు=అర్థం చేసికోలేరు. గడియల్=గడియగడియకు, దినమ్ములును=రోజురోజుకూ, మాసములున్=నెలలు, ఋతువుల్= కాలాలు, గ్రసించుచున్=గడచేకొద్దీ, జరపయికొన్నవేళన్=ముసలితనం మీదపడేసమయానికి, నెఱ= గొప్పదనుకొన్న, చక్కదనమ్ములు=అందాలు, వట్టిపోయెడిన్=ఇంకిపోతాయి.

**తాత్పర్యం:** *తమశరీరాలు మరువపుమొలకలు, పుష్పకోమలాలు అనే భ్రాంతిలో మురిసి పోతారు అంతేకాని, నిజం చెప్పినా గ్రహించరు. నిముషనిముషానికీ మీదపడే వృద్ధాప్య భారంచేత ఈ అందాలన్నీ తరిగిపోతూంటాయి కదా!*

**అపుడు తనదేహమే తన కగును రోఁత,**
**ముద్దులాఁడియె తనపాలి భూత మగును,**
**నేఁటి ప్రణయప్రబంధముల్ నాఁటిదన్క**
**నిలిచియుండవు, పరువము నీటిబుడగ.**

**అర్థాలు:** అపుడు=ఆసమయంలో, తనదేహమే=తనశరీరమే, తనకు=అతనికి, రోఁత=అసహ్యం, అగును= అవుతుంది, ముద్దులాఁడియె=ఇష్టమైనభార్యయే, తనపాలి=అతని యెడల, భూతమగును=దయ్యంలా తయారవుతుంది, నేఁటిప్రణయప్రబంధముల్=ఈనాటి ప్రేమగాథలే, నాఁటిదన్క=ఆనాటిదాకా, నిలిచియుండవు= నిలబడవు, పరువము=యుక్త వయసు, నీటిబుడగ=నీటిమీది బుడగవంటిది.

**తాత్పర్యం:** *అప్పటికి ఈదేహమే అసహ్యమనిపిస్తుంది. ఇష్టపత్నియే దయ్యమనిపిస్తుంది. ఈ ప్రేమగాథలు అప్పటిదాకా నిలబడవు. ఈ ప్రాయం నీటిబుడగవంటిది నాయనా!*

**కావున దుఃఖహేతువగు కాలము పైకొనిరాకమున్నె సౌ**
**ఖ్యావహయోగధారణకు యత్న మొనర్పఁగ నుత్సహించి మే**
**ల్కోవలెఁ గాక, మన్మథవిలోల మనస్కత నింద్రియార్థ సం**
**సేవ లొనర్పఁ జెల్ల, దది చేటునకున్ మొదలింటి హేతువౌ!**

**అర్థాలు:** కావున=కాబట్టి, దుఃఖహేతువగు కాలము=బాధనుకలిగించే ముసలితనం, పైకొని రాకమున్నె= మీదపడకముందే, సౌఖ్యావహ=నిరంతర సుఖాన్నిచ్చే, యోగధారణకు=ఈశ్వరునితో కలిసిపోయే ప్రక్రియకు, యత్నమొనర్పఁగన్=ప్రయత్నంచేయడానికి, ఉత్సహించి=ఇష్టపడి, మేల్కోవలెఁగాక= తెలివిపొందవలెను గాని, మన్మథవిలోలమనస్కతన్= మనస్సును కామవశంచేసి, ఇంద్రియార్థ=వీర్యతృప్తికి, సంసేవలొనర్పన్=వాటికి లొంగి పోవడం, చెల్లదు=పనికిరాదు, చేటునకున్=ప్రమాదానికి, అది=ఇంద్రియాలకు లొంగిపోవడం, మొదలింటి= మొదటి, హేతువౌ=కారణం అవుతుంది.

**తాత్పర్యం:** *కాబట్టి అతిభయంకరమైన ముసలితనం మీదబడకముందే శాశ్వతానంద కరమైన మోక్షపదవికి ప్రయత్నించాలిగాని కామతృప్తికోసం ఇంద్రియాలకు లొంగి పోకూడదు. అది మొదటికే మోసమవుతుందిసుమా!*

**ఎఱుఁగవుగానఁ బూవిలుతు నేడ్తెఱకున్ వశమై విలాస త**
**త్పరత జగమ్మునే మఱచి వర్తిలుచుంటివి పాప మీవు, నేఁ**
**డెఱిఁగితిగానఁ గన్దెఱచి యింతటనైనను సౌమ్యబుద్ధివై**
**తిరిగి ప్రియావిమోహజలధిన్ దరియింపుము దారి చూపెదన్.'**

**అర్థాలు:** పాపము=నిన్నుచూస్తే జాలిపుడుతుంది, ఈవు=అటువంటి నీవు, ఎఱుఁగవుగానన్= తెలియక, పూవిలుతున్=మన్మథుని, ఏడ్తెఱకున్=బలానికి, వశమై=లొంగిపోయి, విలాస తత్పరత=కేళీవిహారంతో, జగమ్మునే= ఈప్రపంచాన్ని, మఱచి=మర్చిపోయి, వర్తిలుచుంటివి=వ్యవహరిస్తున్నావు, నేఁడు=ఈరోజున, ఎఱిఁగితిగానన్= తెలిసికొన్నావు కాబట్టి, ఇంతటనైనను=ఇప్పటికైనా, కన్‌తెఱచి=తెలివిగా, తిరిగి=మరల, సౌమ్యబుద్ధివై= బుద్ధిమంతుడవై, ప్రియావిమోహజలధిన్=ప్రియురాలిమీది కామవాంఛాసముద్రాన్ని, తరియింపుము= దాటి చూపించు. దారి=అందుకు మార్గాన్ని, చూపెదన్=చూపిస్తాను.

**తాత్పర్యం:** *పాపం నీకు తెలియదుకాబట్టి మన్మథబాణాలకు లొంగిపోయి ప్రపంచాన్నే మర్చిపోయి మదనకేళీవిహారంలో ఉండిపోయావు. ఇప్పుడు తెలిసిందికా! ఇప్పటికైనా కళ్ళుతెరచి బుద్ధిమంతుడిలాగా ప్రియకాంతతోటి కామవాంఛాసముద్రాన్ని దాటిరా! అందుకు తగిన దారిని నేను చూపిస్తాను.*

**అని యుపచారదక్షుఁడును నాత్మసముండునునైన శిష్యునొ**
**క్కనిఁ బిలిపించి యంతఁ ద్రిజగత్పరిపూజ్యుఁడు గౌతముండనెన్–**
**'దనయ! కుమారనందునకు ధర్మపథమ్మున దీక్ష యిమ్ము పొ'**
**మ్మనుడు, నతండు వల్లెయని యాతనిఁ దోడ్కొనిపోయెఁ గ్రన్ననన్.**

**అర్థాలు:** అని=ఇలా బోధించి, అంతన్=ఆతరువాత, ఉపచారదక్షుఁడునున్=సేవలలో ఆరితేరినవాడునూ, ఆత్మసముండునున్+ఐన=తనకు ఆరామసంప్రదాయాలలో సమానుడూనైన, శిష్యుని+ఒక్కనిన్=ఒక భిక్షువును, పిలిపించి=కబురుపంపి రప్పించి, త్రిజగత్=మూడులోకాలచేత, పరిపూజ్యుఁడు=పూజింపబడేవాడైన, గౌతముండు+ అనెన్= గౌతమబుద్ధుడిలా అన్నాడు, తనయ=పుత్రా! కుమారనందునకు=ఈ నందకుమారునకు, ధర్మపథమ్మున= మనశిక్షామార్గంలో, దీక్షయిమ్ము పొమ్ము=తీసుకుపోయి సంస్కారవంతుణ్ణి చేయి, అనుడున్=అనగానే, అతండు= అతగాడును, వల్లెయని=సరేనని, క్రన్ననన్=వెంటనే, ఆతనిన్=నందుని, తోడ్కొని పోయెన్=వెంట తీసుకొని పోయాడు.

**తాత్పర్యం:** *త్రిలోకపూజ్యుడైన గౌతమబుద్ధుడు ఇలాబోధించి సేవాదక్షుడు, తనతోసమానుడు*

*నైన ఒక శిష్యుని రప్పించి ఇలా చెప్పాడు. నాయనా! ఇతడు నాతమ్ముడు నందుడు. వీనిని తీసికొనిపోయి మనధర్మం ప్రకారం దీక్ష యివ్వు. అనడంతోనే సరేనని వెంటనే నందుని తనవెంట తీసికొనిపోయాడు.*

**పోయి, వలయు యత్నములు చేయుచుండ, నా**
**వన్నెకాఁడు భూమిపాలతనుజుఁ**
**డొల్లఁబోయి, మోము వెల్లనై గజగజ**
**లాడి, యిట్టులనియె నతనితోడ.**

**అర్థాలు:** పోయి=నందుని తనవెంట తీసికొనిపోయి, వలయుయత్నములు=దీక్షకు కావలసిన పనులు, చేయుచుండన్=నిర్వర్తిస్తూండగా, ఆవన్నెకాడు=ఆ అందాలసుకుమారుడైన, భూమిపాలతనుజుఁడు=రాజకుమారుడు, ఒల్లఁబోయి=నీరసపడిపోయి, మోము=ముఖమంతా, వెల్లనై=పాలిపోయి, గజగజలాడి=వణికిపోతూ, అతనితోడ=ఆ భిక్షువుతో, ఇట్టులనియెన్=ఈ విధంగా మొత్తుకున్నాడు.

**తాత్పర్యం:** *అలా తీసుకుపోయి దీక్షకు కావలసిన ఏర్పాట్లు చేస్తూండగా ఆ సుకుమారుడైన రాకుమారుడు నందుడు నీరసపడిపోయి ముఖమంతా పాలిపోయి వణికిపోతూ ఆ భిక్షువునిలా ప్రార్థిస్తున్నాడు.*

**'నిలుమన్నా! భిక్షూత్తమ!**
**వలదన్నా! నాకు దీక్ష వలదు, నినున్ గా**
**ళులపైఁబడి వేఁడెద, న**
**న్నిలుసేర్పుము, నీకుఁ బున్నెమెంతోయుండున్.**

**అర్థాలు:** భిక్షూత్తమ=ఓ బౌద్ధసన్యాసులలో శ్రేష్టుడా! నిలుమన్నా=ఆగవయ్యా! వలదన్నా= నీ ప్రయత్నాలు విడిచిపెట్టవయ్యా! నాకు=ఐహికసుఖమగ్నుడనైన నాకు ఈ సంస్కారం వద్దు, నినున్=నిన్ను, కాళులపైఁబడి=కాళ్ళపైనపడి, వేఁడెద=వేడుకొంటాను, నీకున్= దీనజన సేవాతత్పరుడవైన నీకు, ఎంతోపున్నెము=ఎంతైనా పుణ్యము, ఉండున్=ఉంటుంది, నన్ను= దీనుడనైన నన్ను, ఇలుసేర్పుము=దయచేసి ఇంటికి చేర్చు.

**తాత్పర్యం:** *ఓ భిక్షువులలో మంచివాడా! కొంచెం ఆగునాయనా! నేనీ ఆశ్రమంలో ఉండలేను. నాకీ సన్యాసదీక్ష వద్దు. నీ కాళ్ళమీద పడివేడుకుంటాను. నీకెంతో పుణ్య ముంటుంది, నన్నుకాస్త మాయింటికి చేర్చు.*

**ప్రాణసమానమైన ప్రియురాలిని బాసి, క్షణమ్ము స్వర్గమం**
**దేనియు నిల్వలేని నను నీగతిఁ జేయఁగఁ బాడియౌనె? లో**
**నానయు భీతియున్ గదిరి, నాలుక కుంటిన, నన్నుతోడ నే**
**నౌననఁ గాదనంగ వెనుకాడితి, సత్యము నీకుఁ దెల్పితిన్.**

**అర్థాలు:** ప్రాణసమానమైన=నా ప్రాణంతో సమానమైన, ప్రియురాలిని=నాకెంతో యిష్టమైన సుందరిని, పాసి=వదిలిపెట్టి, స్వర్గమందేనియు=సౌఖ్యాలకు ఆలవాలమై దేవతలుండే ఆ స్వర్గలోకంలోనైనా, క్షణమ్ము=ఒక్క నిముషంకూడా, నిల్వలేని=గడుపలేని, ననున్=కామాతురుడైన నన్ను, ఈగతిన్=ఈవిధంగా, చేయఁగన్=సన్యాసిని చేయడం, పాడి యౌనె=నీకేమైనా బాగుందా? లోనన్=నాలోపల, అనయు=అన్నగారి ఆజ్ఞతోకలిసి, భీతియున్=భయంకూడా, కదిరి=పెంపారి, నాలుక=నా జిహ్వాగ్రం, కుంటినన్=పనిచేయడానికి నిరాకరింపగా, అన్నతోడ=అన్నగారితో, నేను=సేవకుడనైన నేను, ఔననన్=ఒప్పుకోవడానికిగాని, కాదనంగ=తప్పుకోవడానికిగాని, వెను కాడితి=ఏమీ చెప్పలేకపోయాను. నీకున్=నీకుమాత్రమే, సత్యము=నిజాన్ని, తెల్పితిన్=చెప్పాను.

**తాత్పర్యం:** *నా ప్రాణమైన నా ప్రియురాలు సుందరిని విడిచి ఈ మునులంతా కోరుకొని తపస్సులుచేసే స్వర్గంలోకూడా ఒక్క నిమేషం గడుపలేని నన్ను ఈ విధంగా సన్యాసిని చేయడం నీకేమైనా బాగుందా? నా లోపల తిరుగులేని అన్నగారి ఆజ్ఞ ఒకవైపు, అన్నగారంటే భయం ఇంకొకవైపు నా నాలుకను పనిచేయకుండా చేయగా అన్నగారు చెప్పినప్పుడు ఔనని కాదని తిరుగు చెప్పలేకపోయాను. నీకు మాత్రం ఉన్నది ఉన్నట్లు చెబుతున్నాను.*

**వరమడిగి నాశరీరము**
**తరుణీమణి పుచ్చుకొనియెఁదన సొత్తుగ, నే**
**దురితముపాలై పోవనె**
**పరధనమును నిచ్చవెంట వాడితినేనిన్?'**

**అర్థాలు:** తరుణీమణి=మంచివయసులో ఉన్న నా సుందరి, వరమడిగి=నాదగ్గర ఒకవరం కోరి, నాశరీరము=నా ఈ దేహాన్ని, తనసొత్తుగ=తనదిగా, పుచ్చుకొనియెన్=తీసేసుకొంది. పరధనమునున్=పరులసొత్తయిన ఈ శరీరాన్ని, ఇచ్చవెంట=నా ఇష్టప్రకారం, వాడితినేనిన్= ఉపయోగించానంటే, నేన్=నేను, దురితము=పాపం, పాలైపోవనె=చేసినవాడను కానా?

**తాత్పర్యం:** *నా ప్రియురాలు, అర్ధాంగి, సుందరి నాదగ్గర ఒక వరం అడిగి ఈ శరీరాన్ని తనసొమ్ముగా చేసికొంది. ఇది ఇప్పుడు పరాయిసొమ్ము. దీనిపైన నాకధికారం లేదు. నాయిష్టం వచ్చినట్లు దీనిని నేను వాడుకోవడం పాపంకాదా?*

**అన, మునిశిష్యుఁ డంతట, ననాదరసూచక మందహాస మం**
**దన వికసత్కపోలుఁడయి, డగ్గఱి, నందుని కేల్ గ్రహించి యి**
**ట్లనెఁ 'గడుబేలవై యెఱుఁగవైతి కుమారక! సుప్రసన్నతా**
**ఖని గురునానతిన్ నడవఁగావలదే మన కెంతవారికిన్?**

**అర్థాలు:** అన=నందుడిలా అనగా, అంతటన్=వెంటనే, మునిశిష్యుఁడు=గౌతముని శిష్యుడైన ఆ భిక్షువు,

అనాదరసూచక=గౌరవం తగ్గినట్లుగా, మందహాస=కొరనవ్వుతో, మండన= అలంకరింపబడి, వికసత్=విచ్చిన, కపోలుఁ దయి=చెక్కిళ్ళుగలవాడై, దగ్గఱి=దగ్గరకు వచ్చి, నందునికేల్=అలా మొండికేస్తున్న క్రొత్తభిక్షువు చేతిని, గ్రహించి=తనచేతిలోనికి తీసికొని, ఇట్లనెన్=ఇలా బుజ్జగించాడు. కుమారక=నందకుమారా! కడుబేలవై=బాగా అమాయకుడవైనందున, ఎఱుఁగవైతి=ఇందలి తత్త్వం అర్థంచేసికోలేకపోతున్నావు, మనకు= మనవంటి తెలియనివారికి, ఎంతవారికిన్=అంతా మాకు తెలుసును అనుకొనేవారికి, సుప్రసన్నతాఖని=శుద్ధతత్వానికి నిధివంటివాడైన, గురున్=పూజ్యుని, ఆనతిన్=ఆజ్ఞ ప్రకారం, నడవఁగావలదే=ప్రవర్తించవద్దా?

**తాత్పర్యం:** *నందుడిలా అన్నవెంటనే బుద్ధుని శిష్యుడైన ఆ భిక్షువు అలక్ష్యమైన మందహాసంతో అరవిచ్చిన చెకిళ్ళతో దగ్గరకు వచ్చి నందకుమారుని చేతిని పుచ్చుకొని బుజ్జగించాడిలా... రాజకుమారా! నీవు ఆశ్రమానికి క్రొత్తవాడవు. నీలోని పూర్వపువాసనలు బలీయమైనవి. అమాయకుడవు కాబట్టి ఈ బుద్ధతత్వం నీకర్థం కావడంలేదు. మనలాంటి తెలియనివారికి, అంతా తెలుసుననుకొనేవారికి సంపూర్ణ శుద్ధత్వానికి నిధివంటి పూజ్యుని ఆజ్ఞ పాటించాల్సి ఉంటుందిగదా?*

**ఎంతటి భాగ్యశాలివొ కదే! మహనీయుఁడు, లోకపూజ్యుఁడౌ**
**నంతటివాని సోదరుఁడ వౌటయు, ధర్మమునందుఁగూడ నీ**
**వంతును బంచుకోవలసివచ్చుటయుం దలపోసి చూడుమా!**
**పంతముదారిఁ బోవక శివమ్మగు ధర్మపథమ్ము ద్రొక్కుమా!**

**అర్థాలు:** మహనీయుఁడు=మిక్కిలిగొప్పవాడు, లోకపూజ్యుఁడౌ=ప్రపంచానికే పూజనీయుడైన, అంతటివాని= అంతటి మహాత్మునికి, సోదరుఁడవౌటయు=తమ్ముడై పుట్టడానికి, ఎంతటి భాగ్యశాలివొకదే=ఎంత అదృష్టం చేసికొన్నావోకదా! ధర్మమునందున్=వారు సిద్ధింపజేసికొని ప్రచారంచేసే ధర్మంలోకూడా, నీవంతును=తమ్ముడుగా నీ భాగాన్ని, పంచుకోవలసి వచ్చుటయున్=అర్థంలోనే కాదు ధర్మంలోనూ నీవంతు పంచుకోవలసిరావడాన్ని, తలపోసి= మనసులో తర్కించి, చూడుమా=ఆలోచించు, పంతముదారిన్=మొండి పట్టుదలకు, పోవక= పోకుండా, శివమ్మగు=అందరికీ శుభకరమైన, ధర్మపథమ్ము=న్యాయమైన దారిన, ద్రొక్కుమా=నడిచిచూడు!

**తాత్పర్యం:** *లోకపూజ్యుడు, గొప్పవాడు అయిన అంతటి మహాత్మునికి తమ్ముడివై పుట్టావు. ఎంతటి అదృష్టం చేసికొంటే ఈ భాగ్యం లభిస్తుంది! లోకంలో అన్నదమ్ములు ఆస్తుల్ని పంచుకోవడం ఆనవాయితీ కదా! అలాగే నీవు మీ అన్నగారు సిద్ధింపజేసికొన్న అత్యున్నత ధర్మమనే ఆస్తిని పంచుకోవడానికి తగినవాడవు. ఆవిధంగా ఆలోచించిచూడు. నీకు చేతనైనంత వరకు ఆ ధర్మప్రచారంలో పాలుపంచుకో. ఇప్పటివరకు నీవనుభవించినవన్నీ క్షణికాలు. శాశ్వతమైన సంపద ఇది. మొండిపట్టుదలకు పోకుండా అందరికీ శుభకరమైన ఈ దారిలో ప్రయాణంచెయ్యి.*

**అంచు సరగునఁ గావికట్టించు టాది**
**ధర్మదీక్షాప్రవేశ తంత్రమ్ములెల్ల**
**నడపి నవమన్మథాకారు నందసుతుని**
**క్షణములో భిక్షుమాత్రుగా సల్పుచుండ.**

**అర్థాలు:** అంచు=అంటూ, సరగునన్=తొందరగా, కావికట్టించుటాది=కషాయవస్త్రాలు కట్టించడంవంటి, ధర్మదీక్షాప్రవేశ=బౌద్ధసన్యాసిని చేసే, తంత్రమ్ములెల్ల=తంతులన్నీ, నడపి= పూర్తిచేసి, నవమన్మథాకారు=అందగాడైన, నందసుతుని=నందకుమారుని, క్షణములో=ఒక్కసారిగా, భిక్షుమాత్రుగా=సన్యాసిగా, సల్పుచుండ=చేస్తూంటే...

**తాత్పర్యం:** *ఇలా అంటూ తొందరతొందరగా కాషాయం కట్టించడంవంటి సన్యాసతంతులు జరుపుతూ అందగాడైన నందుని ఒక్కసారిగా సన్యాసిని చేస్తూంటే...*

**సుడివెట్టి లోఁగొను నడిసంద్రపుఁ దుపాను**
**గడవనీఁదెడి యీతగానివోలెఁ**
**గలయ నల్దెసఁ బన్ను వలఁ జిక్కి బయటికి**
**నుఱికిపాఱఁ దలంచు నుడుతవోలె**
**అసమయాగతులైన యమకింకరుల బారిఁ**
**బడక దాఁగఁగ జూచు ప్రాణమువలె**
**భయదవృత్తాంత దుస్స్వప్నంబునుండి మే**
**ల్కొనలేక కలఁగెడి మనసువోలె**

**భిక్షుమండలిచేఁ జిక్కి, పెనఁగులాడి,**
**వేఁడుకొని, బిట్టుగా విలపించి, కసరి,**
**విసిరి, చేష్టలుదక్కి, సొమ్మసిలి వ్రాలి**
**సుందరీ ప్రాణధనము భిక్షులకు దక్కె.**

**అర్థాలు:** సుడివెట్టి=సుడులుతిరుగుతూ, లోఁగొను=తనలోకిలాక్కొనే, నడిసంద్రపున్= నడిసముద్రంలోని, తుపాను=గాలివానను, కడవనీఁదెడి=దాటాలని ఈదే, ఈతగానివోలెన్=ఈతగాడివలె, కలయ=పెనగులాడటానికి, నల్దెసన్పన్ను=నాలుగుదిక్కులా సిద్ధపరచిన, వలన్చిక్కి=వలలోపడి, బయటికిన్=బయటపడటానికి, ఉఱికి పాఱన్=పారిపోవాలని, తలంచున్=అనుకొనే, ఉడుతవోలె=ఉడుతపిల్లలా, అసమయాగతులైన= అకాలంలోవచ్చే, యమకింకరుల=యమభటులకు, బారిన్బడక=చిక్కకుండా, దాఁగఁగజూచు=దాక్కోవాలనుకొనే, ప్రాణమువలె= జీవునిలా, భయదవృత్తాంత=భయంకరమైన, దుస్స్వప్నంబునుండి=చెడ్డకలనుండి, మేల్కొనలేక= బయటపడలేక, కలఁగెడి=తెరలే, మనసువోలె=మనస్సులా, భిక్షుమండలిచేఁజిక్కి=సన్యాసులకుదొరికి, పెనఁగులాడి=గింజుకొని, వేఁడుకొని=ప్రార్థించి, బిట్టుగా విలపించి=పెద్దగా ఏడ్చి, కసరి=కోపించి, విసిరి=దెబ్బలాడి, చేష్టలుదక్కి=చివరకు

ఏమీచేయలేక, సొమ్మసిలి=మూర్ఛిల్లి, వ్రాలి=పడిపోయి, సుందరీ ప్రాణధనము=సుందరి సర్వస్వమైన నందుడు, భిక్షులకుదక్కె=సన్యాసుల స్వంతమైపోయాడు.

**తాత్పర్యం:** *నడిసముద్రంలో తుపాను నీటిసుడులనుండి బయటపడాలనుకొనే ఈతగాడిలా, నాలుగువైపులా పన్నిన వలలోపడి పారిపోవాలనుకొనే ఉడుతలా, అనుకోకుండా వచ్చిన యమభటులనుండి తప్పించుకోవాలనుకొనే జీవుడిలా, భయంకరమైన కలలోచిక్కి మేలు కోవాలని ప్రయత్నించే మనసులా, సన్యాసులకుదొరికి గింజుకొని, ప్రార్థించి, ఏడ్చి, కసరి, విసరి, సొమ్మసిలి పడిపోయిన నందుడు చివరికి సన్యాసిగా మారిపోయాడు.*

ఇది

తృతీయసర్గము

# నిరీక్షణము

**అంకమునఁ బుట్టు రత్నము నవధరించి**
**మురియు బంగారమును వేఱుపఱచి, పుటము**
**వెట్టి, తన్మణి సానపైఁ బెట్టి, యట్టు**
**లొరయుచుంటి వేభూష చేయుదువొకాని!**

**అర్థాలు:** అంకమునన్=ఆభరణంలోని, పుట్టురత్నమున్=సహజమణిని, అవధరించి=చూచి, మురియు= కులికే, బంగారమును=పసిడిభాగాన్ని, వేఱుపఱచి=విడదీసి, పుటమువెట్టి= కాల్చి కాంతివంతంచేసి, తన్మణి= అందులోని రత్నాన్ని, సానపైన్ పెట్టి=మెరుగురాతిమీదపెట్టి, అట్టుల=ఆవిధంగా, ఒరయుచుంటివి= అరగ దీస్తున్నావు, ఏభూష చేయుదువొకాని=చివరికి ఎటువంటి ఆభరణం తయారుచేస్తావో!

**తాత్పర్యం:** *ఈ పద్యం ఈసర్గకు నాందీపద్యంగా భావించవచ్చు. భౌతికంగా ఆనంద పడుతున్న తనతమ్ముడు నందుణ్ణి అధిభౌతిక మార్గంలో ఆనందింపజేయాలని బుద్ధుని తపన. అందుకతని ఆశ్రమాన్ని మారుస్తున్నాడు. అదెలా ఉందంటే ఒక ఆభరణాన్ని తీసికొని అందులోని బంగారాన్ని రత్నాన్ని వేరుచేసి బంగారాన్ని పుటంపెట్టి శుద్ధిచేసి, పుట్టురత్నాన్ని సానపట్టి మెరుగుపెట్టి మళ్ళీ ఉన్నతమైన ఆభరణాన్ని చేయబోతున్నట్లుంది. నందుడికి పుట్టుకతో వచ్చిన భౌతికవాంఛలు సహజంగానే ఉన్నాయి. అందుకే పుట్టురత్నం అన్నాడు. ఇప్పుడు దానికి సానపెడుతున్నాడు. అతనిలో ఆధ్యాత్మికత నింపబోతున్నాడు. ఎటువంటి ఆభరణం తయారుకాబోతుందో మరి! ముందటి ఆభరణం ధరించిన సుందరి పరిస్థితి చూడండి ఇప్పుడు...*

**ఆగతి నందసుందరు మహాముని లోఁగొనిపోకయున్ మొదల్**
**గాఁ గడచన్న కార్యము లొకండు నెఱుంగని బాల, నాథు ప్ర**
**త్యాగమనప్రతీక్ష నట హర్మ్యగవాక్ష గతాననాబ్జయై**
**సోగలు తీఁగలై మలయుచూపులు చూచుచు నిల్చె దిక్కులన్.**

**అర్థాలు:** ఆగతి=ఆవిధంగా, నందసుందరు=నందకుమారుని, మహాముని=ముని అయిన బుద్ధుడు, లోఁ

గొనిపోకయున్=లొంగదీసికొని పోవడం, మొదల్ కాన్=మొదలుగాగల, కడచన్న కార్యములు=ఇక్కడ జరిగిన పనులు, ఒకండును=ఒక్కటి అయినా, ఎఱుంగనిబాల= తెలియని సుందరి, నాథు=తన్నువీడి వెళ్ళిన భర్తయొక్క ప్రత్యాగమన ప్రతీక్షన్=తిరిగివస్తాడని ఎదురుచూస్తూ, అట=తానున్నచోట, హర్మ్యగవాక్షగత=మేడ కిటికీలమధ్య, ఆననాబ్జయై= కన్నీటితో తడిచిన ముఖంతో, సోగలు తీఁగలై=పొడవైన తీవలుగా, మలయు=అల్లుకుంటున్న, చూపులు=ఎదురుచూపులతో, దిక్కులన్=అన్నివైపులా, చూచుచు= గమనిస్తూ, నిల్చె=నిలబడింది.

**తాత్పర్యం:** *ఈ విధంగా నందుని బుద్ధుడు తనతో తీసికెళ్ళడం, దీక్ష ఇప్పించడం మొదలైన పనులు ఏవీ అక్కడ సుందరికి తెలియవుకదా! పాపం, తనభర్త ఇంకా తిరిగివస్తాడని ఎదురుచూస్తోంది. ముఖమంతా విరహంచేత కన్నీటితో తడవగా మేడకిటికీలనుండి దీర్ఘములైన చూపులు నలుదిక్కులా అల్లుకుంటూంటే ఎటునుండి వస్తాడోనని అన్నివైపులా కలయ జూస్తోంది.*

**ఈదారిఁ జూచుఁ బదపడి**
**యాదారిం జూచుఁ, గలయ నంతటఁ జూచున్,**
**'గా' దను, 'నగునా' యనుఁ 'గా**
**నీ! దండింపకయె విడుతునే యితని' ననున్.**

**అర్థాలు:** ఈదారిన్=ఈవైపునిండి వచ్చే మార్గంలో వస్తాడేమోనని, చూచున్=చూస్తుంది, పదపడి=తర్వాత, ఆదారిన్చూచున్=అటువైపునుంచి వచ్చేదారిని చూస్తుంది, అంతటన్= అన్నివైపులా, కలయన్చూచున్= పరిశీలించి చూస్తుంది, కాదు+అనున్=ఎవరినోచూచి కాదనుకొంటుంది, అగునా=ఇతడేమో, అనున్= అనుకొంటుంది, కానీ=కాదనితెలిసాక రానీ, ఇతనిన్=ఇతడు రాకపోతాడా! వచ్చినతరువాత, దండింపకయె విడుతునే=శిక్షవేయకుండా వదిలిపెదతానా, అనున్=అని తలపోస్తుంది.

తాత్పర్యం: ఆ కిటికీలనుండి ఈవైపు ఆవైపు అన్నివైపులకు చూపులు కలయత్రిప్పుతుంది. వచ్చేవారినిచూచి అతడుకాదు, ఇతడేమో ఉహుకాదు, రానీ వచ్చాక దండింపకుండా వదిలి పెడతానా... అనుకొంటుందామె.

**తన వెనుకవచ్చి నిల్చెనొ**
**యనుకొని వెనుదిరిగి చూచు నాసమెయిన్, జ**
**య్యన మఱి వీధులదెసఁ గనుఁ**
**గొనుఁ, దాఁ దన నీడ చూచుకొని యుల్కిపడున్.**

**అర్థాలు:** తనవెనుకవచ్చి=తనకు వెనుకగా వచ్చి, నిల్చెనొ=నిలబడ్డాడో ఏమో, అనుకొని= అనిభావించి, ఆసమెయిన్=ఎంతో ఆశతో, వెనుదిరిగి చూచున్=వెనక్కితిరిగి చూస్తుంది, చయ్యన=వెంటనే, మఱి=మళ్ళీ, వీధులదెసన్=వచ్చిపోయే దారులవైపుకు, కనుగొనున్= తనదృష్టి త్రిప్పుతుంది, తాన్=ఆమె, తననీడ=తనక్రింది నీడను, చూచుకొని=ఉండీవుండీ చూచుకొని, ఉల్కిపడున్=ఉలికిపడుతుంది.

**తాత్పర్యం:** *ఇలా దిక్కులన్నీ కలయజూస్తూ మధ్యమధ్యలో ఒక్కోసారి ఏమో తనప్రియుడు తనవెనకనే నిలబడి ఆటపట్టిస్తున్నాడేమో అనుకొంటూ ఆమె ఆశతో వెనక్కి తిరుగుతుంది. అక్కడ ఉండడు. అరెరె... చూపుమరల్చానే అనుకొంటూ వెంటనే ముందుకు తిరుగుతుంది. దారులన్నీ కలయజూస్తుంది. ఈలోపల ఆమెనీడ కనిపిస్తుంది. అదిచూచి ఉలిక్కిపడుతుంది.*

**తడవుగ నిట్లు నిల్చి, ప్రియుదర్శనభాగ్యము లేమిఁజేసి మ**
**ల్లడిగొని దండడించెడి తలంపులు సత్తువ డిందుసేయ నా**
**పడఁతుక నిల్వలేక నునుఁబాన్పున వ్రాల్చెఁ దపించుమేను; క్రూ**
**రుఁడుగద మారుఁ; డాతనికిఁ గ్రోధుఁడు తోడఁట, యేమి సెప్పుదున్!**

**అర్థాలు:** తడవుగన్=చాలాసేపు, ఇట్లునిల్చి=ఈ విధంగానిలబడి, ప్రియుదర్శనభాగ్యము= తననాథుని చూచేభాగ్యం, లేమిన్‌చేసి=లేకపోవడంచేత, మల్లడిగొని=దుఃఖపడి, దండడించెడి=మరీ ఎక్కువయ్యే, తలంపులు= రకరకాల ఆలోచనలు, సత్తువ=తనలోని బలాన్ని, డిందుసేయన్=తగ్గించగా, ఆ పడఁతుక=ఆ సుందరి, నిల్వలేక= ఇక నిలబడలేక, తపించుమేను=విరహంతో వేగిపోతున్న తనశరీరాన్ని, నునుఁబాన్పున=మెత్తటి పాన్పుమీద, వ్రాల్చె=పడేసింది, మారుఁడు=కాముడు, క్రూరుఁడుగద=దయలేనివాడుకదా, ఆతనికిన్= అతగానికింకా, క్రోధుఁడు=కోపం, తోడఁట=స్నేహితుడట, ఏమిసెప్పుదున్=ఇద్దరూ కలిస్తే ఇంకేముంది!

**తాత్పర్యం:** *ఇలా చాలాసేపు నిలబడి ఇక తననాథుడు రాడని దుఃఖపడి రకరాల ఆలోచనలు ఎక్కువై నీరసపడిపోయిందామె. ఇక నిలబడలేకపోయింది. విరహంతో వేగిపోతూన్న తన శరీరాన్ని ప్రక్కమీద పడేసింది. అసలే దయలేనివాడు మన్మథుడు. అతనికి కోపం తోడు. తాపం మరీ ఎక్కువైతే కోపంరావడం సహజంకదా! ఇక ఇద్దరూ ఆవేశిస్తే ఏం చెప్పాలి!*

**కాంతుండు మేలేర్చి కబరీభరమ్మునఁ**
**జెరివిన క్రొన్ననల్ చెదిరిరాల**
**ముప్పేట రతనాలు పోహళించిన కంఠ**
**హారాలు చిక్కులువాతి పెనఁగ**
**దారమ్ము తెగిన ముత్యాలకోవయుఁబోలె**
**బొటబొట కన్నీటిబొట్టు లురుల**
**నావిదేఱుచు స్విన్నమౌ మోము పరితప్త**
**హృదయస్వభావమ్ము నెఱుఁగఁజేయఁ**
**దళుకు మొగమలు సమ్మాళిగలు పదమ్ము**
**లందు నిల్వక జాతి వ్రేలాడుచుండ**

**నొడలు తెలిసియుఁ దెలియని యునికి దోఁప**
**నడ్డముగ వ్రాలె బాల పర్యంకడోల.**

**అర్థాలు:** కాంతుండు=ప్రియుడైన నందుడు, కబరీభరమ్మునన్=కొప్పులో, మేలేర్చి=మంచివి ఏరి, చెరివిన=తుఱిమిన, క్రొన్ననల్=క్రొత్తపూలు, చెదిరిరాల=క్రిందపడిపోగా, రతనాలు= మణిమాణిక్యాలు, పోహళించిన= పొదిగిన, ముప్పేట=మూడేసి వరుసల, కంఠహారాలు= మెడలోనిగొలుసులు, చిక్కులువాఱి= చిక్కులుపడిపోయి, పెనఁగ=ముళ్ళుపడగా, దారమ్ము తెగిన=మధ్యలోని దారంతెగిపోయిన, ముత్యాలకోవయున్ పోలె=ముత్యాలు కూర్చినదండలాగా, బొటబొట=ఒక్కొక్కటిగా, కన్నీటిబొట్టులు=బాష్పబిందువులు, ఉరలన్=జారి పడుతూండగా, ఆవి=ఊపిరితీసికోవడంలో, తేఱుచు=తెప్పరిలుతూ, స్విన్నమౌ=చెమటతో తడిచిన, మోము= ముఖం, పరితప్త= విరహంతో తపించిపోతున్న, హృదయస్వభావమ్మున్= గుండె పరిస్థితిని, ఎఱుఁగఁజేయన్= ప్రకటిస్తూండగా, తళుకు=మెరిసిపోయే, మొగమలు= మెత్తని, సమ్మాళిగలు=పావకోళ్ళు, జాఱి=జారిపోయి, వ్రేలాడుచుండన్=వేలాడబడుతూండగా, ఒడలు=తనశరీరం, తెలిసియున్ తెలియని=ఉందోలేదో తెలియని, ఉనికి=స్థితి, తోఁపన్=పొడగడుతూండగా, బాల=ఆ సుందరి, పర్యంకడోల=మెత్తని పరుపుపైన, అడ్డముగ వ్రాలె=అడ్డంగా పడిపోయింది.

**తాత్పర్యం:** *ఆమె భర్త ప్రేమతో కొప్పులో తురిమిన మేలైనపూలు క్రిందరాలిపోతూండగా, రత్నాలుపొదిగిన మూడేసి వరుసల కంఠాభరణాలు చిక్కులుపడిపోతూండగా, దారం తెగిపోయిన ముత్యాలదండలాగా కన్నీటిబొట్లు ఒక్కొక్కటే జారిపడుతూండగా, వేడి నిట్టూర్పుల నుండి తెప్పరిలిన ముఖం చెమటపట్టి ఆమె హృదయస్థితిని తెలియజేస్తూండగా, మెరిసిపోయే మొగమలు కాలిజోళ్ళు జారివ్రేలాడుతూండగా, తెలిసీతెలియని శరీరంతో సుందరి మెత్తని పరుపుమీద అడ్డంగా పడిపోయింది.*

**'హా' యనె బాలామణి, 'య**
**క్కా' యనె రాచిల్క కొదమ, కలఁతపడి యెదిన్**
**జేయఁగఁ జేయాడక 'యే**
**మే?' యనెఁ జెలికత్తె యొకతె యింకొక చెలితోన్.**

**అర్థాలు:** బాలామణి=ఆ పిన్నది సుందరి, 'హా' యనె=హా అని నిట్టూర్చింది. రాచిల్కకొదమ= ఆమె పెంపుడు చిలుక, అక్కా యనె=ఏమే అక్కా అంది, చెలికత్తె యొకతె=ఒక చెలికత్తె, కలఁతపడి=తమచెలి అన్యమనస్కంగా ఉంటే తనమనసు బాగాలేక, ఎదిన్=ఏమీ, చేయఁగన్=చేయడానికి, చేయాడక=చేతులు సహకరించక, ఇంకొక= అక్కడున్న మరొకచెలికత్తెతో, ఏమేయనె=ఇప్పుడు ఏమి చేద్దామే అంటోంది.

**తాత్పర్యం:** *ఆ బాలామణి సుందరి విరహం భరించలేక హా అంటూ నిట్టూర్చింది. ఆమె ప్రక్కనే ఉన్న ఆమె పెంపుడుచిలుక ఏమే అక్కా అంటూ ప్రతిస్పందించింది. ఈ పరిస్థితి చూచి కలతపడ్డ ఒక చెలికత్తె ఏమిచేయడానికీ చేతులాడక తోడి చెలికత్తెను పిలిచి ఏమే ఇప్పుడు ఏమిచేయాలి అని అడుగుతోంది.*

**సింగారమ్ముల నెల వా**
**బంగారపుబొమ్మ యిట్టిపాటు పడఁగ, స**
**ర్వాంగీణమ్ముగ నగరున**
**మాంగల్యము వాసి, మసకమసకలు గ్రమ్మెన్.**

**అర్థాలు:** సింగారమ్ముల=అందమైన అలంకారాలకు, నెలవు=చోటైన, ఆ బంగారపుబొమ్మ= బంగారంలాంటి శృంగారాల విలువలుగల ఆ సుందరి, ఇట్టిపాటు పడఁగ=చలాకీగా నవ్వుతూ నవ్విస్తూ తుళ్ళిపడాల్సిన ప్రాయంలో ఇలా విరహంతో నీరసించి మంచంమీద పడిపోగా, నగరున=ఆ నగరంలో, సర్వాంగీణమ్ముగ=అన్ని అవయవాలకు సంబంధించిన, మాంగల్యము=మంగళకరాలైన అంగరాగాదులను, వాసి=ఎవరూ ఏవీ ధరించకపోవడంతో, మసకమసకలు=ఏమాత్రం వెలుగులులేక విచారమనే చీకట్లు, క్రమ్మెన్=ముసురుకున్నాయి.

**తాత్పర్యం:** *ఊరిలో మహారాణి, అన్ని అలంకారాలకు కేంద్రమై అందరిచూపులకు ఒక లక్ష్యమైన బంగారంవంటి సుందరాంగి సుందరి ఈ విధంగా ప్రియునికోల్పోయి విరహంతో బాధపడుతూంటే ఆ పట్టణం పట్టణం అంతా అన్నరంగాలలోను కాంతులు గోల్పోయి మంగళకరమైన కళలుబాసి అమావాస్య చంద్రుడిలాగా నల్లమబ్బేసి పోయాడు. నగరమంతా సుందరి లాగానే నీరసించి పడిపోయింది.*

**కళలకునెల్లఁ బాసి కొడిగట్టిన దీపమువోలె నున్న యా**
**నిలయమునందు నిల్చుటకు నెమ్మది గొల్పక తత్తఱమ్మునన్**
**జెలియ యొకర్తు, 'రాకొమరు నిక్కువ మారసివత్తు' నంచుఁ దొ**
**ట్రిలు పద మూఁది నిల్పికొని డిగ్గెను సౌధము మెట్ల వెంబడిన్.**

**అర్థాలు:** చెలియ యొకర్తు=ఆమె చెలికత్తెలలో ఒకామె, కళలకునెల్లన్=అన్ని సరదాలకు, పాసి=దూరమై, కొడిగట్టిన=ఆరిపోవడానికి సిద్ధంగావున్న, దీపమువోలెన్=దివ్వెలాగా, ఉన్న= కనిపిస్తున్న, ఆ నిలయము నందున్= ఆ చీకటింటిలో, నిల్చుటకు=ఉండటానికి, నెమ్మదిగొల్పక=కుదురు కోల్పోయి, తత్తఱమ్మునన్=తడబాటుతో, రాకొమరు=రాజకుమారుడు నందుని, నిక్కువము=ఉన్నరూపును, ఆరసివత్తున్=చూసి వస్తాను, అంచున్=అని చెప్తూ, తొట్రిలుపదము=తన స్వాధీనంలోలేని తన పాదాన్ని, ఊఁది=తన ప్రయత్నంతో, నిల్పికొని=అదుపులోనికి తెచ్చుకొని, మెట్లవెంబడిన్=మేడమెట్లగుండా, సౌధము=ఆ తెల్లని భవనాన్ని, డిగ్గెను=దిగిపోయింది.

**తాత్పర్యం:** *తమచెలి అవస్థను చూచి భరించలేని ఒకచెలికత్తె ఎంతో సరదాగా ఉండే తమ మహలు ఆరిపోవడానికి సిద్ధంగావున్న దీపంలా ప్రకాశహీనంగా తయారవడం చూడలేక పోయింది. అక్కడ యింకా నిలబడలేక తత్తరపాటుతో నందుడెక్కడున్నాడో చూచివస్తానని చెప్పి తడబడే పాదాలను బలవంతాన స్వాధీనంలోనికి తెచ్చుకొని సోపానాలవెంట సౌధాన్ని దిగి వెళ్ళిపోయింది.*

**ఆ రవళి చెవులఁబడి, వి**
**ప్పారిన నెమ్మోముతోఁ జివాలున లేచెన్**
**నారీమణి, 'వచ్చెనుబో,**
**నారా' జనుకొని ప్రియమ్ము ననలెత్తంగన్.**

**అర్థాలు:** ఆ రవళి=ఆ చప్పుడు, చెవులఁబడి=వినపడి, నారీమణి=మహిళారత్నమైన సుందరి, విప్పారిన= విచ్చుకొన్న, నెమ్మోముతోన్=అందమైన ముఖంతో, చివాలున లేచెన్=ఒక్కసారిగా ఉలికిపడ్డట్టు మంచంమీదనుండి లేచింది. నారాజు=నా ప్రియుడైన నాథుడు, వచ్చెనుబో= తిరిగి వచ్చాడుకాబోలు, అనుకొని=అని భావించి, ప్రియమ్ము=తనలోని ప్రేమ, ననలెత్తంగన్= మొగ్గలు తొడగ్గా.....

**తాత్పర్యం:** *ఆ చప్పుడువిన్న సుందరి తనభర్తమాట విన్నంతనే అప్పటిదాకా భర్తనే తలచుకొంటూ పడుకొందేమో ముఖమంతా విప్పారి ఉలిక్కిపడ్డట్టు ఒక్కసారిగా లేచింది. ఏడీ నాప్రియుడు అంటూ తన నందుదేవచ్చాడని భావించి తనలోని ప్రేమ పరవళ్లు త్రొక్కగా ......*

**'ఎదురేగి బిగ్గఁగౌఁగిటఁ**
**గదియించెదఁ, నింత తడయఁగా నగునే? యం**
**చదలించెదఁ, దత్స్వాంతన**
**మృదూక్తు లాలించి యెదకుఁ దృప్తి ఘటింతున్.'**

**అర్థాలు:** ఎదురేగి=నాథునికి ఎదురు వెళ్ళి, బిగ్గన్=గట్టిగా, కౌఁగిటన్=బాహుబంధంలో, కదియించెదన్= బిగిస్తాను. ఇంత=ఇప్పటిదాకా, తడయఁగాన్=ఆలస్యం చేయడం, అగునే= నీకు తగినపనేనా, అంచు=అని కఠినమైన పదాలతో, అదలించెదన్=గద్దిస్తాను. తత్= కారణం చెప్పలేదుకదా! అప్పుడు, స్వాంతన=ఓదారుస్తూ చెప్పే, మృదూక్తుల్=మెత్తని మాటలు, ఆలించి=ఆలకిస్తూ, యెదకున్=ప్రియుని హృదయానికి, తృప్తి=ఆప్యాయాన్ని, ఘటింతున్= జతకూరుస్తాను.

**తాత్పర్యం:** *వస్తున్న నాథునికి ఎదురెళ్ళి గట్టిగా కౌగిలించుకుంటాను. ఇంతసేపు ఏం చేస్తున్నావు, ఇదేమైనా సంసారులు చేసేపనేనా అంటూ నిలబెట్టి అడిగేస్తాను. అప్పుడు ఏ కారణం చెప్తాడో చూస్తాను. ఏమి చెప్పాలో తోచక మంచిమాటలతో నన్ను ఊరడిస్తూంటే నమ్ముతున్నట్లు ఆలకించి నా ప్రియుని హృదయాన్ని ఆనందింపజేస్తాను.*

**అనుచు వేడ్కలు భావించుకొనుచుఁ గదలి,**
**యొక్కకంటను జిఱునగ వొకటఁ దెచ్చి**
**కోలుకోపమ్ము తుంపురుల్ గురియుచుండ,**
**నడుగుకంటె నెడంద ముందడుగువేయ,**

**అర్థాలు:** అనుచు=ఇలా అంటూ, వేడ్కలు=వినోదపు చేష్టలు, భావించుకొనుచున్= ఊహించుకొంటూ, కదలి=అక్కడనుండి బయలుదేరి, ఒక్కకంటను=ఒక కంటిలో, చిఱునగవు=మందహాసాన్ని, ఒకటన్= రెండవ దానిలో, తెచ్చికోలు=తెచ్చిపెట్టుకున్న, కోపమ్ము=దొంగకోపం, తుంపురుల్=దాగుడుమూతల ప్రదర్శనలు, కురియు చుండన్=వర్షంలా కనిపిస్తూంటే, అడుగుకంటెన్=ఆమెవేసే కాలి అడుగుకంటే, ఎడంద=ఆమె హృదయం, ముందడుగువేయ=ముందుగా ప్రియుని చేరాలని ఆతృతపడుతూంటే....

**తాత్పర్యం:** *ఇలా మనసులో కొన్ని వినోదపుచేష్టలు ఊహించుకొంటూ ఆమె అక్కడనుండి బయలుదేరి ఒక కంటిలో మందహాసాన్ని నింపుకొంది. మరొక కంటిలో దొంగకోపం తెచ్చిపెట్టుకొంది. అది నీటి తుంపురులు మీదపడ్డట్లుగా బయటపడీ పడనట్లుగా తన రూపాన్ని ప్రదర్శిస్తోంది. కాలి అడుగులకంటె ఆమె హృదయమే ముందునడుస్తోంది.*

**చని, సోపానతలము దెసఁ**
**గనుఁగొని, నిట్టూర్పు విడిచి గ్రక్కున మరలెన్**
**అనిలవశమ్మునఁ జని, గ**
**ట్టును డీకొని తిరిగి సుడివడు పడవరీతిన్.**

**అర్థాలు:** చని=అలా తొట్రుపాటుతో వెళ్ళి, సోపానతలము దెస=మెట్లవైపుకు, కనుగొని= చూచి, నిట్టూర్పు విడిచి=నాథుడు కనబడక దీర్ఘశ్వాసను విడిచి, అనిలవశమ్మునన్= గాలితీవ్రతకు, చని=వేగంగా ప్రయాణించి, గట్టును=ప్రవాహపుటొడ్డుకు, డీకొని=గుద్దుకొని, తిరిగి=వెనక్కి తిరిగి, సుడివడు=తిరగబడి తిరుగాడు, పడవరీతిన్= నావలాగా, గ్రక్కున=వెంటనే, మరలెన్= వెనక్కితిరిగి నీరసపడిపోయింది.

**తాత్పర్యం:** *అలా దేహం స్వాధీనంలో లేకుండా నడచి మెట్లవరుసవైపుకు ఒకసారి చూచి నాథుడురాలేదని తెలిసి మళ్ళీమోసపోయానని గ్రహించి గట్టిగా నిట్టూర్చి గాలివేగానికి కొట్టుకుపోయే నావ గట్టుకు డీకొని తిరగబడి సుడులుతిరిగే నీటిలోపడ్డట్లుగా వెంటనే వెనుదిరిగి నీరసపడిపోయింది.*

**తూలుచు సోలుచున్ మరలి, తొయ్యలి సెజ్జఁ బరుండి, మీలితో**
**న్మీలితనేత్రయై, మనసు నిల్కడలే కుపవిష్టయై, తమిన్**
**బేలతనమ్ముఁ గిన్కయును వెక్కసమై, చిగురాకువంటి కెం**
**గేల మొగమ్ము గప్పికొని కీడ్వడి యేడ్వదొడంగె వెక్కుచున్.**

**అర్థాలు:** తూలుచు=అలా తూలిపోతూ, సోలుచున్=పడిపోతూ, మరలి=తిరిగివెళ్ళిన, తొయ్యలి=ఆ లేనడుము చాన, సెజ్జన్=ప్రక్కమీద, పరుండి=పడుకుండిపోయి, మీలిత= మూసిన, ఉన్మీలిత=విచ్చుకున్న... అంటే నిలడలేని, నేత్రయై=కనులుకలదై, మనసు=అంతరంగం, నిల్కడలేక=ఒకచోట ఉండక, ఉపవిష్టయై=లేచి కూర్చొని, తమిన్=

వలపువెల్లువలో, బేలతనమ్మున్=అమాయకత్వమూ, కిన్కయును=కోపమూ, వెక్కసమై=ఎక్కువై, చిగురాకు వంటి= లేతాకులవంటి, కెంగేల=ఎఱ్ఱటి చేతులతో, మొగమ్ము=ముఖాన్ని, కప్పికొని=మూసికొని, కీడ్వడి=జీవితంలో ఓడిపోయి, వెక్కుచున్=వెక్కివెక్కి, ఏడ్వదొడంగె= విలపించసాగింది.

**తాత్పర్యం:** *అలా తూలిపోతూ పడిపోతూ తిరిగి ప్రక్కదగ్గరికి చేరిన ఆ సుందరి పరుపు మీద పడిపోయి కళ్ళు మూస్తూ తెరుస్తూ మనసంతా కలతచెంది పడుకోలేక లేచికూర్చొంది. ఆమె వలపువెల్లువలో అమాయకత్వం కొంతా చిరుకోపం కొంతా రెండూ కలిసి ఎక్కువై పోయాయి. చిగురాకులవంటి ఎఱ్ఱటిచేతులతో ముఖమంతా కప్పుకొని అన్నీ పోగొట్టుకొన్నట్లు వెక్కివెక్కి ఏడ్వసాగింది. ప్రబంధనాయికలలో ఈమె నాలుగోది అన్నమాట.*

**"మనసులో మనసు గలిపి, మాటలోన**
**మాటయును గల్పి, యొరిమయు మమత నెఱపు**
**జీవితేశ్వరుఁ డిట్లు వంచించె నన్నుఁ;**
**గలరె నాకంటె మందభాగ్యలు జగాన?**

**అర్థాలు:** మనసులో=నా మనసునందు, మనసుగలిపి=తన మనసుకలిపి... నేనాలోచించిన విధంగానే తానాలోచిస్తూ, మాటలోన=నామాటలతో, మాటయునుగల్పి=తన మాటలను కూడా కలిపి... నేనౌనన్నది తాను కాదనకుండా, ఒరిమయు=అనుకూలతనూ, మమతయున్=ప్రేమనూ, నెఱపు=వెలయించే, జీవితేశ్వరుఁడు=నా జీవితభాగస్వామి, నన్నున్=తనది అనుకొన్న నన్ను, ఇట్లు=ఈ విధంగా, వంచించె=మోసగించాడు. జగాన=ఈ ప్రపంచంలో, నాకంటె=నన్నుమించిన, మందభాగ్యలు=దురదృష్టవంతులు, కలరె=ఉన్నారా?

**తాత్పర్యం:** మనసున మనసై మాటను మాటై ఆలోచనలోను పలుకులోను ఒకటిగా ఉండి, *అనుకూలతలోనూ ప్రేమపండించడంలోనూ నాలోని తానైన నా జీవితభాగస్వామి నా నందుడు నన్నిట్లా వంచించాడంటే... ఈ ప్రపంచంలో నాకంటె దురదృష్టవంతులు ఎవరైనా ఉన్నారా?*

**'నీనయనమ్ములాన, గురునిన్ గని మ్రొక్కిడి యింతలో ననా**
**శ్యానవిశేషకమ్ము భవదాననలక్ష్మి భజింపవత్తుఁ గా**
**దా, నను నమ్ము' మంచు శపథమ్ములు పల్కిన ధర్మవృత్తికిన్**
**హానియొనర్పలేక సరియంటిని దత్ఫల మిట్టులయ్యెఁబో.**

**అర్థాలు:** నీ నయనమ్ములాన=నీ విశాలమైన నేత్రాలమీద ఒట్టు, గురునిన్=పూజ్యుడైన అన్నగారిని, కని= దర్శించి, మ్రొక్కిడి=మ్రొక్కులు చెల్లించి, ఇంతలోన్=ఇక్కడే ఉన్నట్లుగా, అనాశ్యాన=ఎండిపోని, విశేషకమ్ము= మకరికావిశేషంతోనున్న, భవత్=నీయొక్క, ఆననలక్ష్మి= సంపత్కరమైన నీ ముఖాన్ని, భజింప=సేవించడానికి, వత్తున్‌గాదా=వస్తానుకదా! నను= నీ భర్తను, నమ్ముము=నమ్మలేవా, అంచు=అని నమ్మబలుకుతూ, శపథమ్ములు=

ఒట్టులు, పల్కిన=పెడితే, ధర్మవృత్తికిన్=ఆయనచేస్తున్న మంచిపనికి, హానియొనర్పలేక=భంగపరచలేక, సరి యంటిని=సరేలే వెళ్లిరమ్మన్నాను, తత్ఫలము=దాని ఫలితం, ఇట్టులయ్యెఁబో=ఇలా అయింది చూచావా?

**తాత్పర్యం:** *నీ కళ్ళమీద ఒట్టు, వారిని దర్శించి ఇప్పుడే నీ చెక్కిళ్ళమీది మకరికలు ఆరిపోకముందే వస్తాను. నీ అందమైనమోము చూడకుండా ఉండగలనా అంటూ నమ్మబలికితే పోనీలే, ఒక మంచిపనికి అడ్డుపడటం ఎందుకులెమ్మని సరే అన్నాను. దాని ఫలితం ఇదా!*

**అది ప్రాణం బిది దేహం**
**బది దేహం బిదియె ప్రాణ మనుకొంటిని, మా**
**పదిలంపుఁ బ్రేమభంగికిఁ**
**గొదవలు వాటిల్లు టెఱిఁగికొన నైతినిగా.**

**అర్థాలు:** అది ప్రాణంబు=అక్కడున్నది ప్రాణం, ఇది దేహంబు=ఇక్కడున్నది శరీరం, అది దేహంబు=అక్కడున్నది శరీరం, ఇదియె ప్రాణము=ఇక్కడున్నదే ప్రాణం, అనుకొంటిని= అనుకున్నానుకాని, మా=మాయొక్క, పదిలంపున్= స్థిరమైన, ప్రేమభంగికిన్=వలపుసీమకు, కొదవలు వాటిల్లుట=లోపాలు ఏర్పడతాయని, ఎఱిఁగికొనన్ ఐతినిగా= తెలిసికోలేకపోయాను కదా!

**తాత్పర్యం:** *మేమిరువురం ఒకరి ప్రాణం మరొకరిదని, ఒకరి దేహం మరొకరిదనీ అనుకున్నాంకాని, మా పటిష్టమైన ప్రేమలో లోపాలు గమనించలేకపోయాను సుమా!*

**సాధుతాసుందరమ్మగు నాథు వర్త**
**నమ్ము కపటమ్ముగా నేను నమ్మఁజాల,**
**నాత్మకున్ నీడయైన ప్రేయసిని మఱచి**
**యొండుచో నిల్చుటన్ నమ్మకుండఁజాల.**

**అర్థాలు:** సాధుత=మంచితనం అనే సుగుణంచేత, సుందరమ్మగు=అందమైన, నాథు=నా భర్తయొక్క, వర్తనమ్ము= నడవడిని, కపటమ్ముగా=మోసమని, నేను నమ్మఁజాలన్=నేను ఒప్పుకోలేను, ఆత్మకున్=తన అంతరంగానికి, నీడయైన=ఆశ్రయమైన, ప్రేయసిని=ప్రియురాలనైన నన్ను, మఱచి=విస్మరించి, ఒండుచో=మరొకచోట, నిల్చుటన్= ఉండిపోవడం, నమ్మకుండఁజాల=నమ్మకుండా ఉండలేను.

**తాత్పర్యం:** *సాధుసుందరమైన భర్త నడవడిని మోసమని ఒప్పుకోలేను. కాని, తననే నమ్ముకొన్న ప్రియురాల్ని నన్ను విడిచి ఒకచోట ఉండిపోవడం నమ్మకుండా ఉండలేను.*

**మచ్చలేని చందమామసోయగమును**
**ధిక్కరించు మోముతీరు గాంచి,**
**మరులుగొల్పి చెట్టమాయలు పచరించి,**
**యెవతె యాఁచికొనెనొ యిల్లుసేర్చి?**

**అర్థాలు:** మచ్చలేని=మరకలేని, చందమామసోయగమును=చంద్రునివంటి ముఖాన్ని, ధిక్కరించు=నిరసించే, మోముతీరుగాంచి=నాథునిముఖాన్ని చూచి, యెవతె=ఏ మాయలాడి, చెట్టమాయలు పచరించి=మాయహొయలు చూపించి, మరులుగొల్పి=వలపు కురిపించి, ఇల్లుసేర్చి=ఇంటికితీసికెళ్ళి, ఆఁచికొనెనొ=లొంగదీసికొందో?

**తాత్పర్యం:** *మచ్చలేని నానాథుని ముఖాన్నిచూచి ఏ మాయలాడి హొయలుకురిపించి ప్రేమలోపడేసి లొంగదీసికొని ఇంటకట్టేసుకుందోగదా?*

**ఆ రసభావ మానెనరు లామురిపమ్ములు నట్టిసుద్దు లా**
**తేరిన పొంకముల్ కళలుతేరిన కూర్మలు కుస్తరింపు లా**
**గారము లెల్లఁబోయి, పెఱకాంతకుఁ జిక్కుటయైనచో, నమ**
**స్కార మొనర్పఁజెల్లెడినిగాక, మఱేమనఁ జంచలాత్మునిన్!**

**అర్థాలు:** ఆ రసభావము=ఆ ప్రేమతత్త్వం, ఆ నెనరులు=ఆ దయావీక్షణాలు, ఆ మురిపమ్ములున్=ఆ లాలనలు, అట్టిసుద్దులు=అటువంటి మంచిమాటలు, ఆ తేరిన పొంకముల్=ఆ బిగువులు, కళలు తేరిన కూర్మలు=నిండు స్నేహాలు, కుస్తరింపులు= ఓదార్పులు, ఆ గారములు=ఆ ఇష్టాలు, ఎల్లఁబోయి=అన్నీమాయమై, పెఱకాంతకున్= పరాయిసుందరికి, చిక్కుటయైనచో=దొరికిపోవడమే నిజమైతే, నమస్కారము=చేతులుజోడించడమొక్కటే, ఒనర్పన్=చేయడం, చెల్లెడినిగాక=కుదురుతుంది గాని, చంచలాత్మునిన్=మనసుమారేవానిని, మఱేమనన్= ఇంకేమంటాను?

**తాత్పర్యం:** *ఆ ప్రేమభావాలు, ఆ కరుణనిండినచూపులు, ఆ లాలనలు, మంచి మంచి మాటలు, ఆ బిగువులు, నిండునెయ్యాలు, ఓదార్పులు, గారాలు అన్నీ మాయమైపోయి పరాయికాంత వలలోపడ్డాడంటే ఒకనమస్కారంపెట్టడం తప్ప ఆచంచలాత్మునేమనగలం?*

**అవికలమ్మును నద్వితీయమ్మునైన**
**ప్రణయపరతత్త్వవిదుఁడు నా ప్రాణవిభుఁడు**
**వాని చిత్త మ్మెఱింగియు, లేని పాప**
**శంకఁ దడవితి నెంత దోసమ్ము కలిగె.**

**అర్థాలు:** అవికలమ్మును=చెదిరిపోని, అద్వితీయమ్మునైన=సాటిలేనిదైన, ప్రణయ=ప్రేమకు, పరతత్త్వవిదుఁ డు=అంతులుచూచినవాడు, నా ప్రాణవిభుఁడు=నాప్రాణమైన భర్త, వాని=అటువంటివాని, చిత్తమ్ము ఎఱింగియు= మనసుతెలిసికూడా, లేనిపాపశంకన్=దోషం లేకపోయినా అనుమానంతో, తడవితి=ఏవేవో అనేసాను, ఎంత దోసమ్ము కలిగె=నాకు ఎంతపాపం తగిలిందోకదా!

**తాత్పర్యం:** *చెక్కుచెదరని ప్రేమకు ప్రతిరూపం నా ప్రాణంలో ప్రాణమైన నా భర్త. అతని మనసు తెలిసికూడా లేనిపాపం అంటకట్టి ఏవేవోఅనేసాను. ఎంత పాపం!*

**కిసలయకోమలున్ మొరటు కీల్జడ(వేటుల నొవ్వఁజేసితిన్,**
**విసువు జనించునట్లు తమివేళఁ బరాన్ముఖనైతి, నిట్టివే**
**దొసఁగుల నెన్ని చేసితినొ! తోడనె తత్ఫల మిట్లు పండి (ప్రా**
**ణసఖు వియోగరూపమున న న్నెరియించెడు నేమి సేయుదున్.**

**అర్థాలు:** కిసలయకోమలున్=చివురులవంటి మెత్తని దేహం కలవానిని, మొరటు=కఠినమైన, కీల్జడ=మెలి(త్రిప్పిన కేశపాశాల, (వేటులన్=దెబ్బలతో, నొవ్వన్ చేసితిన్=బాధపెట్టాను, తమివేళన్=శృంగారసమయాలలో, విసువు జనించునట్లు=విసుగు పుట్టేటట్లు, పరాన్ముఖన్ ఐతిని=ముఖం (త్రిప్పుకున్నాను. ఇట్టివే=ఇలాగే అనేకాలైన, దొసఁగులన్=తప్పుల్ని, ఎన్ని చేసితినొ=ఎన్నిచేసానో! తోడనె=చేసినవెంటనే, తత్ఫలము=వాని ఫలితం, ఇట్లు=ఈ విధంగా, పండి=పక్వానికొచ్చి, (ప్రాణసఖు=జీవనసహచరుని, వియోగరూపమున=దూరంచేసే రూపంలో, నన్ను= ఈ పాపాత్మురాలిని, ఎరియించెడున్= దహించివేస్తోంది, ఏమిసేయుదున్=ఇప్పుడు నేనేంచేయాలి?

**తాత్పర్యం:** *ముట్టుకుంటే కందిపోయే నాథుని గట్టిజడతో కొట్టిబాధించాను. కామంతో ఆవురావురుమంటున్న వేళ ముఖం(త్రిప్పుకొని విసుగుపుట్టించాను. ఇలా ఎన్ని తప్పులు చేసానో! దానిఫలితమే ఈ ఎడబాటు. నన్ను దహించివేస్తోంది. ఇప్పుడేంచేయాలి?*

**జంకెన చూపులు నూరక**
**మంకుతనమ్ములును దురభిమానపు బిగియున్**
**వంకరసేఁతలుఁ, బలుకన్**
**సుంకము వేఁడుటలు నెన్ని చోద్యము లకటా!**

**అర్థాలు:** జంకెనచూపులున్=బెదిరించే చూపులు, ఊరక=ఏ ఉపయోగం లేకుండానే, మంకుతనమ్ములును= మొండికేయడాలు, దురభిమానపు=తెచ్చిపెట్టుకున్న, బిగియున్= పొగరుబోతుతనం, వంకరసేఁతలున్=అర్థంలేని వికారపు చేష్టలు, పలుకన్=మాట్లాడమంటే, సుంకము=కప్పాలు, వేఁడుటలున్=కోరటాలు మొదలైనవి, ఎన్ని= ఈవిధంగా మరెన్ని విధాలుగా, చోద్యములు=చి(త్రాలు జరిగాయో! అకటా=అయ్యో.

**తాత్పర్యం:** *చూపులచేత బెదిరించాను, అర్థంలేకుండా ఏవో కారణాలతో మొండికేసాను, కారణం లేకుండానే బెట్టుచేసాను, చిలిపిగా కొట్లాడాను, మాట్లాడమంటే మాటిమాటికీ కానుకలు కొసిరాను... ఇలా మామూలుగా ఉన్నప్పుడు ఎన్నేసి చి(త్రాలు చేసానో... అయ్యో! నా నాథుని, నా (ప్రియాతి (ప్రియనాథుని ఎంతగా విసిగించానో కదా! నాకిలాంటి వియోగం జరగాల్సిందే...*

**పంతముఁ బూననంచుఁ, బదపద్మములం బడి వేఁడికొందు నా**
**కాంతుని నామనోనయనకాంతుని నంగజసార్వభౌము సా**
**మంతుని దోడితేఁగదరె! మాడలు మాన్యము లిచ్చి మిమ్ము మె**
**ప్పింతును, వేయునేల మఱపింతును మీ పరిచారికాత్వమున్.**

**అర్థాలు:** పంతమున్=పట్టుదలను, పూననంచున్=ఇకపైన పట్టనని, నాకాంతుని=నా భర్తయొక్క పదపద్మములన్ పడి=మెత్తని పాదాలపైనపడి, వేఁడికొందు=తప్పు మన్నించమని ప్రార్థిస్తాను, నామనోనయన=నా కోరికల కళ్ళకు, కాంతునిన్=వెలుగై దారిచూపువాడిని, అంగజసార్వభౌము=మదనుడనే చక్రవర్తికి, సామంతుని= సాటి అధికారిని... మదనక్రీడలో మదనుడంతటివానిని, తోడితేఁగదరె=తిరిగి తీసుకురాకూడదా? మాడలు= గొప్పధనాన్ని, మాన్యములు=భూముల్ని, ఇచ్చి=ప్రసాదించి, మిమ్ము=సేవకులైన మిమ్మల్ని, మెప్పింతును= తృప్తి పరుస్తాను, వేయునేల=ఇన్నెందుకు, మీ పరిచారికాత్వమున్=ఒకరికి సేవలుచేసే మీ దీనత్వాన్ని, మఱపింతును= విస్మృతి కలిగిస్తాను.

**తాత్పర్యం:** *ఇకపైన ఏవిషయంలోనూ పట్టుదలకుపోనని నా భర్తమెత్తని పాదాలమీదపడి ప్రార్థిస్తాను. నా కోరికలకు వెలుగైనవానిని, నన్ను మరిపించే మదనక్రీడాపండితుని తిరిగి తెచ్చిపెట్టండి. మీకు అమితములైన ధనధాన్యాలు, భూవసతులు సమకూర్చి మిమ్మల్ని సంతృప్తి పరుస్తాను. మీకీ సేవకావృత్తినుండి విముక్తి ప్రసాదిస్తాను.*

> **నాచెలికాని, నాగురుని, నాకనుఁదమ్ముల మోమునీడలన్**
> **జూచెడివాని, నా మనసు సొంపు నెఱింగినవానిఁ నాకుఁ జే**
> **సాఁచెడివాని, నాదు కనుసన్న మెలంగెడివాని, నా ప్రభున్,**
> **నా చిగురాకుబాఁకుదొర, నా సకలమ్మును దెచ్చియీయరే!"**

**అర్థాలు:** నా చెలికాని=నాస్నేహితుని, నా గురుని=నా ఉపాధ్యాయుని, నా కనుఁదమ్ముల= నా కన్నులనే పద్మాలలో, మోమునీడలన్=తన ముఖబింబాల్ని, చూచెడివాని=చూచుకొని ఆనందించేవాడిని, నా మనసు సొంపును=నా మనోసౌందర్యాన్ని, ఎఱింగినవానిన్=తెలిసినవానిని, నాకున్=నన్ను, చేసాఁచెడివాని=అర్థించేవాడిని, నాదు కనుసన్న=నా కనుసైగలలో, మెలంగెడివాని=నడచేవానిని, నా ప్రభున్=నా ప్రాణనాథుని, నా చిగురాకుబాఁకుదొర=నా మన్మథుని, నా సకలమ్మును=నా సర్వస్వాన్ని, తెచ్చియీయరే= తెచ్చిపెట్టరా!

**తాత్పర్యం:** *చెలియల్లారా! నా చెలికానిని, నా ఉపాధ్యాయుని, నాకనుదమ్ములలో తన ప్రతిబింబాన్ని చూచి ఆనందించేవానిని, నా మనసేమిటో తెలిసినవానిని, ఏదికావాలన్నా నన్నే అడిగేవానిని, నా కనుసైగలలో నడచేవానిని, నా భర్తను, నా మన్మథుని, నా సర్వస్వాన్ని దయచేసి తెచ్చి పెట్టరూ!*

> **అనుచు వంతఁబొరలు నంగన నూరార్చ**
> **వెరవుదోఁప కంతిపురిలతాంగు**
> **లొకరిమొగము లొక్క రురక కన్గొనువేళ**
> **జాడనరయఁ జనిన చేడె వచ్చె.**

**అర్థాలు:** అనుచు=ఇలా ఏవేవో మాట్లాడుతూ, వంతన్ పొరలున్=బాధతో మెలికలు తిరిగిపోయే, అంగనన్=తమ రాణిని, ఊరార్ప=ఓదార్చటానికి, వెరవుదోఁపక=ఉపాయం తోచక, అంతిపురి=అంతఃపురంలోని, లతాంగులు=స్త్రీజనం అంతా, ఒకరిమొగములు= ఒకరిముఖాలను, ఒక్కరు=మరొక్కరు, ఉరక=బేలచూపులతో, కన్గొనువేళ=చూచుకొనే సమయంలో, జాడన్=తమ యజమాని నందుడువెళ్ళిన మార్గాన్ని, అరయన్= విచారించడానికి, చనిన=వెళ్ళిన, చేడె=చెలికత్తె, వచ్చె=తిరిగివచ్చింది.

**తాత్పర్యం:** *ఇలా తనస్వామిని పలవరిస్తూ బాధలోమునిగిన తమరాణిని ఓదార్చడానికి ఉపాయం తోచక అక్కడున్న అంతఃపుర మహిళా పరివారం అంతా తెల్లముఖాలతో ఒకరి నొకరు చూచుకొంటూంటే అంతలో యజమానికోసం వెళ్ళిన చెలికత్తె తిరిగివచ్చింది.*

**వచ్చినదానిఁ గన్గొని ప్రభాతవివర్ణవిధూపమాస్య యా**
**నచ్చపలాక్షి, యాసయు భయమ్మును శంకయుఁదోఁప, 'నెచ్చెలీ!**
**వచ్చుచునున్నవాఁడె? తెలుపన్ గదవే, ప్రియుఁడింతసేపు దా**
**నెచ్చటనున్న వాఁడె, నిను నేమనె, నేటికిఁ దామసించెనే?'**

**అర్థాలు:** ప్రభాత=తెల్లవారేముందు, వివర్ణ=కళావిహీనుడైన, విధు=చంద్రునితో, ఉపమ= పోల్చదగిన, ఆస్యయౌ=ముఖంకలదైన, ఆ+చపలాక్షి=ఆ నాయక సుందరి, వచ్చినదానిన్= తిరిగివచ్చిన చెలికత్తెను, కన్గొని=చూచి, ఆసయు=నాథుడువస్తున్నాడనే ఆశకొంత, భయమ్మును=రావడంలేదేమోనన్న భయంకొంత, శంకయున్=ఏమి చెప్పబోతోందోననే అనుమానం కొంత, తోఁప=తనముఖంలో దోబూచులాడుతూండగా ఇలా అడుగుతోంది. నెచ్చెలీ=ప్రియసఖీ! వచ్చుచునున్నవాఁడె=వస్తున్నాడా? తెలుపన్గదవే=తొందరగా చెప్పవే, ఇంతసేపు=ఇప్పటిదాకా, ప్రియుఁడు=నా ప్రియసఖుడు, తాన్=నానందుడు, ఎచ్చటనున్న వాఁడె=ఎక్కడున్నాడే? నినున్ ఏమనె=నిన్నేమన్నాడే? నేటికిన్=ఇప్పటిదాకా, తామసించెనే= ఆలస్యం ఎందుకు చేసాడే?

**తాత్పర్యం:** *తెల్లారగట్ల వెలవెలబోయే చంద్రునిలా ఉన్నమోముతో ఆ సుందరి తిరిగివచ్చిన చెలికత్తెను చూచి తన నాథుడు వస్తున్నాడా లేడా అన్న అనుమానంతో ఇలా ప్రశ్నిస్తోంది. ప్రియసఖీ! నాథుడు వస్తూన్నాడా తొందరగా చెప్పవే. ఇంతసేపూ ఎక్కడున్నాడట? నిన్ను చూచి ఏమన్నాడు? ఇప్పటిదాకా ఏం చేస్తున్నాడు?*

**అని పలుభంగుల నడిగిన**
**దనకున్ బ్రతిచెప్పకున్న దాని మొగమ్మున్**
**వనితామణి తప్పక క**
**న్గొని, యాస కృశించి, కినుక గూరిన వగతోన్.**

**అర్థాలు:** అని=ఇలాగా, వనితామణి=సుందరి, పలుభంగులన్=అనేకవిధాలుగా, అడిగిన= ప్రశ్నించి నప్పటికీ,

దనకున్=ఆమెకు, బ్రతిచెప్పకున్న=బదులుచెప్పని, దాని=ఆచెలికత్తె, మొగమ్మున్=ముఖాన్ని, తప్పక కన్గొని= తీవ్రంగా చూచి, ఆస=తన ఆశ, కృశించి=సన్నబడిపోగా, కినుకగూరిన=కోపంతోనిండిన, వగతోన్=దుఃఖంతో...

**తాత్పర్యం:** *సుందరి ఈవిధంగా ఎన్నిప్రశ్నలు వేసినప్పటికీ బదులివ్వని చెలికత్తెను తీవ్రంగా చూచి ఆశలు చచ్చిపోగా కోపంతో కలిసిన దుఃఖంతో....*

**'అశ్రుసిక్తమ్ములైన నేత్రాంచలములె**
**చెప్పుచున్నవి వాని దుశ్చేష్టితమును,**
**అయిన నోట వచింపు మేమనియె నతఁడు,**
**రానుపొమ్మనెనో, కానరాఁడొ చెలియ!'**

**అర్థాలు:** చెలియ=చెలీ! అశ్రుసిక్తమ్ములైన=కన్నీటితోతడిచిన, నేత్రాంచలములె=కళ్ళకొలుకులే, వాని దుశ్చేష్టితమును=అతగాని చెడ్డచేతను, చెప్పుచున్నవి=చెప్తున్నాయి. అయిన=అయినప్పటికీ, నోటవచింపుము= నీనోటితో చెప్పు, అతఁడు=నాభర్త, ఏమనియె= ఏమన్నాడు? రానుపొమ్మనెనో=ఇకరాను పొమ్మన్నాడా? కానరాఁడొ=అసలు దొరకలేదా?

**తాత్పర్యం:** *చెలీ! కన్నీటి నీకనుకొలుకులే అతని చెడ్డతనాన్ని చెప్తున్నాయి. అయినా నీ నోటితోచెప్పు. అసలేమన్నాడు? రానుపొమ్మన్నాడా? అసలు దొరకనేలేదా?*

**అనుటయు నా యంగన యి**
**ట్లనెఁ 'గడఁదగియు జాడ తెలియనైతిని దల్లీ!**
**జనములు తలకొక విధమున**
**వినిచిరి, యొక్కరును దత్ప్రవృత్తి యెఱుఁగమిన్.**

**అర్థాలు:** అనుటయున్=ఇలా అడగ్గా, ఆ ఆంగన=ఆ చెలికత్తె, యిట్లనెన్=ఇలా బదులిచ్చింది. తల్లీ=అమ్మా, కడఁదగియు=చివరిదాకా వెళ్ళికూడా, జాడ తెలియనైతిని=వారెక్కడుందీ తెలిసికోలేకపోయాను. జనములు= ప్రజలు, ఒక్కరును=ఏ ఒక్కరూ, తత్ప్రవృత్తి=అసలువిషయం, యెఱుఁగమిన్=తెలియకపోవడంచేత, తలకొక విధమున=తలోవిధంగా, వినిచిరి= చెప్పారు.

**తాత్పర్యం:** *అందుకు చెలికత్తె ఇలా అంది. అమ్మా! చివరిదాకావెళ్ళినా వారుకనిపించలేదు. జరిగినసంగతి తెలియక జనాలు తలొకవిధంగా చెబుతున్నారు.*

**జనము క్రందుగనున్న సమయంబునన్ జుట్టు**
**తిరుగుచుండె నటంచుఁదెల్పె నొకఁడు**
**అన్నతో నేకాంతమాడుచు నుండె నా**
**వీధిమూల నటంచు వినిచె నొకఁడు.**

**అచటనే గౌతమునిం దండించుపాత్రమ్ము**
**చేతఁ గైకొనె నంచుఁ జెప్పె నొకఁడు**
**ఆపాత్ర దాల్చియే యతిపుంగవు పిఱుంద**
**నంతంత నేగె నం చనియె నొకఁడు**

**వారలిర్వురు బౌద్ధవిహారమునకుఁ**
**బోవు మార్గమ్మునన్ గూడి పోవుచుండఁ**
**గాంచితి నటంచు నొకఁ డెఱిఁగించెఁగాని**
**నిక్క మెఱిఁగి వచించు మానిసియె లేఁడు,'**

**అర్థాలు:** ఒకఁడు=అందులో ఒకడు, జనము క్రందుగనున్న=ప్రజలు గుమిగూడిన, సమయంబునన్=స్థితిలో, చుట్టుతిరుగుచుండెన్=వాళ్ళచుట్టూ తిరుగుతున్నాడు, అటంచున్= అని, తెల్పెన్=చెప్పాడు. ఒకఁడు=మరొకడు, ఆవీధిమూలన్=ఆ దారిచివర, అన్నతోన్=తన అన్నగారైన బుద్ధునితో, ఏకాంతమాడుచునుండెన్=ఒంటరిగా ఏవోమాట్లాడుతున్నాడు, అటంచు=అని, వినిచె=చెప్పాడు. ఒకఁడు=ఇంకొకడు, అచటనే=అక్కడే, గౌతము దండించు=బుద్ధుడు చేతికిచ్చిన, పాత్రమ్ము=భిక్షాపాత్రను, చేతఁగైకొనెనంచున్=పుచ్చుకున్నాడని, చెప్పెన్= చెప్పాడు. ఒకఁడు=వేరేవాడు, ఆ పాత్రదాల్చియే=అది పుచ్చుకొని, యతిపుంగవుపిఱుంద= బుద్ధునివెంట, అంతంతన్= మెలమెల్లగా, ఏగెనంచు=వెళ్ళిపోయాడని, అనియెన్=అన్నాడు. వారలిర్వురు=వారిద్దరు, బౌద్ధ విహారమునకున్=ఆ బుద్ధుడుండే నివాసానికి, పోవుమార్గమ్మునన్=వెళ్ళేదారినే, కూడిపోవుచుండన్=కలిసిపోతూంటే, గాంచితిన్ అటంచున్= చూచానని, ఒకడెఱుఁగించెన్=ఒకడుచెప్పాడు, కాని=అయినా, నిక్కమెఱిఁగి=నిజంతెలిసి, వచించు= మాట్లాడే, మానిసియెలేఁడు=ఒక్కమనిషీ లేడమ్మా!

**తాత్పర్యం:** *అదిగో ఆజనంమూగినచోట చుట్టూతిరుగుతున్నాడని ఒకరు, ఆమూల అన్నగారితో ఏవోమాట్లాడుతున్నాడని ఒకరు, అన్నగారిచ్చిన భిక్షాపాత్ర పుచ్చుకున్నాడని ఒకరు, అది పుచ్చుకొని ఆయనవెంట పోయాడని ఒకరు, వాళ్ళిద్దరూ కలిసి ఆరామంవైపుకు నడుస్తున్నారని మరొకడు చూచామన్నారుకాని పూర్తిగా నిజంచెప్పినవాడు ఒక్కరూ లేరమ్మా!*

**అనుచున్ గద్గదకంఠియై వినినవృత్తాంతమ్ము విన్పింప, లో**
**చనపద్మమ్ములు విచ్చి హస్తయుగ మాస్ఫాలించి నిట్టూర్చి, ని**
**ల్చెను గాంతామణి పాలరాప్రతిమవోలెన్ జేష్టలందక్కి, యం**
**తన 'హా' యంచు శరాహతాండజమునాఁ దస్వంగి వ్రాలెన్ భువిన్.**

**అర్థాలు:** అనుచున్=ఇలాచెబుతూన్నచెలి, గద్గదకంఠియై=పూడుకుపోయినగొంతుతో, వినిన వృత్తాంతమ్ము= తానువిన్నదంతా, విన్పింప=వివరించగా, కాంతామణి=ఆ సుందరి, లోచనపద్మమ్ములు= తామరల వంటి ఆ కళ్ళు, విచ్చి=విప్పార్చి, హస్తయుగము=రెండు చేతులు, ఆస్ఫాలించి=పిసాళించి, నిటూర్చి=గట్టిగా గాలివదిలి,

చేష్టలందక్కి=చలనంగోల్పోయి, పాలరాప్రతిమవోలెన్=పాలరాతి విగ్రహంవలె, నిల్చెను=నిలబడింది. అంతన=అంతలోనే, హాయంచు=హానాథా అంటూ, తన్వంగి=పల్చని దేహంగల ఆమె, శరాహతాండజమునాన్= బాణందెబ్బతిన్న పక్షిలా, భువిన్=నేలమీద, వ్రాలెన్=పడిపోయింది.

**తాత్పర్యం:** *ఇలా ఆ చెలికత్తె పూడుకుపోయినగొంతుతో తాను విన్నదంతా చెబుతోంటే, సుందరి పద్మాలవంటి కళ్ళు బాగా విప్పార్చి ఒళ్ళు విరుచుకొంటూ దీర్ఘంగా నిట్టూర్చి పాలరాతి ప్రతిమలాగా చలనంలేకుండా నిలబడిపోయింది. అంతలోనే ఆ లతాంగి బాణం దెబ్బతిన్న పక్షిలాగా నేలమీద పడిపోయింది.*

అంత వయస్యలెల్లరుఁ 'గటా! యెటువంటి యవస్థ వచ్చె భూ
కాంతుని బిల్వరే' యనుచు, గౌతమ దేవుని చెంత కేగి వృ
త్తాంతము దెల్పరే' యనుచు, 'నయ్యయొ ప్రాణము నిల్చు మార్గమున్
గాంతము రారె' యంచును నొకళ్ళొకరీతిగ నాడుచుండఁగన్.

**అర్థాలు:** అంత=అలా పడిపోగా, వయస్యలెల్లరున్=చెలికత్తెలంతా, కటా=అయ్యో, ఎటువంటి=ఎంతటి, అవస్థవచ్చె=పరిస్థితి వచ్చింది, భూకాంతుని బిల్వరే=రాజుగారిని పిలవండి, అనుచు=అంటూ, గౌతమ దేవుని= బుద్ధభగవానుని, చెంతకేగి=దగ్గరకెళ్ళి, వృత్తాంతము=ఇక్కడి విషయాన్ని, తెల్పరేయనుచు=చెప్పండి అంటూ, అయ్యయొ=అయ్యో, ప్రాణమునిల్చు మార్గమున్=ప్రాణాలుకాపాడేదారి, కాంతమురారె=తెలిసికొందాం రండి, అంచును=అని అంటూ, ఒకళ్ళొకరీతిగన్=ఒక్కొకళ్ళు ఒక్కొకవిధంగా, ఆడుచుండఁగన్= కంగారు పడుతూండగా..

**తాత్పర్యం:** *సుందరి అలాపడిపోగానే చెలికత్తెలంతా కంగారుపడి రాజుగారిని పిలవండని కొందరూ, బుద్ధుడికే విన్నవిద్దాం అని కొందరూ, ముందు ప్రాణాలు నిలబడే ఉపాయం చూద్దామని కొందరూ ఇలా ఒక్కొకళ్ళూ ఒక్కొక విధంగా కలదిరుగుతూండగా....*

**ముదుసలిపడంతి యొక్కతె**
**పదిలముగాఁ జెంతఁజేరి, ప్రాణము మరలన్**
**గుదుటంబడు నుపచారము**
**లదియును నిదియును బొనర్ప నయ్యంగనయున్,**

**అర్థాలు:** ముదుసలి పడంతియొక్కతె=ఒక ముసలామె, పదిలముగాన్=మెల్లగా, చెంతఁజేరి=పడిపోయిన సుందరి దగ్గరికేగి, ప్రాణము మరలన్=పోయినవనుకొన్న ప్రాణాలు తిరిగివచ్చి, కుదుటంబడున్=కుదురుకొనేలాగా, ఉపచారములు=తగినసేవలు, అదియునున్ ఇదియును=అదీయిదీ, పొనర్పన్=చేయగా, ఆ అంగనయున్= ఆ సుందరికూడా...

**తాత్పర్యం:** *ఒక అనుభవంగల పెద్దామె నింపాదిగా దగ్గరకుచేరి, ప్రాణాలు కుదుటపడేలా అవీ యివీ ఏవో తగిన సేవలుచేయగా అప్పుడా సుందరి....*

**క్రమముగ దేహమున్ దెలిసి, గౌతమదేవునితోడనే విహా**
**రము దరియంగనేగెఁ దన ప్రాణవిభుం డనుమాటకున్, బ్రియా**
**విముఖత సర్వమున్ విడిచి భిక్షుకులమ్మును జేరె నన్న య**
**ర్థము సరిపోల్చి చూచికొని, దాని నిరాకృతిగాఁ దలంచుచున్.**

**అర్థాలు:** క్రమముగ=మెల్లమెల్లగా, దేహమున్=తన శరీరం చుట్టూ ఏంజరుగుతుందోనన్న విషయం, తెలిసి= గమనించే స్వస్థత కలిగినదై, గౌతమదేవునితోడనే=తన అన్నగారైన బుద్ధభగవానుని వెంట, విహారము=వారి ధర్మప్రచారాదుల కేంద్రస్థానమైన ఆశ్రమం, దరియంగనేగెన్=సమీపానికి వెళ్ళాడు, తన=తనయొక్క, ప్రాణ విభుండు=ప్రాణాలకు ప్రాణమైన తనభర్త, అనుమాటకున్=అనే లోకంలోని ప్రజల అభిప్రాయానికి, ప్రియా= తనప్రియురాలి యెడల, విముఖత=విరాగంతో, సర్వమున్=తనరాజ్యం పరిపాలన సౌకర్యాలు ఆస్తిపాస్తులు భార్య దాసదాసీలు తల్లితండ్రులు బంధువులు ఈ మొత్తం, విడిచి= ఒక్కసారిగా వదిలిపెట్టి, భిక్షుకులమ్మును=ఇవేవీ లేక అన్నీ విడిచిపెట్టమనే దొంగసన్యాసుల మతానికి, చేరెన్=చేరాడు, అన్న=అనిపించే, అర్థము=అభిప్రాయానికి, సరిపోల్చి=ఈడుపరచి, చూచికొని=సమానత్వాన్ని గ్రహించి, దాని=అతడుచేసిన పనిని, నిరాకృతిగాన్=తనను విడిచిపెట్టినట్లుగా, తలంచుచున్=భావిస్తూ....

**తాత్పర్యం:** *మెలమెల్లగా దేహస్పృహ కలిగి తనచుట్టూ జరిగేది గ్రహించి తన ప్రాణనాథుడు తన అన్నగారి ధర్మప్రచారాలయానికి అన్నవెంట వెళ్ళాడనే ప్రజాభిప్రాయంతో, ప్రియురాలైన తనపట్ల వైముఖ్యంతో తనదైన మొత్తాన్ని విడిచిపెట్టి చివరికి దొంగసన్యాసులమతానికి చేరాడనే అభిప్రాయంతో సరిపోల్చుకొని అతడు చేసిన పనిని తనపట్ల నిరాదరంతో చేసిన పనిగా భావిస్తూ... ఇలా ఎత్తిపొడిచింది.*

**'ఔరా! యభినయవిద్యా**
**పారంగత! వంచకాతివంచక! రసభా**
**వారంభప్రతికూలవి**
**చారా! సౌహార్ద ధర్మ సమయవిదూరా!**

**అర్థాలు:** ఔరా=అవుర ఏమిచిత్రం! అభినయవిద్యా=నాటకవిద్యలో, పారంగత=తుదముట్టిన వాడా! వంచక=మోసగాళ్ళకు, అతివంచక=పెద్దమోసగాడా! రసభావ=శృంగార వికారానికి, ఆరంభ=మొదటిలోనే, ప్రతికూల=విరుద్ధంగా, విచారా=ఆలోచించేవాడా! సౌహార్ద=ప్రేమ అనే, ధర్మ=న్యాయానికి సంబంధించిన, సమయ= మర్యాదకు, విదూరా=దూరమైనవాడా!

**తాత్పర్యం:** *ఏమిరా! నాటకవిద్యా పారంగతా! మోసగాళ్ళకే మోసగాడివిగదరా! శృంగారం ఆరంభించకముందే శంకించేవాడా! ప్రేమన్యాయాన్ని దూరంగా ఉంచేవాడా!*

**అడవులకేగి భిక్షుల విహారములన్ భజియించి, కావిక**
**చ్చడములు గట్టు నీరసపు శాంతమె నీకు నిసర్గమైనచోఁ**
**గడునయగారముల్, వలపుఁ గమ్మదనమ్ములు, ప్రాణమిచ్చు ప్రే**
**ముడుల నటింపనేల? నను మోసము చేయఁగనేల ధూర్తుఁడా!**

**అర్థాలు:** అడవులకేగి=అరణ్యాలకెళ్ళి, భిక్షుల=సన్యాసుల, విహారములన్=ఆశ్రమాల్ని, భజియించి=పొగిడి, కావికచ్చడములు=కాషాయపుగోచీలు, కట్టు=ధరించే, నీరసపు= దౌర్బల్యపు, శాంతమె=మెత్తదనమే, నీకు=నీపాలిట, నిసర్గమైనచో=స్వభావమైతే, కదునయగారముల్=అన్ని చిన్నెలు, వలపున్=అనురాగంతోడి, కమ్మదనమ్ములు= ముచ్చట్లు, ప్రాణమిచ్చు=చైతన్యం కలిగించే, ప్రేముడుల=ప్రేమలు, నటింపనేల=చూపించడం ఎందుకు? నను= అమాయకురాలనైన నన్ను, మోసము చేయఁగనేల=ఎందుకు మాయచేయాలి? ధూర్తుఁడా=దుర్మార్గుడా!

**తాత్పర్యం:** *అడవుల్లో సన్యాసులకు సేవలుచేసి కావిగోచీలు పెట్టుకొనే దౌర్బల్యం తలకెత్తుకొనే వాడివి అన్నిచిన్నెలు, ముచ్చట్లు, ప్రాణాలిచ్చే ప్రేమలు నటించడం ఎందుకు? అమాయకురాలనైన నన్నెందుకు మోసంచేయాలిరా దుర్మార్గుడా!*

**అమృతపరిపూర్ణమైన పాత్రమునయందుఁ**
**జేతులారఁగ విసము పోసితి వయారె!**
**అనుభవింపఁగ మనసు లేదయ్యె నేని**
**పాత్రమును దొల్తఁ బూరగింపంగ నేల?**

**అర్థాలు:** అమృతపరిపూర్ణమైన=అమృతం నింపిన, పాత్రమునయందున్=కలశంలో, చేతులారంగ=నీ చేతులతోనే, విసము=ఇంత విషాన్ని, పోసితివయారె=కుమ్మరించావుకదా! అనుభవింపఁగ=అనుభవించే, మనసు=కోరిక, లేదయ్యేనేని=లేకపోతే, పాత్రమును=ఆ కలశాన్ని, తొల్తన్=మొట్టమొదట, పూరగింపంగనేల= అమృతంతో నింపడం ఎందుకు?

**తాత్పర్యం:** *అమృతంనిండిన పాత్రలో చేతులారా విషం కలిపావుకదా! ఆ పాత్రమీద కోరికలేకపోతే మొదట అందులో అమృతం ఎందుకు నింపావు?*

**నీదు నెమ్మోము గాంచెడి యదృష్టము గోలు**
**పోలేక కన్గవ మూయ వెఱచి**
**కనుఁబాటు తాఁకునో యనుభీతిఁ దడవు చూ**
**డఁగనీక చూపులు తిగిచిపట్టి**

**జుణిఁగిపోవునొ యేమొ యను చింతఁ గనుఱెప్ప**
**పాటుకాలము కేలువదల వెఱచి**
**కసుగందునో హస్తకిసలయ మ్మనుశంక**
**బిగువుఁగైదండ కూర్పఁగ దలంకి**
**తీవ్రమైనట్టి ఖడ్గధారా వ్రతమ్ము**
**సేయుచుంటిని నిన్ను భజించుకొఱకుఁ**
**జిత్త మెఱుఁగక నన్ను వంచించితౌర!**
**పున్నెమార్జింతువో! మోక్షమును గడింతొ!**

**అర్థాలు:** నీదునెమ్మోము=నీ అందమైనముఖాన్ని, కాంచెడియదృష్టము=చూచేభాగ్యం, కోలుపోలేక= పోగొట్టుకోలేక, కన్గవ=కళ్ళురెండూ, మూయవెఱచి=మూసుకోడానికి భయపడి, కనుఁబాటు తాఁకునో=రెప్పపాటు పడుతుందేమో, అనుభీతిన్=అనేభయంతో, తడవుచూడఁగనీక=ఆలస్యమైనా, చూపులు=చూడ్కులు, తిగిచిపట్టి= మూయకుండా ఉంచి, జుణిఁగిపోవునొ యేమొ= జారిపోతుందో యేమో, అనుచింతన్=అనేబెంగతో, కనుఱెప్ప పాటుకాలము=రెప్పవేసేకాలం కూడా, కేలువదల=నీచేయివదలడానికి, వెఱచి=భయపడి, హస్తకిసలయము= మృదువైన చేతులు, కసుగందునో=ఎక్కడకమిలిపోతాయో, అనుశంక=అనే అనుమానంతో, బిగువున్= బలమైన, కైదండ కూర్పఁగ=చేయూతయివ్వడానికి, తలంకి=భయపడి, తీవ్రమైనట్టి=గాఢమైన, ఖడ్గధారావ్రతమ్ము= కత్తిమీదిసామును, నిన్నుభజించుకొఱకు=నీసేవకోసం, సేయుచుంటిని= చేస్తున్నాను, చిత్తమెఱుఁగక=నా మనసు తెలిసికోలేక, నన్ను వంచించితౌర=నన్నుమోసం చేసావుగదా! పున్నెమార్జింతువో=పుణ్యం మూటకట్టుకుంటావో, మోక్షమును= ముక్తిని, గడింతొ=సంపాదించుకుంటావోకదా!

**తాత్పర్యం:** *నీ ముఖదర్శనం కోల్పోతానేమోనని కళ్ళుమూయడం మరిచాను. రెప్పకూడా వేయకుండా నీకోసంచూచాను. జారిపోతుందేమోనని కలలోకూడా నీచేయి వదలలేదు. ఇంతమెత్తని చేయి కందిపోతుందని ఎవరికీ చేయూతకూడా ఇవ్వలేదు. ఇన్నిభయాలతో నీకోసం ఎదురుచూడటం కత్తిమీది సామే అయింది. ఇటువంటి నామనసు తెలిసికోలేక నన్నుమోసంచేసావుకదా! కానివ్వు... నీవు ఎంతపుణ్యం సంపాదిస్తావో ఎంతముక్తిని పొందుతావో చూస్తాను.*

**కూరిమి తోఁబుట్టుగుల విస్మరించి యా**
**నెయ్యమ్ము నీమీఁద నిల్పుకొంటి**
**అరమరలేని వయస్యలఁ బెడఁబాపి**
**చెలిమికేల్ నీమూపుఁజేర్చికొంటి**

**జననీ జనక సేవ చాలించి నీదు పా**
**దమ్ములే దిక్కని నమ్ముకొంటి**
**ఇలవేలుపుల పూజ కెడసి నీ పరిచర్య**
**చాలు నాకని సంతసమ్ము పడితి**

**అన్ని భావముల్ త్వత్ప్రణయాగ్ని యందె**
**యాహుతులువేల్చి నేశూన్యనైతి నింక**
**నేమిగతిఁ బోదు - నెవ్వరి నేమి యందుఁ**
**దెలివిమాలిన నన్నె నిందించుకొందు.**

**అర్థాలు:** కూరిమి తోఁబుట్టుగుల=ప్రియమైన అక్కాచెల్లెండ్రను, విస్మరించి=మరచిపోయి, ఆనెయ్యమ్ము= వారిమీది ప్రేమ, నీమీఁద=ఇటువంటి నీయందు, నిల్పుకొంటి=ఉంచాను, అరమరలేని=ఏభేదమూలేని, వయస్యలఁ బెడబాపి=చెలులను విడనాడి, చెలిమికేల్=స్నేహ హస్తాన్ని, నీమూపున్=నీభుజాన, చేర్చికొంటి=వేసాను, జననీ జనకసేవ=తల్లిదండ్రులసేవ, చాలించి=ముగించి, నీదుపాదమ్ములే=నీపాదాలే, దిక్కని=శరణమని, నమ్ముకొంటి= నమ్మి కొన్నాను, ఇలవేలుపులపూజకు=ఇంటిదేవతలపూజలు, ఎడసి=మానేసి, నీపరిచర్యచాలు= భర్తసేవచాలు, నాకు అని=నాకంటూ, సంతసమ్ముపడితి=సంతోషపడ్డాను, అన్నిభావముల్= నా అభిప్రాయాలన్నీ, త్వత్ ప్రణయాగ్నియందె=నీ ప్రేమనే అగ్నిలోనే, ఆహుతులువేల్చి= సమిధలుగా సమర్పించి, నేశూన్యనైతి=నేను ఏమీలేకుండా మిగిలిపోయాను. ఇంకన్=ఇకపైన, ఏమిగతిఁబోదు=ఎక్కడికనిపోయేది? ఎవ్వరినేమియందున్= ఎవరినేమనుకుంటే ఏముంది? తెలివిమాలిన నన్నె=నాతెలివితక్కువకు నన్నే, నిందించుకొందు=తిట్టుకుంటాను.

**తాత్పర్యం:** *అక్కాచెల్లెండ్రనుకూడా మరచి నిన్నే ప్రేమించాను. స్నేహితురాండ్రనుకూడా వదిలి నిన్ను నమ్ముకున్నాను. తలిదండ్రులనుకూడా వదిలి నీపాదాలే సేవించాను. ఇలవేలుపుల పూజలుమానేసి సర్వం నీవే అనుకొన్నాను. నాభావాలన్నీ నీప్రేమకే ఆహుతు లిచ్చాను. ఇప్పుడునేను శూన్యనయ్యాను. ఎవ్వరినేమంటే ఏముంది! తెలివితక్కువ నాది!*

**అని విభుని బదరి, పదరుటఁ**
**గినుక భరమ్మును నొకింత కీడ్వడి, మఱి యీ**
**పని ప్రియుఁడు తనకుఁ దా దొరఁ**
**కొనునా, యనుశంక యలముకొని చిత్తమునన్.**

**అర్థాలు:** అని=ఇలా అని, విభుని=భర్తను, పదరి=నిందించి, పదరుటన్=నిందించినందున, కినుకభరమ్మునున్= కోపావేశాన్ని, ఒకింత=కొంచెం, కీడ్వడి=తేలికపరచి, మఱి=ఇప్పుడు, యీపని=యీసన్యాసానికి, ప్రియుఁడు= తనభర్త, తనకుఁదా=తనంతటతనే, దొరకొనునా= సిద్ధించిందా, అనుశంక=అనే అనుమానం, చిత్తమునన్= మనసంతా, అలముకొని=వ్యాపించి...

**తాత్పర్యం:** *ఇలా భర్తను నిందించి, తనలోని కోపభారాన్ని తగ్గించుకొని అసలీ సన్యాసదీక్ష పుచ్చుకోవాలనే తలంపు అతనికేపుట్టిందా అనే సందేహం మనసంతా ఆవహించి...*

**'అతనుండె సర్వదైవతకులాధిపుఁ డంచు**
**సన్నజాజుల పూజ సల్పుచుండు,**
**వలరాజె నిత్యయౌవన సంపద నొసంగు**
**వరదుఁడం చంజలి పట్టుచుండు,**
**నంగజుండే యువాభ్యర్చనీ యుండైన**
**గురువని పాదముల్ కొలుచుచుండుఁ,**
**గంతుఁడే శృంగారకళల పెన్నిధి యంచుఁ**
**బరవశుండై పాటపాడుచుండు**

**నట్టి మన్మథసేవకుం, డట్టి మన్మ**
**థాతి మన్మథుఁ డింతలో యతిజనోప**
**భోగ్యవైరాగ్యపద్ధతిఁ బూనెఁ దనకుఁ**
**దానె యనుకొంట నమ్మఁగారాని దకట!**

**అర్థాలు:** అతనుండె=తనువులేని మన్మథుడే, సర్వదైవతకుల=దేవతావర్గానికంతకు, అధిపుఁడంచు=నాయకుడని, సన్నజాజులపూజ=నిత్యం పూచే సన్నజాజులతో ఆరాధన, సల్పుచుండు=చేస్తుంటాడు, వలరాజె=మన్మథుడొక్కడే, నిత్యయౌవనసంపదన్=నిరంతరంగా ఉండే వయోపటుత్వాన్ని, ఒసంగు=ఇచ్చే, వరదుఁడంచు=వరదాత అంటూ, అంజలి=దోసిలి, పట్టుచుండు=పడుతూంటాడు, అంగజుండే=మన్మథుడే, యువాభ్యర్చనీయుండైన=యువకులచే పూజింపదగిన, గురువని=పూజనీయుడని, పాదముల్ కొలుచుచుండు=పాదాలు సేవిస్తూంటాడు, కంతుడే= మన్మథుడే, శృంగారకళల=మదనక్రీడలకు, పెన్నిధియంచున్=పెద్దపాతరగా భావించి, పరవశుండై= ఒడలుమరచి, పాటపాడుచుండు=కీర్తిస్తూంటాడు, అట్టి మన్మథసేవకుండు=అటువంటి మదనపూజారి, మన్మథాతిమన్మథుఁదున్=మదనుడికే మదనుడు, ఇంతలో=ఈకొద్దిసమయంలోనే, యతిజనోపభోగ్య=సన్యాసులకు తగిన, వైరాగ్యపద్ధతిన్= ఈ నీరసమైన విరక్తిని, తనకున్ తానె=తనంతటతానే, పూనెన్=స్వీకరించాడని, అనుకొంట= అనుకోవడం, నమ్మగాఁ రానిది=నమ్మశక్యంకావడంలేదు. అకటా=అయ్యో భగవంతుడా!

**తాత్పర్యం:** *మన్మథుడే దేవతాచక్రవర్తి అంటూ నిత్యం సన్నజాజులతో పూజచేసేవాడు, అతడే నిత్యయవ్వనదాత అని దోసిలిపట్టేవాడు, అతడే యవకులచేత పూజింపదగినవాడని పాదపూజచేసేవాడు, అతడే శృంగారరసాధిదేవతని ఒళ్ళుమరచి పాడుకొనేవాడు, అటువంటి మదనపూజారి, మన్మథులకే మన్మథుడు ఇంతలోనే వృద్ధసన్యాసులకిష్టమైన విరక్తిమార్గాన్ని స్వీకరించాడనుకోవడం నమ్మశక్యం కావడంలేదు. అయ్యో భగవంతుడా!*

**భావించిచూడ నింతకుఁ**
**బావనుఁడా గురుఁడె మొదలు, బలవంతముగా**
**నో, వేఱు విధముగానో**
**నావల్లభు దక్కఁగొనియె నన్నిటుచేసెన్.,**

**అర్థాలు:** ఇంతకున్=జరిగినదాన్నిబట్టి, భావించిచూడన్=ఆలోచించగా, మొదలు=మొదట, పావనుఁడు=పరమ పూజ్యుడైన, ఆగురుఁడె=వాళ్ళన్నగారే, బలవంతముగానో= దౌర్జన్యంగానో, వేఱువిధముగానో=మరో ఉపాయం తోనో, నావల్లభు=నాభర్తను, దక్కఁగొనియె=స్వాధీనం చేసికొన్నాడు, నన్ను=దీనురాలినైన నన్ను, ఇటుచేసెన్= ఈవిధంగా చేసాడు.

**తాత్పర్యం:** *ఇదంతా చూస్తూంటే వాళ్ళన్నగారే బలవంతంగానో, బెల్లించో నావాడిని తన స్వంతం చేసికొన్నాడు. మాయతెలియని నన్ను ఇలా చేసాడు.*

**అని నిశ్చయించి, గురు నే**
**మనుటకునున్ నోరు రాక, యల్లంతన మె**
**త్తని కినుకతోడ గౌరవ**
**మెనసెడి వాక్యముల నతని నిట్లని యెంచెన్.**

**అర్థాలు:** అని నిశ్చయించి=ఇలా ఒక నిర్ణయానికివచ్చి, గురుని=పెద్దవాడిని, ఏమనుటకునున్= ఏమంటానికీ, నోరురాక=నోరు పెగలక, అల్లంతన=అంతలోనే, మెత్తని కినుకతోడ=మృదువైన కోపంతో, గౌరవ మెనసెడి= వినయం తొంగిచూచే, వాక్యములన్=మాటలతో, అతనిని=ఆ బుద్ధ భగవానుని, ఇట్లని యెంచెన్=ఇలా ఎత్తి పొడిచింది.

**తాత్పర్యం:** *ఇలా ఒక నిర్ణయానికి వచ్చినదై పెద్దవాడిని ఏమీ అనలేక ఆగి అంతలోనే మెత్తని మాటలతో గౌరవం ఉట్టిపడేలా బుద్ధభగవానుని ఈవిధంగా ఎత్తిపొడిచింది.*

**"చల్లనిచూపు, తీయనివచస్సు, దయామృతసారవాహినుల్**
**వెల్లువలైన చిత్తము భువిన్ త్వదధీనము లొండు చోటులన్**
**జెల్ల వటంచు గాథల వచింతురు, చెల్లెలి వంటి నాయెడన్**
**బొల్లయిపోయె నేమయ! ప్రభూ! భవదార్తజనావనక్రియల్.**

**అర్థాలు:** ప్రభూ=ఓదేవా! చల్లనిచూపు=హాయిగొలిపే నీ చూపులు, తీయని వచస్సు=మధురమైన మాటలు, దయామృతసార=కరుణ అనే అమృతరసాయనపు, వాహినుల్=ప్రవాహాలు, వెల్లువలైన=వరదలైపొంగే, చిత్తము=నీ మనస్సు, భువిన్=ఈ నేలపైన, త్వత్=నీకు, అధీనములు=వశమైన హృదయాలు, ఒండుచోటులన్=వేరే ప్రదేశాల్లో, చెల్లవు=పనికిరావు, అటంచు=అంటూ, గాథలవచింతురు=ఏవేవో కథలు చెప్పుకుంటూంటారు, భవత్=నీయొక్క, ఆర్తజనావన=దీనులనురక్షించే, క్రియల్=పనులు, చెల్లెలివంటి=నీ సోదరిలాంటి, నాయెడన్=నాపట్ల, పొల్లయి పోయెన్=పనికిరాకుండా పోయినవి, ఏమయ=ఇదేమిటయ్యా!

**తాత్పర్యం:** *ఓస్వామీ! నీ చూపులు చల్లనివి, మాటలు తీయనివి, మనస్సేమో కరుణామృత రసాయన ప్రవాహాలు పొంగిపొర్లేది, నీ ధర్మంలో ప్రవేశించిన హృదయక్షేత్రాలు మరొక ధర్మంలో యిమడవు అని ఏవేవో కథలుకథలుగా చెప్పుకొంటూంటారు. అటువంటి నీ ధర్మపరిరక్షణక్రియలు నీచెల్లెలివంటి నాపట్ల పొల్లయిపోయాయేమయ్యా!*

**నాయెడ నించుక పొరపా**
**టే యున్నదియనుము, దాని కింతటి శిక్షన్**
**జేయుట నాయమ? మరణం**
**బే యుచితము కాద, భర్తృవిరహము కంటెన్.**

**అర్థాలు:** నాయెడన్=నాయందు, ఇంచుక=కొంచెం, పొరపాటే=తప్పే, ఉన్నదియనుము= ఉందనుకో, దానికి= ఆమాత్రానికి, ఇంతటిశిక్షన్ చేయుట=ఇంతశిక్షవేయటం, నాయమ= ధర్మమేనా? భర్తృవిరహము కంటెన్= భర్తతో ఎడబాటుకంటె, మరణంబే=చావే, ఉచితము కాద=నయంకాదా?

**తాత్పర్యం:** *నేను ఏకొంచెమో తప్పుచేసానే అనుకో. ఆ మాత్రానికే ఇంత శిక్షా? భర్త ఎడబాటుకంటే నాకు చావు నయంకాదూ!*

**దోసమొనర్చుచుండుటయు దోసిలి యొగ్గుట మాకుఁ జెల్లు, నా**
**దోసము లెల్లసైచి తఱితో దయ సూపుట మీకుఁ జెల్లు, నా**
**హా! సకలాగమార్థనిపుణా! పరిపూర్ణ దయాపయోధి! నా**
**దోసము పెద్దచేసి తలద్రుంచితి వేమయ! బోధపుష్కలా!**

**అర్థాలు:** దోసమొనర్చుచుండుటయు=తప్పుచేయడం, దోసిలియొగ్గుట=క్షమించమని వేడుకోవడం, మాకున్ చెల్లున్=మాలాంటివాళ్ళకు సరిపోతుంది. ఆ దోసములెల్ల సైచి= ఆ తప్పులన్నీ క్షమించి, తఱితో=సమయానికి, దయసూపుట=కరుణించడం, మీకున్=మీ వంటి మహాత్ములకు, చెల్లున్=తగుతుంది. ఆహా=ఓహో! సకలాగమ= వేదాలన్నిటియొక్క, అర్థనిపుణా=సారమెరిగినవాడా! పరిపూర్ణ=నిండైన, దయాపయోనిధి=కరుణాసముద్రా! బోధపుష్కలా=సమృద్ధమైన జ్ఞానంకలవాడా! నాదోసము=నా చిన్నతప్పును, పెద్దచేసి=కొండంత చేసి, తలద్రుంచితి వేమయ=నా తలతీసావుగదయ్యా!

**తాత్పర్యం:** *తప్పుచేయడం, ఒగ్గేయమనడం మాకుచెల్లుతుంది. వాటన్నిటినీ క్షమించి కరుణించడం మీపని. ఆహా! వేదనిధీ! దయాసముద్రా! జ్ఞానపుష్కలా! గోరంత తప్పును కొండంతచేసి నా జీవితానికే ఎసరుపెట్టావుగదయ్యా!*

**శోకరూపిణియైన యశోధరాంబ**
**కీ తఱిన్ దోడికోడల నైతి నిజము;**

**శాక్యకులమును మెట్టిన సతులకెల్ల**
**భర్తృవిరహమె నోముల ఫలమ? దేవ!**

**అర్థాలు:** దేవ=స్వామీ! శోకరూపిణియైన=విషాదానికే రూపమైన, యశోధరాంబకు=నీ భార్య యశోధరకు, ఈతఱిన్=ఇప్పుడు, నిజము=నిజంగా, తోడికోడలనైతి=ఏరాలునయ్యాను, శాక్యకులమును=మీ శాక్యులయింట, మెట్టిన=కాలుపెట్టిన, సతులకెల్ల=కోడళ్ళందరికీ, భర్తృ విరహమె=భర్తల ఎడబాటే, నోములఫలమ=వారి పుణ్యాల ఫలితమా?

**తాత్పర్యం:** *ఓ వినూత్న ధర్మబోధకుడా! విషాదానికే మారురూపమైన నీ భార్య యశోధరకు ఇప్పుడు నేను నిజంగా తోడికోడలినయ్యాను. మీ శాక్యవంశంలో మెట్టిన ఆడవాళ్ళందరికీ ఇలా భర్తలతో దూరంగా ఉండటం ఆనవాయితీ ఏమో!*

**'గౌతమగోత్రజుల్ పరమకారుణికుల్, సుకృతాత్ములయ్యెడన్**
**మాతృవియోగచింత యను మాట యెఱుంగక యుండెదమ్మ, త**
**ల్లీ! తలరన్ బనేమి' యని, లేని వికాసము దోఁప, నన్ను మీ**
**చేతులఁబెట్టునప్పుడు వచించెను మా జనయిత్రి గౌతమా!**

**అర్థాలు:** గౌతమా=ఓ గౌతమవంశోద్భవా! గౌతమగోత్రజుల్=మీ గౌతమవంశంలో పుట్టినవాళ్ళు, పరమ కారుణికుల్=గొప్ప దయావంతులు, సుకృతాత్ములు=పుణ్యాత్ములు, అయ్యెడన్=అటువంటప్పుడు, మాతృ= తల్లితనానికి, వియోగచింత=దూరమవుతాననే, అనుమాట=ఆలోచనను, ఎఱుంగక= మరచిపోయి, ఉండెదమ్మ= ఉంటావుతల్లీ! తలరన్=దుఃఖపడే, పనేమి=పనేముంటుంది, తల్లీ=మా అమ్మవుకదూ! అని=ఇలాచెప్పి, లేని వికాసము=అబద్ధపు తెలివి, తోఁప=కల్పించి, నన్ను=ఈ అమాయకురాలైన నన్ను, మీచేతులఁబెట్టునప్పుడు=మీ చేతుల్లో పెట్టేటప్పుడు, మాజనయిత్రి=మా అమ్మ, వచించెను=చెప్పింది.

**తాత్పర్యం:** *ఓ గౌరవ గౌతమవంశంలో పుట్టినవాడా! మీ వంశలోని వాళ్ళంతా గొప్ప దయావంతులు, పుణ్యాత్ములు; అటువంటప్పుడు నీ మాతృత్వానికివచ్చే ఇబ్బందేమీ లేదని, బాధపడేపనే లేదని, సుఖంగా ఉంటావనిచెప్పి నన్ను మీ చేతులలో పెట్టేటప్పుడు మా అమ్మ చెప్పింది.*

**తమ్ముఁడు పాదపద్మముల దాపునకున్ జనుదెంచి మొక్కఁ, బ్రే**
**మమ్మున నాయురభ్యుదయమంగళముల్ విలసిల్లునట్లమో**
**ఘమ్మగు దీవనల్ సలుపఁగా దొరఁకొందురుగాని, సర్వమున్**
**వమ్మొనరించు సన్యసనపద్ధతి నేర్పుదురా భవాదృశుల్!**

**అర్థాలు:** భవాదృశుల్=మీవంటివారు, తమ్ముఁడు=చిన్నసోదరుడు, పాదపద్మముల=తన పద్మాలవంటి పాదాల,

దాపునకున్=దగ్గరకు, చనుదెంచి=వచ్చి, మొక్కన్=ప్రణమిల్లితే, ప్రేమమ్మునన్=ఆదరంతో, ఆయుః=జీవించేకాలం, అభ్యుదయ=అభివృద్ధి, మంగళముల్= శుభపరిణామాలు, విలసిల్లునట్లు=పెరిగేటట్లు, అమోఘమ్మగు=ప్రశస్తమైన, దీవనల్= ఆశీస్సులు, సలుపఁగా=ఇవ్వటానికి, దొరఁకొందురుగాని=ప్రయత్నిస్తారుకాని, సర్వమున్= జీవితాన్ని మొత్తాన్ని, వమ్మొనరించు=ప్రయోజనంలేకుండాచేసే, సన్యసనపద్ధతి=వైరాగ్య మార్గాన్ని, నేర్పుదురా=బోధిస్తారా?

**తాత్పర్యం:** *మీవంటి పెద్దవారు తమ్ముడు కాళ్ళదగ్గరకొచ్చి నమస్కరిస్తే ఆదరంతో దగ్గరకు తీసికొని ఆయువు అభ్యుదయం శుభాలుపెరిగే గొప్పవరాలు ఇస్తారుకాని, జీవితం మొత్తం నాశనంచేసే విధంగా సన్యాసమార్గాన్ని బోధించడం ఎంతవరకు న్యాయం చెప్పండి!*

**కాలముచెల్లి, పశ్చిమముఖమ్మునఁ బ్రాయపుఁ బ్రొ ద్దొకింతలో**
**వ్రాలఁగ నున్న పెద్దలు, భవత్ప్రతిపాదిత ధర్మమార్గ చిం**
**తాలసితాత్ములై, తెలిసి దారసుతాదుల నుజ్జగించినన్**
**బోలు; నిదెట్టు లొప్పితివి? మొగ్గను ద్రుంచుట, పిందె కోయుటల్.**

**అర్థాలు:** కాలముచెల్లి=అనుభవించే వయసంతా ఉడిగిపోయి, ఒకింతలో=కాసేపటికే, ప్రాయపున్ ప్రొద్దు= ఆయువనే సూర్యుడు, పశ్చిమముఖమ్మునన్=పడమటి దిశకు, వ్రాలగనున్న=వాలిపోవడానికి సిద్ధంగానున్న, పెద్దలు=వయసుమళ్ళినవారు, భవత్=నీచేత, ప్రతిపాదిత=అందింపబడిన, ధర్మమార్గ=ఆచరణపద్ధతి, చింతా లసితాత్ములై= అవలంబించాలనే ఆలోచనగలవారై, తెలిసి=పూర్తిగా జీవితాన్ని అనుభవించి, దారసుతాదులన్= భార్యాపిల్లలు మొదలైన సంసారాన్ని, ఉజ్జగించినన్=వదిలిపెడితే, పోలు=అది ఒకరకంగా మంచిపద్ధతి, మొగ్గను ద్రుంచుట=విరియకముందే పూవును తెంపేయడం, పిందెకోయుటల్=పెద్దగాకముందే కాయలు కోయటం, ఇదెట్టులొప్పితివి=ఇదేవిధంగా మంచిదో చెప్పు.

**తాత్పర్యం:** *కాలంచెల్లిన పండు ముదుసళ్ళు చావడానికి ముందు నీ సిద్ధాంతం నమ్మి భార్యాపిల్లల్ని సంసారాన్ని వదిలిపెట్టి నీవెంట పడితే బాగానే ఉంటుంది. కాని, ఇదేమిటి? విడవకముందే పూలుతెంపడం, కసరుగాయలు కోయడం...ఇదేమైనా బాగుందా?*

**'సత్తెముతో నహింసవలె శాశ్వతికమ్మగు భర్తయోగసం**
**పత్తికి భాజనంబవయి, వర్ధిలు మమ్మరో' యంటికాదె, యా**
**ర్యోత్తమ! మా వివాహపు ముహూర్తమునన్ బ్రణమిల్ల, నేల మా**
**పొత్తెడసేయుటల్, భవదమోఘవచస్కత కేల లోపముల్?**

**అర్థాలు:** ఆర్యోత్తమ=ఉత్తములలో ఉత్తముడా! మావివాహపు=మాపెండ్లినాటి, ముహూర్తమునన్=శుభవేళలో, ప్రణమిల్లన్=నీ కాళ్ళకుమొక్కితే, సత్తెముతోన్=నిజం మాట్లాడటానికి, అహింసవలె=బాధపెట్టకుండా ఉంటానికిగల సంబంధంలా, శాశ్వతికమ్మగు=నిరంతరమైన, భర్తయోగసంపత్తికి=మగనితోకలసి ఉండటానికి, భాజనంబ వయి=యోగ్యురాలివై, వర్ధిలుమమ్మరో=పైకిరా తల్లీ, అంటికాదె=అన్నావుకదా, ఏల=ఎందుకు, మాపొత్తు= మాబంధం,

ఎడసేయుటల్=తెంపటం ఎందుకు? భవత్=నీ, అమోఘవచస్కతకు=తిరగులేని వాగ్బలానికి, ఏల= ఏమిటియీ, లోపముల్=విరోధాలు?

**తాత్పర్యం:** *ఉత్తమోత్తముడా! మా పెండ్లివేళ మేము నీకాళ్ళకు మొక్కితే ఏమనిదీవించావ్! సత్యానికి అహింసకు శాశ్వతమైన బంధం ఎలా ఉంటుందో అలాంటి బంధంతో మమ్మల్ని బ్రతకమన్నావుకదా! ఇప్పుడు ఎందుకు మా బంధాన్ని నీవే తెంపేసావ్? పవిత్రమైన నీ మాటకు విలువలేదా?*

**పిట్టలుగా మృగములుగాఁ**
**బుట్టుండని శాపమిచ్చి పోగూడదొ, మే**
**మట్టే జంటం బాయక**
**చెట్టుల గుట్టలను బట్టి జీవింతుముగా.**

**అర్థాలు:** పిట్టలుగా=పక్షులుగానో, మృగములుగాన్=అడవిజంతువులుగానో, పుట్టుండని= పుట్టమంటూ, శాపమిచ్చి=మమ్మల్ని శపించి, పోగూడదొ=వెళ్ళిపోకూడదా? మేము=మేమిద్దరం, అట్టే=ఆవిధంగానే, జంటం బాయక=విడిపోకుండా, చెట్టులగుట్టలబట్టి= ఏచెట్టుమీదనో ఏగుట్టమీదనో, జీవింతుముగా=బ్రతికేవాళ్ళంకాదా!

**తాత్పర్యం:** *పక్షులుగానో జంతువులుగానో పుట్టమని శపిస్తే ఇంతకంటే బాగుండేది. వాటిలాగానే ఏచెట్టుమీదనో ఏగుట్టమీదనో కలిసి జీవించేవాళ్లంకదా!*

**వలలోఁ జిక్కిన జక్కవ**
**పులుఁగుంబలె డిందువడి కవూకువు మనుచున్**
**విలపించు నా మనోహరు**
**నెలుఁగుల్ చెవి సోఁకుచున్న విచటికి నాకున్.**

**అర్థాలు:** వలలోన్ చిక్కిన=వల్లోపడ్డ, జక్కవపులుఁగుంబలె=చక్రవాకపక్షిలాగా, డిందువడి= అణగిపోయి, కువూకువుమనుచున్=కూకూమంటూ, విలపించు=ఏడుస్తున్న, నామనోహరున్=నాచిత్తచోరుని, ఎలుగుల్= కంఠధ్వనులు, ఇచటికి=ఇంతదూరానికి, నాకున్= నాకు, చెవిసోఁకుచున్నవి=వినపడుతున్నవి.

**తాత్పర్యం:** *వల్లోపడ్డ చక్రవాకంలా కదలలేక కువుకువుమని ఏడుస్తున్న నావాడి గొంతు సడులు ఇంతదూరానికి కూడా నాకు వినిపిస్తున్నాయి.*

**పశుపక్ష్యాదుల కష్టపు**
**దశ చూడఁగలేని నీవు తమ్ముని యేడ్పుల్**
**విశదముగా వినగల్గుట**
**వశిపుంగవ! నా యభాగ్యవశమునఁగాదే!"**

**అర్థాలు:** వశిపుంగవ=ఇంద్రియవిజేతా! పశుపక్ష్యాదుల=నోరులేనివాని, కష్టపుదశ=బాధపడే విధం, చూడఁ గలేని=చూడలేని, నీవు=దయాసముద్రుడవు, తమ్మునియేడ్పుల్=తమ్ముడి రోదనలు, విశదముగా=ప్రత్యక్షంగా, వినగల్గుట=వినిసహిస్తున్నావంటే, నాయభాగ్యవశమునన్=నాదురదృష్టంవల్ల, కాదే=కదా!

**తాత్పర్యం:** *ఓ జితేంద్రియశ్రేష్ఠా! పక్షులు జంతువులు బాధపడుతూంటేనే చూడలేని నీవు తమ్ముడు రోదిస్తూంటే ఎదురుగావుండి వింటున్నావంటే అది నాదురదృష్టం కాదా!*

**కని కడవెళ్ళని దుఃఖ**
**మ్మునఁ బొరలెడి దేవిఁగాంచి ముదుసలి చెలి యో**
**ర్తనునయము నయముగల మె**
**త్తని పలుకులఁ బెక్కుగతులఁ దాలిమి గఱపున్.**

**అర్థాలు:** కని=ప్రాప్తించి, కడవెళ్ళని=పూర్తిగాపోని, దుఃఖమ్మునన్=విచారంతో, పొరలెడి= పడిదొర్లే, దేవిన్=తన యజమానిని, కాంచి=చూచి, ముదుసలిచెలియోర్తు=ఒక ముసలి చెలికత్తె, అనునయము=ఓదార్పు, నయముగల= మృదువుకలిసిన, మెత్తనిపలుకులన్=బాధ కలిగించని మాటలతో, పెక్కుగతులన్=అనేకవిధాలుగా, తాలిమి గఱపున్=అణకువ నేర్పుతోంది.

**తాత్పర్యం:** *వచ్చిన దుఃఖం పూర్తిగాపోక పడిదొర్లుతున్న యజమానిని చూచి ఒకముసలి చెలికత్తె ఓదారుస్తూ మృదువుగా మెత్తనిమాటలతో అనేకవిధాలుగా ఊరుకోబెట్టింది.*

**'పరమమృదువయ్యు, జీవితేశ్వరుని కంటె**
**ధీరమానస మా చిన్న దేవి యనుచుఁ**
**జెప్పికొని మెచ్చుగా సంతసింతు మేము;**
**ఇంతమాత్రకె బేలవైతేమి తల్లి!**

**అర్థాలు:** మాచిన్నదేవి=మా చిన్న రాణి, పరమమృదువయ్యు=ఎంతో సుకుమారమైనా, జీవితేశ్వరునికంటె= తనభర్తకంటె, ధీరమానస=ఎంతో ధైర్యచిత్తం కలది, అనుచు=అని, చెప్పికొని=చెప్పుకొంటూ, ఏము=మేమంతా, మెచ్చుగా=పొగడుకొని, సంతసింతుము= సంతోషిస్తాం, ఇంతమాత్రకె=అయ్యో ఇంతమాత్రానికే, బేలవైతి= పిరికిదానివయ్యావు, ఏమితల్లి=ఏమిటమ్మా ఇది?

**తాత్పర్యం:** *మా చిన్నిరాణి చూడటానికి ఎంతో సుకుమారమైనా ధీరగంభీరుడు తనభర్త నందకుమారునికంటె ఎంతో ధైర్యసాహసాలు కలిగింది అని నిన్నెంతగానో పొగుడు కొంటూంటాం. అలాగని మేమెంతో సంతోషిస్తాం. కాని ఇదేమిటితల్లీ! నీభర్త రావడం కాస్తంత ఆలస్యమైతేనే ఇలా అయిపోయావు! నీవింత పిరికిదానివని మేమెప్పుడూ అనుకోలేదు. అయ్యో... ఏమిటమ్మా ఇది? ఊరుకో!*

**దినదిన మెంతమంది గురుదేవుని దర్శన మాచరింపఁగా**
**జనరు? సపర్య సల్పి నిజసద్మము చేరరు? పెద్దకాలమై**
**కనినకతాన నీవిభుఁడు గౌతమదేవునితోడ నేమి మం**
**తనమున నున్నవాఁడొ, తనుదాఁ జనుదెంచెడి నింత నంతటన్.**

**అర్థాలు:** దినదినము=ప్రతిరోజూ, ఎంతమంది=ఎందరుభక్తులు, గురుదేవుని= బుద్ధభగవానుని, దర్శన మాచరింపఁగా=చూడటానికి, చనరు=వెళ్ళటంలేదు? సపర్యసల్పి= సేవచేసికొని, నిజసద్మము=వారిండ్లకు, చేరరు= తిరిగివెళ్ళరు? పెద్దకాలమై=ఎంతోకాలం క్రితం, కనినకతాన=చూచినందువల్ల, నీవిభుఁడు=నీ భర్త నందుడు, గౌతమదేవునితోడ= అన్నగారిమీది ప్రేమతో, ఏమి=ఏమేమి, మంతనమునన్=రహస్య సమాలోచనాలలో, ఉన్న వాఁడొ=మునిగిపోయాడో! ఇంతనంతకున్=ఇప్పుడు కాకపోతే ఇంకొంత సేపటికి, తనుదాన్= తనంతటతానే, చనుదెంచెడిన్=వస్తాడు చూడు.

**తాత్పర్యం:** *ప్రతిదినం ఎంతమంది జనం ఆ అయ్యవారిదర్శనానికి వెళ్ళడంలేదు? వారి సేవచేసికొని ఇంటికి తిరిగి వెళ్ళడంలేదు? ఎంతోకాలంగా అన్నగారిని చూడనందువల్ల ఏవేవో కుటుంబవిషయాలు మాట్లాడుకొంటూ ఉండిపోయి ఉండొచ్చు. ఇప్పుడుకాకపోతే ఇంకొంత సేపటికి నీభర్త తనంతతానే వస్తాడుచూస్తూండు.*

**కన్నుసన్నల మెలఁగెడి కాంతుగుఱిచి**
**యీ యధీరవిచారము లింపు గావు;**
**విభుఁడు గ్రమ్మఱివచ్చెడి వేళయయ్యె**
**లెమ్ము, మాయమ్మ!' యని సాంత్వనమ్మొనర్చె.**

**అర్థాలు:** కన్నుసన్నలమెలఁగెడి=నిత్యం చెప్పినట్లు చేసే, కాంతుగుఱిచి=నీ భర్తనుగురించి, ఈ=ఇటువంటి, అధీర=అల్పమైన, విచారములు=ఆలోచనలు, ఇంపుగావు=బాగుండవు, విభుఁడు=నీ భర్త నందుడు, క్రమ్మఱివచ్చెడి=తిరిగివచ్చే, వేళయయ్యె=సమయమయింది, లెమ్ము=ఇంక దుఃఖాన్ని ప్రక్కనపెట్టి లే, మాయమ్మ=మా అమ్మవుకదూ! అని=అనిచెబుతూ, సాంత్వనమ్మొనర్చె=అనేక విధాలుగా ఊరుకోబెట్టింది.

**తాత్పర్యం:** *నీవు ఎలా చెబితే అలా నడిచే నీభర్త గురించి ఎందుకు ఇటువంటి మాటలతో నీ మెదడు పాడుచేసికొంటావు? పతివ్రతలకు ఇటువంటి పలుకులు మంచివికావమ్మా! ఇంక నీ ప్రియభర్త తిరిగివచ్చే వేళయిందికదా! ఇంక లేమ్మా... మా అమ్మవుకదూ! ధైర్యంగా ఉండమంటూ అనేకవిధాలుగా ఆ వృద్ధచెలికత్తె సుందరిని ఓదార్చింది.*

**అంతట భానుమంతుఁ దపరాంబుధి గ్రుంకఁగ, నత్తలోదరీ**
**స్వాంతమునందుఁబోలెఁ గలయన్ దెసలెల్లఁ దమంబు ప్రాఁకె, నా**
**కాంతను బుజ్జగించు చెలికత్తెలు వితైదు నాసపోల్కి నొ**
**క్కింతవెలుంగు దోఁప నుదయించెను దారక లక్కడక్కడన్.**

**అర్థాలు:** అంతట=ఆసమయంలో, భానుమంతుఁడు=సూర్యుడు, అపరాంబుధి=పశ్చిమ సముద్రంలో, క్రుంకఁ గన్=దిగిపోగా, ఆ+తలోదరీ=ఆ ఉదరం లోతైన సుందరియొక్క, స్వాంతమునందున్=అంతరంగంలోని ప్రదేశం, పోలెన్=వలె, దెసలెల్లన్=దిక్కులన్నీ, కలయన్=కలిసిపోయేటట్లు, తమంబుప్రాఁకెన్=చీకట్లు వ్యాపించాయి. ఆకాంతను=ఆమెను, బుజ్జగించు=ఊరడించే, చెలికత్తెలు=పరిచారికలు, విత్తెడున్=ఆమెహృదయంలో నాటే, ఆసపోల్కిన్=చిన్ని ఆసక్తివలె, ఒక్కింత=పిసరంత, వెలుంగుదోఁపన్=కాంతి కనిపించేలా, అక్కడక్కడన్= దూరదూరంగా, తారకలు=చుక్కలు, ఉదయించెను=పొడిచాయి.

**తాత్పర్యం:** *ఈ విధంగా చెలికత్తెలు ఊరడిస్తూండగా ప్రొద్దుక్రుంకింది. ఆ సుందరి మనసులో వలెనే దిక్కులన్నీ చీకట్లు వ్యాపించాయి. ఆమెను ఊరడించే చెలులు ఆమెలో నాటే ఆశలనే విత్తనాలలాగా కొంచెం వెలుగనిపించేలా అక్కడక్కడా చుక్కలుపొడిచాయి.*

ఇది

చతుర్థసర్గము

# అనుతాపము

**స్మరదుర్మదున్ బట్టి సపరివారంబుగాఁ**
**బశువరించిన యజ్ఞవాటివోలె,**
**నూర్మిసంక్షోభమ హోపద్రవము లేక**
**నిశ్చలంబగు శాంతనీరధివలెఁ,**
**బ్రావృట్పయోధరావరణమ్ము తొలఁగి ని**
**ర్మలమైన శారదాభ్రమ్ము వోలెఁ,**
**బ్రశమిత రాజసారంభమై మఱి శుద్ధ**
**సత్త్వప్రకాశమౌ స్వాంతమువలె,**

**శాంతపావన గంభీర సరళభావ**
**బంధురంబయి ధర్మదేవత స్వయమ్ము**
**కోరి కట్టించుకొన్నట్టి కొల్వుకూట**
**మనఁగ నొప్పారు బౌద్ధవిహారభూమి.**

**అర్థాలు:** స్మరదుర్మదున్=దుర్మార్గుడైన మన్మధుని, పట్టి=వడిసిపట్టి, సపరివారంబుగాన్= అతనికి తోడొచ్చే వసంతాదుల సహితంగా, పశువరించిన=విశసనంచేసిన(బలిచేసిన), యజ్ఞవాటివోలెన్=హోమగుండంలాగా, ఊర్మి=కెరటాలతో, సంక్షోభ=కల్లోలమై, మహా=గొప్ప, ఉపద్రవములేక=గత్తరలేకుండా, నిశ్చలంబగు=చలనంలేని, శాంతనీరధివలెన్=ప్రశాంతమైన సముద్రంలాగా, ప్రావృట్=వర్షాకాలపు, పయోధర=మేఘాల, ఆవరణమ్ము=కప్పు, తొలఁగి=తప్పుకొని, నిర్మలమైన=స్వచ్ఛమైన, శారద=శరత్కాలపు, అభ్రమ్మువోలెన్=ఆకాశంలాగా, ప్రశమిత= చల్లబడ్డ, రాజస=రజోగుణంతో, ఆరంభమై=మొదలై, మఱి=చివరికి, శుద్ధసత్త్వ=అచ్చమైన సత్త్వ గుణంచేత, ప్రకాశమౌ=కాంతులీనే, స్వాంతమువలె=మనస్సులా, శాంత=ప్రశాంతమైన, పావన=పవిత్రమైన, గంభీర=బిగుతైన, సరళభావ=మృదుభావంచేత, బంధురంబయి= మనోహరమైన, ధర్మదేవత=న్యాయాచారదేవత, స్వయమ్ము=తానే, కోరికట్టించుకొన్నట్టి= కావాలనికట్టించుకొన్న, కొల్వుకూటమనఁగ=సభాభవనంలా, బౌద్ధవిహారభూమి=బుద్ధుని ఆశ్రమం, ఒప్పారు=ప్రకాశిస్తోంది.

**తాత్పర్యం:** *మన్మథుని పరివారంతోకలిపి బలిచేసిన యజ్ఞభూమిలా, కెరటాలగత్తరలేని*

*నిశ్చలమైన సముద్రంలా, వర్షమేఘాలుతొలగి నిర్మలమైన శారదాకాశంలా, రజోగుణం తగ్గి సత్త్వగుణం పొంగిన మనస్సులా, ప్రశాంతం పవిత్రం గంభీరం మృదుభావాలచేత అందమైన ధర్మదేవత కావాలని కట్టించుకొన్న సభావేదికలా ఆ బుద్ధునివిహారభూమి ప్రకాశిస్తోంది.*

**తఱచగు చెట్లనీడ సికతాకృతవేదుల సావధానతన్**
**గిఱిగొని యుండు శిష్యులకుఁ గేవలతాపరమార్థబోధముల్**
**గఱపెడి శాక్యమౌనిపయిఁ గమ్మఁదనమ్ముల క్రోవులైన క్రొ**
**వ్విరులను జల్లుచుండుఁ బృథివీరుహముల్ సుకృతంబు పెంపునన్.**

**అర్థాలు:** తఱచు+అగు=ఎక్కువైన, చెట్లనీడ=వృక్షాల ఛాయలు, సికతాకృత=ఇసుకతో చేయబడిన, వేదుల=వేదికలు, సావధానతన్=వినడానికి సిద్ధంగా ఉండి, గిఱికొని=చుట్టూచేరి, ఉండు=ఉన్న, శిష్యులకున్= అంతేవాసులకు, కేవలతా=కేవలం, పరమార్థబోధముల్=మోక్ష సంబంధమైన ప్రవచనాలు, కఱపెడి=నేర్పే, శాక్యమునిపయిన్=బుద్ధదేవునిపై, కమ్మఁదనమ్ముల=సువాసనల, క్రోవులైన=చల్లేవైన, క్రొవ్విరులను=క్రొత్తపూలను, సుకృతంబు= పూర్వపుణ్యం, పెంపునన్=ఎక్కువైనందున, పృథివీరుహముల్=పరిసర వృక్షాలు, చల్లుచుండున్= చల్లుతూంటాయి.

**తాత్పర్యం:** *నిండైన చెట్లనీడలలో ఇసుకవేదికలపై విద్యార్థులైకూర్చున్న శిష్యులకు మోక్ష మార్గాలు మాత్రమే బోధించే శాక్యమునిపైన అక్కడి పెద్దపెద్దచెట్లు తమపూర్వపుణ్యంచేత సువాసనలు వెదజల్లే క్రొంగ్రొత్త పూలను చల్లుతున్నాయి.*

**గురువరు నుపదేశమ్ములు**
**మఱవక చింతనముసల్పి, మాన్యములు తదా**
**చరితముల నాచరింతురు**
**బురములఁ దిరుగుదురు బుద్ధమునివరు శిష్యుల్.**

**అర్థాలు:** బుద్ధమునివరు=బుద్ధభగవానుని, శిష్యుల్=అనుచరులు, గురువరున్=తమగురువు గారైన బుద్ధుని, ఉపదేశమ్ములు=బోధలు, మఱవక=వెంటనే మరచిపోకుండా, చింతనము సల్పి=మననంచేసి, మాన్యములు= గౌరవింపదగినవి అయిన, తదాచరితములన్=ఆచరింప దగినవాటిని, ఆచరింతురు=తమ నిత్యజీవితంలో అనుసరిస్తారు, పురములన్=ఆయా పట్టణాలలో, తిరుగుదురు=చరిస్తారు.

**తాత్పర్యం:** *ఆవిధంగా బుద్ధుడుచేసే బోధనలు వెంటనే మరచిపోకుండా మననం చేసికొంటూ, ఆచరణలో పెడుతూ ఆ శిష్యులు పట్టణాలలో తిరుగుతూంటారు.*

**క్షణవిజ్ఞాననిరూపణమ్ములు, నహింసాధర్మసార ప్రసా**
**రణముల్, జాతివిభేదకాననకుఠారమ్ముల్, దయాసత్యపో**

**షణముల్, గౌతము భాషణమ్ము, లవి శిష్యశ్రేణి తత్ప్రాంతప**
**ట్టణవల్లీ జనసన్నివేశములఁ జాటంబోదు రశ్రాంతమున్.**

**అర్థాలు:** క్షణవిజ్ఞాన=మనకు కనిపించేదంతా క్షణభంగురం శాశ్వతంకాదు అనే తెలివికి, నిరూపణమ్ములున్= కొన్ని ఉదాహరణలు, అహింసాధర్మ=మనం చేసేపనివల్ల మరొక జీవికి బాధకలగకూడదనే న్యాయంయొక్క, సార=నిగ్గును, ప్రసారణముల్=వెదజల్లేవి, జాతివిభేద= పుట్టుకచేత ప్రాప్తించే తెగల తేడాలనే, కానన=అడవికి, కుఠారమ్ముల్=తెగనరికే గండ్ర గొడ్డళ్ళు, దయాసత్య=తక్కువవారిపైన కరుణ అనే మనోవ్యాపారం ఎట్టిపరిస్థితుల లోను నిజంచెప్పటనే మరోమనోవ్యాపారం ఈరెంటికీ, పోషణమ్ముల్=బలంచేకూర్చేవి, అవి=అనే సూర్యకిరాణాలైన, గౌతము=ఆ బుద్ధుని, భాషణమ్ములు=అమూల్యమైన పలుకులరత్నాలను, శిష్యశ్రేణి=వారి అంతేవాసుల బృందాలు, తత్ ప్రాంత=ఆ పరిసరములందలి, పట్టణవల్లీ= ఆవాసాల మధ్యగల, జన=ప్రజల, సన్నివేశములన్= సమూహాల కంతకూ, అశ్రాంతమున్= విశ్రాంతిలేకుండా అన్నివేళలా, చాటంబోదురు=తెలియజెప్పటానికి పోతూంటారు.

**తాత్పర్యం:** *కనిపించేవన్నీ బుద్బుదాలని కొన్ని ఉదాహరణలు, అహింసాధర్మసారాన్ని వెదజల్లేవికొన్ని, జాతివర్గభేదాల అడవిని నరికేసే పరికరాలుకొన్నీ, దయాసత్యాలకు బలం చేకూర్చేవికొన్నీ అయిన చీకటినిపోగొట్టే బుద్ధుని బోధనలు ఆయాప్రాంతాల ప్రజాహృదయాల్లో బలంగా చాటిచెప్పటానికి వారి శిష్యగణాలు నిరంతరం పోతూనే ఉంటారు.*

**ఛాగమ్ము మెడకుఁ గసాయికత్తికి మధ్య**
**వెసఁజొచ్చి వ్రేటు తప్పించువారు,**
**మాలపల్లెల కేగి మంచిమాటలు చెప్పి**
**దేహ శౌచమ్ము బోధించువారు,**
**దూరతఃపరిహృతదర్గంధకుష్ఠ దే**
**హుల కుపచారముల్ సలుపువారు,**
**ఆప్తవియోగసంతప్తుల కూఱట**
**చెప్పి విరక్తి శిక్షించువారు,**

**నాఁడునాఁటికిఁ బదులు వందలుగఁజేరు**
**జనములకు ధర్మదీక్ష లొసంగువారు**
**నౌచుఁ దిరుగుచునుందు రత్యంతసత్య**
**ధర్మశీలురు దేవదూతలవిధాన.**

**అర్థాలు:** ఛాగమ్ముమెడకున్=మేకపోతు మెడకు, కసాయి కత్తికి=హంతకునిచేతి కత్తికి, మధ్య= నడుమ, వెసన్=వేగంగా, చొచ్చి=ప్రవేశించి, వ్రేటు=కత్తిదెబ్బను, తప్పించువారు=తొలగించు వారును, మాలపల్లెలకేగి= అంటరానివారి వసతులకు వెళ్ళి, మంచిమాటలుచెప్పి=జీవితంలో చేయవలసినవేవో చెప్పి, దేహశౌచమ్ము=శరీరం

శుభ్రంచేసికొనే మార్గాలు, బోధించువారు= తెలియజెప్పేవారును, దూరతః=దూరంగా, పరిహృత=వదిలివేయబడిన, దుర్గంధ=చెడు వాసనలు వెదజల్లే, కుష్ఠదేహులకు=కుష్ఠువ్యాధిపీడితులకు, ఉపచారముల్=సేవలు, సలుపువారు= చేసేవారును, ఆప్తవియోగ=దగ్గరవారు పోయిన, సంతప్తులకు=బాధితులకు, ఊఱటచెప్పి= ఊరుకోబెట్టి, విరక్తి=ఎప్పటికైనా వియోగం తప్పదని, శిక్షించువారు=మనసును కుదుటపరచువారును, నాఁడునాఁటికిన్= రోజురోజుకూ, పదులు వందలుగఁజేరు=అసంఖ్యాకంగా చేరే, జనములకు=ప్రజలకు, ధర్మదీక్షలు= బౌద్ధమత సంస్కారాలు, ఒసంగువారున్=నేర్పేవారును, ఔచున్=అగుచూ, అత్యంతసత్యధర్మశీలురు=గొప్పవైన సత్యధర్మాలను అనుసరించే ఆ సన్యాసులు, దేవదూతలవిధాన=దైవపురుషుల్లాగా, తిరుగుచునుందురు= ఆశ్రమమంతా సంచరిస్తూంటారు.

**తాత్పర్యం:** *అక్కడి బౌద్ధసన్యాసులు దేవదూతల్లాగా కొందరు కటికవానికీ మూగజీవానికీ మధ్యదూరి వాటినిరక్షిస్తూంటే, కొందరు మాలపల్లెలకువెళ్ళి వారికి దేహశుభ్రతావిధులు బోధిస్తూంటే, కొందరు ఎవరూదగ్గరకు వెళ్ళలేని కుష్ఠువ్యాధి పీడితులకు సేవచేస్తూంటే, కొందరు దగ్గరవారు చనిపోయి బాధపడేవారిని జననధర్మంచెప్పి ఓదారుస్తూంటే, మరి కొందరు ప్రతిరోజూ గుంపులుగుంపులుగా ఆశ్రమంలో సేవకుచేరే ప్రజలకు బౌద్ధధర్మ దీక్షలు ఇస్తూంటే వారు అత్యంత సత్యధర్మపరులుగా ఆశ్రమమంతా తిరుగుతున్నారు.*

**వారువీరను భేదభావమ్ములేక**
**దొరకునెడ భిక్షగొందు రాదరము నించి,**
**నెమ్మది శయించెదరు రాత్రి నెలవు చేరి**
**గురుని పాదాంతికమ్మున శిరము లుంచి.**

**అర్థాలు:** వారువీరను=ఆ సన్యాసులు పేదగొప్పా అనే, భేదభావమ్ములేక=తేడాలు మనసులో పెట్టుకోకుండా, ఆదరమునించి=ఒకరినొకరు ప్రేమించుకొంటూ, దొరకునెడ=ఎవరైనా పిలిచి భిక్షవేస్తే, భిక్షగొందురు=దానిని స్వీకరిస్తారు, రాత్రి=చీకటివేళకు, నెలవుచేరి=ఆశ్రమానికి చేరి, గురుని=ఆచార్యుని, పాదాంతికమ్మున=పాదాలవద్ద, శిరములుంచి=తలలు పెట్టుకొని, నెమ్మది=హాయిగా, శయించెదరు=నిద్రపోతారు.

**తాత్పర్యం:** *ఆ బౌద్ధసన్యాసులలో పేద గొప్పా అనే భేదంలేదు. అసలా తేడాలు వారి మనసుల్లోసైతం పుట్టవు. వారు ఎప్పుడూ ఒకరినొకరు ఆదరంతో ప్రేమగానే మసలు కుంటారు. సాయంత్రానికి ఊళ్ళోకి భిక్షకోసంవెడతారు. ఎవరైనా పిలిచి పెడితే స్వీకరిస్తారు. రాత్రికి ఆశ్రమంచేరి గురువుగారి పాదాలవద్ద తలలుపెట్టుకొని హాయిగా నిద్రిస్తారు.*

**చూపు మేరకె చిత్తవిక్షోభములన**
**ణంచి యానందధామ మనంగనొప్పు**

**నా విహారమ్ము నందుని భావమునకు**
**నింతయనరాని విక్షోభహేతువయ్యె.**

**అర్థాలు:** చూపుమేరకె=ఒక్కదృష్టి మాత్రంచేతనే, చిత్తవిక్షోభములను=మానసిక వ్యధలన్నిటినీ, అణంచి= త్రొక్కిపెట్టి, ఆనందధామము=శాశ్వత సంతోషానికి కేంద్రము, అనంగనొప్పున్= అనేవిధంగా వెలుగులు చిందే, ఆ విహారమ్ము=ఆ బుద్ధుని ఆశ్రమం, నందుని=నూతనంగా చేరిన నందకుమారుని, భావమునకున్=ఆలోచనలకు, ఇంతయనరాని=గొప్ప, విక్షోభ= బాధకు, హేతువయ్యె=కారణమైంది.

**తాత్పర్యం:** *ఒక్కచూపుతోనే జనుల మానసిక సమస్యలకు పరిష్కారం చూపించే ఆనంద ధామంగా పేర్గన్న బుద్ధుని విహారభూమి నందునికి మాత్రం గొప్పబాధా కారణమయింది.*

**బోనునఁ బడ్డ భద్రగజపోతము పోలిక రోషదుఃఖితం**
**బైన మనంబుతోఁ, దరళితాశ్రువిమూఢవిలోకనమ్ముతో**
**నానృపసూతి యేకతములైన ప్రదేశములందుఁ జేరి యెం**
**తేని కుమారిలున్ జలరుహేక్షణఁ బ్రేయసి నెంచి యిట్లనున్:**

**అర్థాలు:** ఆనృపసూతి=ఆ రాకుమారుడైన నందుడు, బోనునన్=కపటపుగోతిలో, పడ్డ=పడిపోయిన, భద్రగజ పోతము=మదించిన పట్టపుటేనుగు, పోలిక=విధంగా, రోష=కోపంతో, దుఃఖితంబైన=రోదించుచున్న, మనంబు తోన్=మనస్సుతో, తరళిత=మెరుస్తూన్న, అశ్రు=కన్నీటిచేత, విమూఢ=అచేతనమైన, విలోకనమ్ముతో=చూపుతో, ఏకతములైన=ఒంటరి, ప్రదేశములందున్=చోట్ల, చేరి=ప్రవేశించి, ఎంతేని=ఎంతగానో, కుమారిలున్=దుఃఖ పడుతూంటాడు, జలరుహేక్షణన్=పద్మాలవంటి కన్నులుగల, ప్రేయసిన్= ప్రియురాలైన సుందరిని, ఎంచి= తలచుకొని, ఇట్లనున్=ఈ విధంగా అనుకొంటూంటాడు.

**తాత్పర్యం:** *ఆ రాకుమారుడైన నందుడు కపటపుగోతిలోపడిపోయి బయటకురాలేక బయటపడని కోపంతో రోదించే మదించిన పట్టపుటేనుగులా బాధపడుతూన్న చిత్తంతో, కన్నీటితో మెరుస్తున్నా చైతన్యం కోల్పోయిన ఎక్కడచూస్తున్నాడో తెలియని కంటిచూపులతో ఒంటరిగా ఎవరూకనిపించని చోటుల్లో చేరి ఎంతగానో బాధపడుతూన్నాడు. అంతలోనే పద్మాలవంటి కన్నులుగల తన ప్రియురాలు సుందరి గుర్తుకొచ్చింది. ఆమెను తలచుకొంటూ ఈ విధంగా విలపిస్తూన్నాడు నందుడు.*

**"హా! నవనీతకోమలి! ప్రియా! జగదేక విమోహనాంగి! నా**
**ప్రాణధనంబ! నా ప్రణయరాజ్యరమారమణీయ వైభవం**
**బా! నినుఁ బాసి యొంటిమెయిఁ బ్రాణముతో నిట నున్నవాఁడ, నీ**
**దీనుని నిస్సహాయుని గతిన్ గనువారలు లేక నెచ్చెలీ!**

**అర్థాలు:** హా=ఓ, నవనీతకోమలి=వెన్నవలె మెత్తనైన మృదువైనదానా! ప్రియా=నా ప్రియురాలా! జగదేక=ప్రపంచంలో సాటిలేని, విమోహనాంగి=బాగా ఆకర్షించే అవయవాలుగలదానా! నాప్రాణధనంబ=నా జీవన విత్తమా! నా ప్రణయరాజ్య=నా ప్రేమ సామ్రాజ్యమనే, రమా=లక్ష్మికి, రమణీయ=మనోహరమైన, వైభవంబా= సంపదనే ప్రాణప్రియా! నెచ్చెలీ=మంచిస్నేహితురాలా! సుందరీ! ఈదీనుని=ఈ బాధపడేవానిని, నిస్సహాయుని గతిన్= ఏవిధమైన సహాయం లేనివానివలె, కనువారలులేక=నా హృదయం తెలిసినవారు కనిపించక, నినున్=ప్రేయసివైన నిన్ను, పాసి=విడిచిపెట్టి, ఒంటిమెయిన్= ఒంటరిగా, ఇటన్=ఇక్కడ ఈ ఆశ్రమంలో, ప్రాణముతో=ఇంకా బ్రతికే, ఉన్నవాఁడన్= ఉన్నాను.

**తాత్పర్యం:** *ఓ వెన్నవంటి మృదువైనదానా! ప్రపంచంలో సాటిలేని మోహనాంగీ! నా ప్రాణ ధనమా! నా ప్రియురాలా! నా ప్రేమసామ్రాజ్య లక్ష్మికి ఆనందదాయకమైన గొప్పసంపదా! ప్రాణస్నేహితురాలా! ఇక్కడ ఈ దీనుడు నీప్రియుడు ఒంటరిగా సహాయంచేసేవారు లేక ఇంకా ప్రాణాలతోటే ఉన్నాడుసుమా!*

**'నీ నయనమ్ములాన, గురునిం గని మ్రొక్కిడి యంతలో ననా**
**శ్యానవిశేషకమ్ము భవదాననలక్ష్మి భజింపవత్తుఁగా**
**దా! నను నమ్ము' మంచు శపథమ్ములు పల్కిన, ధర్మవృత్తికిన్**
**హాని యొనర్పలేక సరియంటిని, తత్ఫల మిట్టులయ్యెఁబో.**

**అర్థాలు:** నీ నయనమ్ములాన=నీ కనులమీద ఒట్టు, గురునింగని=అన్నగారిని చూచి, మ్రొక్కిడి=సేవించి, అంతలోన్=ఆవెంటనే, అనాశ్యాన=ఎండిపోని, విశేషకమ్ము=మకరికా పత్రంతో శోభించే, భవదాననలక్ష్మి=నీ ముఖసౌందర్యాన్ని, భజింపవత్తుగాదా=పొగడటానికి వస్తానుకదా! నననమ్ముము=నామాట నమ్మవూ, అంచు= అంటూ, శపథమ్ములు=ఒట్లు, పల్కిన=వేసికూడా, ధర్మవృత్తికిన్=సేవాధర్మానికి, హానియొనర్పలేక=నష్టంచేయలేక, సరియంటిని=ఇక్కడ సరే అన్నాను, తత్ఫలము=దానిఫలితం, ఇట్టులయ్యెఁబో=ఇలా తయారయింది సుమా!

**తాత్పర్యం:** *అన్నగారికి భిక్షపెట్టి వెంటనే నీబుగ్గలమీది మకరికలు ఆరిపోకముందే తిరిగి వచ్చి నీ ముఖలక్ష్మిని సేవించుకుంటాను, నీ కనుదమ్ములమీదొట్టు, నన్నునమ్మమంటూ వెళ్ళాను. ఇక్కడ అన్నగారి ఆదేశాన్ని ఎదిరించలేక సరేనన్నాను. దాని ఫలితమేయిది. ఇలా అవుతుందని నేనూహించలేదు.*

**తడఁబడుగుండెతో నెదురుదారులు సూచుచు నిల్చినిల్చి, యె**
**య్యెడకును జూడగానమిఁ జెలీ! నను దూఱితొ, దూఱకుంటివో!**
**పడమటిగాడ్పు దెబ్బతిని, వాడిన తీవవిధమ్మునన్ బడ**
**ల్పడి వసివాడి కుట్టిమముపైఁ బడి కన్నులు తేలవైచితో.**

**అర్థాలు:** తడcబడు గుండెతోన్=తబ్బిబ్బుపడుతూ కొట్టుకునే గుండెతో, ఎదురుదారులు=నాకై ఎదురుచూపులు, సూచుచు=చూస్తూ, నిల్చినిల్చి=ఎంతోసేపు నిలబడి, ఎయ్యెడకును=ఎంత సేపటికీ, జాడగానమిన్=నన్నుచూడలేక, చెలీ=ఓ ప్రియురాలా! ననుదూఱితొ=నన్ను తిట్టుకున్నావా? దూఱకుంటివో=తిట్టుకోలేదా? పడమటిగాడ్పు=వేసవి వేడిగాలుల, దెబ్బతిని= బాగా వడదెబ్బతిని, వాడిన=వడలిపోయిన, తీవవిధమ్మునన్=పూలతీవలా, బడల్పడి= బడలిపోయి, వసివాడి=మృదుత్వంపోయి, కుట్టిమముపైన్=తీగసాగే పాకమీద, పడి=పడిపోయి, కన్నులు=నీ కళ్ళు, తేలవైచితో=తేలేసావా?

**తాత్పర్యం:** *ప్రియా! తడబడే గుండెతో నాకోసం ఎదురుచూచి ఎంతోసేపు నిలబడి ఎంతకూ నాజాడ కనిపించక నన్ను తిట్టుకున్నావా? చివరికి వడదెబ్బతిని వాడిపోయి వాలిపోయిన పూలతీవలాగా నీవుకూడా కళ్ళుతేలేసావా?*

**అకట! లభింపదాయెcగద! యాసమయమ్మునకైనc జేరి, నీ**
**ముకుళిత లోచనమ్మయిన మోమున మోమిడి, స్విన్నబాహువ**
**ల్లిక మెడకుం బెనంచికొని, 'లెమ్ము చెలీ! క్షమియింపు' మంచువేc**
**డికొనుచు వట్టివేళ్ళసురటిం గొని చల్లcగ వీచు భాగ్యమున్.**

**అర్థాలు:** అకట=అయ్యో! ఆసమయమ్మునకైనన్=ఆవేళకైనా, చేరి=అక్కడకు చేరుకొని, నీ ముకుళిత=నీవు మూసిన, లోచనమ్మయిన=కళ్ళుకలదైన, మోమున=నీముఖంమీద, మోమిడి=నా ముఖంచేర్చి, స్విన్న=నా చెమర్చిన, బాహువల్లిక=చేతులహారాన్ని, మెడకుం= నీకంఠానికి, బెనంచికొని=పెనవేసి, లెమ్ముచెలీ=మేలుకోప్రియా, క్షమియింపుము=నన్ను మన్నించు, అంచు=అంటూ, వేcడికొనుచు=నిన్ను బ్రతిమిలాడుతూ, వట్టివేళ్ళసురటిన్= వట్టివేళ్ళతోచేసిన వీవనను, కొని=చేత పుచ్చుకొని, చల్లcగ=నీవు సేదదీరేవిధంగా, వీచు=విసిరే, భాగ్యమున్= అదృష్టము కూడా, లభింపదాయెcగద=నాకు దొరకలేదు కదా!

**తాత్పర్యం:** *అయ్యో! నీవు పడిపోయిన ఆసమయానికైనా నీ దగ్గరికి చేరుకొని మూసిన కళ్ళతోనున్న నీ ముఖంమీద ముఖంపెట్టి చెమటతోతడిచిన నా చేతులతో నీమెడను పెనవేసి లేచెలీ, నన్ను మన్నించమంటూ బ్రతిమిలాడుతూ వట్టివేళ్ళ విసనకర్రతో విసురుతూ నీకు సేదదీర్చే అదృష్టంకూడా నాకు దక్కలేదుకదా!*

**వెలవెలcబోవు నెచ్చెలిపిండు మోమునc**
**క్రమముగా సంతోషకళలు దేఱ**
**దారుణంబైనట్టి తన్ముహూర్తము శుభో**
**దర్కమై మంగళోత్సవము సేయc**
**గువకువ వాపోవు కొదమరాచిల్క తె**

**క్కవిదిర్చి కెరలుచు గంతువేయ**
**అనుతాపవశమున నాభిముఖ్యము భజిం**
**పఁగలేక నాచూపు ప్రక్క కొదుఁగ**

**ముసురు విడిచిన నాఁటి క్రొంబ్రొద్దు పొడుపు**
**వేళఁ గెందమ్మివలె నరవిచ్చు నీదు**
**కన్నుఁగవ గాంచు భాగ్యమ్ము గల్గదాయె,**
**నెంతవానికి నంత యదృష్టరేఖ!**

**అర్థాలు:** వెలవెలఁబోవు=వెలిసిపోతున్న, నెచ్చెలిపిండు=నీ దగ్గరిచెలుల సమూహపు, మోమునన్=ముఖాలమీద, క్రమముగా=మెలమెల్లగా, సంతోష=ఆనందపు, కళలుదేఱ=రేఖలు పొడసూపగా, దారుణంబైనట్టి=మహా భయంకర మైన, తన్ముహూర్తము=ఆ కొద్ది కాలం, శుభోదర్కమై=ముందుగా క్షేమాలిస్తూ, మంగళోత్సవముసేయన్= పెద్ద పండుగ వేడుకలు చేయగా, కువకువవాపోవు=కువకువలాడుతూ బాధపడే, కొదమరాచిల్క= వయసులోనున్న రామచిలుక, ఱెక్కవిదిర్చి=రెక్కలువిప్పి, కెరలుచు=ఉప్పొంగి, గంతువేయ= ఎగిరి నృత్యంచేయగా, అనుతాప వశమున=పశ్చాత్తాపంతో, న+అభిముఖ్యము=ఎదురుపడక, భజింపఁగలేక=నిన్ను కీర్తింపలేక, నాచూపు= నాదృక్కులు, ప్రక్కకొదుఁగ=ఒకదరికి దప్పుకోగా, ముసురు=చిత్తడివాన, విడిచిననాఁటి=ఆగిపోయినరోజున, క్రొంబ్రొద్దుపొడుపు=క్రొత్తగా ప్రొద్దుపొడిచిన, వేళన్=ఉదయాన, కెందమ్మివలెన్=ఎఱ్ఱతామరవలె, అరవిచ్చు= తెరచుకొనే, నీదు=నీయొక్క, కన్నుఁగవ=కనుల అందాలను, కాంచు=చూచే, భాగ్యమ్ము=అదృష్టం, కల్గదాయెన్= నాకుపట్టలేదుకదా! అంత=అంతటి, అదృష్టరేఖ=సౌభాగ్యం యోగం, ఎంతవానికి= ఎంతటి పుణ్యాత్మునికో కదా!

**తాత్పర్యం:** *వెలవెలబోయే చెలుల ముఖాలమీద మెలమెల్లగా ఆనందరేఖలు పొడసూపు తూండగా, దారుణమైన ఆ విషాదముహూర్తం ముందుగా శుభాలిచ్చే మంగళోత్సవం కాగా, బాధపడుతూ కువకువలాడే కొదమరాచిల్క ఉప్పొంగి రెక్కలువిదిల్చి ఆనందంతో గంతులువేయగా, చేసినతప్పుకు పశ్చాత్తాపంతో నీకెదురుపడి మాటాడలేక నా చూపులు ప్రక్కదారులు వెదుక్కోగా, ముసురుపట్టి ఆగిననాడు క్రొత్త ప్రొద్దుపొడుపువేళ అరవిరిసే ఎఱ్ఱదామరల్లాంటి నీ కనుల అందాలను చూచి పరవశించే భాగ్యం నాకు లేదుకదా! అంతటి అదృష్టం ఎంతటి పుణ్యాత్ములకో కదా!*

**ఈ దెసకు నీదు చూపులు**
**ఆ దెసకున్ నాదుచూపు లల్లికగొని యా**
**రోదోంతరమునఁ గలియుట**
**యే దర్శనభాగ్య మంబుజేక్షణ! మనకున్.**

**అర్థాలు:** అంబుజేక్షణ=పద్మనయనా! ఈ దెసకు=ఇటువైపుకు, నీదు=స్త్రీసహజమైన నీ, చూపులు=లలితమైన

చూపులు, ఆ దెసకున్=అటు సుందరమైన నీ వైపుకు, నాదుచూపులు=పురుషత్వం పొంగిపొరలే నాయొక్క చూపులు, అల్లికగొని=పెనబడి అల్లుకొని, ఈ రోదోంతరమునన్=ఈ విశాల విశ్వపు అంచులలో, కలియుటయే= కలిసి విహరించడమే, మనకున్=మన యిద్దరికీ, దర్శనభాగ్యము=చూడటమే అదృష్టం కదూ!

**తాత్పర్యం:** *ఓ పద్మనయనా! నీ స్త్రీసహజమై లలితములైన చూపులు ఈ పురుషత్వం వైపుకు, నా పురుషత్వం పొంగిపొర్లే చూపులు ఆ లలితత్వం వైపుకు ప్రసరించి అల్లుకొని పెనవేసికొని ఈ విశాలవిశ్వాంతరాళపు అంచులందు విహరించే దృశ్యాన్ని దర్శించడం మనకు గొప్ప అదృష్టంకదూ!*

**అన్నయనుజ్ఞ లేక యడుగావలఁ బెట్టఁగ శక్తిలేదు, త**
**త్సన్నిధి కేగి నా వగపుచందము దెల్పఁగ శక్తి లేదు, నా**
**ఖిన్నత చూచి పొమ్మనుచు గెంటునుబో, యిటువంటి రూపుతో**
**ని న్నలరింప నీ యెదుట నిల్చెడి శక్తియు లేదు ప్రేయసీ!**

**అర్థాలు:** ప్రేయసీ=ప్రియురాలా సుందరీ! అన్న=అన్నగారైన బుద్ధభగవానుని, అనుజ్ఞలేక= అనుమతిలేకుండా, అడుగు=ఒక్కడుగుకూడా, ఆవలన్=బయటకు, పెట్టఁగ=వేయడానికి, శక్తిలేదు=మానసిక బలం లేనివాడిని, తత్సన్నిధికి=ఆయనముందుకు, ఏగి=వెళ్ళి, నా=నాదైన, వగపుచందము=దుఃఖవిషయం, తెల్పఁగ=చెప్పటానికి, శక్తిలేదు=ధైర్యంలేదు, నా ఖిన్నతచూచి=నా బాధనుచూచాక, పొమ్ము+అనుచు=బయటకు పొమ్మంటూ, గెంటునుబో= గెంటివేస్తాడేమో, ఇటువంటి=ఇలాంటి, రూపుతో=నా వాడిపోయిన రూపంతో, నిన్ను=నా కోసం తపించేనిన్ను, అలరింప=సంతోషపెట్టడానికి, నీయెదుట=నీముందు, నిల్చెడి=నిలబడే, శక్తియులేదు= సాహసంకూడా లేదు!

**తాత్పర్యం:** *సుందరీ! ప్రియురాలా! అన్నగారి అనుమతిలేకుండా ఈ బౌద్ధవిహారంనుండి ఒక్కడుగుకూడా బయటపెట్టడానికి మానసికబలం లేనివాణ్ణి. పోనీ ఆయనముందుకే వెళ్ళి నా పరిస్థితి చెబుదామనుకుంటే అక్కడికి వెళ్ళటానికే ధైర్యం లేనివాణ్ణి. ఎందుకంటే నాయీ ముఖం చూచాక నన్ను బయటకు గెంటివేస్తాడేమోనని భయం. ఇప్పుడే ముఖంతో నీ ముందుకువచ్చి నిన్ను సంతోషపెట్టేది? అందుకుకూడా సాహసంచేయలేనివాణ్ణి.*

**అళికులస్పృహణీయమైన నీ ధమ్మిల్ల**
**భరమునఁ గుసుమమంజరులు తుఱిమి**
**కెందామరలకు రక్తిమ దిద్దు నీ పాద**
**ముల రత్ననూపురములను గూర్చి**
**అరచందమామ సోయగ మేలు నీ ఫాల**
**మునఁ బచ్చికస్తూరి బొట్టు దిద్ది**
**బాగోగులను నీవె పరికించుకొమ్మని**
**మణిగణస్థగిత దర్పణము దాల్చి**

**సరసకలహమ్ము వేళ నంజలిఘటించి**
**ధన్యమైనట్టి నందుహస్తద్వయమున**
**నొకటి బిచ్చపుఁబాత్ర మోయుటకుఁ దొడరెఁ**
**దుడుచుచున్నది బాష్పబిందువుల నొకటి.**

**అర్థాలు:** అళికుల=తుమ్మెదలదండును, స్పృహణీయమైన=గుర్తుకుతెచ్చే, నీ ధమ్మిల్ల=నీ తలవెంట్రుకల, భరమునన్=పెంపులో, గుసుమమంజరులు=పూలగుత్తులు, తుఱిమి=క్రుక్కి, కెందామరలకు=ఎర్రతామరలకు, రక్తిమ=ఎర్రదనాన్ని, దిద్దు=అలంకరించే, నీపాదముల= నీ లేతపాదాలకు, రత్ననూపురములను=మణిమంజీరాలు, కూర్చి=అలంకరించి, అర చందమామ=సగంచంద్రుని, సోయగము=అందాలను, ఏలు=మించే, నీ ఫాలమునన్= నీ నుదుటిమీద, పచ్చికస్తూరి=లేత మృగనాభితో, బొట్టుదిద్ది=బొట్టుపెట్టి, బాగోగులను= మంచిచెడులను, నీవె=నీవే, పరికించుకొమ్మని=చూచి దిద్దుకొమ్మని, మణిగణస్థగిత=మణులతో పొదిగిన, దర్పణము=అద్దాన్ని, తాల్చి=ధరించి, సరసకలహమ్ము=వలపుజగడాల, వేళన్=సమయంలో, అంజలిఘటించి=దోసిలిపట్టి, ధన్యమైనట్టి=కృతకృత్యమైన, నందు=ఈ నీ ప్రియసఖుడు నందుని, హస్తద్వయమునన్=రెండు చేతులలో, ఒకటి=ఒకచేయి, బిచ్చపుఁబాత్ర= భిక్షాపాత్రను, మోయుటకున్=మోయడానికి, తొడరెన్=పాల్పడింది, ఒకటి=మరొకచేయి, బాష్పబిందువులన్= కన్నీటిని, తుడుచుచున్నది= తుడుచుకొంటున్నది.

**తాత్పర్యం:** *ప్రేయసీ! తుమ్మెదలదండువంటి నీ ఒత్తయిన కురులలో పూలగుత్తులను తురిమి, ఎర్రతామరలకు ఎర్రదనాన్ని కూర్చే నీ ఎర్రని పాదాలకు మణిమంజీరాలు అలంకరించి, సగం చందమామలా అందాలుచిందే నీ నుదుటిమీద పచ్చికస్తూరితో బొట్టుదిద్ది, బాగుందో లేదో నిన్నే చూచుకోమని మణులుపొదిగిన అద్దాన్ని నీముందు పట్టుకొని, శృంగార కలహాలలో నీముందు దోసిలిపట్టి ధన్యతపొందిన ఈ రెండు చేతులలో ఇప్పుడొకటి అన్నగారిచ్చిన బిచ్చపుపాత్రను మోస్తోంది, ఇక రెండోది ఈ విరహాన్ని భరించలేక నా కన్నులుకార్చే కన్నీటిని తుడుచుకొంటోంది. ఇదీ నా పరిస్థితి.*

**ఈసు విడనాడి దయచూపుదేని దేవి!**
**పత్రలాంఛితమైన నీ వదన లక్ష్మి**
**మనమునన్ నిల్పి ధ్యానించుకొనుచు, ముక్తి**
**గాంచఁ బ్రయత్నించెదన్ రతికాంతుదయను."**

**అర్థాలు:** దేవి=ప్రియురాలా! ఈసు=కోపాన్ని, విడనాడి=వదిలేసి, దయచూపుదేని=నన్ను దయతలచితే, పత్ర లాంఛితమైన=మకరికాపత్రాలతో సొగసులీనే, నీవదనలక్ష్మి=నీ ముఖమనే నాభాగ్యాన్ని, మనమునన్=నా మనస్సులోనే, నిల్పి=నిలుపుకొని, ధ్యానించుకొనుచు=లోలోపల స్మరించుకొంటూ, రతికాంతు=రతీదేవి కాంతుడైన మన్మథుని, దయను=కరుణచేత, ముక్తిగాంచన్=మోక్షాన్ని పొందడానికి, ప్రయత్నించెదన్=సాధనచేస్తాను.

**తాత్పర్యం:** *దేవీ! నామీద కోపాన్నివదిలి నన్నుమన్నిస్తే, నేను మకరికాపత్రాలు రచించిన నీ ముఖబింబాన్నే తలచుకొంటూ మన్మథుని దయచేత మోక్షాన్నిచేరే ప్రయత్నంచేస్తాను.*

**అనుచు సంతాపవాహినియైన వగపు**
**వెల్లువకు సేతు వొండు గల్పించుకొనును,**
**అదియుఁ బాఁతున లోఁతులేనట్టి దగుట**
**విరిసి కూలినఁ, దానును వెల్లి మునుఁగు.**

**అర్థాలు:** అనుచు=అంటూ, సంతాపవాహినియైన=విచారంయొక్క ప్రవాహమైన, వగపు= దుఃఖపు, వెల్లువకు= పొంగునుదాటేందుకు, సేతువు+ఒండు=వంతెన ఒకటి, కల్పించుకొనును=తయారుచేసికొంటూన్నాడు. అదియున్=అదికూడా, పాఁతున=స్థంభాదుల పాతటానికి, లోఁతు=తగిన లోతు, లేనట్టిదగుట=లేకపోవడాన, విరిసి=ఆధారం తొలగిపోయి, కూలినన్=కూలిపోతే, తానును=అతడుకూడా, వెల్లి=ఆప్రవాహంలో, మునుఁగు=మునిగిపోతాడు.

**తాత్పర్యం:** *ఇలా అంటూ విచారంలో మునిగి లోనుండి పొంగుకొచ్చే దుఃఖపువెల్లువకు ఒక వంతెనకట్టడానికి ప్రయత్నించాడు. అదికూడా స్థంభాలు పాతటానికి తగినలోతు లేకపోవడాన పట్టునిలవక కూలిపోయింది. అతడా ప్రవాహంలో మునిగిపోయాడు.*

**చిదుముడిపాటున నింకొ**
**క్కెడ కేగును, గాలు నిల్వ కింకను వేఱొ**
**క్కెడ కేగు వెండి మున్నటి**
**యెడకే యేతెంచి మరల నిట్లని వగచున్,**

**అర్థాలు:** చిదుముడిపాటునన్=ఇలా కలతచెంది, ఇంకొక=వేరొక, ఎడకు=చోటికి, ఏగును= వెడతాడు, కాలునిల్వక=అక్కడకూడా నిలబడలేక, ఇంకను=ఆపైన, వేఱొక్క=మరొక, ఎడకు= చోటికి, ఏగు=వెడతాడు, వెండి=ఆ తరువాత, మున్నటియెడకే= ముందున్న చోటికే, ఏతెంచి=వచ్చి, మరల=మళ్లీ, ఇట్లని=ఇలా, వగచున్= బాధపడుతున్నాడు.

**తాత్పర్యం:** *ఇలా కలతచెందిన నందుడు అక్కడక్కడా తిరిగి ఎక్కడా కాలునిలువక మళ్లీ ముందున్నచోటికే వచ్చి ఇలా బాధపడుతున్నాడు.*

**"కిసలయకోమలమ్మయిన కేలు గ్రహించినదాదిగా రసో**
**ల్లసన మనోహరంబును, గళానవతారమణీయమున్, నితాం**
**తసుఖదమైన నీదు చరితమ్మున నొక్కొకభావ మిప్డు మా**
**నసమునఁ బాతి నీ నెఱతనమ్మునకుం బ్రణమిల్లఁ జేసెడిన్.**

**అర్థాలు:** కిసలయ=లేచిగురులవంటి, కోమలమ్మయిన=మృదువైన, కేలు=నీచేతిని, గ్రహించినది=పట్టుకున్నది, ఆదిగా=మొదలుగా, రసోల్లసన=ఇంద్రియాల గగుర్పాటుచేత, మనోహరంబును=మనస్సును దొంగిలించు నదియును, కళానవతా=క్రొత్తకాంతులచేత, రమణీయమున్=కమనీయమును, నితాంత=శాశ్వతమైన, సుఖదమైన= సుఖాన్నిచ్చేదైన, నీదు=నీయొక్క, చరితమ్మునన్=నడవడిలో, ఒక్కొకభావము=ఒక్కొక్క చేష్ట, ఇప్డు=ఈ విరహవేళ, మానసమునన్=నాహృదయమంతా, పాఱి=ప్రవహించి, నీనెఱతనమ్మునకున్= నీ జాణతనానికి, ప్రణమిల్లన్= మొక్కేలా, చేసెడిన్=చేస్తుంది.

**తాత్పర్యం:** *నీ లేచిగురువంటి చేతిని గ్రహించినది మొదలుగా ఆ మనోహరమైన గగుర్పాటు, ఆ కమనీయమైన కాంతిప్రసరణం, ఎన్నడూవీడని సుఖాన్నిచ్చే నీ నడవడిలోని ఒక్కోచేష్టా నామనసంతా ప్రాకి నీ జాణతనానికి నమస్కరింపజేస్తోంది.*

> **కన్నుల వ్రేలుచున్నదదె కామిని! మద్విరహజ్వరార్తి చే**
> **వన్నె దొఱంగి, వెల్లనయి, వాడి, విశీర్ణశిరోజభారమై**
> **యున్న భవత్స్వరూపమయయో! కఠినాత్ముఁడ మిత్రఘాతినౌ**
> **నన్నెటు చూడవచ్చితివి, నాపయి నేటికి నీకుఁ బ్రేముడుల్?**

**అర్థాలు:** కామిని=ప్రేయసీ! అదె=అదిగో, మద్విరహజ్వరార్తిచే=నా ఎడబాటుచే కలిగిన వేడితో, వన్నెదొఱంగి= రంగుతగ్గి, వెల్లనయి=తెల్లబడి, వాడి=వడలిపోయి, విశీర్ణ=విడిపోయిన, శిరోజభారమైయున్న= తేలికపడిన వెంట్రుకలతోనున్న, భవత్=నీయొక్క, స్వరూపము=రూపం, అయయో=అయ్యో, కన్నులవ్రేలుచున్నది=కళ్ళల్లో కనిపిస్తోంది, కఠినాత్ముఁడ=బండగుండెవాడిని, మిత్రఘాతినౌ=స్నేహధర్మం పాటించనివాడినైన, నన్ను+ఎటు= నన్నెట్లా, చూడవచ్చితివి=చూడటానికి వచ్చావు? నేటికి=ఈ ప్రొద్దుకూ, నీకున్= నీహృదయంలో, నాపయి= నామీద, ప్రేముడుల్=ఇంకా ప్రేమ మిగిలిందా!

**తాత్పర్యం:** *ప్రేయసీ! నా ఎడబాటువేడిచేత వన్నెతగ్గి, తెల్లబడి, వాడిపోయి, విడిపోయిన కబరీభారంతో నీ రూపం అయ్యో నా కళ్ళలో కదులుతోంది. ఈ కఠినాత్ముడిని స్నేహధర్మాన్ని పాతరేసినవాణ్ణి నన్ను చూడటానికి ఎట్లావచ్చావు? ఇంకా నీ హృదయంలో నామీద ప్రేమ మిగిలిందా!*

> **మునుపటి యట్లె యున్నది కపోలమునందు విశేషకంబదే!**
> **మన ప్రణయ ప్రసంగముల మర్మములం దలపించు రేఖ, నా**
> **పొనరిచినట్టి పాపమును మూదలకించెడి ధర్మముద్ర, యీ**
> **తని మఱుమేనికై తనువుదాల్చిన కర్మవిపాకబీజమున్.**

**అర్థాలు:** కపోలమునందు=నీ బుగ్గమీద, విశేషకంబు=నేనురచించిన మకరికాపత్రం, మునపటియట్లె= అప్పటిలాగే,

ఉన్నది=ఉంది. అదే=ఆ పత్రమే, మనప్రణయ=మన శృంగార పరమైన, ప్రసంగముల=మాటల, మర్మములన్=రహస్యాలను, తలపించు=గుర్తుకుతెచ్చే, రేఖ=మాలిక, నాపొనరిచినట్టి=నేను చేసిన, పాపమును=నేరాన్ని, మూదలకించెడి=ఎత్తిచూపే, ధర్మముద్ర=న్యాయదర్పణం, యీతని=ఈ దుర్మార్గుని, మఱుమేనికై=తరువాతి జన్మకోసం, తనువుదాల్చిన=రూపొందిన, కర్మవిపాకబీజమున్=పాపాల పంట.

**తాత్పర్యం:** *నీబుగ్గమీది మకరిక నేనుగీసిందే. అదిప్పుడు మన ప్రణయరహస్యాలను గుర్తుచేసే మాలికలావుంది. నేను చేసిన నేరాన్ని ఎత్తిచూపే న్యాయదర్పణంలావుంది. చివరికీ దురాత్మునిమరుజన్మకోసం రూపొందిన పాపాలపొలంలోపండిన గింజలావుంది.*

> **ఎన్ని విధాలనో హృదయ మిచ్చి భజించితి విట్టిక్రూరునిన్**
> **నిన్నుఁ దలంచి చిత్తసరణిన్ విలపింతున, జాలి నింతునా?**
> **ఇన్ని విధమ్ములన్ హృదయ మిచ్చిన ప్రేయసి వీటిఁబుచ్చితిన్**
> **నన్ను గుఱించి పల్లటిలనా, పెనుసిగ్గున మ్రగ్గిపోదునా?**

**అర్థాలు:** ఇట్టిక్రూరునిన్=ఇటువంటి చెడుగని, హృదయమిచ్చి=నీయెడదనిచ్చి, ఎన్నివిధాలనో= ఎన్నోవిధాలుగా, భజించితి=సేవించావు. నిన్నున్=అటువంటినిన్ను, తలంచి=స్మరించి, చిత్తసరణిన్=మనసునిండా, విలపింతున=ఏడ్వనా? జాలినింతునా=జాలిపడనా? ఇన్నివిధమ్ములన్=ఇన్నిరకాలుగా, హృదయమిచ్చిన=మనసిచ్చిన, ప్రేయసి=ప్రియురాలిని, వీటిఁబుచ్చితిన్=ఆరడిపెట్టాను, నన్నుగుఱించి=ఇటువంటి నన్నుగూర్చి, పల్లటిలనా=అటమటించనా? పెనుసిగ్గున=ముఖంచూపించలేక, మ్రగ్గిపోదునా=చచ్చిపోనా.

**తాత్పర్యం:** *ఇలాంటి క్రూరాత్ముని ఎంతగా మనసిచ్చి సేవించావు! అలాంటి నిన్ను తలచుకొని మనసారా ఏడ్వనా? జాలిపడనా? ఇన్నిరకాలుగా హృదయమిచ్చిన ప్రియసఖిని ఆరడిపెట్టాను. ఇటువంటి నన్నుగురించి నేను అటమటించనా లేక సిగ్గుతో చచ్చిపోనా?*

> **ఎన్నఁగరాని కూర్మి నిలువెల్ల నొకింతగ రాగపూర్ణమౌ**
> **సొన్నపుఁ బానపాత్ర యగుచున్ గరయుగ్మమునందు నిల్చు నా**
> **పెన్నిధి, నిష్టదైవమును వీఱిఁడినై యిటు పాఱవైచికొం**
> **టి, న్నిరుపేదనై యలమటించెద దిక్కఱి రిత్తజోగినై.**

**అర్థాలు:** ఎన్నఁగరాని=ఇంత అని చెప్పలేని, కూర్మి=ప్రేమ, నిలువెల్లన్=దేహమంతా, ఒకింతగ=కొంతగా, రాగపూర్ణమౌ=అనురాగంతో నింపుకొన్న, సొన్నపున్=బంగారుతోచేసిన, పానపాత్ర=మధువుసేవించే కలశంగా, అగుచున్=మారి, కరయుగ్మమునందు=నా దోసిట, నిల్చు=అమరే, నీపెన్నిధిన్=నాకున్న పెద్ద భాండాగారాన్ని, ఇష్టదైవమును=నాకిష్టమైన దేవతను, వీరిఁడినై=పిరికివాడినై, ఇటు=ఇలా, పాఱవైచికొంటిన్=పారేసుకొన్నాను. నిరుపేదనై=ఇప్పుడేమీ లేనివాడినై, రిత్తజోగినై=వట్టి బిచ్చగాడినై, దిక్కఱి=దిక్కులేక, అలమటించెద=ఏడుస్తున్నాను.

**తాత్పర్యం:** *ఎంతో ప్రేమను దేహమంతా అనురాగంతో కలిపి నింపుకొని బంగారు పానపాత్రలా తయారై నా చేతులమధ్య అమరిన పెద్ద నిక్షేపాన్ని, నా యిష్టదేవతను పిరికివాడిలా ఇలా వదులుకున్నాను. ఇప్పుడేమీలేని వట్టిబిచ్చగాడినై దిక్కులేక భిక్షాపాత్రతో రోదిస్తున్నాను చూడు సుందరీ!*

**వలపుల్ వడ్డికిఁ బాఱఁ గౌఁగిటఁ గదింపన్ బాత్రవై, నిండుచూ**
**పులకున్ వెన్నెలవై, శ్రవోయుగళి కింపుల్ నింపు గానమ్మవై,**
**యలరుందావివి యయ్యు నూర్పులకుఁ, బై నాత్మైకభోగ్యమ్మవై,**
**తలఁపుల్ దాఁటి, యభిన్నవై, తుది మదాత్మా! నాకు లేవైతివే."**

**అర్థాలు:** వలపుల్=ప్రేమలు, వడ్డికిన్ పాఱన్=వృద్ధివైపు పరుగులుతీయగా, కౌఁగిటన్= ఆలింగనంతో, కదింపన్=నిలువరించడానికి, పాత్రవై=యోగ్యురాలివై, చూపులకున్=నా దృక్కులకు, నిండు=నిండైన, వెన్నెలవై= చంద్రకాంతివై, శ్రవోయుగళికి=నా రెండు చెవులకు, ఇంపుల్నింపు=ఆనందాన్ని చేకూర్చే, గానమ్మవై=దివ్య సంగీతానివై, ఊర్పులకున్=నా ఊపిరులకు, అలరుందావివి=పూల సువాసనవు, అయ్యు=అవుతూ, పైన్=ఆ పైన, అత్మైక= నా అంతరాత్మకు మాత్రమే, భోగ్యమ్మవై=అనుభవనీయమై, తలఁపుల్=ఆలోచనలకు, దాఁటి=అతీతంగా, అభిన్నవై=విడదీయరానిదానివై, తుది=చివరకు, మదాత్మా=నా ఆత్మలో ఆత్మవైనదానా, నాకు= దురదృష్టవంతుడనైన నాకు, లేవైతివే=లేకుండా పోయావుకదా!

**తాత్పర్యం:** *వృద్ధివైపుకు పరుగులుతీసే మన ప్రేమల్ని ఆలింగనంతో నిలువరించడానికి యోగ్యురాలివైనదానా! నా చూపులకు నిండు వెన్నెలవైనదానా! నా చెవులకు ఆనందాన్ని కూర్చే దివ్యగానమా! నా ఊపిరులకు పూలసువాసనవైనదానా! ఆపైన నా అంతరాత్మకు మాత్రమే అనుభవైకయోగ్యమా! నా ఆలోచనలకు అతీతమై అభిన్నవైనదానా! చివరకు నా ఆత్మలో ఆత్మవైనదానా! ఇప్పుడు నాకు లేకుండా పోయావుకదా!*

ఇది

పంచమసర్గము

# ఉపదేశము

**అలవలమర్చి, తీవియలయల్లిక పందిరివెట్టి, యంబుజ**
**మ్ములు దొవ లెన్నొ నాటి, జలపూరము నింపియు, నల్పబుద్ధినై**
**యలుఁగులు పూడ్చివైచితిఁ గటా! గృహదీర్ఘిక; కంచ(వాలునో?**
**యలి విహరించునో? మునుకలాడఁగ వచ్చునొ? దప్పిదీర్చునో?**

**అర్థాలు:** గృహదీర్ఘికకు=ఇంటి దిగుడుబావికి, అలవలు=కంచెలు, అమర్చి=ఏర్పాటుచేసి, తీవియల యల్లిక= పూలతీగలు అల్లుకునేట్లు, పందిరివెట్టి=పందిరివేసి, అంబుజమ్ములు=తామరలు, తొవలు=కలువలు, ఎన్నొనాటి= ఎన్నిటినో భూమిలో(గుచ్చి, జలపూరము= నీటి(ప్రవాహంతో, నింపియున్=నీరునింపి, అల్పబుద్ధినై= బుద్ధితక్కువ వాడినై, అలుఁగులు= ఎక్కువైననీరు పోవడానికి మార్గాలు, పూడ్చివైచితిన్=మూసివేసాను, కటా= అయ్యో! అంచ (వాలునో=ఈ బావిలో హంసలు వాలుతాయో, అలి విహరించునో=తుమ్మెదలు సంచరిస్తాయో, మునుకలాడఁగ వచ్చునొ=ఈతలుకొట్టవచ్చునో, దప్పిదీర్చునో=దాహం తీర్చుకోవచ్చునో?

**తాత్పర్యం:** *ఒకడు తనయింటిలోని దిగుడుబావికి చుట్టూ కంచెకట్టాడు, పూలతీగలకు పందిరివేసాడు, కమలాలు కలువలు నాటాడు, బావిని జల(ప్రవాహంతో నింపాడు. అయితే అలుగులు మూసివేసాడు. ఇప్పుడా బావిలోకి హంసలు వస్తాయో లేవో, తుమ్మెదలు విహరిస్తాయో లేదో, స్నానాలు చేయవచ్చునో లేదో, మంచినీళ్ళు (తాగవచ్చునో లేదో అనుకొంటూ తీరిగ్గా బాధపడుతూన్నాడు. ఎన్ని మంచిపనులు చేసినా ఒక్క తప్పుచేస్తే అన్నీ అనుమానాలేకదా!*

**అని యిటు బహుభంగుల వగ**
**పునఁ బడి దిన మొక్క యుగము పోలికఁ గడపన్**
**విని, కని యాతని చందము**
**మునిపుంగవుఁ డొక్కనాఁడు (మోల నిలువఁగన్.**

**అర్థాలు:** అని=అంటూ, ఇటు=ఈవిధంగా, బహుభంగుల=అనేకవిధాలుగా, వగపునన్ పడి=దుఃఖంలోపడి,

దినమొక్కయుగము పోలికన్=ఒక్కోరోజును ఒక్కోయుగంలాగా, గడపన్=గడుపుతూండగా, ఆతనిచందము=ఆ నందుని పరిస్థితిని, విని=కర్ణాకర్ణిగా విన్నవాడై, కని=కళ్ళారా చూచి, ఒక్కనాఁడు=ఒకరోజున, మునిపుంగవుఁడు=మునిశ్రేష్ఠుడైన బుద్ధుడు, మ్రోల=ఎదురుగా, నిలువఁగన్=నిలబడగా....

**తాత్పర్యం:** *అంటూ ఇలా అనేకవిధాలుగా దుఃఖంతో రోజొకయుగంలా గడుపుతూంటే ఆ నందుని సంగతి విని తానుగా చూచిన బుద్ధభగవానుడు ఒకనాడు ఎదుటికిరాగా....*

**తన బాలిశత్వమ్ముఁ గనెనేమొ, వినెనేమొ**
**గౌతముండనెడి సిగ్గరితనమ్ము**
**తన పాటు చూడఁగా మనసొప్ప కప్పుడే**
**విడిచిపుచ్చు నఁటన్న వెఱ్ఱి యాస**
**తన చేత యమృతపాత్రము బోరగిలఁ ద్రోసి**
**నతఁడెకా యన్న రవ్వంత యీసు**
**పూజ్యపాదునిదెసఁ బొడమిన తన చెట్ట**
**భావమ్మునకు నాత్మ పాపశంక**

**యొక్కటొక్కటిగాఁ బుట్టి, యొకటి నొకటి**
**పొలియఁగాఁజేసి, యంతలోఁ బొత్తుగూడి,**
**వెండి పొడసూపి, నందుని పేదమనసు**
**తాళఁజాలనియంత గగ్గోలుచేసె.**

**అర్థాలు:** తన బాలిశత్వమ్మున్=తన మూర్ఖత్వాన్ని, గౌతముండు=పూజ్యబుద్ధుడు, కనెనేమొ= చూచాడేమో, వినెనేమొ=లేక విన్నాడేమో, అనెడి=అనేటువంటి, సిగ్గరితనమ్ము=సిగ్గుకొంత, తనపాటు=తనపరిస్థితి, చూడఁగా=చూచినంత, మనసొప్పక=ఇంకా ఉంచడానికి మనసూరుకోక, అప్పుడే=వెంటనే, విడిచిపుచ్చున్= వదిలిపెడతాడు, అఁటన్న=అనే, వెఱ్ఱి= పిచ్చి, ఆశ=కోరిక, తనచేత=తనచేతిలోని, అమృతపాత్రము=కోరికలు సిద్ధించే అక్షయపాత్రను, బోరగిలన్=తలక్రిందులుగా, త్రోసిన=పడవేసినది, అతఁడెకా=ఇతడేగదా, అన్న=అనే, రవ్వంతయీసు=కొంచెం ఈర్ష్య, పూజ్యపాదునిదెసన్=గౌరవనీయునియెడ, పొడమిన=ఏర్పడిన, తనచెట్ట భావమ్ము నకున్=తనచెడుతలంపుకు, ఆత్మ=లోలోని, పాపశంక=నేరం చేసానేమోనన్న అనుమానం, ఒక్కటొక్కటి గాన్=వరుసగా, పుట్టి=లోజనించి, ఒకటినొకటి= ఒకదాన్నొకటి, పొలియఁగాఁజేసి=నశింపజేసి, అంతలో= అంతలోనే, పొత్తుగూడి=జతగట్టి, వెండి పొడసూపి=మళ్ళీ కనిపించి, నందుని పేదమనసు=ఆ నందుని బలహీన మైన మనసు, తాళఁ జాలనియంత=తట్టుకోలేనంతగా, గగ్గోలుచేసె=చికాకుపెట్టాయి.

**తాత్పర్యం:** *తన మూర్ఖత్వాన్ని గ్రహించాడేమో అన్నగారనే సిగ్గొకవైపు, తన పరిస్థితి గ్రహించి మనసుమారి వదిలిపెడతాడనే ఆశ ఒకవైపు, తన బంగారంవంటి జీవితాన్ని పాడుచేసాడనే*

*కోపం ఒకవైపు, అయ్యో అన్నను చెడ్డగాభావించానేమోనన్న అనుమానం ఒకవైపు, ఒక్కొకటే మనసులో పుట్టి ఒకదానినొకటి చంపి, అంతలోనే మళ్ళీపుట్టి నందుని పేదమనసును తట్టుకోలేనంతగా కలతపెడుతున్నాయి.*

**మోయఁగలేని భావభరమున్ వహియించుట నీరసించి కే**
**ల్దోయిలి బట్టెఁగాని, తఱితో 'భవతేనమ'యంచుఁ బల్కలేఁ**
**డాయెఁ గుమారుఁడా గురుని, నయ్యనఘుండును జాలిపెంపునన్**
**డాయఁగవచ్చి, తాఁ గవుఁగిటన్ గదియించి, శిరమ్ము మూర్కొనెన్,**

**అర్థాలు:** కుమారుఁడు=ఆ నందకుమారుడు, మోయఁగలేని=తానుమోయలేని, భావభరమున్= తలపుల బరువును, వహియించుట=మోయడంవల్ల, నీరసించి=సత్తువతగ్గి, కేల్దోయిలిబట్టెఁగాని=చేతులు జోడించాడేకాని, తఱితో=సమయానికి, ఆ గురునిన్=ఆ పూజ్యునకు, భవతేనమ=నీకు నమస్కారం, అంచున్=అని, పల్కలేఁ డాయెన్=నోటితో పలుకలేకపోయాడు. ఆ+అనఘుండును=ఆ పాపం అంటని బుద్ధుడుకూడా, జాలి పెంపునన్= దయకలిగినవాడై, డాయఁగవచ్చి=దగ్గరకువచ్చి, తాన్=తానుగా తమ్ముని, కవుఁగిటన్=కౌగిలిలో, కదియించి= హత్తుకొని, శిరమ్ము=తలపైన, మూర్కొనెన్=వాసన చూచాడు.

**తాత్పర్యం:** *అప్పటికే నందకుమారుడు మోయలేని ఆలోచనలభారంతో నీరసించిపోవడం వల్ల అన్నకు చేతులుజోడించాడేకాని నోటితో నమస్కారం అని చెప్పలేకపోయాడు. అదిచూచి బుద్ధుడు తమ్మునిపైన జాలితో దగ్గరికివచ్చి తానే తనతమ్ముని దగ్గరకు తీసికొని ఆశ్వాసించాడు.*

**వన్నె దొఱఁగి, క్రొంజివురు వాడి, కృశించిన లేఁతతీవకున్**
**వెన్నెలజల్లు క్రొమ్మిసిమి పెట్టినరీతిఁ గుమారనందుఁ డా**
**యన్న కవుంగిటన్ నిలిచినంతనె కీడ్వడియున్న యంగముల్**
**క్రొన్నవకంబు సత్తువయుఁ గొన్నటులాయె, మనంబు రెక్కొనెన్.**

**అర్థాలు:** వన్నె=రంగు, తొఱఁగి=తగ్గి, క్రొంజివురు=లేతచిగురు, వాడి=బడలుపడి, కృశించిన=క్షీణించిన, లేఁ తతీవకున్=అప్పుడేపుట్టిన పూతీగకు, వెన్నెలజల్లు=చల్లని చంద్రకాంతి, క్రొమ్మిసిమి=కోమలత్వాన్ని, పెట్టిన రీతిన్=ప్రసాదించినట్లు, కుమారనందుఁడు=నందకుమారుడు, అన్నకవుంగిటన్=అన్నగారి కౌగిట్లో, నిలిచి నంతనె=చేరినవెంటనే, మనంబురెక్కొనన్=మనస్సు ఉత్సాహంపొందునట్లు, కీడ్వడియున్న=బక్కచిక్కిపోయిన, అంగముల్=అవయవాలన్నీ, క్రొన్నవకంబు=క్రొత్తగా మిసమిసలాడుతూ, సత్తువయున్=బలాన్ని, కొన్నటు లాయె=పొందినట్లయింది.

**తాత్పర్యం:** *లేత పూవులతీగ వన్నెతగ్గి చిగుర్లు ఎండివాడిపోతూండగా, వెన్నెలజల్లు కురిసి తిరిగి కోమలత్వాన్ని పొందినట్లు, కుమారనందుడు అన్నకౌగిట్లో చేరినంతనే చిక్కిపోయిన*

*అవయవాలు క్రొత్తహంగులద్దుకొని మిసమిసలతో బలాన్నిపొంది అతని అంతరంగం నూతనోత్సాహం పొందింది.*

**అమ్ముని యాసీనుండై**
**తమ్ముని నుపవిష్టుఁజేసి, తనువు నిమిరి, శాం**
**తమ్ముగఁ దత్కోమలభా**
**వమ్మున కనురూపమైన ఫణితి నిటు లనెన్.**

**అర్థాలు:** ఆ+ముని=ఆ మునికల్పుడైన శాక్యముని, ఆసీనుండై=తన స్థానంలో చక్కగా కూర్చున్నవాడై, తమ్మునిన్=తన తమ్ముడైన నంద రాకుమారుని, ఉపవిష్టున్=తన ప్రక్కనే కూర్చున్నవాడుగా, చేసి=సుఖవంతునిగా చేసి, తనువు=అప్పటివరకు వివిధాలోచనలతో కలతవడి దస్సిన అతని శరీరాన్ని, నిమిరి=తన చల్లని చేతులతో తడిమి సాంత్వనపరచి, శాంతమ్ముగన్=ఏమీజరుగని విధంగా క్రొత్తగా తనదగ్గరకు వచ్చినవానిలా భావించి, తత్కోమల=ఆ తన మునిజన భావాలకు తగినవిధంగా మెత్తని, భావమ్మునకు=తన స్వభావానికి, అనురూపమైన= తగిన, ఫణితిన్=విధంగా, ఇటులనెన్=ఈ విధంగా అన్నాడు.

**తాత్పర్యం:** *ఆ శాక్యముని తాను కూర్చొని తనప్రక్కనే తమ్ముని కూర్చుండబెట్టుకొని వడలిన దేహాన్ని శ్రమదీరేవిధంగా నిమిరి పరమశాంతంగా తనభావాలకు తగినవిధంగా మెత్తని మాటలతో ఇలా అనునయించాడు.*

**"అంబుధి కంబుజారి యుదయంబునుబోలె, భవచ్ఛుభ ప్రవే**
**శంబు విహారవాటికకుఁ జాల మహోత్సవ మౌనఁటంచు భా**
**వంబున నెంచి, తోడికొని వచ్చితి నిన్నిటకుం గుమార! దై**
**న్యంబున మున్గియున్న భవదాననముం గనలేరు భిక్షువుల్.**

**అర్థాలు:** కుమార=తమ్ముడా నందకుమారా! అంబుధికి=నీటినిల్వయైన సముద్రానికి, అంబుజారి=అంబుజాలకు శత్రువైన పూర్ణచంద్రుని, ఉదయంబునుబోలె=దర్శనానికిలాగా, భవత్=అమాయకుడవైన నీయొక్క, శుభప్రవేశంబు= మంగళకరమైన ఆగమనం, విహార వాటికకున్=ఈ మా ఆశ్రమనివాసాలకు, చాల=మిక్కిలి, మహోత్సవము=గొప్ప ఆనంద హేతువు, ఔనఁటంచు=అవుతుందని, భావంబునన్=నా మనసులోపల, ఎంచి=తలంచి, నిన్నిటకున్=నా ఆత్మబంధువువైన నిన్నిక్కడకు, తోడికొని=వెంటబెట్టుకొని, వచ్చితి=వచ్చాను. దైన్యంబున=నీవిక్కడ ఏడుపుమొహంతో దుఃఖంలో, మున్గియున్న=మునిగి బాధపడుతూంటే, భిక్షువుల్=ఇక్కడి సర్వం విడిచిపెట్టి ఆనందంగా బ్రతుకుతూన్న బౌద్ధసన్యాసులు, భవత్=నీయొక్క, ఆననమున్=వాడిపోయిన నీ ముఖాన్ని, కనలేరు=చూచి భరించలేరు.

**తాత్పర్యం:** *తమ్ముడా! నందకుమారా! పద్మాలకు శత్రువు, కలువలకు మిత్రుడైన పూర్ణ చంద్రుని ఉదయంతో ఉప్పొంగే సముద్రంలాగా అమాయకుడవైన కాంతివంతమైన నీ*

*మంగళకరమైన రాకతో మా విహారవాటికంతా గొప్ప పండుగవచ్చినట్లు మురిసిపోతుందనే ఆలోచనతో ఆత్మబంధువైన నిన్ను వెంటబెట్టుకొని వచ్చాను. కాని నీవు నా వాత్సల్యాన్ని భంగపరిచావుసుమా! తమ సర్వస్వాన్ని విడిచి ఇక్కడకువచ్చి ఆనందంతో బ్రతుకుతూన్న ఇక్కడి సన్యాసులు దుఃఖంతో కుమిలిపోతున్న నీ ముఖాన్ని చూచి భరించలేరు తమ్ముడూ!*

**చూడఁగదన్న! భిక్షువులు శోభనశీలురు, ప్రాణిదుఃఖముల్**
**చూడఁగలేరు, భూతహితలోల మనస్కులు, సత్యదేవతా**
**పీడ సహింపలే, రతను పెంపు జయించిన శూరతాఖనుల్,**
**వాఁడి యెఱుంగనట్టి మృదుభావులు, ప్రేమరసైకజీవనుల్.**

**అర్థాలు:** చూడఁగదన్న=తమ్ముడూ! వీరిని చూడరాదూ! భిక్షువులు=ఇచటి సన్యాసులు, శోభన శీలురు= ప్రజాశ్రేయమే తమ అభ్యాసంగాగలవారు, ప్రాణిదుఃఖముల్=హింసవలన జీవులు రోదించడాన్ని, చూడఁగలేరు= చూచి సహించలేరు, భూతహిత=సకల జీవులు వృద్ధిచెందడంలోనే, లోల=శ్రద్ధవహించిన, మనస్కులు=ఆలోచనలు గలవారు, సత్యదేవతాపీడ=నిజం చెప్పడంలోనే శాశ్వతమైన ఆనందంగలదనే దైవతత్వానికి ఉపద్రవాన్ని, సహింపలేరు=భరించలేరు, అతను=మనిషిని వినాశనంవైపు తీసికెళ్ళే కామం అనే పురుషార్థపు, పెంపు=అభివృద్ధిని, జయించిన=సత్వమార్గంలో ఓడించిన, శూరతాఖనుల్= యుద్ధవిద్యలో పారంగతులు, వాఁడి=పరుషత్వమే, ఎఱుంగనట్టి=తెలియని, మృదుభావులు= మెత్తని హృదయంగలవారు, ప్రేమరస=అందరినీ ప్రేమించడమనే మనోధర్మం, ఏక=ఒక్కటి మాత్రమే, జీవనుల్=బ్రతుకుగా కలిగినవారు.

**తాత్పర్యం:** *తమ్ముడూ! ఇక్కడి భిక్షువులను చూడు. ప్రజల సుఖమొక్కటే సాధనగాగలవారు. ప్రాణుల దుఃఖాన్ని చూడలేరు. సమస్తజీవుల సౌఖ్యంకోసమే నిత్యం ఆలోచిస్తూంటారు. సత్యమే దేవతగా ఆమెకేమాత్రం బాధకలుగనీయరు. కామోద్రేకాన్ని జయించిన శూరులు. పరుషశబ్దాలను ఉపయోగించని మృదుభావులు. ప్రేమించడమొక్కటే బ్రతుకుగా కలవారు.*

**తనతోడిదే లోకమని నమ్మికొని వేఱె**
**గతిలేని యొకతల్లి సుతుఁ డితండు**
**స్వయము కోరి వరించి కయికొన్న యొకనవ్య**
**లావణ్యలహరివల్లభుఁ డితండు**
**అభిషేకపరిపూతుఁడై మొన్ననే సింహ**
**పీఠ మెక్కిన రాచబిడ్డ యితఁడు**
**పట్టినకత్తి దింపక సంగరాంగణ**
**విహరణం బొనరించు వీరుఁడితఁడు**

**మమతలం ద్రెంచి, కాముని మాయ గెలిచి,**
**రాజ్యలోభమ్ముఁ ద్రోసి, క్రూరత నణంచి**
**శాంతులై చేరి నిల్చి రంజలిఘటించి**
**ధర్మదేవత పాదపద్మముల చెంత.**

**అర్థాలు:** ఇతండు=ఇక్కడ వీనినిచూడు, తనతోడిదే=తనతోనే, లోకమని=ఈ ప్రపంచమని, నమ్ముకొని=పూర్తిగా విశ్వసించి, వేఱెగతిలేని=మరొక ఆశ్రయంలేని, ఒకతల్లి=ఒక మాతృమూర్తికి, సుతుఁడు=కుమారుడు, ఇతండు= వీనినిచూడు, స్వయము=తానుగా, కోరి వరించి=కావాలని ప్రేమించి, కయికొన్న=చేపట్టిన, ఒకనవ్యలావణ్య లహరి=ఒక క్రొత్త సుకుమార సుందరికి, వల్లభుఁడు=భర్త, ఇతఁడు=వీనినిచూడు, అభిషేకపరిపూతుఁడై= అభిషేకంచేత పవిత్రుడై, మొన్ననే=క్రొత్తగా, సింహపీఠము=రాజసింహాసనం, ఎక్కిన=అలంకరించిన, రాచబిడ్డ= రాజకుమారుడు, ఇతఁడు=ఇక వీనినిచూడు, పట్టినకత్తి= చేత పట్టిన ఖడ్గాన్ని, దింపక=క్రిందపెట్టకుండా, సంగరాంగణ=యుద్ధభూమిలో, విహరణంబు=వీరవిహారం, ఒనరించు=చేసే, వీరుఁడు=వీరయోధుడు. (వీరంతా) మమతలంద్రెంచి=వీరొక్కరే నావారనే భావన దరికిరానీయకుండా, కాముని=మన్మథుని, మాయగెలిచి=మోసాన్ని జయించి, రాజ్యలోభమ్మున్=రాజభోగాలను, త్రోసి=ప్రక్కకునెట్టి, క్రూరతన్=దారుణకృత్యాలను చేసే స్వభావాన్ని, అణంచి=త్రొక్కిపెట్టి, శాంతులై=సాధు స్వభావంతో, చేరి=ఒకచోట కలిసి, ధర్మదేవత=సాధుధర్మమనే దేవత, పాదపద్మములచెంత=పద్మాలవంటి పాదాలముందు, అంజలిఘటించి=చేతులుజోడించి, నిల్చిరి=నిలబడ్డారు.

**తాత్పర్యం:** *ఇక్కడ వీరినొక్కొక్కరినీ చూడు. ఇతడు తననే నమ్ముకొని బ్రతికే వేరేప్రపంచం తెలియని ఒక తల్లితనయుడు. ఇతడు తానుగా ప్రేమించి ఇతనిని చేపట్టిన నవ సుకుమార సుందరికి భర్త. ఇతడు మొన్ననే పట్టాభిషేక క్రతువు పూర్తిచేసికొని సింహాసనమెక్కిన రాకుమారుడు. ఇతడు పట్టినకత్తి దింపకుండా యుద్ధరంగంలో వీరవిహారంచేసే వీరుడు. వీరంతా మమకారాలు విడనాడి, మన్మథుని మోసపుచేతలను గెలిచి, రాజభోగాలు ప్రక్కకు నెట్టి, క్రూరత్వాన్ని త్రొక్కిపెట్టి మిగులశాంతులై ఒకచోచేరి ధర్మదేవత పాదపద్మాలచెంత చేతులుజోడించి నిలబడ్డారు.*

**విడుమర యాధివ్యాధుల,**
**కుడుకువ మోహాదికమున, కురుసత్యదయల్**
**విడిసిన చోటిది; జాలిన్**
**బడె దేమిటి కన్న? దైన్య భావము గదురన్.**

**అర్థాలు:** ఆధి=మానసిక వ్యథలకు, వ్యాధులకు=శారీరక రుగ్మతలకు, విడుమర=విడుదల, మోహాదికమునకు= మోహాది షడ్వికారాలనుండి, ఉడుకువ=ఊరట, ఉరు సత్యదయల్= గొప్పవైన సత్యము దయలనే ఉన్నతగుణాలు, విడిసిన=విడిదిచేసిన, చోటిది=ప్రదేశం ఈ ఆశ్రమం, దైన్యభావము=ఏదో పోగొట్టుకున్న యోచన, కదురన్= అతిశయించేలా, జాలిన్= దుఃఖంలో, ఏమిటికి=ఎందుకు, పడెదు=పడిపోతావు, అన్న=తమ్ముడూ!

**తాత్పర్యం:** *ఈ ఆరామం మానసిక శారీరక వ్యాధులనుండి విడుదల ప్రసాదిస్తుంది. మోహాది షడ్వికారాలనుండి ఊరటకలిగిస్తుంది. సత్యము దయ అనే ఉన్నతగుణాలకు శాశ్వతమైన చోటు. ఇందులో ప్రవేశించటానికి ఎందుకు బాధపడతావు తమ్ముడూ?*

**భవనిదాఘసంతాపముల్ పరిహరించు**
**సత్యశాంతిదయాసరిత్ఝురులు పొడము**
**నీ విహారమహాహార్య మెక్కి, యిటులఁ**
**గంట నీర్వెట్టఁ దగదు నీవంటివాఁడు.**

**అర్థాలు:** భవ=జన్మబంధాలనే, నిదాఘ=ఎండాకాలపు, సంతాపముల్=పరితాపాలను, పరిహరించు=ఈ జీవితంనుండి తొలగించే, సత్య=కాలాతీతం, శాంతి=కల్లోలాతీతం, దయా=కోపాతీతం అయిన, సరిత్=నదుల, ఝురులు=ప్రవాహాలు, పొడమున్=పుట్టుకనొందే, ఈ=ఈ చక్కని వాతావరణంలోని, విహార=భిక్షుకాశ్రమమనే, మహా=గొప్పదైన, ఆహార్యము= జ్ఞానపీఠంపైన, ఎక్కి=కాలుపెట్టి కూడా, ఇటులన్=ఈ విధంగా వెర్రివానిలా, నీవంటివాఁడు=నీవంటి ఉన్నతకుల సంజాతుడు, కంట=కళ్ళ వెంబడి, నీర్వెట్టన్=బాష్పజలాలు రాల్చడం, తగదు=తగినపని కాదు.

**తాత్పర్యం:** *ఇది పవిత్రమైన భిక్షువులు నివసించే బౌద్ధధర్మ ప్రచారకేంద్రం. ఇక్కడ మనిషిని శుష్కింపజేసే భవ బంధాలనే ఎండాకాలపు అరిషడ్వర్గాలకు, వాటివల్ల మనిషిపొందే దుఃఖాలకు తావులేదు. వాటిని శాశ్వతంగా తొలగించే కాలాతీతమైన, కల్లోలాతీతమైన, కోపాతీతమైన సుగుణాల నదీప్రవాహాలకు జన్మక్షేత్రం ఈ విహారం. ఇటువంటి మహిమగల జ్ఞానపీఠంలో కాలుపెట్టికూడా నీవంటి ఉత్తమకులసంజాతుడు ఇలా కళ్ళనీళ్ళుపెట్టుకోవడం ఏమీ బాగాలేదు.*

**పాఱన్జూడుము! శోకమోహభయసంభ్రాంతమ్ము, నీరంధ్ర సం**
**సారారణ్యమునన్ దెసల్ దెలియ కాశాబద్ధమై సారెకున్**
**గ్రూరత్వమ్మున నొండొరున్ గసిమసంగున్ బ్రాణిలోకమ్ము, హిం**
**సారంభమ్ము వినా, సుఖంబెటుల లభ్యంబౌ నిటన్ దేహికిన్?**

**అర్థాలు:** పాఱన్జూడుము=సరిగా పరిశీలించి చూడు, శోక=దుఃఖంచేత, మోహ=కోరికల చేత, భయ= బెదరుచేత, సంభ్రాంతమ్ము=కలవరపాటుకు గురిచేసేది, నీరంధ్ర=దట్టమైన, సంసార=కుటుంబమనే, అరణ్య మునన్=ఈ కారడవిలో, దెసల్=దిక్కులు, తెలియక= గుర్తించలేక, ఆశాబద్ధమై=ఏదోలభిస్తుందనే కోరికల త్రాళ్ళతో కట్టుబడి, సారెకున్=మాటి మాటికి, క్రూరత్వమ్మునన్=కటికితనంతో, ప్రాణిలోకమ్ము=ఈ జీవప్రపంచ మంతా, ఒండొరున్=ఒకరినొకరు, కసిమసంగున్=చంపుకొంటారు. ఇటన్=ఇటువంటిచోట, దేహికిన్=దేహధారికి, హింసారంభమ్మువినా=చంపుకోడంతో మొదలయే దుఃఖంతప్ప, ఎటుల=ఏవిధంగా, సుఖంబు=ఆనందం, లభ్యంబౌ= సమకూరుతుంది?

**తాత్పర్యం:** *తమ్ముడూ! ఈ జీవితాన్ని జాగ్రత్తగా చూడు! దుఃఖం కోరికలు భయం వీటిచేత కలవరపాటుకు గురిచేస్తూ దట్టమైన కుటుంబమనే కారడవిలో దిక్కుతెలియక ఆశలనే తాళ్ళతో కట్టుపడి మాటిమాటికీ క్రూరంగా ఒకరినొకరు చంపుకొనే ఈ జీవలోకంలో దుఃఖంతప్ప సుఖం ఎక్కడ దొరుకుతుంది చెప్పు?*

**భరమౌ నాఁకటిపెల్లునన్ బులి నిజాపత్యమ్ము భక్షింప, సూ**
**నరులై యీనరు లెల్లవారు పరసంతానమ్ము భక్షింతు, రీ**
**పరహింసారతమౌ జగమ్ము ననుకంపాదృష్టి రక్షింప నెం**
**తురుగానీ, మనకేమి యన్నటులఁ బ్రొద్దుల్ పుత్తురా రాసుతుల్?**

**అర్థాలు:** భరమౌన్=భయంకరమైన, ఆఁకటిపెల్లునన్=ఆకలివెల్లువచేత, పులి=పెద్దపులి, నిజాపత్యమ్ము=తన సంతానాన్నే, భక్షింప=తింటే, సూనరులై=హంతకులై, ఈనరులు=ఈమానవులు, ఎల్లవారు=అందరూ, పర సంతానమ్ము=ఇతరుల పిల్లల్ని, భక్షింతురు=తింటారు. ఈ పరహింసా=ఈ పరులను బాధపెట్టడంలో, రతమౌ= మునిగిన, జగమ్ము= ప్రపంచాన్ని, అనుకంపాదృష్టి=దయతో, రక్షింపన్=కాపాడగా, ఎంతురుగానీ=పూనుకుంటారు కాని, రాసుతుల్=రాకుమారులు, మనకేమియన్నటులన్=మనకెందుకులే అని, ప్రొద్దుల్పుత్తురా=కాలం గడిపేస్తారా?

**తాత్పర్యం:** *పెద్దపులికి ఆకలి ఎక్కువైతే తనపిల్లల్నే తింటుంది. కాని మానవులుమాత్రం ఇతరుల్ని తింటారు. ఇలా ఇతరుల్ని చంపటమనే కార్యంలో మునిగిపోయిన ఈ ప్రపంచాన్ని దయతోకాపాడటానికి ప్రయత్నిస్తారుకాని, మనవంటి రాజకుమారులు మనకెందుకులే అని ఊరకుంటారా?*

**ప్రాసాదోపరితలముల**
**దాసీజన కల్ప్యమానతత్తద్భోగో**
**ల్లాస లసితాత్ములెల్ల ద**
**యాసారవిదూరులో? మహాంధులొ? తనయా!**

**అర్థాలు:** తనయా=అబ్బాయీ, ప్రాసాద=రాజభవనాల, ఉపరితలముల=పైభాగాల్లో, దాసీజన=సేవకీగణంచేత, కల్ప్యమాన=సమకూర్చబడిన, తత్తత్=ఆయా, భోగ+ఉల్లాస=సుఖ సంతోషాలతో, లసిత= పరవశించే, ఆత్ములెల్ల= అంతఃకరణులంతా, దయాసార=కరుణార్ద్రతకు, విదూరులో=దూరంగా ఉండేవారో, మహాంధులో=గ్రుడ్డివారో?

**తాత్పర్యం:** *తమ్ముడూ! నీ పసితనానికి బాధపడుతున్నాను. రాజప్రాసాదాల పైభాగాల్లో దాసీజనులచేత సేవలుచేయించుకొంటూ ఆ సుఖాల్లోతేలిపోయే నీవంటి వాళ్ళంతా దయకు దూరమైనవారా, లేక పుట్టంధులా అర్థంకావడం లేదు.*

**కానలఁ బచ్చికల్ దిని మృగమ్ములు గ్రుక్కెడు నీరు గ్రోలి ప్రా**
**ణానిలముల్ భరించుకొనవా, నరు లెంతటి జాల్ములోకదా!**

**జేనెడు పొట్టకై దురితసింధువునం బడి సృష్టియెల్ల దుః**
**ఖాన ముడుంగజేసి నరకప్రతిమాన మొనర్తురక్కటా!**

**అర్థాలు:** మృగమ్ములు=లేళ్ళు దుప్పులు వగైరా సాధుజంతువులు, కానలన్=మహారణ్యాలలో, పచ్చికల్=పచ్చగడ్డి వగైరాలు, తిని=ఆరగించి, గ్రుక్కెడు=ఒకసారి మ్రింగదగు, నీరు=నీటినిమాత్రం, గ్రోలి=త్రాగి, ప్రాణానిలముల్=ప్రాణాలునిలిపే ఆకలిమంటలను, భరించుకొనవా=చల్లార్చుకోవడంలేదా! నరులు=ఈ ఉన్నతజన్ములైన మానవులు, ఎంతటి= ఎంతపెద్ద, జాల్ములోకదా=క్రూరాత్ములోకదా! జేనెడు=బ్రొటనవ్రేలి నుండి చిటికెనవ్రేలిదాకా సాగదీస్తే ఎంతో అంతమాత్రమైన, పొట్టకై=కడుపులోని ఆకలిమంట చల్లారడంకోసం, దురితసింధువునన్=పాపపు సముద్రంలో, పడి=కూలిపోయి, సృష్టియెల్ల=ఈ ప్రపంచమంతా, దుఃఖాన=శోకంలో, ముడుంగజేసి=నశింపజేసి, నరకప్రతిమానము=చనిపోయాక యాతనలుపొందే ఒక యమలోకానికి ప్రతికృతిగా, ఒనర్తురు=తయారు చేస్తున్నారు, అక్కటా=అయ్యో!

**తాత్పర్యం:** *నోరులేని సాధుజంతువులు కూడా కాస్త పచ్చగడ్డితిని గుక్కెడు నీళ్ళుతాగి ఆకలి చల్లార్చుకుంటున్నాయి. ఈ పరిణతజీవులైన మానవులు ఎంతటి క్రూరులోకదా! అయ్యో! జేనెడు పొట్ట నింపుకొనడానికి పాపపు సముద్రంలోపడి ఈ ప్రపంచాన్ని దుఃఖంలోముంచి ఎక్కడో నరకలోకం ఉంటుందనుకుంటే దానికి ప్రతిరూపాన్ని ఇక్కడే చూపిస్తున్నారు కదా!*

**ఆఁకలిబాధచేఁ జెమట లాఱని గాసికి నోర్చి, ప్రాణముల్**
**పోకడపెట్టువారి శ్రమమున్ రుధిరమ్ము గడించి యీయఁగాఁ**
**జేకుఱినట్టి యర్థము లిసీ యని రోయ కెటుల్ భుజింతు వ**
**న్నా! కృపమాలి, ఘోరకలుషాక్తతఁ దుచ్ఛములైన భోగముల్.**

**అర్థాలు:** అన్నా=అయ్యా! ఆఁకలిబాధచేన్=ఆకలివలన బాధచేత, చెమటలు=స్వేదజలాలు, ఆఱని=ఆరి పోకుండా స్రవిస్తూంటే, గాసికిన్=శారీరకబాధలకు, ఓర్చి=సహించి, ప్రాణముల్= జీవధాతువులు, పోకడపెట్టు=బయటకుపోతూండగా, వారి=ఆ శ్రమజీవుల, శ్రమమున్= కష్టం, రుధిరమ్ము=రక్తం కలిసి, గడించి=సంపాదించి, ఈయఁగాన్=సమర్పిస్తూంటే, చేకుఱినట్టి=సమకూరిన, అర్థములు=సంపదలను, ఇసీయని=ఛీ అని, రోయక=చీదరించుకోకుండా, కృపమాలి=కరుణలేకుండా, ఘోరకలుష=భయంకరమైన పాపాలవలన, అక్తతన్=పొందినవైన, తుచ్ఛములైన=నీచములైన, భోగములు=సుఖాల్ని, ఎటుల్=ఏ విధంగా, భుజింతువు=అనుభవిస్తావు?

**తాత్పర్యం:** *ఓయీ!* కడుపునింపుకోవడానికి *ప్రాణాలకు తెగించి చెమటలారకుండా పనిచేసే శ్రమజీవుల కష్టం, రక్తం కలిసి సంపాదించి మీకిచ్చే సంపదల్ని, ఆ పాప పంకిలంచేత పొందిన తుచ్ఛమైన సుఖాల్ని ఛీ అని చీదరించుకోకుండా దయమాలి ఏవిధంగా నీవు అనుభవిస్తావు?*

**వ్రేగయినట్టి వేదనల పెల్లున మున్నె కుసుళ్ళుగూలి, య**
**య్యో! గడి కాళ్ళతో నొకటి నొక్కటి తాఁచుచుఁ గ్రుమ్ములాడు నీ**
**లేఁగలవంటి లోకుల మలీమసభావముఁ బాపి ప్రోతురా,**
**రాగిలి భోగముల్ గుడుతురా! నినువంటి నరేంద్రపుత్రకుల్.**

**అర్థాలు:** అయ్యో=అయ్యయ్యో, వ్రేగు+అయినట్టి=భారమైన, వేదనల=బాధలయొక్క, పెల్లున= ఆవేశంతో, మున్నె=ముందుగానే, కుసుళ్ళుగూలి=అవయవబంధాలు తొలగిపోయి, గడి కాళ్ళతోన్=బంధాలువేసిన కాళ్ళతో, ఒకటినొక్కటి=ఒకదాన్నొకటి, తాఁచుచున్=తన్నుకొంటూ, క్రుమ్ములాడున్=పొడుచుకొనే, ఈ లేఁగలవంటి= అమాయకమైన దూడలవంటి, లోకుల=ప్రజలలోని, మలీమసభావమున్=మకిలి ఆలోచనల్ని, పాపి=తొలగించి, ప్రోతురా=కాపాడతారా, నినువంటి=నీవంటి, నరేంద్రపుత్రకుల్=రాజకుమారులు, రాగిలి=తమకం వహించి, భోగముల్=సుఖాల్ని, కుడుతురా=అనుభవిస్తారా?

**తాత్పర్యం:** *అయ్యో కుమారా! బాధల బరువుతో అసలే కీళ్ళబంధాలు తొలగిపోయి, కట్టేసినకాళ్ళతో తమలోతాము తన్నుకొంటూ క్రుమ్ముకొంటూ నడచే లేగదూడలవంటి ఈ ప్రజలలోని దుష్టభావాల్ని తొలగించి కాపాడాలా; లేక నీవంటి రాకుమారులు తమకంతో ఈ సుఖాలన్నీ అనుభవించాలా చెప్పు!*

**సారధికృత్య మొక్కరుఁడు, సైంధవకృత్యము వేఱొకండు శాం**
**తారభటిన్ యథావిధి నుపాయముమై నెఱవేర్చి లోకయా**
**త్రారథమున్ మునీంద్రవిహితమ్మగు గమ్యము చేర్చుకోసమై**
**పాఱుని జన్మమున్, బుడమిపాలుని జన్మముఁ గల్గె నిమ్మహిన్.**

**అర్థాలు:** లోకయాత్రారథమున్=ఈ సంసార జీవయాత్ర అనే రథానికి, సారధికృత్యము= సరియైనదారిలో నడుపగలిగిన పనికి, ఒక్కరుఁడు=అధికారిగా ఒకడు, సైంధవకృత్యము= సింధుదేశంలో పుట్టిన మేలైనగుఱ్ఱాలవలె రథాన్ని లాగగలిగిన పనికి, వేఱొకండు=మరొకడు, శాంత=నెమ్మది, ఆరభటిన్=అతిశయించగా, యథావిధిన్= స్వాభావికంగా, ఉపాయముమై= తగిన ఎత్తుగడతో, నెఱవేర్చి=పూర్తిచేసి, మునీంద్రవిహితమ్మగు=మహర్షులకు ఇష్టమైన, గమ్యము=ఉద్దేశ్యానికి, చేర్చుకోసమై=తీసుకువెళ్ళడానికి, పాఱునిజన్మమున్=లోకాన్ని సరిదిద్దగల మార్గదర్శి బ్రాహ్మణుని పుట్టుక, పుడమిపాలుని జన్మమున్=ఈ భూమిని జనామోదంగా పాలించగలిగిన క్షత్రియుని పుట్టుక, ఇమ్మహిన్=ఈ నేలమీద, కల్గెన్=సంభవించాయి.

**తాత్పర్యం:** *ఈ లోకంలో సంసారమనే జీవనయానం సాగించడానికి మంచిదారిలో నడుపగలిగే మార్గదర్శకుని పనిని, మేలైనగుఱ్ఱాలవలె రథభారాన్ని ముందుకులాగేపనిని మెల్లగా స్వాభావికంగా తగిన ఎత్తుగడతో పూర్తిచేసి మహర్షులు చెప్పినవిధంగా గమ్యాన్ని చేర్చడంకోసం ఈ లోకంలో బ్రాహ్మణునిపుట్టుక, క్షత్రియుని పుట్టుక సంభవించాయి.*

**బరువు మోయఁగఁజాలు నశ్వములు లేక**
**ప్రాప్యము నెఱింగి నడపు సారధియు లేక**
**దారితప్పెను నేఁటికి నారథమ్ము;**
**ఎచటఁ బడి కూలిపోవునో యెఱుఁగరాదు.**

**అర్థాలు:** కాని, బరువు=ఈ భారాన్ని, మోయఁగన్ జాలున్=ముందుకు లాగగలిగిన, అశ్వములులేక=గుఱ్ఱాలు దొరక్క, ప్రాప్యమున్=పొందదగినదాన్ని, ఎఱింగి=తెలిసికొని, నడపు=ముందుకు నడపగలిగే, సారధియులేక= మార్గదర్శకుడు దొరక్క, నా రథమ్ము=నేను ఎక్కిన ఈ ధర్మరథం, నేఁటికి=ఈ నాటికి, దారితప్పెను=తప్పుదారి పట్టింది. ఎచటన్ పడి= ఏగోతిలోపడిపోయి, కూలిపోవునో=శిథిలమవుతుందో, ఎఱుఁగరాదు=తెలియడంలేదు.

**తాత్పర్యం:** *కాని, ఈ రథభారాన్ని మోయగలిగిన మేలుజాతి గుఱ్ఱాలు దొరకలేదు. పొంద దగిన లక్ష్యాన్ని గుర్తించి నడపగలిగిన సారధి దొరకలేదు. ఈ నాటికి నా ధర్మరథం దారి తప్పింది. ఏగోతిలోపడి విరిగిపోతుందో నాకర్థం కావడంలేదు.*

**స్వర్గఫలకాంక్ష రాజ్యవిస్తార కాంక్ష**
**జన్నములటంచు సంగ్రామ సరణులంచు**
**జనులు కురియించు రక్తవర్షమ్ము కతనఁ**
**దడియుచున్నది భూదేవి తనువు కుఱ్ఱ!**

**అర్థాలు:** కుఱ్ఱ=ఓయి చిన్నవాడా, స్వర్గఫల=ఎక్కడో చనిపోయినవెనుక వచ్చే స్వర్గంపైన, కాంక్ష=కోరికతో, రాజ్యవిస్తార=భూమిమొత్తాన్ని పాలించాలన్న, కాంక్ష=కోరికతో, జన్నములటంచు=యజ్ఞాలనీ, సంగ్రామ సరణు లంచు=యుద్ధతంత్రాలనీ, జనులు=ఈ ప్రజలు, కురియించు=పారించే, రక్తవర్షమ్ముకతనన్=నెత్తుటి ప్రవాహాలతో, భూదేవితనువు=ఈ భూమాత శరీరం, తడియుచున్నది=తడిచిపోతోంది.

**తాత్పర్యం:** *ఓయి పసివాడా! ఎప్పుడో స్వర్గప్రాప్తి కలుగుతుందనీ, ఈనేలంతా పాలించాలనీ యజ్ఞాలతోనూ యుద్ధాలతోనూ ఈ ప్రజలు పారించే నెత్తుటి ప్రవాహాల్లో ఈ భూమి అంతా తడిచిపోతోంది.*

**పొదుగు విడువని పిల్లపై బుద్ధిపాఱి**
**యడలునన్ దల్లి మేఁక సూనాంగణమున**
**రాల్చు కన్నీటిబొట్లంకురములుగాఁగ**
**మొలచుచున్నవి విషవృక్షములు కుమార!**

**అర్థాలు:** కుమార=నందకుమారా! పొదుగువిడువనిపిల్లపై=పాలుమానని తనపిల్లమీద, బుద్ధిపాఱి=మనసుపోయి, సూనాంగణమున=కసాయి ముంగిట్లో, తల్లిమేఁక=ఆమేకతల్లి, అడలునన్=భయంతో, రాల్చు=వదిలిపెట్టే, కన్నీటి

బొట్లు=బాష్పబిందువులు, అంకురములు గాఁగ=జలాలుకాగా, విషవృక్షములు=విసపుచెట్లు, మొలచుచున్నవి= మొలిచి పెద్దవుతున్నాయి.

**తాత్పర్యం:** *కుమారా! కసాయిముంగిట్లో తల్లిమేక పాలుమానని తనపిల్లను మర్చిపోలేక వదిలిపెట్టే కన్నీటిబొట్లు సాగుజలాలుకాగా ఇక్కడ విషవృక్షాలు మొలుస్తూన్నాయి.*

**ఆద్యులైనట్టి ఋషులు సత్యంబహింస**
**ధర్మదేవత రెండు నేత్రము లటంచుఁ**
**గఱపిపోయిరి లోకసంగ్రహము కొఱకు;**
**నంధురాలయి యాపె యల్లాడునిపుడు.**

**అర్థాలు:** ఆద్యులైనట్టి=మానవధర్మానికి మొదటివారైన, ఋషులు=మహామునులు, సత్యంబు= నిజంచెప్పడం, అహింస=బాధించకపోవడం, లోకసంగ్రహముకొఱకున్= ఈ ప్రపంచపు గొప్పదనానికి, ధర్మదేవత=న్యాయ వ్యవస్థయొక్క, రెండు నేత్రములు=రెండుకళ్ళు, అటంచున్=అని, గఱపిపోయిరి=నేర్పి వెళ్ళిపోయారు. ఆపె=ఆ ప్రపంచం, ఇపుడు=ఇప్పుడు, అంధురాలయి=రెండుకళ్ళూలేని గుడ్డిదై, అల్లాడున్=దుఃఖంతో క్రుంగిపోతోంది.

**తాత్పర్యం:** *పూర్వులైన మన మహర్షులు ఈ లోకప్రగతికి సత్యం అహింస ఈ రెండూ రెండుకళ్ళని చెప్పిపోయారు. లోకం ఇప్పుడు రెండుకళ్ళూలేని గ్రుడ్డిదై అల్లాడుతోంది.*

**ఊబిలోఁ గాళ్ళు దిగఁబడి, యోరమెడను**
**మలఁచి బయలాలకించు గోమాతవోలెఁ**
**దల్లడిలుచున్న దీవిశ్వధాత్రి రాచ**
**బిడ్డనికి నీకుఁ దగునె యుపేక్షసేయ?**

**అర్థాలు:** ఊబిలోన్=లోతుగానున్న బురదలో, కాళ్ళుదిగఁబడి=కాళ్ళురెండూ కూరుకుపోయి, ఓరమెడనుమలచి= మెడప్రక్కకు వంచి, బయలాలకించు=బయటనుంచి ఎవరిమాటలైనా వినిపిస్తాయాని వినే, గోమాతవోలెన్=తల్లి ఆవులా, ఈవిశ్వధాత్రి=ఈ ప్రపంచం, తల్లడిలుచున్నది=బిగ్గరగా విలపిస్తూన్నది. రాచబిడ్డనికి=రాకుమారుడవైన, నీకున్=నీవంటివానికి, ఉపేక్షసేయ=పట్టించుకోకపోవడం, తగునె=న్యాయమేనా?

**తాత్పర్యం:** *ఊబిలో కాళ్ళుదిగబడి ఓరమెడతో దిక్కులుచూచే గోమాతలాగా ఈ సకల ప్రపంచం తల్లడిల్లిపోతోంది. రాచబిడ్డవైన నీకు అనాదరించడం తగినపనేనా?*

**నా తమ్ముండు దయాపయోధి, శ్రితచింతారత్న, మాపన్న ర**
**క్షాతాత్పర్యుఁడు, బౌద్ధధర్మలతికల్ సాఁకంగలాఁడంచు నే**
**చేతఃప్రీతిగ నెంచికొందుఁగద, యిన్నీ! పుష్పబాణాగమా**
**ధ్యేతృప్రాథమికుండవై, తిరుగఁజన్నే నీ కిటుల్ సోదరా!**

**అర్థాలు:** సోదరా=తమ్ముడూ! నాతమ్ముండు=నాతమ్ముడు, దయాపయోధి=కరుణకు సముద్రంవంటివాడు, శ్రిత=ఆశ్రయించినవారికి, చింతారత్నము=అడిగిందిచ్చే చింతామణి వంటివాడు, ఆపన్న=కష్టాలలోనున్నవారిని, రక్షాతాత్పర్యుఁడు=కాపాడటమే తనధర్మంగా కలవాడు, బౌద్ధధర్మలతికల్=ఇప్పుడేపుట్టిన లేతీగలవంటి బౌద్ధధర్మాన్ని, సాఁకంగలాఁడు= పోషించగలవాడు, అంచు=అని, నే=నేను, చేతఃప్రీతిగన్=మనసారా, ఎంచికొందుఁగద= ఎన్నుకొన్నానుగదా, యిస్సీ=అయ్యో, పుష్పబాణ=మన్మథుని, ఆగమాధ్యేతృ=రాకకోసం ధ్యానించడమే, ప్రాథమికుండవై=మొదటిపనిగా భావించి, నీకిటుల్=నీకీవిధంగా, తిరుగఁజన్నే=తిరగడం బాగుందా?

**తాత్పర్యం:** *నాతమ్ముడు దయాసముద్రుడు, ఆశ్రితజన చింతామణి, కష్టాలలో ఉన్నవారిని కాపాడతాడు, ఈ బౌద్ధధర్మాన్ని గట్టెక్కిస్తాడు అని భావించుకున్నానుకాని, అయ్యో!* ఇలా *కామమగ్నుడవైపోయావేమి సోదరా!*

**నకనకలాడు పొట్టకు నింత గంజియే**
**నొదవని నిరుపేద యుమ్మలికయు**
**వేఁకియెత్తిన మందుమాఁకు పథ్యము పాన**
**మరయువారలు లేని యనద మూల్గు**
**అస్త్రజర్జరితాంగులై రణక్షోణి ది**
**క్కతి యేడ్పువారి యాహారవమ్ము**
**పతివియోగం బేకసుతవియోగము జత**
**యై పొక్కు నిర్భాగ్యురాలి కూయి**

**అంధపంగ్వాదులగు వికలాంగులెల్ల**
**సలుపు గగ్గోలు నేకమై జగతి, శోక**
**భీకరమహాంబునిధియౌచు, విరతిలేక**
**యడలుచుండఁగఁ జెవిఁదూరదా, కుమార!**

**అర్థాలు:** నకనకలాడు=ఆకలితో దహించిపోయే, పొట్టకు=ఉదరంలోకి, ఇంతగంజియేన్= కొంచెం గంజిగూడా, ఒదవని=దొరకని, నిరుపేద=గర్భదరిద్రుని, ఉమ్మలికయు=దుఃఖం, వేఁకియెత్తిన= జ్వరం తగిలితే, మందుమాఁకు=ఒక మందుమాత్రగాని మూలికగాని, పథ్యము=తినదగిన ఆహారంగాని, పానము=త్రాగేందుకు పానీయంగాని, అరయువారలు= చూచి ఇచ్చేవారు, లేని=తనవారంటూలేని, అనదమూల్గు=అనాథయేడ్పు, అస్త్రజర్జరిత= ఆయుధాలచేత గాయపడిన, అంగులై=అవయవాలతో, రణక్షోణి=యుద్ధరంగంలో, దిక్కతి= దిక్కులేక, ఏడ్పువారి= విలపించేవారి, ఆహారవమ్ము=దీనాలాపం, పతివియోగంబు= భర్త ఎడబాటు, ఏకసుతవియోగము=ఒక్కగానొక్క కొడుకుచావు, జతయై=కలిసిరాగా, పొక్కు= బాధపడే, నిర్భాగ్యురాలి=దురదృష్టవంతురాలి, కూయి=ఏడ్పుగొంతు, అంధపంగ్వాదులగు= గ్రుడ్డివారు కుంటివారు మొదలైన, వికలాంగులెల్ల=అవిటివారంతా, సలుపు=చేసే, గగ్గోలున్=

గొడవలూ, ఏకమై=ఒక్కటై, జగతి=ఈ ప్రపంచం, శోకభీకర=దైన్యంచేత భయంకరమైన, మహాంబునిధియౌచు= గొప్పసముద్రంగా, విరతిలేక=విరామంలేకుండా, అడలుచుండఁగన్= హాహాకారాలు చేస్తూంటే, కుమార=అబ్బాయీ, చెవిఁదూరదా=నీకు వినిపించడంలేదా?

**తాత్పర్యం:** *కడుపుకింత గంజిదొరకని నిరుపేద దుఃఖం, జ్వరం తగిలితే మందుమాకు చూచేవారులేని అనాథల ఏడ్పు, యుద్ధాల్లో గాయపడ్డవారి దీనాలాపం, మగడు కొడుకు ఒక్కసారే మరణిస్తే అప్పుడామెచేసే విలాపం, అవిటివారి గగ్గోలు అన్నీకలిసి ఈప్రపంచాన్ని శోకభయంకర సముద్రంలా హాహాకారాలు చేస్తూంటే వినిపించడంలేదా కుమారా?*

**ఆఁకలిసెకకుఁ గాయమున మాంసాదులు**
**హరియించిపోవ శల్యములు మిగిలి**
**పొలుసెత్తి, పాలి, కన్నులగుంటలేర్పడి,**
**బోర యెండఁగ, బొజ్జ బూరటిల్లఁ**
**బుడకకాళులతోడ నడయాడు చల్లనఁ**
**బెరటిలోనికి నేగి బిడ్డఁ డచట**
**మంటిపెళ్ళలు దినుచుంట గన్గొనియును**
**వలదని వారింప వాకురాక**

**కుత్తుకన్ నల్లపూసయుఁ, గుండలోన**
**వడ్లగింజయుఁ, గనుల బాష్పములు లేక**
**కడుపు చుమ్మలుచుట్టఁగా నడలుచున్న**
**తల్లులం గాంచవో నీవు తమ్ముఁగుఱ్ఱ?**

**అర్థాలు:** ఆఁకలిసెకకున్=ఆకలిమంటలకు, కాయమున=దేహంలో, మాంసాదులు=మాంసం రక్తం అన్నీ, హరియించిపోవ=ఆవిరికాగా, శల్యములుమిగిలి=ఎముకలు బయటపడి, పొలుసెత్తి=చర్మంమీద పొట్టుతేలి, పాలి=తెల్లబడి, కన్నుల=కళ్ళు, గుంటలేర్పడి=గుంటలు పడి, బోరయెండఁగ=గుండెలు ఎండిపోయి, బొజ్జ బూరటిల్లన్=పొట్ట ఉబ్బిపోయి, బుడక కాళులతోడ=పుల్లలవంటి కాళ్ళతో, నడయాడుచు=నడుచుకొంటూ, చల్లనన్=మెల్లగా, పెరటిలోనికిన్ ఏగి=దొడ్డివైపుకెళ్ళి, బిడ్డడు=తన కొడుకు, అచట=అక్కడ కనిపించిన, మంటి పెళ్ళలు=మట్టిగడ్డలు, తినుచుంట=నోట్లోపెట్టుకోవడం, కన్గొనియును=చూచికూడా, వలదని=వద్దని, వారింప= అడ్డుపెట్టడానికి, వాకురాక=నోటమాటరాక, కుత్తుకన్=మెడలో, నల్లపూసయున్=సౌభాగ్యచిహ్నమైన నల్లపూసలు, కుండలోన=పొయ్యిమీద పాత్రలో, వడ్ల గింజయున్=బియ్యపుగింజలు, కనుల=కళ్ళలో, బాష్పములు=కన్నీరు కూడా, లేక=కనిపించకుండా పోగా, కడుపు=ఉదరమంతా, చుమ్మలుచుట్టఁగాన్=సంక్షోభించగా, అడలుచున్న= అలమటిస్తున్న, తల్లులన్=ఆ మాతృమూర్తులను, కాంచవోనీవు=నీకు కనిపించడం లేదా, తమ్ముఁగుఱ్ఱ=తమ్ముడా?

**తాత్పర్యం:** *ఆకలిమంటలకు శరీరమంతా ఎండిపోయి ఎముకలు బయటపడ్డ, చర్మమంతా పొట్టుతేలిపోయిన, పాలిపోయిన, కళ్ళు గుంటలుపడ్డ, గుండెలెండిపోయిన, పొట్ట ఉబ్బిపోయిన కొడుకు పుల్లలవంటి కాళ్ళతో నడుచుకొంటూ మెల్లగా దొడ్డివైపుకు వెళ్ళి అక్కడ మట్టిబెడ్డలు తింటూండటం చూచికూడా తప్పు- తినకూడదని అడ్డుపెట్టడానికి నోరు పెగలక మెడలో నల్లపూసకాని, కుండలో బియ్యపుగింజకాని, కళ్ళలో కన్నీరుకాని కనిపించని ఆ మాతృమూర్తులు కడుపంతా చుమ్మలుచుట్టుకోగా అలమటించిపోవడం నీకు కనిపించడంలేదా తమ్ముడూ?*

**అవియున్ గుండెలు రాతికైనఁ గనుమన్నా! విశ్వదైన్యమ్ము, చా**
**లవు నీర్వెట్టఁగ వేయికన్నులు, భుజాలక్షల్ వలెన్ బాపకూ**
**ప విపన్నాత్ముల నుద్ధరింప, వెతఁబాపన్, సేదఁబోకార్ప, మై**
**నివురన్, బాష్పజలమ్ముఁ బోఁదుడువఁ దండ్రీ! లెమ్ము సజ్జుండవై.**

**అర్థాలు:** విశ్వ దైన్యమ్ము=ఈ ప్రపంచపు దీనత్వాన్ని, కనుమన్నా=ఒక్కసారి చూడునాయనా, రాతికైనన్=రాయివంటివానికైనా, గుండెలు=హృదయం, అవియున్=ఇదిచూస్తే బ్రద్దలై పోతుంది. వేయికన్నులు=మనిషికి వెయ్యికళ్ళున్నా, నీర్వెట్టఁగ=కన్నీళ్ళు పెట్టడానికి, చాలవు= సరిపోవు, పాపకూప=ఈ పాపమనే లోతైన నూతులలోని, విపన్నాత్ములన్=కష్టాలలో ఉన్నవారిని, ఉద్ధరింప=పైకెత్తడానికి, భుజాలక్షల్=లక్షభుజాలు, వలెన్=కావాలి, వెతఁ బాపన్=వీరి కష్టాలు పోగొట్టడానికి, సేదన్=వారి బడలికను, పోకార్ప=తీర్చడానికి, మైనివురన్=ధైర్యం చెప్పడానికి, బాష్పజలమ్మున్=కన్నీటిని, పోఁదుడువన్=తుడవడానికి, సజ్జుండవై=సిద్ధపడి, లెమ్ము=ముందుకురా, తండ్రీ=నాయనా!

**తాత్పర్యం:** *ఈ ప్రపంచం ఎంత దీనస్థితిలో ఉందో ఒకసారి చూడునాయనా! ఇదిచూస్తే ఎంతటి రాతిగుండెలైనా బ్రద్దలవుతాయి. దీన్నిచూచి కన్నీరుపెట్టడానికి వెయ్యికన్నులు చాలవు. పాపకూపంలోని వీరిని ఉద్ధరించడానికి లక్షచేతులు కావాలి. వీరి కష్టాలు తీర్చడానికి, బడలిక పోగొట్టడానికి, ధైర్యం చెప్పడానికి, కన్నీరు తుడవడానికి లేచి సిద్ధపడునాయనా!*

**అని బుజ్జవమునఁ బలికిన**
**విని నందుఁడు, బెదరు సుంత విడిచినమది నా**
**నన మెత్తిచూచి, గౌతమ**
**ముని కేమో విన్నవింపఁబోయి మనమునన్.**

**అర్థాలు:** అని=ఈ విధంగా, బుజ్జవమునన్=అనునయంగా, పలికిన=బుద్ధుడు మాట్లాడితే, విని=అదివిన్న, నందుఁడు=ఆ నందకుమారుడు, బెదరు=లోపలి భయం, సుంత= కొంతవరకు, విడిచినమదిన్=వదలిన మనస్సుతో, ఆననము=ముఖాన్ని, ఎత్తిచూచి=పైకెత్తి చూచి, గౌతమమునికి=అన్నగారైన గౌతమబుద్ధునితో, ఏమో=ఏదో, విన్నవింపఁబోయి= చెప్పుకొనడానికి సిద్ధమై కూడా, మనమునన్=తనలో......

**తాత్పర్యం:** *ఈ విధంగా అన్నగారు అనునయిస్తూ పలికిన మాటలకు తమ్ముడైన నందుడు మనసులోని బెదురు కొంత పోగా, ముఖమెత్తి అన్నగారిని చూచి ఏదో చెప్పబోయి, మళ్ళీ మనసులో ఇలా అనుకొంటున్నాడు. తాను చేసేకార్యం సమర్ధనీయం కాకపోతే పెద్దవారి ముందు మాట్లాడటానికి సంకోచం తప్పదుకదా!*

**'వెన్నెల తోడికోడలయి, వీణియపాటకు విందువియ్యమై**
**సన్నని తెమ్మెరల్ నవతుషారకణమ్ములు సాఁకు బిడ్డయౌ**
**క్రొన్ననవంటి నా వలపుఁగూడ గురుండు దొసంగొనర్చి, నన్**
**జెన్నఁటిగాఁ దలంచి నిరసించె, నిఁకేమని మాఱువల్కుదున్.'**

**అర్థాలు:** వెన్నెల=చల్లదనానికి, తోడికోడలయి=ఏరాలై, వీణియపాటకు=వీణానాదంవంటి ఆనందకారకానికి, విందువియ్యమై=కావలసిన వియ్యపురాలై, సన్నని=మెల్లగావీచే, తెమ్మెరల్= చల్లగాలులు, నవతుషారకణమ్ములు= అప్పుడే పుట్టిన మంచుబిందువులు, సాఁకు=పోషించే, బిడ్డయౌ=గారాలబిడ్డ అయిన, క్రొన్ననవంటి=లేతపూవు లాంటి, నావలపున్=నా ప్రేమ పల్లవాన్ని, కూడ=సహితం, గురుండు=పూజనీయులైన అన్నగారు, దొసంగు= తప్పిదంగా, ఒనర్చి=చేసి, నన్=నన్ను, చెన్నటిగాన్=నీచునిగా, తలంచి=భావించి, నిరసించెన్=తిరస్కరించాడు, ఇఁకేమని=ఇంక ఏవిధంగా, మాఱువల్కుదున్=సమాధానం చెప్పేది?

**తాత్పర్యం:** *నా ప్రేమపుష్పం ఎటువంటిది! చల్లదనం దానినీడ. వీణానాదానికి కావలసిన దగ్గర చుట్టం. సన్నని పిల్లతెమ్మెరలు, కోమలమైన మంచుబిందువులు తమ బిడ్డగా పోషించే నవపల్లవం. అటువంటి నా ప్రేమనుకూడా తప్పునుచేసి అన్నగారు నన్ను నీచుడిగా భావించారు. నన్ను నిరాదరించారు. ఇక ఈయనకు ఏమని చెప్పాలి?*

**అనుచుఁ జింతించి, యేతాదృశానురాగ**
**విభవసామ్రాజ్యలక్ష్మియౌ వెలఁదిమిన్న**
**తలఁపునం బాఱ, ననుతాపతప్తుఁడగుచు**
**నెనరు నిండిన హృదయమ్ము నిశ్వసింప.**

**అర్థాలు:** అనుచున్=ఈ విధంగా, చింతించి=తలపోసి, ఏతాదృశ=ఇటువంటి, అనురాగ= ప్రేమయొక్క, విభవ=సంపదనే, సామ్రాజ్యలక్ష్మియౌ=దేశానికి ఏలికయిన, వెలఁదిమిన్న=నాయకురాలైన సుందరి, తలఁపునన్=మనసులో, పాఱన్=విహరించగా, అనుతాప=పశ్చాత్తాపంతో, తప్తుఁడగుచు=దహింపబడినవాడై, నెనరు=కరుణ, నిండిన= తొలుకాడిన, హృదయమ్ము=అంతరంగం, నిశ్వసింప=నిట్టూర్పువిడువగా.....

**తాత్పర్యం:** *పైవిధంగా బాధపడుతూండగా ఇంతగొప్ప అనురాగసంపద అనే సామ్రాజ్యానికి అధిదేవత అయిన స్త్రీరత్నం తనప్రేయసి సుందరి మనసుపొరలలోంచి బయటకొచ్చి*

*విహరించింది. నందుడు అదిచూచి పశ్చాత్తాపంతో దహించుకుపోయాడు. అతని హృదయం కరుణతో నిండిపోయి గాఢంగా నిట్టూర్చింది. అప్పుడు....*

**'గురుదేవుఁ డక్కటా! మన**
**నిరుపమమగు రాగసురధునిన్ దెగనాడన్,**
**వెఱతు నెదురాడఁగా, సుం**
**దరి! యీనాదొసఁగుఁగూడఁ దగు మన్నింపన్.**

**అర్థాలు:** అక్కటా=అయ్యో! మన=మనమధ్యగల, నిరుపమము అగు=పోల్చటానికి వీలులేనిదైన, రాగ= అనురాగంయొక్క, సురధునిన్=ఆకాశగంగా ప్రవాహాన్ని కూడా, గురుదేవుఁడు=పూజ్యుడైన అన్నగారు, తెగనాడన్= ఖండించగా, ఎదురాఁడగా=కాదనడానికి, వెఱతున్=భయపడుతున్నాను, సుందరి=నాప్రేయసీ సుందరీ! ఈ=ఈ పరిస్థితిలో, నా=నాదైన, దొసఁగున్=ఈతప్పును, కూడన్=సహితం, తగు మన్నింపన్=క్షమించడానికి తగినదానవే.

**తాత్పర్యం:** *అయ్యో! పూజ్యులైన అన్నగారు మనమధ్యగల ఉపమించటానికి వీలులేని అనురాగ గగన గంగాప్రవాహాన్ని కూడా అడ్డుకున్నారు. ఏమిచేయను! కాదనలేను. సుందరీ! ఇటువంటప్పుడు నీవు నా యీ తప్పునుకూడా క్షమించాలి తప్పదు.*

**ఎఱుఁగుదుగాన నందు విమలేంగిత, మీ పదదాసు నేరముల్**
**గరుణదలిర్ప సైఁచెదవుగావున వేఁడెదఁగాక, నిష్కృతుల్**
**దొరకునె నా యఘమ్ములకుఁ దొయ్యలి! నాదొకమాట, యింతకున్**
**బరులు గ్రహింతురెట్టు? లతిమానుషముల్ మన కూర్మి పేరుముల్.'**

**అర్థాలు:** నందు=ఈ నందకుమారుని, విమల=స్వచ్ఛమైన, ఇంగితము=అభిప్రాయం, ఎఱుఁగుదుగాన= తెలిసినదానవుగనుక, ఈపదదాసు=నీ పాదాలను సేవించే వీని, నేరముల్= తప్పులన్నిటినీ, కరుణదలిర్ప= దయాతిశయంతో, సైఁచెదవుగావున=క్షమిస్తావు కాబట్టి, వేఁడెదఁగాక=నిన్ను ప్రార్థిస్తున్నాను, తొయ్యలి=ఓ ప్రియురాలా, నా అఘమ్ములకున్=నేను చేసిన పాపాలకు, నిష్కృతుల్=పరిష్కారాలు, దొరకునె=ఈ లోకంలో లభిస్తాయా, నాది=నేను చెప్పవలసిన, ఒకమాట=మాటొకటుంది, ఇంతకున్=ఇంతకీ, మన=మనమధ్య నడచిన, కూర్మి=ఇష్టాల, పేరుముల్=గొప్పతనాలు, అతిమానుషముల్=మానవాతీతాలు, పరులు= ఇతరులు, గ్రహింతురెట్టుల్=ఏవిధంగా తెలిసికొంటారు?

**తాత్పర్యం:** *ఈ నందకుమారుని అభిప్రాయాల్లోని విమలత్వం తెలిసినదానివి కనుక ఈ పాదదాసుని తప్పులన్నీ నామీది దయతో క్షమిస్తావు కాబట్టి ఓ ప్రియురాలా! నిన్ను ప్రార్థిస్తున్నా... నేను నీపట్ల చేసిన పాపాలకు ఈ లోకంలో ప్రాయశ్చిత్తం లభిస్తుందా? ఇంతకీ ఇప్పుడు నేను చెప్పవలసిన మాటొకటుంది. అసలు మనమధ్య నడచిన ప్రియ వచనాల గౌరవాలు మానవాతీతాలు కదా! వాటిని ఇతరులు ఎట్లా తెలిసికొంటారు?*

**అనుచుఁ జింతాపరంపరలందు మరల**
**మునుఁగు నందునివైఖరి పోల్చి గురుఁడు**
**'మనసు దాపఁగనేల? యీ మౌనముద్ర**
**వదలి ననుఁ గాంచుమన్న! నీ వదనమెత్తి.**

**అర్థాలు:** అనుచున్=ఇలా అనుకొంటూ, చింతాపరంపరలందు=ఆలోచనల వెల్లువలో, మరల=తిరిగి, మునుఁగు=మునిగిపోతూన్న, నందునివైఖరి=నందుని పరిస్థితిని, పోల్చి= ఈడుపరచి, గురుఁడు=అనుభవజ్ఞుడైన అన్నగారిలా అన్నారు, మనసు=నీ మనసులో ఉన్న విషయాన్ని, దాపఁగనేల=దాచుకోవడం ఎందుకు, ఈ మౌనముద్ర= ఇలా మాటాడకుండా ఉండటం, వదలి=వదిలిపెట్టి, నీ వదనమెత్తి=నీతలపైకెత్తి, ననున్=నావైపు, కాంచుమన్న= చూడు తమ్ముడూ!

**తాత్పర్యం:** *ఇలా అనుకొంటూ మళ్ళీ ఆలోచనల్లో పడిపోతున్న తమ్ముని గమనించిన గౌతముడు ఎందుకు లోలోపల దాచుకుంటావు? కాస్త తలెత్తి నావైపు చూడమన్నాడు.*

**నీనాసందున నేటికీ యరమరల్? నిక్కమ్ము దెల్పంగదో**
**యీ! నాపల్కు రుచింపదేమొ? మది కేమేనొవ్వ గల్పించెనే**
**మో? నీ మానసమెట్లొ నా కెఱుఁగరాదో? యాప్తు లెవ్వారు తం**
**డ్రీ! నాకన్నను నీ' కటంచనునయించెన్ బేర్మి దైవారఁగన్.**

**అర్థాలు:** నీనాసందునన్=నీకూ నాకూ మధ్య, ఏటికి=ఎందుకు, ఈ అరమరల్=ఈ తేడాలు? నిక్కమ్ము= నిజమేదో, తెల్పంగదోయీ=చెప్పరాదూ! నాపల్కు=నేచెప్పింది, రుచింపదేమొ=బాగులేదో, మదికి=నీ మనస్సుకు, ఏమేని=ఏదైనా, నొవ్వగల్పించెనేమో= కష్టం కలిగించిందా, నీ మానసమెట్లొ=నీ మనసేమిటో, నాకెఱుఁగరాదో= నాకు తెలియలేదా, నాకన్నను=నాకంటె, నీకు=ఇక్కడనీకు, ఆప్తులెవ్వారు=కావలసినవారెవరు, తండ్రీ=నాయనా! అటంచు=అంటూ, పేర్మి=ప్రేమ, తైవారఁగన్=పొంగగా, అనునయించెన్=ఓదార్చాడు.

**తాత్పర్యం:** *తండ్రీ! నీకూనాకూ మధ్య ఈ దూరాలు ఎందుకు? నిజమేదో చెప్పరాదూ! నామాట నచ్చలేదా? నీ మనసుకేమైనా కష్టం కలిగించిందా? చెప్పకపోతే నీ మనసు నాకెలా తెలుస్తుంది? ఇక్కడ నాకంటె నీకు కావలసినవాళ్ళెవరున్నారు? అంటూ బుద్ధుడు ప్రేమతో బుజ్జగించాడు.*

ఇది

షష్ఠసర్గము

# ధర్మసంవాదము

**దగదీఱ నీరమ్ము ద్రావి యోలలనాడ**
**రారయ్య! యో బాటసారులార!**
**చల్లని యీ తరుచ్ఛాయల సేదదే**
**ఱఁగ విశ్రమింపరారయ్య! సుంత**
**ముగ్గిరాలిన ఫలమ్ముల నారగింప ర**
**య్యా! మాకు నాత్మీయులైతి రింక**
**అడ్డమాకలు లేక యాడుఁడు పాడుఁ డు**
**య్యేలలూఁగుఁడు సంశయింపవలదు**

**కేళిదీర్ఘిక కలవలు గూలఁద్రోసి**
**చూఱవదలితి నలుఁగులు పాఱవిడిచి,**
**అరమరలులేక, కొంచక యనుభవింప**
**రమ్మ! రాయంచలార! భృంగమ్ములార!**

**అర్థాలు:** ఓ బాటసారులార=ఓ దారినబోయే ప్రయాణీకులారా; దగదీఱ=దప్పిక తీరేలా, నీరమ్ముద్రావి= మంచినీళ్ళు త్రాగి, ఓలలాడ=జలకాలాడగా, రారయ్య=రండి రండి, చల్లని=చల్లగా ఉండే, ఈతరుచ్ఛాయల=ఈ చెట్లనీడలలో, సేదదీఱఁగ=అలసట తీరేలా, విశ్రమింప రారయ్య=ఊరడిలుదురుగాని రండి, సుంత= కొంచెం, ముగ్గిరాలిన=పండి క్రిందపడిన, ఫలమ్ములన్=పండ్లను, ఆరగింపరయ్యా=తినండి సామీ, మాకున్=ఇక్కడ మాకు, ఆత్మీయులైతిరి=కావలసినవారయ్యారు, ఇంక=ఇకమీద, అడ్డమాకలు=అడ్డుసొడ్డులు, లేక= లేకుండా, ఆడుఁ డు=ఆడండి, పాడుఁడు=పాడండి, ఉయ్యేలలూఁగుఁడు=ఉయ్యాలలూగండి, సంశయింపవలదు=సందేహపడకండి, కేళి దీర్ఘికకు=ఆడుకొనే దిగుడుబావులకు, అలవలు= అవరోధాలు, కూలఁద్రోసి=పడగొట్టి, అలుఁగులు=మొరవలు, పాఱవిడిచి=పారేలా వదిలి, చూఱవదలితి=చాటుగా నీరునింపాను, రాయంచలార=ఓ రాజహంసలారా, భృంగమ్ము లార=ఓ తుమ్మెదలారా, అరమరలులేక=సందేహాలు లేకుండా, కొంచక=జంకులేకుండా, అనుభవింపరమ్మ= యధేచ్ఛగా విహరించండి.

**తాత్పర్యం:** *తెరువరులైన ఓరాయంచలారా! తుమ్మెదలారా! దప్పితీర జలకాలాడరండు. ఈ*

*చల్లనిచెట్లనీడల్లో విశ్రమించండి. కొన్ని మిగలమగ్గిన పళ్లుతినండి. కావలసినవారు కాన మీకడ్డుసొడ్లులేవు. ఆడండి. పాడండి. ఊయలలూగండి. మీరు విహరించేందుకు దిగుడుబావులలో పూర్తిగా నీరుపెట్టాను. జంకూగొంకూలేక స్వేచ్ఛగా విహరించండి. ఇది ధర్మసంవాదానికి పాఠకుల్ని సిద్ధంచేయడం. స్వేచ్ఛగా వాదించండని సూచన.*

**అల్లన నిల్చి రాకొమరుఁ డానతుఁడై, తొలుదొల్త సుంత తొ**
**ట్రిల్లియుఁ గొంకొకింత యధరీకృత మైనకొలంది మాటలన్**
**దొల్లిటి మాధురీమహిమ దోఁపఁగ నంజలివట్టి, 'సైఁపఁగాఁ**
**జెల్లుఁ బ్రభూ! ననున్, జనవుచేఁ బొరపొచ్చెపు మాటలాడినన్.**

**అర్థాలు:** రాకొమరుఁడు=రాజకుమారుడు నందుడు, ఆనతుఁడై=ఆజ్ఞాపించబడినవాడై, అల్లననిల్చి=జడునివలె నిలబడి, తొలుదొల్త=మొట్టమొదట, సుంత=కాస్తంత, తొట్రిల్లియున్= కంగారుపడి, కొంకు=భయం, ఒకింత= కొంచెం, అధరీకృతము=తక్కువ, ఐనకొలంది= అవుతూన్నకొద్దీ, మాటలన్=తన మాటలలో, తొల్లిటి=ముందున్న, మాధురీమహిమ= తీపిదనం, తోఁపఁగన్=తొంగిచూడగా, అంజలివట్టి=చేతులుమోడ్చి, ననున్=దీనుడనైన నన్ను, చనవుచేన్=ఒకప్పుడు నీతోవున్న గారాబంచేత, పొరపొచ్చెపు=డాంబికమైన, మాటలు=పలుకులేవైనా, ఆడినన్= అన్నానేమో, ప్రభూ=ఇప్పుడీ ప్రపంచానికే శాంతిని బోధించే ఏలికా, సైఁపఁగాన్=క్షమించుటకు, చెల్లున్= సరిపోయినవాడవు.

**తాత్పర్యం:** *ఈ విధంగా బుజ్జగించబడిన రాకుమారుడు నందుడు కొంతసేపు చలనం లేకుండా నిలబడి మొట్టమొదట తిరిగి మాట్లాడటానికి కాస్తంత కంగారుపడ్డాడు. కొంత సేపటికి తనలోని భయం కొంతకొంత తరిగిపోతూండగా మాటలలో ముందున్న తీపిదనం మరల పొటమరించడం మొదలుపెట్టింది. అన్నగారి ముందు చేతులుమోడ్చి నమస్క రించాడు. ఒకప్పుడు అన్నగారితోనున్న గారాబంచేత అలా పెడసరంగా మాట్లాడానేమోనని ఒప్పుకున్నాడు. ఇప్పుడు ఈ ప్రపంచానికే శాంతిని బోధించే కార్యక్రమంలో ఉన్న ప్రభుడైన అన్నను క్షమించమని వేడుకున్నాడు. అలా క్షమించగలడని నమ్మాడు.*

**ననుఁ గాముకమాత్రునిగా**
**మనమునఁ దలపోసియేమొ, మదనాగమతీ**
**ర్థునిగాఁగ నానతిచ్చుట?**
**వినవలతున్ గురుఁడు నాదు విన్నపము దయన్.**

**అర్థాలు:** ననున్=దీనుడనైన నన్ను, కాముకమాత్రునిగా=కేవలం కామాతురినిగా, మనమునన్=మనసులో, తలపోసియేమొ=అనుకొనికాబోలు, మదనాగమ=కామశాస్త్రంలో, తీర్థునిగాఁగ=ఉపాధ్యాయుడనని, ఆనతి

ఇచ్చుట=శాసించటం, గురుఁడు=పూజనీయుడవైన నీవు, నాదువిన్నపము=నేచెప్పేదికూడా, దయన్=కరుణించి, వినవలతున్=వినమని కోరుతున్నాను.

**తాత్పర్యం:** నన్ను కేవలం మదనవిద్యా పారంగతునిగా భావించి కాబోలు ఇలా శాసించటం. ఆర్యా! నా మాటకూడా కొంచెం వింటావా?

**ఎలదేఁటి రెక్కతుద పైఁ**
**బొలసినఁ గసుగందు మల్లెమొగ్గకుఁ దులయై,**
**తొలిసంజ నూత్నరుచులన్**
**గలగలమని నవ్వు వలపుఁ గాదనఁదగునే?**

**అర్థాలు:** ఎలదేఁటి=వయసులోవున్న తుమ్మెద, రెక్కతుదపైన్=రెక్కచివరలో, పొలసినన్= తళుక్కుమని, కసుగందు=రంజిల్లే, మల్లెమొగ్గకున్=మల్లెపూవుకు, తులయై=సాటివచ్చే; తొలిసంజ=ఉదయభానుని, నూత్న రుచులన్=క్రొత్తకాంతులతో, గలగలమనినవ్వు=గలగలా నవ్వే, వలపున్=ప్రేమరాగాన్ని, కాదనఁ=వద్దనడం, తగునే=భావ్యమేనా?

**తాత్పర్యం:** *వయసుతుమ్మెద రెక్కచివర మెరిసే మల్లెమొగ్గలా, ఉదయభానుని క్రొత్త కాంతుల్లా గలగలా విరిసే ప్రేమరాగాన్ని వలదనడం బాగుంటుందా?*

**పొచ్చె మెఱుఁగని భావముల్ పొంది పొసఁగి**
**వలపు నెత్తావు లీనెడు భాగ్య మల్ప**
**మగునె గురుదేవ! – నీ చెప్పినట్ల– శోక**
**బహుళమైన యనిత్యప్రపంచమందు.**

**అర్థాలు:** నీచెప్పినట్ల=నీవు చెప్పినట్లే, శోకబహుళమైన=దుఃఖంతో నిండిన, అనిత్య=శాశ్వతం కాని, ప్రపంచ మందు=ఈ లోకంలో, పొచ్చెము=కపటం, ఎఱుఁగని=తెలియని, భావముల్= ఉద్దేశాలు, పొంది=గ్రహించి, పొసఁ గి=ముందుకుసాగి, వలపునెత్తావులు=ప్రేమపరిమళాలు, ఈనెడు=ప్రసవించే, భాగ్యము=ఆ అదృష్టం, అల్పమగునె=తక్కువదవుతుందా? గురుదేవ= పూజ్యులైన ఆచార్యవర్యా!

**తాత్పర్యం:** *ఆచార్యవర్యా! నీవుచెప్పినట్లే తాత్కాలికం,దుఃఖమయం అయిన ఈలోకంలో కపటంలేని భావాలతో ముందుకుసాగుతూ ప్రేమ పరిమళాలు ప్రసవించే అదృష్టం ఏమంత తక్కువదా?*

**చింతల్ సేరని తా, వుదారగుణముల్ శిక్షించు నాచార్యక,**
**మ్మంతశ్శత్రు సమాజమున్ దొలఁచు దివ్యాస్త్రంబు, నద్వైత భా**
**వాంతేవాసి, కృపాలతల్ మొలచు పా, దానందనిష్యంది, స**
**ర్వాంతర్యామిగదా, మహా ప్రణయభావావేశమో గౌతమా!**

**అర్థాలు:** ఓ గౌతమా=అన్నగారైన గౌతముడా! చింతల్‌సేరని=దుఃఖాలు దరిచేరని, తావు= చోటు, ఉదార గుణముల్=ఉన్నతమైన భావాలను, శిక్షించున్=నేర్పే, ఆచార్యకమ్ము=గురు పీఠం, అంతశ్శత్రు=మనలోపలి విరోధులైన కామక్రోధాదుల, సమాజమున్=కూటాన్ని, తొలచు=ఛేదించే, దివ్యాస్త్రంబున్=అలౌకికాయుధం, అద్వైతభావ=రెండు అనేది లేదనే సూత్రానికి, అంతేవాసి=శిష్యరూపం, కృపాలతల్=కరుణ అనే తీవలు, మొలచు= పుట్టే, పాదు=నేలతల్లి, ఆనంద=పరమసుఖాన్ని, నిష్యంది=స్రవించేది, మహా=గొప్పశక్తివంతమైన, ప్రణయ భావా వేశము=ప్రేమతత్త్వపు పరాకాష్ఠ, సర్వాంతర్యామిగదా=ఈసృష్టి అంతరాంతరాళాల్లో సదా ప్రవహించేదే కదా!

**తాత్పర్యం:** *అన్నా గౌతమా! చింతలే లేనితావు, ఉన్నతగుణాలను బోధించే ఆచార్యస్థానం, అంతశ్శత్రువులను తొలగించే దివ్యాయుధం, అద్వైతభావానికి శిష్యప్రాయం, కరుణాలతలకు పాదు, ఆనందాన్ని స్రవించే మహా ప్రేమతత్త్వం అన్నిచోట్లా వ్యాపించిందేకదా!*

**భానుకోటి ప్రభాభాసమానమై, స్వ**
**తంత్రమై నిల్చు నానందధామమునకు**
**సంతతవసంతసుఖదమై జరగుఁ గాదె**
**తాపహర మౌచుఁ బ్రేమఘంటాపథమ్ము.**

**అర్థాలు:** ప్రేమఘంటాపథమ్ము=వలపు సామ్రాజ్యపు రహదారి, భానుకోటి=కోటిమంది సూర్యుల, ప్రభా= కాంతితో, భాసమానమై=సమానంగా వెలుగుతూ, ఆనందధామమునకు= పరమసంతోష సౌధానికి, స్వతంత్రమై= స్వేచ్ఛగా, నిల్చు=దారిచూపిస్తుంది. సంతత=ఎప్పుడూ, వసంతసుఖదమై=పూలకారులా సంతోషదాయకమౌతూ, తాపహరమౌచున్=తాపాన్ని పోగొడుతూ, జరగున్‌గాదె=నడపుతుంది గదా!

**తాత్పర్యం:** *ఈ ప్రేమ అనే రాజమార్గం ఆనందసౌధానికి కోటిసూర్యప్రభలతో స్వేచ్ఛగా దారి చూపిస్తుంది; ఎప్పుడూ వసంతకాలంలా తాపాన్ని పోగొడుతూ సుఖాన్నిస్తుందిగదా!*

**ప్రియజనవిహీనమైన జీవితము మొరడు,**
**ప్రణయమాధురి గ్రోలిన బ్రతుకు దివస**
**మాత్రమేనియుఁ జాలుఁ, బ్రేమమ్ము లేమి**
**కన్న నిప్పచ్చరము వేఱ కలదె దేవ!**

**అర్థాలు:** ప్రియజన=ప్రేమించేవారి, విహీనమైన=తోడులేని, జీవితము=బ్రతుకు, మొరడు= మోడువంటిది. దేవ=పూజనీయా! ప్రణయమాధురి=వలపు తీపులు, గ్రోలిన=త్రాగిన, బ్రతుకు=మనుగడ, దివసమాత్రమేనియున్= ఒక్కరోజైనా, చాలున్=సరిపోతుంది. ప్రేమమ్ము= అనురాగం, లేమికన్న=దొరక్కపోవడంకంటె, నిప్పచ్చరము= శూన్యం, వేఱకలదె=వేరేముంది?

**తాత్పర్యం:** *ప్రేమించే తోడులేని బ్రతుకు మోడువంటిదికదా! దేవా... వలపుమాధురులు త్రాగిన బ్రతుకు ఒక్కరోజు చాలు. వలపు దొరక్కపోతే బ్రతుకంతా శూన్యమేకదా!*

**స్వరచయమ్ము లొండొంటిని బెరసి రాగ**
**రసము లీనెడుపగిదిఁ బరస్పరమ్ము**
**భావములు గూడి రాగమ్ము ప్రభవమందుఁ;**
**దీయఁ తలఁపులు మొదలంటఁ ద్రెంచుటెట్లు?**

**అర్థాలు:** స్వరచయమ్ములు=సరిగమపదని అనే సంగీత స్వరములు, ఒండొంటిని=ఒకదాని కొకటి, బెరసి=హత్తుకొని, రాగరసములు=కమ్మని సంగతులు, ఈనెడుపగిదిన్=జన్మనిచ్చే విధంగా, పరస్పరమ్ము=అన్యోన్యం, భావములు=అనురక్తులు, కూడి=కలిసి, రాగమ్ము=ప్రేమ, ప్రభవమందున్=పుడుతుంది. తీయన్=మధురమైన, తలఁపులు=ఆలోచనల్ని, మొదలంటన్=కూకటివ్రేళ్ళతో, ఎట్లు=ఏవిధంగా, త్రెంచుట=నాశనంచేయగలను?

**తాత్పర్యం:** *స రి గ మ ప ద ని అనే సప్తస్వరాలు ఒకదానికొకటి ఒరుసుకొని మధుర మనోహరమైన సంగీతపు ధ్వనులు పుట్టి రసావిష్కరణం జరుగుతుంది కదా! అలాగే, ప్రేయసీ ప్రియుల అన్యోన్య భావాలు ఒక్కటై అనురాగం జనిస్తుంది. ఈ ప్రపంచాన్ని ఐకమత్యంగా నడిపించేదే ఈ ప్రక్రియ. అందుకు ఆధారాలైన ఈ తీపి తలపుల్ని కూకటి వ్రేళ్ళతో ఎలా ఛేదించమంటావు?*

**ప్రహరి చరింపుచున్ దిగిచిపట్టెడు నొండొకటిన్ సతమ్ము నీ**
**గ్రహములు ప్రేమసూత్రముల, రాగవశంవదవృత్తిఁగాదె! దు**
**స్సహబహుళాధ్వయానముల శ్రాంతి యెఱుంగ కుడుల్ చరించు న**
**న్వహము వియోగభారవహమైన దయావహగీతికారుతిన్.**

**అర్థాలు:** ఈ గ్రహములు=ఈ పైన మనచుట్టూ తిరిగే గగనచరాలన్నీ, సతమ్ము=ఎల్లప్పుడూ, ఒండొకటిన్=ఒకదానినొకటి, ప్రేమసూత్రముల=స్నేహ పాశాలతో, ప్రహరి=తమతమ కక్ష్యలలో, చరింపుచున్=తిరుగుతూ, తిగిచిపట్టెడున్=ఆకర్షించి పట్టుకుంటున్నాయి. రాగ=అనురాగానికి, వశంవద=లొంగిన, వృత్తిన్ గాదె=యాత్ర వలనకదా, దుస్సహ=సహింపరాని, బహుళ=ఎన్నో, అధ్వ=త్రోవల, యానముల=ప్రయాణాల్లో, శ్రాంతి= తీరిక, ఎఱుంగక=లేకుండా, ఉడుల్=నక్షత్రాలు, అన్వహము=ప్రతిదినమూ, వియోగ=ఎడబాటనే, భారవహమైన=బరువునుమోసే, దయావహ=కరుణామయమైన, గీతికా=పాటల, రుతిన్=ధ్వనితో, చరించున్=తిరుగుతూంటాయి.

**తాత్పర్యం:** *మనచుట్టూ తిరిగే గ్రహాలన్నీ ఒకదానినొకటి స్నేహపాశాలతో ఆకర్షించబట్టే కదా తమకక్ష్యల్లో విడవకుండా తిరుగుతున్నాయి! భరింపరాని ఎన్నో ఆకాశపు దారులలో నక్షత్రాలు తీరికలేకుండా ఎడబాటనే బరువునుమోస్తూ కరుణామయమైన సంగీతధ్వనులతో రోజూ తిరుగుతూన్నాయంటే ప్రేమకు లొంగిన నడకల వల్లనే కదా!*

**వివృత తరంగబాహుఁడయి, విశ్వము నాత్మపృథూపగూహన**
**ప్లవమునఁ దేల్పఁగాఁదివురు వారిధినాయకుఁ డైక్యభావసం**

**భవదనుభూతి సౌఖ్యరసభావనఁ జేసికదా మహాత్మ! యీ**
**భవవిషపాత్రలోఁ బ్రణయభాక్కుల కందు మరందబిందువుల్.**

**అర్థాలు:** మహాత్మ=ఓ మహాపురుషా! వారిధినాయకుఁడు=మహాసముద్రుడు, వివృత=విచ్చుకొన్న, తరంగ= కెరటాలనే, బాహుఁడయి=చేతులుకలవాడై, విశ్వమున్=ప్రపంచాన్ని, ఆత్మ=తనయొక్క, పృథు=పెద్దదైన, ఉపగూహన=కౌగిలి అనే, ప్లవమునన్=తెప్పపై, తివురు=ప్రయత్నించి, తేల్పగాన్=తేలించడానికి, ఐక్యభావ=ఒకటి అనేభావమే, సంభవత్=ఫలంగా, అనుభూతి=అనుభవ, సౌఖ్యరసభావనన్=సుఖప్రీతి యోచనను, చేసికదా= కావించేకదా! ఈ=ఈ కనిపించే, భవ=పుట్టుకనే, విషపాత్రలోన్= ప్రాణాంతకమైన గిన్నెలో, ప్రణయభాక్కులకు= ప్రేమనుపొందేవారికి, మరందబిందువుల్= తేనెచుక్కలు, అందు=అభిస్తాయి!

**తాత్పర్యం:** *మహాత్మా! సముద్రుడు తన తరంగాలనే చేతుల కౌగిట ఈవిశ్వాన్ని తేల్చి పట్టుకోవడం ఇద్దరూ ఒకటనే భావాన్నిచ్చే సుఖానుభూతిని పొందటం కోసమేకదా! అలాగే ప్రేమికులకు ఈ పుట్టుకనే ప్రాణాంతకమైన జీవనపాత్రలో తేనెబొట్లు ఆ అనుభూతితోనే దొరుకుతాయి.*

**అకలుషమైన ప్రేమ కిరవై, నురుఁగుల్ వెలివాఱుచున్న స్ఫా**
**టిక మణిపాత్రలోపల నటించు నిజ ప్రతిబింబ దర్శనో**
**త్సుకసుఖమున్ వినిశ్చలతఁ జూఱఁగొనంగల నేర్పరుల్ గదా!**
**సుకృతులు, వారి కీభవము సుందరమై శివమై కనంబడున్.**

**అర్థాలు:** సుకృతులు=పుణ్యాత్ములు, అకలుషమైన=నిర్మలమైన, ప్రేమకు=అనురాగానికి, ఇరవై=తావయి, నురుఁగుల్=తెల్లటి ఫేనాన్ని, వెలివాఱుచున్న=క్రక్కుచున్న, స్ఫాటిక=అచ్చమైన, మణిపాత్రలోపల=రత్నంతోచేసిన గిన్నెలోని, నటించు=కదలే, నిజ=తమవైన, ప్రతిబింబ=నీడలను, దర్శన=చూచుకోవడంలో, ఉత్సుక=తమక, సుఖమున్= సౌఖ్యాన్ని, వినిశ్చలతన్=తదేక పారవశ్యంతో, చూఱగొనంగల=దొంగిలించగల, నేర్పరుల్ గదా=నిపుణులుకదా! వారికి=అటువంటివారికి, ఈభవము=ఈ సంసారం, సుందరమై= ఎంతో అందంగానూ, శివమై=కైవల్యంగానూ, కనంబడున్=కనబడుతుంది.

**తాత్పర్యం:** *పుణ్యాత్ములు నిర్మలమైన ప్రేమకు క్షేత్రాలు. వారు నురుగువలె తెల్లటి స్వచ్ఛమైన మణిపాత్రలోపల కదలాడే తమ ప్రతిబింబాలను చూచేతమకంలో కదలకుండా సుఖాన్ని చూరగొనగల నేర్పరులుకదా! వారికీ సంసారంకూడా ఎంతో అందంగానూ, శుభదాయకం గానూ కనిపిస్తుంది.*

**విరియన్ బూచెడు దేవ! ప్రేమసుమముల్ విశ్వమ్ము; నాకొక్క క్రొ**
**వ్విరి మారందఝరీపరాగసుషమావిర్భావమానోజ్ఞమై**

**దొరకెన్, నాయెద నద్ది రాగరస మాధుర్యమ్ములన్ నింప, ద**
**బ్బులకావుల్ మెయిఁ గప్పుమాత్ర ముకుళీభావమ్ము సంధిల్లునే?**

**అర్థాలు:** దేవ=ఓ దైవసమానుడా! విశ్వమ్ము=ఈ ప్రపంచంలో, ప్రేమసుమముల్=ఎన్నో అనురాగపుష్పాలు, విరియన్‌బూచెడు=విరబూస్తున్నాయి. నాకు+ఒక్క=అందులో నాకొక, క్రొవ్విరి=క్రొత్త పూవు, మారందఝరీ=ప్రవాహంవంటి మకరందంతో, పరాగ=పుప్పొడి, సుషమ=శోభయొక్క, అవిర్భావ=పుట్టుకచేత, మనోజ్ఞమై=మనోహరమై, దొరకెన్=దొరికింది. నాయెదన్=నా హృదయంలో, అద్ది=ఆ పూవు, రాగ=అనురాగముయొక్క, రస=ఇంద్రియాల యొక్క, మాధుర్యమ్ములన్=తియ్యదనాలను, నింప=నింపివేయగా, దబ్బులకావుల్=కపటపు రంగులు, మెయిన్=శరీరాన్ని, కప్పుమాత్ర=కప్పినంతమాత్రాన, ముకుళీభావమ్ము=ముడుచుకోవడం అనేది, సంధిల్లునే=తాకుతుందా?

**తాత్పర్యం:** *భగవానుడా! విశ్వంలో ఎన్నో ప్రేమపుష్పాలు పూస్తున్నాయి. వానిలో మరంద పరాగాలచేత మనోహరమైన క్రొత్తపూవొకటి నాకు దొరికింది. అది రాగరస మాధుర్యాలతో నా హృదయం నింపేసింది. ఇక పైనెన్నిరంగులు పూస్తేమాత్రం ముడుచుకుంటుంది?*

**వసివాళ్వాడ, దొకప్పుడుఁ**
**గసుగందదు, మేల్మిచాయ కగ్గదు, తావుల్**
**కొసరు, మరందము చిలుకును**
**విసువక యెదఁ దాల్తు నట్టి ప్రేమసుమమ్మున్.**

**అర్థాలు:** వసివాళ్వాడదు=పూర్తిగా వాడిపోదు, ఒకప్పుడున్=ఒక్కసారికూడా, కసుగందదు= కమిలిపోదు, మేల్మిచాయ=మేలైన కాంతి, కగ్గదు=తగ్గిపోదు, తావుల్=సువాసనలు, కొసరు=కావాలంటుంది, మరందము= తేనియలు, చిలుకును=చల్లుతుంది, అట్టి=అటువంటి, ప్రేమ సుమమ్మున్=వలపు అనే విరిని, విసువక= విసుక్కోకుండా, ఎదన్=హృదయంలో, తాల్తున్= ధరిస్తాను.

**తాత్పర్యం:** ప్రేమకుసుమం పూర్తిగావాడిపోదు. ఎప్పుడూ కమిలిపోదు. కాంతి తగ్గదు. పైగా సువాసనలు దిద్దుకొంటుంది. చుట్టూ తేనెలుచల్లుతుంది. అటువంటి పుష్పాన్ని కాదనకుండా హృదయంలో దాచుకొంటాను.

**తెలియనివాఁడ గాను గురుదేవ! జగజ్జనజీవనమ్ము క**
**శ్మలతకుఁ దావలంబయి, రుజావికలంబు, జరాపరీతమై,**
**కలుషలతాలవాలమయి, కాడును బీడయి, శోచనీయమై**
**గులగులలాడు పుర్వులకు గూఁడయి మృత్యుముఖమ్ముఁ జొచ్చుటల్.**

**అర్థాలు:** గురుదేవ=పూజ్యగౌతమా! జగత్=ఈ ప్రపంచంలోని, జనజీవనమ్ము=ప్రజల జీవితం, కశ్మలతకున్=

మలినాలకు, తావలంబయి=ఉనికిపట్టయి, రుజావికలంబు=రోగాలచేత పీడింపబడుతూ, జరాపరీతమై= ముసలి తనంచేత చుట్టబడి, కలుషలత=పాపాలనే లతలకు, ఆలవాలమయి=ఆవాసమై, కాడునుబీడయి=అడవిగాను బంజరుగాను, శోచనీయమై=శోకింపదగినదై, గులగులలాడు= లుకలుకలాడే, పుర్వులకు=పురుగులకు, గూఁడయి=నివాసమై, మృత్యుముఖమ్మున్=చావు నోటిలోనికి, చొచ్చుటల్=ప్రవేశించవలసి రావడం, తెలియనివాఁడగాను=ఎరుగనివాణ్ణికాను.

**తాత్పర్యం:** *ఆర్యా! ఇక్కడి జనజీవితం గురించి నాకంతా తెలుసు. ఇది మలినాలకు ఉనికిపట్టు. అన్ని రోగాలకూ ఆటపట్టు. ఎప్పుడూ ముసలితనం ఆవరించి ఉంటుంది. పాపాలనే ముళ్ళతీగలకు ఆవాసం. అంతా అడవుల మయంలా బంజరుభూమిలా శోకాలకు ఆలవాలం. లుకలుకలాడే పురుగులకు గూడువంటిది. చావుయొక్క ముఖంలోనికి చేరాలంటే మాత్రం రాజమార్గం. అంతా నాకు తెలుసు.*

**బుడగలవంటి తుచ్ఛసుఖపూర్తికి లోభముసెంది, యామిషం**
**బెడలిన యెమ్ము గాంచి కలహించెడు కుక్కలగుంపువోలెఁ బా**
**ల్పడిరి జగజ్జనుల్ ప్రణయలాస్య కళోచితరంగమైన యీ**
**పుడమి సమస్తమున్ బ్రధనభూమి యొనర్పఁగ నష్టబుద్ధులై.**

**అర్థాలు:** బుడగలవంటి=ఏక్షణమైనా చితికిపోయే నీటిబుడగలవంటి, తుచ్ఛసుఖ=నీచమైన సుఖాలవలన, పూర్తికి=ఏదో సంతృప్తిపొందాలనే, లోభముచెంది=ఆరాటపడి, ఆమిషంబు=మాంసం, ఎడలిన=విడిచిపెట్టిన, ఎమ్ముగాంచి=ఎముకను చూచి, కలహించెడు=కొట్లాడుకునే, కుక్కలగుంపువోలె=ఊరకుక్కల మందల్లా, జగజ్జనుల్=ఈ ప్రంచంలోని ప్రజలు, నష్టబుద్ధులై=ఉచితానుచితాలు కోల్పోయినవారై, ప్రణయలాస్య= ప్రేమనర్తనమనే, కళా=లలితకళకు, ఉచితరంగమైన= అనువైన రంగస్థలమైన, ఈపుడమి=ఈ భూమి, సమస్తమున్=మొత్తాన్ని, ప్రధనభూమి=యుద్ధరంగంగా, ఒనర్పఁగ=చేయడానికి, పాల్పడిరి=సిద్ధపడ్డారు.

**తాత్పర్యం:** *నీటిబుడగలవలె పైకి ఉన్నాయనిపించే నీచమైన సుఖాలతృప్తికోసం ఆరాటపడి మాంసంకోల్పోయిన ఎముక కోసం కాట్లాడే కుక్కలగుంపులాగా ఈ ప్రపంచ ప్రజలు బుద్ధులు నశించి ప్రేమనర్తనమనే లలితకళకు తగిన రంగస్థలం ఈ భూమి మొత్తాన్ని యుద్ధరంగం చేయడానికి పూనుకొన్నారు.*

**నాకీ లోకముతోఁ బనేమి, వినుమన్నా! పాలమున్నీటిలో**
**నేకాంతమ్మగుచోఁ బ్రవాళములచే నేపారు ద్వీపమ్ములో**
**నాకుల్ రాలని, పూలు వాడని వసంతారామమధ్యమ్ములో**
**రాకాచంద్రసహస్రముల్ వెలుఁగు హర్మ్యాగ్రమ్మునం దొక్కటన్.**

**అర్థాలు:** వినుమన్నా=అన్నా నేచెప్పేదివిను! నాకు=తత్వం తెలిసిన నాకు, ఈలోకముతోన్= ఈ ప్రపంచంతో,

పనేమి=ఏమిపని? పాలమున్నీటిలోన్=పాలసముద్రంలో, ఏకాంతమ్ముగుచోన్=ఎవరూలేనిచోట, ప్రవాళములచేన్=పగడాలచేత, ఏపారు=ఒప్పారే, ద్వీపమ్ములోన్=ఒకదిబ్బమీద, ఆకుల్‌రాలని=ఏనాడూ శిశిరంలేని, పూలువాడని=వెలుగుతగ్గిపోని, వసంతారామ=పూవులకారుతోనిండిన ఆశ్రమం, మధ్యమ్ములో=నడుమ, రాకా చంద్రసహస్రముల్=వేయిమంది పూర్ణచంద్రులు, వెలుఁగు=ప్రకాశించే, హర్మ్యాగ్రమ్మునందు=మేడపైన, ఒక్కటన్=ఒకచోట....

**తాత్పర్యం:** *అన్నా! ఈ లోకంతో నాకు పనేముంది! నేనైతే పాలసముద్రంలో ఎవరూలేని చోట పగడాలదిబ్బమీద ఆకులేరాలని పూలేవీవాడని వసంతమనే ఆరామం మధ్య వేయిమంది పూర్ణచంద్రులు ఒక్కటై ప్రకాశించే సౌధోపరిభాగంలో ఒకచోట.... (తరువాతి పద్యంతో అన్వయం)*

> **నాకుం బ్రాణము ప్రాణమైన చెలితో నానాసుఖమ్ముల్ లతా**
> **నీకమ్మై పెనఁగొన్న డోలికలలో నిఃఖేదదివ్యామృత**
> **స్వీకారమ్ము భజింపుచున్ సమయముల్ సీమల్ వెసన్ దాఁటి, యే**
> **కాకారమ్మును నిత్యమై నెగడు నయ్యానంద మర్థించెదన్.'**

**అర్థాలు:** నాకున్=నాకు, ప్రాణము=జీవమూ, ప్రాణమైన=సర్వస్వమైన, చెలితో=నా సుందరితో, నానా సుఖమ్ముల్=అన్నివిధాల ఆనందాలు, లతానీకమ్మై=తీవలమాలికలుగా, పెనఁగొన్న=మెలివేసుకొన్న, డోలికలలో=పల్లకీలలో, నిఃఖేద=బాధలులేని, దివ్యామృత= దేవతలు సేవించే బ్రహ్మరసాన్ని, స్వీకారమ్ము=చేగొని, భజింపుచున్=సేవిస్తూ, సమయముల్= కాలావధులు, సీమల్=దేశావధులు, వెసన్=వేగంగా, దాఁటి=అధిగమించి, ఏకా కారమ్మును=ఇద్దరం ఒక్కటై, నిత్యమై=శాశ్వతంగా, నెగడున్=పరిఢవిల్లే, ఆ+ఆనందము=ఆ అమేయమైన ఆనందాన్ని, అర్థించెదన్=కోరుకొంటాను.

**తాత్పర్యం:** *నా ప్రాణమూ సర్వస్వమైన సుందరితో సర్వసుఖాలు తీవలుగా పెనవేసికొని తయారైన పల్లకీలలో ఏబాధాలేకుండా దివ్యమైన అమృతాన్ని సేవిస్తూ కాలమూ దేశమూ మరచిపోయి ఒక్కటిగా శాశ్వతంగా విహరించే ఆగొప్ప ఆనందాన్ని కోరుకొంటున్నాను.*

> **అని యుత్కంఠ దలిర్ప నందుఁడు స్వకీయప్రేమసిద్ధాంతమున్**
> **వినిపింపన్, సుగతుండు తద్వదనమున్ వీక్షించి, మందస్మితం**
> **బును బెన్‌జాలియు జాలువాఱ, 'హృదయంబున్ విప్పి మేల్సేసితో**
> **తనయా! వన్నెలుదేఱు నీ ప్రణయతత్త్వం బెల్ల నాలించితిన్.**

**అర్థాలు:** అని=ఇలాచెప్పి, నందుఁడు=నందకుమారుడు, ఉత్కంఠదలిర్ప=ఆసక్తికరంగా, స్వకీయ=తనదైన, ప్రేమసిద్ధాంతమున్=వలపు నిర్ణయాన్ని, వినిపింపన్=వివరించగా, సుగతుండు=తథాగతుడు, తద్వదనమున్=అతని ముఖాన్ని, వీక్షించి=అవలోకించి, మందస్మితంబును=చిరునవ్వును, పెన్‌జాలియు=పెద్దగా కనికరమూ,

జాలువార=ప్రవహించగా, ఓతనయా=ఓతండ్రీ! వన్నెలుదేఱు=రంగులమయమైన, నీ=నీ అమాయకపు, ప్రణయతత్త్వంబు ఎల్లన్=ప్రేమగురించిన భావం మొత్తాన్ని, ఆలించితిన్= ఆలకించాను. హృదయంబున్=నీ మనసును, విప్పి=బహిరంగపరచి, మేల్సేసితి=నాకుచాలా మంచిచేసావు.

**తాత్పర్యం:** *నందుడిలా తన ప్రేమసిద్ధాంతాన్ని వివరించగా బుద్ధుడు అతనిముఖాన్ని పరిశీలనగా చూచాడు. కోపానికి బదులు ఆయనలో చిరునవ్వు విపరీతమైన జాలి కలిగి ఇలా అన్నాడు. ఓయీ తమ్ముడూ! నీ రంగులప్రపంచమైన ప్రేమతత్త్వాన్ని పూర్తిగా విన్నాను. నీ హృదయాన్ని విప్పి దాచుకోకుండా లోపలున్నది మొత్తంచెప్పేసావు. మంచిపని చేసావు. నాకు మేలేచేసావు.*

**అఖిల జంతు సామాన్యమౌ నాత్మసౌఖ్య**
**లోలతయె పెద్దగాఁ జవుల్పుట్టఁ జెప్పి**
**తింతదూరమ్ము; కామమోహితుల కెల్ల**
**నెంత చక్కని యుపదేశ మిది కుమార!**

**అర్థాలు:** కుమార=బిడ్డా! ఇంతదూరమ్ము=ఇప్పటిదాకా, అఖిల=అన్ని, జంతు=జలచరాలు భూచరాలు అయిన జన్యువులకు, సామాన్యమౌ=సమానంగా ఉండే, ఆత్మ=తనదైన, సౌఖ్యలోలతయె=సుఖంపొందాలన్న చాపల్యాన్నే, పెద్దగాన్=గొప్పచేసి, చవుల్ పుట్టన్= నోరూరేలాగా, చెప్పితి=చెప్పావు. ఇది=ఈ సిద్ధాంతం, కామమోహితులకు= తుచ్ఛమైన సుఖాలు పొందాలనుకొనేవారికి, ఎల్లన్=ఇటువంటి వాటన్నింటిలోకి, ఎంతచక్కని=ఎంతమంచి, ఉపదేశము=ఉద్బోధన!

**తాత్పర్యం:** *అబ్బాయీ! ఇప్పటిదాకా నీవుచెప్పిందంతా కొంతమందికి బాగానచ్చుతుంది. ఈ లోకంలో పుట్టిన అన్ని జంతువులకు సహజంగావుండే సుఖాలమీది లాలసత్వమేకదా పెద్దగొప్పగా రుచికరంగా చెప్పావు! ఇదంతా తుచ్ఛమైన సుఖాలమీద కోరికలున్నవారికి ఎంత చక్కని ఉపదేశం!*

**హద్దుమీఱిన విషయవాంఛాళిఁ దవిలి**
**పరువులిడు మానసహయమ్ము పజ్జ నరుగు**
**భావనన్ బట్టలేక, స్వప్నములు గిలుకు**
**కవుల వ్రాఁతలు చదివితోకాక నీవు!**

**అర్థాలు:** నీవు=ఇప్పటివరకు నీవు, హద్దుమీఱిన=మర్యాదలు అతిక్రమించిన, విషయ= ఇంద్రియాలయొక్క, వాంఛాళిన్=కోరికల సమూహమందు, తవిలి=తగులుకొని, పరువులిడు=పరుగులు పెట్టే, మానస=మనస్సు అనే, హయమ్ముపజ్జన్=గుఱ్ఱం దగ్గరకు, అరుగు=చేరే, భావనన్=ఆలోచనను, పట్టలేక=గట్టిగా నియమించలేక,

స్వప్నములు=కలలో తేలిపోతూ, గిలుకు=ఏదో తోచినట్లు రచించే, కవుల=ఈ రచయితల, వ్రాఁతలు=రచనల్ని, చదివితోకాక=చదివివుంటావు కాకపోతే నీకీ వెర్రి ఆలోచనలు ఎలావస్తాయి?

**తాత్పర్యం:** *ఇప్పటిదాకా నీవు ఎల్లలుదాటిన ఇంద్రియ వాంఛలలో తగులుకొని పరుగులు పెట్టే మనసనే గుఱ్ఱాన్ని చేరే ఆలోచనలతో, దానిని నియంత్రించలేక, దానిని చేరాలని కలలు కంటూ ఏవో తమకు తోచినట్లు వర్ణించే కవుల వర్ణనలు చదివినట్లున్నావు. లేకపోతే నీకీ వెఱ్ఱిమొఱ్ఱి ఆలోచనలు ఎందుకు వస్తాయి?*

> **ఆ తరుశాఖలన్ ఫలచయమ్ముల మెక్కుచు, వింతవింతలౌ**
> **చేఁతలుఁ బల్కు లొండొరుల చేతములన్ గరఁగింపఁ గామసం**
> **ప్రీతి ఘటింపుచున్న విరుమేనులు నొక్కటిచేసి; చెప్పు మా**
> **కోఁతులజంట సౌఖ్యమునకున్ సుత! యేమని పేరుపెట్టెదో?**

**అర్థాలు:** సుత=అబ్బాయీ! ఆ తరుశాఖలన్=ఆ చెట్టుకొమ్మలమీద, ఫలచయమ్ముల=రకరకాల పండ్లు, మెక్కుచు=కడుపునిండా తింటూ, వింతవింతలౌ= చిత్రమైన, చేఁతలున్=పనులతోనూ, పల్కుల=కిచకిచలతోనూ, ఒండొరుల=ఒకదానికొకటి, చేతములన్=మనస్సులు, కరఁగింపన్=చెమరింపజేయగా, ఇరుమేనులున్=రెంటి శరీరాలను, ఒక్కటిచేసి=పెనవేసి, కామసంప్రీతి=సంయోగసుఖాన్ని, ఘటింపుచున్నవి= సంపాదిస్తున్నాయి. ఆ కోఁతులజంట=ఆ కపిద్వయంయొక్క, సౌఖ్యమునకున్=ఆనందానికి, ఏమని=ఏవిధంగా, పేరుపెట్టెదో= పేరుపెడతావో, చెప్పుము=తెలియజేయి.

**తాత్పర్యం:** *పుత్రా! అటుచూడు... ఆ చెట్టుకొమ్మలమీద రెండు కోతులు పళ్ళుతింటూ విచిత్రంగా గెంతుతూ కిచకిచలాడుతూ వాటి మనస్సులొక్కటై శరీరాలు ఒకటిచేసి కామ సుఖాన్ని పొందుతున్నాయి. ఇప్పుడుచెప్పు... ఆ జంట ఆనందానికి ఏమని పేరుపెడతావు?*

> **లేదు కుమార! తన్మిథునలీలకు మర్త్యమనోజ కేళికిన్**
> **భేద; మళీకసౌఖ్యములు పెక్కులు భావనచేసి, భ్రాంతిలో**
> **నీఁదుచుఁ బెద్దపేరులిడి, యిద్దియె నిత్యము సత్యమందు, వు**
> **న్మాదముగాక, ప్రేమ మగునా, పరువంపు నిగారపుంబసల్?**

**అర్థాలు:** కుమార=పుత్రా! తత్+మిథునలీలకు=ఆ కోతులజంట క్రీడకూ, మర్త్య=మానవుల, మనోజకేళికిన్= మదనక్రీడకూ, భేదము=తేడా, లేదు=కనిపించడంలేదు. అళీక=నిజంకాని, సౌఖ్యములు=తృప్తులను, పెక్కులు= ఎన్నిటినో, భావనచేసి=ఊహించి, భ్రాంతిలోన్=భ్రమలో, ఈఁదుచున్=ఈతలుకొడుతూ, పెద్దపేరులిడి= పెద్దపెద్దపేర్లు పెడుతూ, ఇద్దియె=ఇదిమాత్రమే, నిత్యము=ఎల్లప్పుడూ ఉంటుంది, సత్యము=అబద్ధంకాదు, అందువు= అంటావు, ఉన్మాదముగాక=పిచ్చికాకపోతే, పరువంపు=ప్రాయంయొక్క, నిగారపున్=మిసిమి, పసల్=సొంపులు, ప్రేమము=నిజమైన అనురక్తి, అగునా=అవుతుందా?

**తాత్పర్యం:** *కుమారా! ఆ కోతులజంట సుఖానికీ మనుషులజంట సుఖానికీ తేడా ఏమిటి? నిజాలుకాని సౌఖ్యాలేవో భావించి భ్రమలోపడి కొట్టుకుంటూ వాటికి పెద్దపెద్దపేర్లు పెట్టి ఇదిమాత్రమే నిత్యం, ఇదిమాత్రమే సత్యం అంటావే.. అదంతా ఉన్మాదంగాక మరేమిటి? యౌవనంచేకలిగే మిసిమితనాల పొంగులుగాని, నిజమైన స్వార్థంలేని ప్రేమ అవుతుందా?*

**అందగాఁడవు, కొమరుఁ బ్రాయముననున్న**
**రాచబిడ్డవు గావున రాగభోగ**
**ములు కొనల్ సాఁగి క్రొన్ననల్ పూచుఁగాని**
**పరువమది నీకు మాత్రము తిరమఁటోయి?**

**అర్థాలు:** అందగాఁడవు=సుందరమైన రూపున్నవాడివి, కొమరున్=పడుచు, ప్రాయముననున్న=వయసులోనున్న, రాచబిడ్డవు=రాజకుమారుడివి, కావున=కాబట్టి, రాగభోగములు=ఒంటిచాయ మంచితిండి, కొనల్సాఁగి= పెంపొంది, క్రొన్ననల్=క్రొత్త పూతలు, పూచుఁగాని=పూస్తాయిగాని, పరువము అది=ఈ పడుచుదనం, నీకు మాత్రము= నీకైతేమాత్రం, తిరమఁటోయి=శాశ్వతమంటావా!

**తాత్పర్యం:** *రూపం సుందరం. పడుచు వయసు. అందులో రాచబిడ్డవు. కాబట్టి ఒంటికి మంచిరంగు, మంచిభోజనం సహజం. అవి అలాగే పెంపొంది క్రొత్తక్రొత్తగా పూతలు పెడతాయేగాని ఈ పడుచుదనం నీకుమాత్రం శాశ్వతమా?*

**విందున్ నీ సతి సార్థకాఖ్యయనుచున్ వేనోళ్ళ, నీ రూపమున్**
**గందున్ డెందము విందుగా, మధురవాక్యస్ఫూర్తి మీ నెయ్యపుం**
**జందంబెల్ల నుపన్యసించితివి, వత్సా! యింతకున్ వాసియౌ**
**సౌందర్యమ్మును, రక్తి యొండొకట విశ్వమ్మందు లేదందువో?**

**అర్థాలు:** వత్సా=కుమారా! నీసతి=నీభార్య, సార్థకాఖ్యయనుచున్=పేరుకుతగ్గట్లే మంచి సుందరి అని, వేనోళ్ళ= అందరినోటా, విందున్=వింటూంటాను. నీరూపమున్=నీ అందచందాలను, డెందము విందుగా= మనసారా, కందున్=చూస్తున్నాను. మధుర=తీయనైన, వాక్యస్ఫూర్తి=శబ్ద చమత్కారాలతో, మీనెయ్యపున్=మీమధ్యగల సాహచర్యపు, చందంబెల్లన్=వివరమంతా, ఉపన్యసించితివి=ముచ్చటించావు. ఇంతకున్= ఇంతకంటె, వాసియౌ= మిన్నయైన, సౌందర్యమ్మును=అందాన్ని, రక్తి=ఆనందాన్ని, విశ్వమ్మందు=లోకంలో, ఒండొకట=వేరేచోట, లేదందువో=దొరకదంటావా?

**తాత్పర్యం:** *కుమారా! నీ భార్య సుందరి పేరుకుతగ్గట్లు నిజంగా సుందరేనని అందరినోటా విన్నాను. నీవు ఎంత అందగాడవో కళ్ళారా చూస్తూనే ఉన్నాను. మధురమధురమైన వచనాలతో శబ్దచమత్కారాలతో మీనడుమ నడచే శృంగార విషయాలన్నీ మీ ఆనంద పారవశ్యాన్ని నీవు*

*ఉపన్యసించగా విన్నాను. బాగానే ఉంది. అయితే ఇంతకంటే గొప్పదైన సౌందార్యాన్నీ, పొందే ఆనందాన్నీ ఈ లోకంలో మరెక్కడా పొందలేనంటావా? నా మాట విని నీ తర్కాన్ని వదిలెయ్యి.*

**ఆ కపిచాన తత్కపికి నందపుఁ బెన్గని, నీ లతాంగియున్**
**నీకు వరాలమూట, మఱి నిర్జరకాంతల నిత్యయౌవనా**
**స్తోకవిలాస విభ్రమరుచుల్ చవిచూచినఁ, దక్కురూపముల్**
**చీఁకటి తోడఁబుట్టువు లిసీ! యనిపించుఁ గదోయి కంటికిన్,**

**అర్థాలు:** ఆ కపిచాన=ఆ ఆడుకోతి, తత్ కపికిన్=ఆ మగకోతికి, అందపున్=అందాలకు, పెన్ గని=పెద్ద ఉనికిపట్టు, నీ లతాంగియున్=నీయొక్క ప్రేయసికూడా, నీకు=నీవరకు నీకు, వరాలమూట=వరాలు కురిపించే ముడుపు, మఱి=అయితే, నిర్జర=దేవతల, కాంతల= భార్యల, నిత్యయౌవన=ఎల్లప్పుడూ ఉండే పరువంయొక్క అస్తోక=విస్తారమైన, విలాస= అందాలతోడి, విభ్రమరుచుల్=శృంగారకాంతులు, చవిచూచినన్=రుచిచూచినప్పుడు, కంటికిన్=అదే నేత్రానికి, తక్కురూపముల్=మిగిలిన శృంగారవిషయాలన్నీ, చీఁకటి=అంధకారానికి, తోడఁ బుట్టువులు=అనుజన్ములు, ఇసీ=ఛీ, అనిపించున్=అనిపిస్తాయి, కదోయి=కదా!

**తాత్పర్యం:** *ఆ కోతికి దాని జంటకోతి అందాలగని. నీ ప్రేయసికూడా నీవరకునీకు వరాల మూట. సరే! నిత్య యౌవనవంతులైన దేవతాస్త్రీల అగణిత విలాస విభ్రమ కాంతులు కనుక రుచిచూస్తే ఇదే కంటికి ఇప్పటివరకు గొప్పవనుకొన్నవన్నీ అంధకారబంధురాలుగా కనిపిస్తాయి, ఛీ అనిపిస్తాయికదా!*

**తనయా! తాదృశమైన యచ్చరల సౌందర్యమ్మునున్ నాశమై**
**చనుఁ, బ్రేమింతువు నశ్వరమ్మయిన యాచక్కందనమ్మీవు, ని**
**త్యనవీనమ్మును, నాత్మభోగ్యమును, సత్యంబైన సౌందర్యమున్,**
**గనరాదే? విషయప్రపంచమునఁ గాంక్షల్ పండవెవ్వారికిన్.**

**అర్థాలు:** తనయా=కుమారా, తాదృశమైన=అటువంటి, అచ్చరల=దేవతావనితల, సౌందర్యమ్మునున్=అందాలు కూడా, నాశమైచనున్=జీర్ణమైపోతాయి, ఈవు=నీవు, నశ్వరమ్మయిన=నశించిపోయే, ఆ చక్కందనమ్ము=ఆ అందాలను, ప్రేమింతువు=మరులు కొంటావు, నిత్యనవీనమ్మునున్=దినదినానికీ క్రొత్తదనాన్నీ, ఆత్మభోగ్యమును= హృదయానికి ఆనందాన్నిచ్చేది, సత్యంబైన=ఎప్పటికీ నిజమైన, సౌందర్యమున్=అందాన్ని, కనరాదే=సాధించ కూడదా, ఎవ్వారికిన్=ఎవరికికూడా, విషయప్రపంచమునన్=ఇంద్రియ లోకాన, కాంక్షల్=నిజమైన కోరికలు, పండవు=తీరవు.

**తాత్పర్యం:** *కుమారా! అటువంటి దేవతాస్త్రీలకే దేహసౌందర్యాలు శాశ్వతంకావు. ఇక నీవీ లోకంలోని వేగంగా నశించిపోయే అందాలకోసం ఎందుకు ప్రాకులాడుతావు? దినదినానికీ నూతనంగా పల్లవించే, ఆత్మకు ఆనందాన్నిచ్చే నిజమైన సౌందర్యంకోసం ప్రయత్నించ కూడదా? ఈ ఇంద్రియప్రపంచంలో ఎవరికీ నిజమైన కోరికలు తీరవు.*

**గ్రుచ్చి కవుంగిటన్ బొదివికోఁ బనిలేదు, వియోగబాధలన్**
**ముచ్చముడుంగఁ బోవదు, కనుంగవకున్ మఱి వీనుదోయికిన్**
**మెచ్చు ఘటింపఁ గోరదు, నిమిత్తము వేఁడ, దొకప్డు మాఱ ద**
**య్యచ్చపుఁ బ్రేమ మేడ? విషయాదివికారము లేడఁ బుత్రకా?**

**అర్థాలు:** పుత్రకా=కుమారా! గ్రుచ్చి=కదించి, కవుంగిటన్=ఆలింగనంలో, పొదివికోన్= చేర్చుకునే, పనిలేదు= అవసరంలేదు, వియోగబాధలన్=విరహవేదనలతో, ముచ్చముడుంగన్=బడలిపోతే, పోవదు=వదిలిపోదు, కనుంగవకున్=కళ్ళకు, మఱి=ఇంకా, వీనుదోయికిన్=చెవులకు, మెచ్చుఘటింపన్=మెప్పుపొందాలని, కోరదు= కోరికోదు, నిమిత్తము=కారణం, వేఁడదు=అడగదు, ఒకప్డు=ఒకప్పుడుకూడా, మాఱదు=రూపం మార్చుకోదు, ఆ+అచ్చపున్=అటువంటి స్వశ్ఛమైన, ప్రేమము ఏడ=ప్రేమ ఎక్కడ? విషయాది=పంచేంద్రియాల, వికారములు= పరిణామాలు, ఏడన్=ఎక్కడ?

**తాత్పర్యం:** *కుమారా! అచ్చమైన ప్రేమకు గట్టిగా కౌగలించుకో పనిలేదు. విరహవేదనలతో కృశించిపోనక్కరలేదు. కళ్ళయొక్క చెవులయొక్క మెప్పుపొందాలని కోరికోదు. ఎందుకని అడగదు. ఎప్పుడూ మారదు. అటువంటి ప్రేమ ఎక్కడ? ఇంద్రియాల మార్పులకు వశమైన నీవుకోరే ప్రేమ ఎక్కడ? రెంటికీ ఏమైనా సంబంధం ఉందా?*

**ప్రేమము ప్రేమమంచురక పెద్దనుడుల్ వచియింతువీవు, ని**
**ష్కామము నాదు ప్రేమమని చాటెదు, నిన్నొక పృచ్ఛచేసెదన్;**
**గామవికార మించుకయుఁ గల్గదయేని కుమారఁ చెప్పుమా**
**ప్రేమకు నాటపట్టయిన ప్రేయసికై యిటు లేల పొక్కెదో?**

**అర్థాలు:** కుమార=తనయా! ప్రేమము ప్రేమము అంచు=ప్రేమా ప్రేమా అంటూ, ఉరక= ఊరకనే, పెద్దనుడుల్=పెద్దపెద్దమాటలు, వచియింతువు ఈవు=నీవు మాట్లాడతావు, నిష్కామము=కోరికలేనిది, నాదు ప్రేమమని=నాప్రేమంటూ, చాటెదు=చెప్పుకుంటావు, నిన్ను+ఒక=నిన్ను ఒకే ఒక, పృచ్ఛచేసెదన్=ప్రశ్న వేస్తాను, చెప్పుమా=మందుచెప్పు, కామ వికారము=కోరికజబ్బు, ఇంచుకయున్=కొంచెమయినా, కల్గదయేని= రాకపోతే, ప్రేమకు=నీవలపుకు, ఆటపట్టయిన=నెలవయిన, ప్రేయసికై=ప్రియురాలికోసం, ఇటుల=ఈవిధంగా, ఏల= ఎందుకు, పొక్కెదో=దుఃఖిస్తావు?

**తాత్పర్యం:** *కుమారా! ప్రేమాప్రేమా అంటూ ఏవోపెద్దపెద్ద మాటలు చెప్తున్నావు. నీప్రేమ స్వచ్ఛమైనదని చాటుకొంటున్నావు. నిన్నొక్కటే ప్రశ్నవేస్తాను సమాధానంచెప్పు. నీలో కోరిక అనే జబ్బుతగలకపోతే నీ ప్రేమకు మూలకందమైన ప్రేయసి కోసం ఇలా ఎందుకు ఆరాటపడతావు చెప్పు!*

**ఆలి చేలచెఱంగె యఖిల వసుంధరా**
**వలయమ్ముగా నెంచి ప్రహరి దిరిగి**
**మగువ కటాక్షదామమె విశ్వసామ్రాజ్య**
**పట్టమ్ముగా ఫాలపట్టిఁ జేర్చి**
**చాన కేలుంగవ సత్యధర్మములుగా**
**భావించి నిజకరద్వయి ఘటించి**
**విరిబోఁడి నెమ్మోము సిరి మోక్షలక్ష్మిగా**
**హృదయమ్ము చూడ్కులం దిరవుకొల్పి**
**మోహితాత్ముఁడవైతివి, ముగుదతలఁపు**
**లుజ్జగింపుము తనయ! యీ ముజ్జగమ్ము**
**నాత్మ సంసారముగ నెంచు నలఘుచరిత**
**కాస్పదుండౌట లెస్స నీయట్టివాఁడు.**

**అర్థాలు:** తనయ=కుమారా! ఆలి=పెండ్లాంయొక్క, చేలచెఱంగె=చీరకొంగే, అఖిల=మొత్తం, వసుంధరా వలయమ్ముగాన్=ఈభూమండలంగా, ఎంచి=భావించి, ప్రహరిదిరిగి=చుట్టూతిరిగి, మగువ=ఆమెయొక్క, కటాక్షదామమె=కంటికొనచూపుల దండమాత్రమే, విశ్వసామ్రాజ్య= అవనీతలానికి, పట్టమ్ముగా=అధికారంగా, ఫాలపట్టిన్=రాజ్యాభిషేక సమయంలో నుదుట కట్టే వస్త్రంగా, చేర్చి=స్వీకరించి, చానకేలుంగవ=ఆమె రెండు చేతులు, సత్యధర్మములుగా= సత్యం ధర్మం అనే రెండు పరమలక్ష్యాలుగా, భావించి=అనుకొని, నిజకరద్వయి= నీరెండుచేతులందు, ఘటించి=తీసికొని, విరిబోఁడి=ఆసుందరి, నెమ్మోము= సుందరముఖాన్ని, సిరిమోక్షలక్ష్మిగా= సంసారదుఃఖాలన్నిటిని తొలగించే సంపదగా, హృదయమ్ము=నీ గుండెల, చూడ్కులందు= చూపులందు, ఇరవు కొల్పి=స్థానంకల్పించి, మోహిత+ఆత్ముఁడవు=అజ్ఞానంలోపడిన అంతరంగం గలవాడవు, ఐతివి=అయ్యావు. ముగుదతలఁపులు= మగువల ఆలోచనలు, ఉజ్జగింపుము=వదిలిపెట్టు. నీయట్టివాఁడు=నీలాంటివాడు, ఈ ముజ్జగమ్మున్=ఈ మూడులోకాలను, ఆత్మసంసారముగన్=సొంత కుటుంబంగా, ఎంచు= భావించే, అలఘు చరితకు=గొప్పచరితానికి, ఆస్పదుండౌట=క్షేత్రం కావడం, లెస్స=మంచిది.

**తాత్పర్యం:** *కుమారా! పెళ్ళాం చీరచెంగే మొత్తం భూమండలంగా భావించి ప్రదక్షిణాలు చేసి, ఆడదాని ఓరచూపులే విశ్వాధిపత్యంగా తలకు చుట్టుకొని, ఆమె రెండుచేతులూ సత్యధర్మాలుగా నమ్మి నీచేతులందు తీసికొని, ఆ సుందరముఖాన్ని సకల పాపహరణంగా హృదయంలో చోటుకల్పించి అజ్ఞానంలో పడిపోయావు నాయనా! ఇకనైనా ఈ మగువల గురించిన ఆలోచనల్ని విడిచిపెట్టు. ఇది నీవంటి రాజకుమారునకు తగినపని కాదు. ఈ జగమంతా నీ సంసారమే. అందరి మంచే మనకు మంచి. అలా భావించి క్రొత్తచరిత్రకు శ్రీకారం చుట్టు.*

**హృదయతటములఁ బొరలిపాఱెడి త్వదీయ**
**ప్రణయసురధుని విష్టపత్రయము నొకట**
**జాలిమై ముంచియెత్తినఁ బోలుఁగాక**
**యంగనామాత్రసమభిషేకార్హ మగునె?**

**అర్థాలు:** హృదయతటములన్=అంతరంగంయొక్క ఒడ్డులను, పొరలి=ముంచుతూ, పాఱెడి= ప్రవహించే, త్వదీయ=నీయొక్క ప్రణయ=ప్రేమతత్వమనే, సురధుని=గంగాప్రవాహం, విష్టపత్రయమున్=మూడులోకాలను, ఒకట=ఒకవేళ, జాలిమై=దుఃఖంతో, ముంచియెత్తినన్= ముంచెత్తినా, పోలుఁగాక=సరే, అంగనామాత్ర=అవయవ సౌకుమార్యమున్నంత మాత్రంచేత, సమభిషేకార్హము=పూజనీయం, అగునె=అవుతుందా?

**తాత్పర్యం:** *హృదయతటాలను పొరలిప్రవహించే నీ ప్రణయగంగ ఒకవేళ మూడు లోకాలనూ జాలితో ముంచెత్తినా ముంచెత్తునుగాక. అంతమాత్రంచేత ఒక ఆడుది అందమైన అవయవాలు కలిగి ఉన్నంతమాత్రాన ఆ జలంతో అభిషేకం చేయతగునా?*

**విరియంబూచెడుఁ బ్రేమపుష్పముల నీ విశ్వమ్ము నిక్కమ్మె; క్రొ**
**వ్విరి నీవొక్కటి పుణ్కి తాలిచితి వుద్వృత్తానురాగమ్ముమై**
**నురమం, దయ్యది వాడి రాలునపు డయ్యో! కంటక మ్మొండు ని**
**ష్ఠురతన్ నాటును, దానిఁ బుచ్చుఁగల వెజ్జున్ మున్నె యోజింపుమా!**

**అర్థాలు:** అయ్యో=అయ్యో కుమారా! నిక్కమ్మె=నిజమే, ఈవిశ్వమ్ము=ఈ ప్రపంచం, ప్రేమపుష్పములను=వలపు పూలను, విరియంబూచెడున్=విరబూస్తుంది. నీవు=అందులో నీవు, క్రొవ్విరి=కొత్తపూవును, ఒక్కటి=ఒకదాన్ని, పుణ్కి=ఎంచుకొని, ఉద్వృత్త=దుందుడుకు, అనురాగమ్ము=వ్యామోహంతో, మైన్=శరీరమున, ఉరమందు= గుండెలమీద, తాలిచితివి= ధరించావు. ఆ+అది=ఆపూవు, వాడి=వాడిపోయి, రాలునపుడు=పడిపోయేటప్పుడు, కంటకమ్మొండు=ద్వేషమొకటి, నిష్ఠురతన్=నిర్దాక్షిణ్యంగా, నాటును=గుండెలో దిగిపోతుంది, దానిన్=దానిని, పుచ్చుఁగల=పెరికివేయగల, వెజ్జున్=వైద్యుని, మున్నె=ముందే, యోజింపుమా=సమకూర్చుకో.

**తాత్పర్యం:** *అయ్యో కుమారా! నిజమే! ఈ విశ్వంలో ఎన్నో వలపుపూలు విరబూస్తాయి. వానిలో నీవొక అందమైన క్రొత్తపూవునొకదానిని ఎంచుకొని వ్యామోహంతో గర్వంగా నీ గుండెలమీద హత్తుకున్నావు. కాని ఆపూవు వాడిపోక మానదు. రాలిపోవడమూ తప్పదు. అప్పుడుమాత్రం దానియెడబాటు వలన నీలో కలిగిన కంటకం నీ గుండెల్లో దిగిపోతుంది. దానిని పైకితీయగలిగిన వైద్యుణ్నిమాత్రం నీవు ముందే కూర్చుకోవాలి.*

**ఇన్ని పూవులుండ నీ వొక్క పుష్పమ్ము**
**పుణుకనేల? యెడఁద ముల్లు నాటి**

**తాపమంద నేల? తనయ! మమత్వదో**
**షమ్మె శోకకారణమ్ము సుమ్ము.**

**అర్థాలు:** తనయ=కుమారా! ఇన్నిపూవులుండ=పూవులెన్నో ఉండగా, నీవు ఒక్కపుష్పమ్ము= నీవు మాత్రం ఒక్కటేపూవును, పుణుకనేల=ఎందుకేరుకున్నావు? ఎడద=గుండెలో, ముల్లునాటి=ముల్లుదిగి, తాపమందనేల= ఎందుకు బాధపడతావు? మమత్వ=నాదనుకొనే, దోషమ్మె=తప్పే, శోకకారణమ్ము=ఈబాధకు కారణం, సుమ్ము=సుమా!

**తాత్పర్యం:** *కుమారా! లోకంలో ఇన్నిపూవులుంటే ఒకపూవునే ఎందుకు కోరుకున్నావు? ఏదో గుచ్చుకుందని ఎందుకు బాధపడతావు? ఆ ఒక్కదానిమీద నీ పక్షపాతమే నీ శోకానికి కారణం సుమా!*

**కడుపుఁ దీపియుఁ, బితృభక్తి, కాంతమీఁది**
**నెయ్యమును, నెచ్చెలులపట్లఁ దియ్యదనము**
**'నా'యనెడు విత్తునం బుట్టి నాశమొందు;**
**మమత లేనట్టి ప్రేమ నిత్యము, కుమార!**

**అర్థాలు:** కుమార=నాయనా! కడుపున్=తాను కన్నవారిమీది, తీపియున్=మమకారమూ, పితృభక్తి=తన్ను కన్నవారిమీది గౌరవమూ, కాంతమీఁది=కట్టుకున్నదానిమీది, నెయ్యమును= ప్రియమునూ, నెచ్చెలులపట్లన్=తన చెలికాళ్ళమీది, తియ్యదనము=ఇష్టమూ, 'నా'యనెడు= నాది అనుకొనే, విత్తునన్=విత్తనంవలన, పుట్టి=జనించి, నాశమొందు=కనిపించకుండా పోతాయి. మమత=మమకారం, లేనట్టి=లేని, ప్రేమ=అనురాగంమాత్రమే, నిత్యము= ఎప్పుడూ ఉంటుంది.

**తాత్పర్యం:** *కుమారా! తాను కన్నవారిమీద, తన్నుకన్నవారిమీద, కట్టుకున్నదానిమీద, స్నేహితులమీద ప్రేమ ఈరోజుంటుందీ, రేపు పోతుంది. ఈ బంధాలులేని ప్రేమే కలకాలం ఉంటుంది.*

**ఎవ్వనికి వాఁడు, 'తా' నను నిష్టదైవ**
**మునకు నాలయమును గట్టి పూజసల్పు;**
**గాలియు వెలుంగుఁ జొరని తదాలయమునఁ**
**జివుకు దేవుని చెఱ మాన్పఁ జెల్లు నీకు.**

**అర్థాలు:** ఎవ్వనికివాఁడు=ఎవడికివాడే, తాన్ అనున్=తాను అనే, ఇష్టదైవమునకున్= తనకిష్టమైన దేవతకు, ఆలయమునుగట్టి=గుడికట్టి, పూజసల్పు=ఆరాధిస్తుంటాడు. గాలియు=చల్లటిగాలిగాని, వెలుగున్=ప్రకాశంగాని, చొరని=ప్రవేశించని, తదాలయమునన్=ఆ గుడిలో, చివుకుదేవుని=చీకిపోయే ఆదేవుని, చెఱమాన్పన్= బంధముక్తునిచేయడం, నీకు=నీలాంటి వానికి, చెల్లు=సాధ్యమవుతుంది.

**తాత్పర్యం:** *ప్రతివాడికీ తానంటేనే ఎక్కువ ఇష్టం. తనకుమించిన దైవంలేదు. కాబట్టి తనకే ఒకగుడి కట్టుకొని పూజించుకుంటూ ఉంటాడు. అంటే తనయిష్టానికే ప్రాధాన్యత ఇస్తాడు. ఇలా గాలీవెలుతురూ లేని గుళ్ళోకూర్చుని చీకిపోతూంటాడు. ముందు తానాచెఱనుండి బయటపడాలిసుమా! అంటే మానవుడు 'నేను', 'నాది' అనేవి వదులు కోవాలని సూచన.*

**'తా' నొక గడ్డకట్టుకొని తత్పరతన్ శిలలై నశించు న**
**జ్ఞానుల కేడనోయి సుఖసంగతి! తాఁ, దనయాలు, నాత్మసం**
**తానము, తోడఁబుట్టువులు, తల్లియుఁ దండ్రి, కులమ్ము, దేశమున్**
**మానవు, లెల్ల ప్రాణులు కుమార! సమస్తముఁ దాను గావలెన్.**

**అర్థాలు:** కుమార=తనయా! తాన్=తానొక్కడే, ఒకగడ్డకట్టుకొని=ఒక ఉండగాచుట్టుకొని, తత్పరతన్= అదేలోకంగా, శిలలై=జడత్వంతో, నశించున్=మరణించే, అజ్ఞానులకు= మూర్ఖులకు, సుఖసంగతి=సుఖంగా ఉండటం, ఏడనోయి=ఎక్కడయ్యా! తాన్=తానూ, తనయాలు=తనభార్య, ఆత్మసంతానము=తనపిల్లలు, తోడఁ బుట్టువులు=అన్నదమ్ములు అక్కచెల్లెండ్రు, తల్లియున్=అమ్మా, తండ్రి=నాన్న, కులమ్ము=తనవాళ్ళూ, దేశమున్=తన రాజ్యం, మానవులు=జనులు, ఎల్లప్రాణులు=అన్నిజీవులు, సమస్తమున్=ఇవన్నీ, తాను= తానే, కావలెన్= అయిపోవాలి.

**తాత్పర్యం:** *కుమారా! ఈలోకంలో మనిషి తానొక్కడే సుఖపడాలని మడికట్టుకొని అదేపనిగా తనకోసమే జీవించకూడదు. అలాంటివాళ్ళు మూర్ఖులు. వాళ్ళంతా రాళ్ళలా చైతన్య రహితంగా అలాకొన్నాళ్ళు బ్రతికి ఏనాడో ఒకనాడు ఊరూపేరూ లేకుండా మరణిస్తారు. ఇంకా వాళ్ళకి సుఖమనేది ఎక్కడుంది? మనిషైనవాడు తానొక్కడే కాకుండా తానూ, తనభార్యా, తన సంతానమూ, తనతోపుట్టిన అన్నలూ, తమ్ములూ, అక్కలూ, చెల్లెళ్ళూ, తన తల్లీ, తండ్రీ, తన కులపువాళ్ళూ, తాను పుట్టిన దేశంలోని ఇతరమానవులూ, తన చుట్టూ పెరిగే కోళ్ళూ, కుక్కలూ, పక్షులూ, చెట్లూ, చేమలూ అన్నిజీవులూ ఇవన్నీ తనరూపాలే అనుకోవాలి. అవన్నీ తానుగా, తానే అవన్నిగా భావించాలి. వారందరి సుఖమే తనసుఖంగా, వారందరి దుఃఖమూ తనదుః ఖంగా అనుకోవాలి.*

**కొడుకులు లేని వారలకుఁ గూరిమిబిడ్డవు, మాతృహీనులౌ**
**బుడుతలకెల్లఁ దల్లివయి పోషణ సేయుము, 'నా' యనంగ లే**
**కడలెడు దీనులన్ మనుపు, మార్తుల కాదరువై భజింపు, మీ**
**పుడమి దివమ్ము సల్పు మిదెపో, పరమార్థము బౌద్ధజాతికిన్.**

**అర్థాలు:** కొడుకులు లేనివారలకున్=కొడుకులులేక తపించేవారికి, కూరిమిబిడ్డవు=ఆదరించే కొడుకువు కావాలి. మాతృహీనులౌ=తల్లిలేని, బుడుతలకెల్లన్=పసివారినందరినీ, తల్లివయి= నీవే తల్లివై, పోషణ సేయుము=పెంచి పెద్దచేయాలి. 'నా'యనంగ లేక=నా అనేవారులేక, అడలెడు=జీవితమంటే భయపడే, దీనులన్=అనాథలను,

మనుపుము=రక్షించాలి. ఆర్తులకు=బాధలలో ఉన్నవారికి, ఆదరువై=ఆధారముగా ఉండి, భజింపుము=సేవించాలి. ఈపుడమి=ఆ విధంగా ఈ భూమిని, దివమ్ముసల్పుము=స్వర్గాన్నిచేయి. బౌద్ధజాతికిన్= మా బౌద్ధసన్యాసులకు, ఇదెపో=ఇదొక్కటే, పరమార్థము=పరమ పవిత్రమైన కార్యం.

**తాత్పర్యం:** *ఆవిధంగా ఈ సమాజమే నీవనుకొంటే కొడుకులులేక తపించేవారికి నీవే కొడుకువుకావాలి. తల్లినికోల్పోయిన పసివారందరినీ నీవే తల్లివై పెద్దచేయాలి. ఎవరూలేని అనాథలను కరుణించి కాపాడు. బాధల్లో ఉన్నవారికి సేవచేయి. ఈ భూమిని స్వర్గంగా మార్చు. ఇది మాత్రమే బౌద్ధధర్మంలో బ్రతికేవారికి ఆదర్శమార్గం.*

**నిన్ను గృహమ్ము వీడుమని నే వచియించుట కర్థ మిట్టిదో**
**యన్న! మమత్వశూన్యమును, వ్యాజవిహీనమునైన ప్రేమ నే**
**నెన్నఁడు కాదనన్; సుకృతి వీవు, రసార్ద్రము నీ యెదంద యీ**
**తెన్నునఁబోయి సర్వజగతిన్ భజియింపుము నీకు మేలగున్.**

**అర్థాలు:** నిన్ను=సంసారంలోనున్న నిన్ను, గృహమ్ము=భార్యాబిడ్డలను, వీడుమని=వదిలి పెట్టుమని, నేవచియించుటకు=నేను చెప్పడానికి, అర్థము=కారణం, ఇట్టిదోయన్న=ఇదే సోదరా! మమత్వ=స్వార్థం, శూన్యమును=లేనట్టిది, వ్యాజ=కపటం, విహీనమునైన=లేనిదీ అయిన, ప్రేమన్=ప్రేమను, ఏన్=నేను, ఎన్నఁడుకాదనన్=ఎప్పుడూ వద్దనలేదు; ఈవు=నీవు, సుకృతివి=పుణ్యాత్ముడవు, నీయెదంద=నీహృదయం, రసార్ద్రము= ప్రేమరసంలో తడిచినది. ఈతెన్నునన్=నేచెప్పేమార్గంలో, పోయి=నడచి, సర్వజగతిన్=సకలజీవరాశినీ, భజియింపుము=సేవించు, నీకు మేలగున్=నీకు మంచిజరుగుతుంది.

**తాత్పర్యం:** *సోదరా! నేను నిన్ను భార్యాబిడ్డలను వదిలి రమ్మనడంలోని ఆంతర్యం ఇదే! మమకారం లేని, కపటంలేని ప్రేమను నేనెప్పుడూ కాదనలేదు. నీవు పుణ్యాత్ముడవు. నీ హృదయం పరమ సున్నితమైనది. కాబట్టి నేను చెప్పేమార్గంలో నడిచి లోకానికంతటికీ సేవచేయి. నీకు మేలుజరుగుతుంది.*

**తీయతలఁపులు మొదలంటఁ ద్రెంపుమనుచు**
**హృదయసూనమ్ము త్రుంపుమంచే వచింపఁ,**
**బ్రేమశూన్యము గాదన్న! భిక్షుగణము,**
**జీవకారుణ్యమే మాకు జీవగఱ్ఱ.**

**అర్థాలు:** అన్న=కుమారా! తీయతలఁపులు=హృదయాలకు మధురములైన ఆలోచనల్ని, మొదలంటన్= వ్రేళ్ళతోసహా, త్రెంపుమనుచు=పీకివేయమని, హృదయసూనమ్ము=ఆత్మ అనే పుష్పాన్ని, త్రుంపుమంచు= త్రెంపివేయమని, ఏ వచింపన్=నేను చెప్పడంలేదు. భిక్షుగణము= ఇక్కడున్న సన్యాసుల బృందమంతా, ప్రేమ శూన్యముగాదు=

హృదయ సౌకుమార్యం లేనిది కాదు. మాకు=మా బౌద్ధ భిక్షువులందరికీ, జీవకారుణ్యమే= జీవులందరియెడల దయను కలిగి ఉండటమే, జీవగఱ్ఱ=బ్రతుకు మందు.

**తాత్పర్యం:** *కుమారా! నిన్ను తుచ్ఛమైన ప్రేమను వదిలిపెట్టమన్నాను అంటే నీ మనసులోని సుకుమారమైన భావనలు మొదలంటా మొత్తాన్నీ పీకివేయమని కాదు. దయాపూర్ణమైన నీ హృదయపుష్పాన్ని పూర్తిగా త్రెంచివేయమని కాదు. నీ ప్రేమకు హద్దులు నిర్ణయించకు. నీలోని దయాసముద్రానికి పరిమితులను విధించకు. ఇక్కడున్న భిక్షుక బృందమంతా ఒకప్పుడు నీవంటి సంసారులే. వారంతా వారిహృదయాల్ని విశాలం చేసికొని ఇక్కడకు వచ్చారు. అంతేగాని వారు ప్రేమలేనివారు కారు. ఇక్కడివారి ప్రాణాలన్నీ విశ్వవ్యాప్తమైన జీవులన్నిటిపైనా కరుణావర్షాన్ని కురిపించడానికే ఉన్నాయి.*

**ప్రేమకన్న సత్యము లేదు భిక్షుకులకు**
**పరమసత్యముకన్న సుందరము లేదు;**
**లభ్యమైతి సౌందర్య లాలసుఁడ వీవు,**
**రసమయములౌను మన విహారమ్ము లింక.'**

**అర్థాలు:** భిక్షుకులకు=బౌద్ధసన్యాసులకు, ప్రేమకన్న=అనురాగంకంటే, సత్యములేదు=నిజమైన వస్తువులేదు. పరమసత్యముకన్న=చివరకు మిగిలేదానికంటే, సుందరములేదు=ప్రియమైనది లేదు. సౌందర్యలాలసుఁడవు=అట్టి ప్రియపదార్థం కోరేవాడవు, నీవు=నీవంటి పురుషపుంగవుడవు, లభ్యమైతి=దొరికావు. ఇంక=ఇకపైన, మన విహారమ్ములు=ఈ మన ఆశ్రమాలు, రసమయములౌను=లోకప్రియాలౌతాయి.

**తాత్పర్యం:** *ఇక్కడి భిక్షుకులకు ప్రేమకంటే సత్యపదార్థం లేదు. పరమసత్యం కంటే ప్రియమైనది లేదు. అటువంటి ప్రియాన్ని కోరికొనేవాడవు నీవు దొరికావు. ఇంకేంకావాలి! మన విహారం ఇంక లోకప్రియం కావడం తథ్యం.*

**అమ్మహితాత్ముఁడిట్లు హృదయంగమమౌగతి, మాధురీధురీ**
**ణమ్ముగ ధర్మసారవచనమ్ములు పెక్కు లుపన్యసింపఁగా**
**నెమ్మన ముద్భుహీతమయి నిల్చెఁ దదర్థమునం దొకింత యా**
**తమ్మునికిన్; నిసర్గనిశితమ్ములు గౌతము ధర్మబోధనల్.**

**అర్థాలు:** ఆ+మహితాత్ముఁడు=ఆ గొప్పబుద్ధిగల బుద్ధుడు, ఇట్లు=ఈ విధంగా, హృదయంగమము= మనోహరము, ఔగతి=అయ్యేవిధంగా, మాధురీ=తియ్యదనంచేత, ధురీణమ్ముగ=శ్రేష్ఠంగా, పెక్కులు=ఎన్నో, ధర్మసారవచనమ్ములు=ధర్మాన్ని స్రవించే మాటల్ని, ఉపన్యసింపఁగా=బోధింపగా, ఆ తమ్మునికిన్=తమ్ముడైన నందునికి, నెమ్మనము=తెలివైన మనసు, తదర్థమునందు=ఆ బుద్ధుడు చెప్పినదానిలో, ఒకింత=కొంతవరకు,

ఉద్బృహీతమయి=బుద్ధికెక్కి, నిల్చెన్=నిలబడింది. గౌతము=ఈ విధంగా గౌతముని, ధర్మబోధనల్=సత్యావిష్కరణలు, నిసర్గ=స్వభావంచేత, నిశితమ్ములు=వాడియైనవి.

**తాత్పర్యం:** *ఆ మహాత్ముడీవిధంగా మనోహరమైన శైలిలో పట్టులో తేనెల్లా ధర్మం స్రవించే ప్రసంగాలు చేయగా, వాని తమ్ముడైన నందుడుకూడా సహృదయుడైనందున ఆ మహాత్ముడు చెప్పినదానిలో కొంతభాగమైనా బుద్ధికెక్కింది. అయినా గౌతముని ధర్మబోధనలు మంచి వాడియైన స్వభావం కలవికదా!*

**గురుని పాదాబ్జములఁ జూడ్కిఁ గుదురుకొల్పి**
**'దేవ! భిక్షుకవృత్తి వర్తిల్లునట్టి**
**స్త్రీ జనముగూడ నార్హతదీక్ష గాంచి**
**బౌద్ధధర్మము పాలింపవచ్చు నేమొ?**

**అర్థాలు:** గురుని=బుద్ధభవానుని, పాదబ్జములన్=పాదాలనే కమలాలయందు, చూడ్కిన్= చూపులను, కుదురు గొల్పి=నిలబెట్టి, దేవ=భగవంతుడా! భిక్షుకవృత్తి=సన్యాసదీక్షలో, వర్తిల్లునట్టి=జీవించాలనుకొనే, స్త్రీ జనముగూడన్= ఆడువారుకూడా, ఆర్హతదీక్షగాంచి=బౌద్ధ సంస్కారాన్ని పొంది, బౌద్ధధర్మము=నీవుచెప్పే న్యాయాన్ని, పాలించ వచ్చునేమొ=పాటించ వచ్చునేమో?

**తాత్పర్యం:** *ఆమాటలాలకించిన నందునికి ఒక అనుమానం వచ్చింది. ఒంటరిగా ఉండబోయే భార్యను తలచుకొన్నాడు. గురుని పాదాలమీద దృష్టినిలిపాడు. ఇలా తన అనుమానం బయటపెట్టాడు. 'దేవా! ఈ భిక్షుకవృత్తి స్వీకరిస్తే ఆడువారు కూడా నీ ధర్మంలో చేరవచ్చునా? వారు కూడా బౌద్ధసంస్కారాన్ని పొందవచ్చునా? అలా పొంది నీవు బోధించే బౌద్ధధర్మాన్ని పాటించవచ్చును కదా?*

**ఆనతి యిందు; నన్వలచి, యాత్మ ననున్ నెఱనమ్మికొన్న యా**
**చానకుఁ గూడ సంసరణ సంతరణమ్మగు దారిఁ జూపి య**
**జ్ఞానమువాప కే నొకడ సమ్మతియై నవధర్మమార్గమున్**
**బూనఁగ నేర్తునెట్టులు? ప్రభూ! సహధర్మిణి వీటిఁబుత్తునే?**

**అర్థాలు:** ప్రభూ=ఓ దేవా! నన్వలచి=నన్ను ప్రేమించి, ఆత్మ=లోలోపల, ననున్=నన్నే, నెఱనమ్మికొన్న=బాగా నమ్ముకొని జీవిస్తున్న, ఆచానకున్=ఆ అమాయకురాలిని, కూడ= సైతం, సంసరణ=సంసార సాగరాన్ని, సంతర ణమ్మగు=దాటే, దారిన్=మార్గాన్ని, చూపి= చూపించి, అజ్ఞానమువాపక=తెలివితక్కువతనాన్ని పోగొట్ట కుండా, ఏనొకడ=నేనొక్కడినే, సమ్మతియై=నీ మాటలంగీకరించి, నవధర్మమార్గమున్=ఈ క్రొత్తదైన ధర్మమార్గాన్ని, పూనఁ గ=అనుసరించటానికి, నేర్తునెట్టులు=ఎలా అంగీకరించేది? ఆనతియిందు=చెప్పండి, సహధర్మిణి= కట్టుకున్న భార్యను, వీటిఁబుత్తునే=ఎలా వదిలిపెట్టాలి?

**తాత్పర్యం:** *ప్రభూ! హృదయంనిండా నన్నే ప్రేమించి నమ్ముకున్న అమాయకురాలికి కూడా అజ్ఞానం పోగొట్టి ఈసంసారాన్ని తరించే మార్గం చూపకుండా నేనొక్కడినే ఈ క్రొత్తమార్గాన్ని అవలంబించడం న్యాయమంటావా! కట్టుకున్నభార్యను అలా వదిలిపెట్టడం మంచిదా చెప్పండి.*

> **తేఱి ప్రసన్నమై మనసు తెల్వివహించెను; శోకమోహముల్**
> **దూరములై భవాంధువున దూలిన జీవుల నుద్ధరింపఁగాఁ**
> **గోరికపుట్టెఁ, దొంటి వలకూర్మికి దవ్వుల నిల్చి వేఁడెదన్,**
> **బూరుషులెల్ల నర్హులయి బోటులుమాత్ర మనర్హ లౌదురే?'**

**అర్థాలు:** తేఱి=సంసార తాపత్రయంనుండి తేరుకొని, ప్రసన్నమై=శుభ్రమై, మనసు=నా మనస్సు, తెల్వి వహించెను=తెలివిపొందింది. శోకమోహముల్=దుఃఖం, ఆసక్తి; దూరములై= తొలగిపోయి, భవ+అంధువున=ఈ జన్మ అనే అంధకారంలో, తూలిన=పడిన, జీవులన్= ప్రాణులను, ఉద్ధరింపఁగాన్=పైకితేవాలని, కోరికపుట్టెన్= ఆశపుట్టింది. తొంటి=ఇంతకు ముందున్న, వలకూర్మికి=ప్రేమయందుగల ఆసక్తికి, దవ్వులనిల్చి=దూరంగా నిలబడి, వేఁడెదన్=ప్రార్థిస్తున్నాను. పూరుషులెల్లన్=మగవారందరూ, అర్హులయి=యోగ్యులై, బోటులు మాత్రము= ఆడవారుమాత్రమే, అనర్హలౌదురే=యోగ్యులు కాకపోతారా?

**తాత్పర్యం:** *నావరకు నేను నీమాటలతో పవిత్రుడనై శోకమోహాలను వదిలేసాను. భవాంధ కారంలో పడిన జీవులను పైకితేవాలని బుద్ధిపుట్టింది. ముందున్న కామాసక్తి దూరమైంది. నిన్నొక్కటే ప్రార్థిస్తున్నాను చెప్పండి. ఈ బౌద్ధమార్గానికి మగవారు యోగ్యులూ, ఆడువారు మాత్రమే అయోగ్యులా?*

> **కరములు మోడ్చి నందుఁడిటు గద్గదికన్ దను వేఁడుచుండ, నా**
> **గురుఁ డొకయింత కన్మొగిచి, కొండొక యోజన సల్పి యంతటన్**
> **విరిసిన నేత్రపద్మములఁ బ్రేమమరందఝరుల్ స్రవింప, నా**
> **దరమునఁ గేలు సాఁచి పినతమ్ముని కేలు తెమల్చి యిట్లనున్.**

**అర్థాలు:** కరములుమోడ్చి=చేతులు ముకుళించి, నందుఁడిటు=నందుడీవిధంగా, గద్గదికన్= డగ్గుత్తికతో, తను=తనను, వేఁడుచుండన్=ప్రార్థిస్తూండగా, ఆగురుఁడు=ఆ బుద్ధదేవుడు, ఒకయింత=కొంతసేపు, కన్మొగిచి= కనులుమూసికొని, కొండొక యోజనసల్పి=వేరేవిధంగా సంకల్పించి, అంతటన్=అప్పుడు, విరిసిన=విచ్చుకొన్న, నేత్రపద్మములన్=పద్మాలవంటి కనులనుండి, ప్రేమ=అనురాగమనే, మరందఝరుల్=తేనెప్రవాహాలు, స్రవింపన్= చిప్పిల్లగా, ఆదరమునన్=ఎంతో ప్రేమతో, కేలుసాఁచి=చెయ్యచాపి, పినతమ్ముని=చిన్నవాడైన తమ్ముని, కేలు= చేతిని, తెమల్చి=కదిలించి, యిట్లనున్=ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** *నందుడీవిధంగా చేతులు ముకుళించి తనను పూడినగొంతుతో దీనంగా వేడుకుంటూంటే బుద్ధదేవుడు కాసేపు కనులుమూసికొన్నాడు. తరువాత తన ఆలోచన మార్చు*

*కొన్నట్లు కనులు విప్పాడు. ఆ కళ్ళవెంట అమృతధారలు స్రవిస్తున్నాయి. ఆదరంగా తమ్మునిచేతిని తనచేతిలోకి తీసికొని ఇలా అన్నాడు.*

**'వీనిన్‌బెంచినధాత్రి నార్హతిని గావింపన్ దలంపూని, యీ**
**యానందుండును మున్ను నీవలెనె నన్నర్థించె వేభంగులన్**
**గానిం, డే నిపు డేల కాదనవలెన్; గాంతానిమిత్తమ్ముగా**
**హానింజెందక యుండుఁగాక మనధర్మాంకూరముల్ పుత్రకా!**

**అర్థాలు:** పుత్రకా=కుమారా! ఈ ఆనందుండును=ఈ ఆనందుడుకూడా, వీనిన్ బెంచిన= ఇతనిని పెద్దచేసిన, ధాత్రిన్=ధాత్రి అనే ఆమెను, ఆర్హతిని=భిక్షుకిగా, కావింపన్=చేయడం కోసం, తలంపూని=ఆలోచించి, మున్ను= ఇంతకుముందు, వేభంగులన్=అనేక విధాలుగా, నన్ను అర్థించె=నన్ను వేడుకున్నాడు. కానిండు=అలాగే కానీయండి. ఏనిపుడేల=నేనిప్పుడెందుకు, కాదనవలెన్=కాదనాలి? కాంతానిమిత్తమ్ముగా=ఆడువారి కారణంగా, మన ధర్మాంకూరముల్=ఇప్పుడే మొలుస్తున్న మనధర్మపు మొలకలు, హానింజెందక=నష్టపోకుండా, ఉండుఁగాక=ఉండాలి కదా!

**తాత్పర్యం:** *కుమారా! (మరోభిక్షువును చూపిస్తూ) ఇడుగో వీడు ఆనందుడు. ఇతడుకూడా తన్ను పెంచిన తల్లిని భిక్షుకిని చేయమని ఎంతో పోరాడు. అప్పుడు కాదన్నాను. కానివ్వండి... ఇప్పుడు నేనెందుకు కాదనాలి? భవిష్యత్తులో ఈ ఆడువారివలన ఇప్పుడే మొలకెత్తుతున్న మనధర్మానికి మచ్చరాకూడదుమరి!* (బుద్ధచరిత్రలో అప్పటికే ఆడువారి ప్రవేశం జరిగింది)

**అసదృశమ్మగు బ్రహ్మచర్య వ్రతమ్ముఁ**
**బాలనమ్మొనరించుచు బౌద్ధధర్మ**
**మూన నధికారిణులు నుందురేని, యట్టి**
**శీలవతులకు నార్హత సిద్ధయగుత.'**

**అర్థాలు:** అసదృశమ్మగు=సాటిలేని, బ్రహ్మచర్యవ్రతమ్మున్=బ్రహ్మచర్యమనే దీక్షను, పాలనమ్మొనరించుచు= సక్రమంగా పాటిస్తూ, బౌద్ధధర్మమూనన్=మన ధర్మాన్ని అనుసరించే, అధికారిణులు=సమర్థులు, ఉందురేని= ఉన్నట్లయితే, అట్టి=అటువంటి, శీలవతులకున్=తాను వాగ్దానం చేసినట్లు మసలుకొనేవారికి, ఆర్హత=ఈ దీక్ష, సిద్ధ=ముక్తిమంత్రం, అగుత=అవుతుంది.

**తాత్పర్యం:** *సాటిలేని బ్రహ్మచర్య దీక్షను సక్రమంగా పాటిస్తూ మనధర్మాన్ని అనుసరించే సమర్థులు ఉంటే, అటువంటి శీలవతులకు ఈ సన్యాసదీక్ష ముక్తిమంత్రం అవుతుంది తప్పదు.*

ఇది

సప్తమసర్గము

# అనుజ్ఞ

"అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వాస్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్రజరసా యస్మి న్నహార్యో రసః
కాలే నావరణాత్యయా త్పరిణతే యత్ప్రేమసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కధమ ప్యేకంహి తత్ప్రార్థ్యతే"

బాల్యమాదిగ నేర్చి పతి మెప్పు లందిన
గానవిద్యా ప్రసంగములు మఱచి
నందుఁడేఁగిన దారియందె కన్నుంచి వా
పోవు రాచిల్కను బుజ్జగించి
తనకోసమై యనుదినము క్రొత్తఁగ ఁబూచు
నారామలతల నెయ్యమ్ము మాని
చెక్కుచెక్కును రాయఁ జిత్రించుకొన్నట్టి
ప్రణయచిత్రముల వస్త్రమునఁ గప్పి

చాయకగ్గిన చిత్రమ్ము, సౌరభమ్ము
గోలుపోయిన సుమమునై, గుర్తుపట్ట
రానివిధమున నంతిపురమ్మునందుఁ
గాలమొకరీతి సుందరి గడుపుచుండె.

**అర్థాలు:** బాల్యము ఆదిగ=చిన్నతనంనుండి, నేర్చి=నేర్చుకొని, పతి=తన భర్తచేత, మెప్పులందిన=ఓహో అనిపించుకొన్న, గానవిద్య=చక్కగా పాడటం, ప్రసంగములు=చక్కగా మాటాడటాలు, మఱచి=మర్చిపోయి, నందుఁడు ఏఁగిన=నందుడు వెళ్ళిపోయిన, దారియందె=దారివైపే, కన్నుంచి=చూస్తూ, వాపోవు=విలపించే, రాచిల్కను=ఎప్పుడూ మంచిగా పలికే పెంపుడుచిలుకను, బుజ్జగించి=ఊరుకోబెడుతూ, తనకోసమై= తనకోసమే, అనుదినము=ప్రతిరోజూ, క్రొత్తఁగన్=నవనవలాడుతూ, పూచున్=పుష్పించే, ఆరామలతల= తోటలోని పూలతీగల, నెయ్యమ్ముమాని=స్నేహాన్ని వదిలేసి, చెక్కుచెక్కును రాయన్=బుగ్గబుగ్గ మీదా రాయటానికి, చిత్రించుకొన్నట్టి=ముందే సిద్ధంచేసికొన్న, ప్రణయచిత్రముల=మదన క్రీడలకుచెందిన బొమ్మలను, వస్త్రమునగప్పి=గుడ్డతో ముసుగువేసి,

చాయకగ్గిన=రంగు కోల్పోయిన, చిత్రమ్ము=బొమ్మ, సౌరభమ్ము=సువాసనలు, కోలుపోయిన=పోగొట్టుకున్న, సుమమునై=పూవుగామారి, గుర్తుపట్టరాని=ఎవరూ గుర్తుపట్టలేని, విధమునన్=మాదిరిగా, అంతిపురమ్మునందు= అంతఃపురంలో, సుందరి=నందుని భార్య, కాలమొకరీతి=సమయం భారంగా, గడుపుచుండె=వెళ్ళదీస్తోంది.

**తాత్పర్యం:** *అక్కడ నందునిభార్య సుందరి బాల్యంలోనే నేర్చుకొని భర్తచేత పొగిడించుకొన్న ఆటపాటలన్నీ మర్చిపోయింది. నందుడు వెళ్ళినదారినే చూస్తూ దుఃఖంతో మాటాడటం మానేసిన రాచిల్కను ఊరడిస్తోంది. రోజూ తనకోసమే పూచే పూలతీగలతో స్నేహాన్ని వదిలేసింది. ప్రియుడు వచ్చి చిత్రించడానికి వీలుగా ముందుగానే సిద్ధంచేసికొన్న రెండు బుగ్గలనూ గుడ్డతో కప్పేసుకొంది. రంగులు వెలిసిపోయిన చిత్రంలా తయారయింది. సువాసన పోగొట్టుకున్న పూవైపోయింది. ఎవరూ గుర్తించలేని విధంగా వన్నెతగ్గి అంతఃపురంలోనే కాలమంతా భారంగా గడిపివేస్తోంది.*

**వన్నెగలట్టి యా నగరవాసిను లొక్కొక రేఁగుదెంచుచున్**
**మన్ననమైఁ బరామరిక మాటలు పల్కుచు నూరడించుచోఁ**
**గన్నుల నీరునింపదు, ముఖమ్మున దైన్యము చేరనీయ, దే**
**మన్నఁ దటస్థభావపరయై బదులాడదు నిర్వికారయై.**

**అర్థాలు:** వన్నెగలట్టి=సుగాత్రులైన, ఆనగరవాసినులు=ఆ కపిలవస్తు రమణులు, ఒక్కొకరు= ఒకరివెంట ఒకరు, ఏఁగుదెంచుచున్=వస్తూ, మన్ననమైన్=ఆదరణతో, పరామరికమాటలు=పలుకరింపుమాటలు, పల్కుచున్= మాటాడుతూ, ఊరడించుచోన్=బాధలో ఉందని ఊరడిస్తూంటే, కన్నుల=ఆమె కళ్ళలో, నీరునింపదు=కన్నీరు పెట్టుకోదు. ముఖమ్మున=ముఖంలో, దైన్యము=దీనత్వం, చేరనీయదు=కనపడనివ్వదు, ఏమన్నన్= వచ్చినవారు ఏమడిగినా, తటస్థభావపరయై=ముభావంగా, నిర్వికారయై=ప్రతిస్పందన లేకుండా ఉండి, బదులాడదు=సమాధానం చెప్పదు.

**తాత్పర్యం:** *సుందరి ఆవిధంగా బాధపడుతూంటే ఆ కపిలవస్తు నగరంలోని బంధువుల ఆడువారంతా ఒక్కొకరే వచ్చి పరామర్శిస్తున్నారు. అయితే ఎవ్వరేమి పలుకరించినా సుందరి కళ్ళలో నీరు కనిపించదు. ముఖంలో అనదతనం కనిపించదు. అడిగిన ప్రతిదానికీ ముభావం తప్ప సమాధానం చెప్పదు.*

**'మనసు మరలించుకొనె' నంచు, 'మఱచె' నంచుఁ**
**'గాలమే మాన్పు సర్వదుఃఖమును' నంచు,**
**'మానవతి' యంచు, 'వైరాగ్యమూనె' నంచు**
**నోటికొక మాట వీట నాబోటిఁ గూర్చి.**

**అర్థాలు:** వీటన్=ఆ ఊరిలో, ఆబోటిన్=ఆ సుందరిని, కూర్చి=గురించి, నోటికొకమాట= ఒక్కొకరు ఒక్కొక

మాటగా, మనసు మరలించుకొనెన్=మనసుమార్చుకున్నదేమో, అంచు= అని కొందరు, మఱచెనంచున్= మర్చిపోయిందేమో అనికొందరు, కాలమే=సమయమే, సర్వ దుఃఖమును=బాధలన్నింటినీ, మాన్పు=తొలగిస్తుంది, అంచు=అని కొందరు, మానవతి యంచు=అభిమానవతి, అంచు=మనమేం చేస్తాం అనికొందరు, వైరాగ్య మూనెన్=విరక్తి పొందింది, అంచు=అనికొందరు అనుకొంటున్నారని భావం.

**తాత్పర్యం:** *సుందరిని గురించి ఆపూరి అమ్మలక్కలు చూట్టానికని వచ్చి ఆమె మాట్లాడక పోతే ఇంక మనసు మార్చుకొందేమోనని కొందరు, జరిగిందంతా మర్చిపోయిందని కొందరు, అన్ని దుఃఖాలకీ కాలమే మందని కొందరు, పాపం అభిమానవతి ఏంచేస్తామని కొందరు, విరక్తిపొందిందేమోనని కొందరు అనుకోవడం మొదలుపెట్టారు.*

**ఆదటన్ బ్రత్యహమ్ము శుద్ధోదనుండు**
**శాక్యముని నూత్న ధర్మ సంస్థాపనమ్ము**
**వివరముగఁ దెల్ప శ్రద్ధమై వినుచు, దాని**
**మననముం జేయు నొంటిపాటునఁ గృశాంగి.**

**అర్థాలు:** శుద్ధోదనుండు=మహారాజైన శుద్ధోదనుడు, ప్రత్యహమ్ము=ప్రతిరోజూ, ఆదటన్= ఆదరంగా దగ్గరకూర్చొని, శాక్యముని=తమవంశంవాడైన బుద్ధుడు(బుద్ధుని మరోపేరు శాక్యముని), నూత్న=క్రొత్తగా, ధర్మసంస్థాపనమ్ము=మనిషి ఆచరించవలసిన బాగోగులను చెప్పిన పద్ధతిని, వివరముగన్= అర్థమయ్యేలా, తెల్ప=చెబుతూంటే, శ్రద్ధమై వినుచు=భక్తితో అంతా వింటూ, దాని=వానిని, కృశాంగి=బక్కచిక్కిపోయిన సుందరి, ఒంటిపాటునన్=ఏకాంతంగా, మననముంజేయున్= మాటిమాటికీ తలచుకొంటోంది.

**తాత్పర్యం:** *మహారాజైన శుద్ధోదనుడు ప్రతిరోజూ ప్రేమగా దగ్గరకూర్చొని కోడలికి తన వంశంలోని బుద్ధముని నూతనంగా బోధించిన ప్రతిమనిషీ జీవితంలో ఆచరించాల్సిన పద్ధతులగురించి వివరంగా చెబుతూంటే శ్రద్ధగా వింటూ ఆమె వాటిని ఒంటరిగా కూర్చుని మననం చేసికొంటూంది.*

**భావించిచూచుఁ దన యం**
**తేవాసులతోడ శాక్యధీరుఁడు జగతీ**
**సేవామతిఁ బొనరించెడి**
**పావనసంచారముల నుపన్యాసములన్.**

**అర్థాలు:** శాక్యధీరుఁడు=శాక్యవంశంలో పండితుడైన బుద్ధుడు, తనయంతేవాసులతోడ= తన శిష్యులతో, జగతీ=లోకానికి, సేవామతిన్=పరిచర్యచేసే బుద్ధితో, పొనరించెడి=చేసే, పావన=పవిత్రములైన, సంచారములన్= ఊళ్లుతిరగడాలలో, ఉపన్యాసములన్=ప్రవచనాలను, భావించిచూచున్=తలచుకొని విన్నవాటిని సరిచూచు కొంటుంది.

**తాత్పర్యం:** *సుందరి అలా మననం చేసికొంటూ గతంలో తాను చూడని శాక్యపండితుని శిష్యులతోటి ప్రయాణాల గురించి లోలోపల దర్శింప ప్రయత్నిస్తోంది. తన నందుడు ఆతనితోనేకదా ఇప్పుడు సహవాసం చేస్తోంది! మామగారి మాటలు వింటూంటే బావగారి సంకల్పం అర్థమౌతోంది. వేదాలే పరమధర్మాలు, వాటిననుసరించడమే మోక్షానికి మార్గం, యజ్ఞాలు యాగాలు హింసాచర్యలైనాసరే వాటినే అనుసరించాలి అనే సిద్ధాంతాన్ని కాదని సత్యాహింసలే మోక్షహేతువులని బోధించే వారి ఉపన్యాసాల్ని అర్థంచేసికొంటోంది.*

**ధనకనక వస్తువాహన**
**వనితాతనయాప్తబంధు వర్గమునెల్లన్**
**గొనకొని త్యజించి, గౌతమ**
**మునివరు మార్గమ్ముఁ బట్టు పుణ్యులఁ దలఁచున్.**

**అర్థాలు:** ధన=డబ్బును, కనక=బంగారాన్ని, వస్తు=విలువైన సామాన్ను, వాహన=యానకాలను, వనితా=ఆడువారిని, తనయా=పిల్లలను, ఆప్తబంధువర్గమున్= కావలసిన వారిని, ఎల్లన్=అందరినీ, గొనకొని= ప్రయత్నంచేత, త్యజించి=వదిలేసి, గౌతమ మునివరు=గౌతమదేవుని, మార్గమ్మున్=దారిని, పట్టు=అనుసరించే, పుణ్యులన్=పుణ్యాత్ములను, తలచున్=తలచుకొంటుంది.

**తాత్పర్యం:** ఆరోజులలో అనేకమంది తమకున్న ధనాన్ని, బంగారాన్ని, వస్తువులను, వాహనాలను, స్త్రీలను, పిల్లల్ని, దగ్గరబంధువుల్ని సర్వాన్నీ వదిలిపెట్టి అహింసా సత్యాలనే బుద్ధుని త్రోవలో నడవటానికి సిద్ధమయ్యారు. వారెంత పుణ్యాత్ములోకదా! వారి త్యాగాన్ని సుందరి తలచుకొంటూంది.

**గురువరు నాదేశంబులు**
**శిరసావహియించి చేయు శిష్యులలో నె**
**ల్లరకంటె ముందు హృదయే**
**శ్వరునిన్ భావించుకొని సెబాసని మెచ్చున్.**

**అర్థాలు:** గురువరుని=నూతన మతాచార్యులైన బుద్ధభగవానుని, ఆదేశంబులు=శాసనాలను, శిరసా=తలవంచి, వహియించి=స్వీకరించి, చేయు=తమ ఆచరణలోపెట్టే, శిష్యులలోన్= అంతేవాసుల్లో, ఎల్లరకంటె=అందరికీ మించి, ముందు=మొగదలనుండే, హృదయేశ్వరునిన్= తన యెదదలో నిరంతరం నివసించే భర్తను, భావించుకొని= ఊహించుకొని, సెబాసని= ఎవరూ చేయలేనిపని చేసావని, మెచ్చున్=తనలోనే అభినందించింది.

**తాత్పర్యం:** *నూతన మతానికి ఆచార్యులైన తన బావగారిని గురువుగారుగా భావించి, వారు ఆదేశించిన ప్రకారం తలవంచి అనుసరించే వారి శిష్యులలో అందరికంటె ముందు*

*వరుసలో తన ప్రియతమమైన నందుడు సాగుతూన్నట్లు భావించుకొంటూంది సుందరి. ఆ బౌద్ధ విహారంలోకూడా తన భర్తకంటే గొప్పవాడు లేకపోయాడు కదాని భర్తను అభినందిస్తోందామె. తన భర్త తనకు దూరమైనా అక్కడ బౌద్ధభిక్షువులలో ముందుండ గలిగాడని ఆమె తృప్తి.*

**చిత్రాంబరములు దాల్చెడి విలాసిని క్రొత్త**
**తెలుపులు నీరుకావులు ధరించు**
**నెఱికురుల్ ముడిచెడి నేరుపుల్ పూసరుల్**
**విడనాడి చెలి యేకవేణి దాల్చు**
**బుద్ధదేవుని ధర్మబోధనల్ కూరిమి**
**చెలులకు వివరించి చెప్పుచుండు**
**భిక్షుకుండైనట్టి ప్రియు సత్వరూపమ్ము**
**భావించి యంజలి పట్టుచుండు**

**దినదినమ్ము యశోధరాదేవి నగరి**
**కరిగి యటఁ బ్రొద్దుపుచ్చు, నా యన్నదమ్ము**
**లిరువురిఁ దలంచి నిట్టూర్చు, నింటనున్న**
**తమ్ముఁ దలపోసి యుత్కంఠ నుమ్మలించు.**

**అర్థాలు:** చిత్రాంబరములు=రంగురంగుల వస్త్రాలు, తాల్చెడి=ధరించే, విలాసిని=వన్నెలాడి, క్రొత్త=క్రొత్తగా, తెలుపులు=తెల్లనిబట్టలు, నీరుకావులు=కాషాయాలు, ధరించు=కడుతుంది. నెఱికురుల్=అందమైన వెంట్రుకలను, ముడిచెడి=అలంకరించుకొనే, నేరుపుల్=మెలకువలు, పూసరుల్=పూలదండలు, విడనాడి=వదిలిపెట్టి, చెలి= సుందరి, ఏకవేణి=ఒకటేజడ, తాల్చు=వేసికొంటుంది. బుద్ధదేవుని=తథాగతుని, ధర్మబోధనల్=తాను మామగారివద్ద విన్న ధార్మికప్రసంగాలు, కూరిమిచెలులకు=దగ్గరిస్నేహితురాండ్రకు, వివరించి=విపులంగా, చెప్పుచుండు= చెబుతూంటుంది. భిక్షుకుండైనట్టి=బౌద్ధసన్యాసం పుచ్చుకున్న, ప్రియు=తన భర్తయొక్క, సత్వరూపమ్ము= మంచితనాన్ని, భావించి=ఊహించి, అంజలిపట్టుచుండు= చేతులుజోడిస్తుంది. దినదినమ్ము=ప్రతిరోజూ, యశోధరాదేవి=సిద్ధార్థునిభార్య యశోధర, నగరికరిగి=ఇంటికివెళ్ళి, అటన్=అక్కడే, ప్రొద్దుపుచ్చున్= కాలం గడుపుతుంది. ఆ అన్నదమ్ములు ఇరువురిన్=ఆ సోదరులిద్దరినీ, తలంచి=తలచుకొని, నిట్టూర్చున్= ఉస్సురంటుంది. ఇంటనున్న=ఇంటిలోనున్న, తమ్మున్=తమనిద్దరినీ, తలపోసి= తలచుకొని, ఉత్కంఠన్=తమకంతో, ఉమ్మలించు=తల్లడిల్లుతుంది.

**తాత్పర్యం:** *ఇది సుందరి దినచర్య. విలువైన వస్త్రాలు విడిచి తెలుపు కావిబట్టలు ధరిస్తుంది. అందమైన జుత్తును అలంకరించుకోవడం మానేసి ఒంటిజడవేసికొంటుంది. మామగారి వద్దవిన్న బుద్ధుని బోధనలు చెలికత్తెలకు తిరిగిబోధిస్తుంది. భిక్షుకుడైన భర్తనూతనరూపాన్ని*

*ఊహించుకొని చేతులుజోడిస్తుంది. ప్రతిరోజూ తోడికోడలింటికెళ్ళి అక్కడే ప్రొద్దుపుచ్చుతుంది. అన్నదమ్ములైన సిద్ధార్థుని, నందుని తలచుకొని నిట్టూరుస్తుంది. ఇంటిదగ్గరే ఉండి బాధపడే తనను, యశోధరను తలచుకొని దుఃఖంతో తల్లడిలుతోంది.*

**సరవిన్ రెండవజామునన్ "భవతి భిక్షాందేహి" యన్ వాక్య ము**
**చ్చరితంబైనపు డా లతాంగి చకితస్వాంతంబునన్ బుట్టు ని**
**ర్భరముల్, బాష్పజలప్రవర్షణసమర్థంబుల్, భవిష్యత్పథ**
**స్ఫురణంబుల్, కరుణప్రమోద భరితంబుల్, భావసంఘాతముల్.**

**అర్థాలు:** సరవిన్=పరిపాటిగా, రెండవజామునన్=మధ్యాహ్నానికి ముందుగా, భవతి భిక్షాందేహియన్=అమ్మా అన్నం అనే, వాక్యము=మాట, ఉచ్చరితంబు ఐనపుడు=పలుక బడినప్పుడు, ఆలతాంగి=ఆ సుందరియొక్క, చకిత=బెదరు, స్వాంతంబునన్=మనసులో, నిర్భరముల్=గొప్పవి, బాష్పజల=కన్నీటి, ప్రవర్షణ=జల్లులకు, సమర్థంబుల్=శక్తిగలవి, భవిష్యత్=నడవబోయే, పథస్ఫురణంబుల్=మార్గదర్శకాలు, కరుణ=దయతోను, ప్రమోద= సంతోషంతోను, భరితంబుల్=నిండినవి, భావ=ఆలోచనల, సంఘాతముల్=పుంజాలు, పుట్టు=సంభవిస్తున్నాయి.

**తాత్పర్యం:** *రోజులు గడుస్తుండగా మధ్యాహ్నమయ్యేసరికి 'భవతి భిక్షాందేహి' అనే మాట వినిపిస్తుంది. అప్పుడా సుందరి బెదరుగుండెలకు అందులో భారమైనవి, కన్నీటి వర్షాలకు తట్టుకునేవీ, ముందు నడవబోయే దారులను చూపించేవీ, దయాతోషాలతో నిండినవీ అయిన ఎన్నో భావపుంజాలు స్ఫురిస్తున్నాయి. అంటే ఆమాటను విన్నంతనే రకరకాల భవిష్యత్తు గురించిన ఆలోచనలు కలుగుతున్నాయి.*

**ఆదరమార భిక్షుకుల కర్చలొనర్చి, విహారవృత్తముల్**
**సోదెగొనున్, 'సుధాకలశసుందరపాణులు వేల్పువెజ్జు లా**
**సోదరు లిందు నందు భవశోకమహామయముల్ హరించుచో**
**నీదెస రారుగావలయు నెన్నఁడు' నంచు వచించుఁ గొంకుచున్.**

**అర్థాలు:** ఆదరమార=మిక్కిలి ఆదరంతో, భిక్షుకులకు=వచ్చిన సన్యాసులకు, అర్చలు= పరిచర్యలు, ఒనర్చి=చేసి, విహారవృత్తముల్=వారి ఆశ్రమవార్తలను, సోదెగొనున్=చెప్పమని అడుగుతుంది. సుధాకలశ=అమృతభాండాలచేత, సుందరపాణులు=అందమైన చేతులు కలిగిన, వేల్పువెజ్జులు=అశ్వనీదేవతలవలె అందమైనవారు, ఆ సోదరులు= ఆయన్నదమ్ములు, ఇందునందు=అక్కడా ఇక్కడా, భవశోక=జన్మచేత కలిగిన బాధలనే, మహామయముల్=గొప్ప జంతువులను, హరించుచోన్=సంహరిస్తూ, ఈదెస=ఈవైపుకు, ఎన్నఁడున్=ఎప్పుడూ, రారుగావలయు= రారుగాబోలు, అంచు=అంటూ, కొంకుచున్=తడబడుతూ, వచించున్= అంటుంది.

**తాత్పర్యం:** వచ్చిన భిక్షుకులకు ఆదరంతో పరిచర్యలుచేసి ఆరామవార్తలు చెప్పమంటుంది.

*వింటూనే అందులో తమవారిగురించి వినిపించక అశ్వనీదేవతలవంటి ఆ సోదరులు ఎక్కడెక్కడ జనాలబాధలు పోగొడుతూ గడపుతున్నారో, ఇటువైపుకు ఎప్పుడూ రారుగాబోలు అని తడబడుతూ ఏదో పరాకుగా మాటాడుతుంది.*

**పరిచారిక లెల్లరు ని**
**ద్దురవోవఁగఁ, బ్రోదిచిల్కతో నొంటిగ సుం**
**దరనందుని ప్రియవృత్తాం**
**త రహశ్చింతనము శెప్పి తలఁపులు ద్రవ్వన్.**

**అర్థాలు:** పరిచారికలు=సేవకురాండ్రు, ఎల్లరు=అందరూ, నిద్దురవోవఁగన్=నిద్రపోతూండగా, ప్రోదిచిల్కతోన్=పెంపుడు చిలుకతో, ఒంటిగ=ఒంటరిగా, సుందర నందుని=తన సుందరుడైన నందునియొక్క, ప్రియవృత్తాంత=ప్రేమకు సంబంధించిన, రహః=గోప్యమైన, చింతనము=తలపులను, శెప్పి=చెప్పుతూ, తలఁపులు=స్మృతులను, ద్రవ్వన్=గుర్తుకు తెచ్చుకొంటోంది.

**తాత్పర్యం:** *సుందరి ఒక్కతే కూర్చున్నప్పుడు గతాన్ని స్మరించుకొంటూంది. తన పరిచారికలు అందరూ నిద్రపోయిన తరువాత తన పెంపుడు చిలుకను దగ్గరకు తీసికొంటుంది. దానిని పలుకరించి తన ప్రియసుందరుడైన నందుని గురించి చెప్పటం మొదలుపెడుతుంది. తమ భార్యాభర్తల నడుమ జరిగిన శృంగార కార్యకలాపాల గురించి చెప్తూ అప్పటి జ్ఞాపకాలు అన్నింటినీ త్రవ్వుకుంటుంది.*

**'మూడు లోకమ్ము లొక్కట ముంచియెత్తు**
**ప్రణయమందాకినిన్ గృహోపవనసరసి**
**నిలిపికొని యోలలాడఁగాఁ దలఁచు టెల్ల**
**వీఱిఁడితనమ్ము గాదఁటే, వెఱ్ఱిచిలుక!**

**అర్థాలు:** వెఱ్ఱిచిలుక=ఓసి అమాయకపు చిలుకా! మూడులోకమ్ములు=ముజ్జగాలనీ, ఒక్కట= ఒక్కసారిగా, ముంచియెత్తు=ఆక్రమించగలిగిన, ప్రణయమందాకినిన్=ప్రేమగంగను, గృహ=ఇంటి, ఉపవన=తోటలోని, సరసి=కొలనులో, నిలిపికొని=దాచుకొని, ఓలలాడఁగాన్= మునకవేద్దామని, తలఁచుటెల్ల=అనుకోవడం అంతా, వీఱిఁడితనమ్ము=అవివేకం, కాదఁటే=కాదా!

**తాత్పర్యం:** *ఓసి అమాయకపు చిలుకా! లోకాలన్నింటినీ ఒక్కసారిగా తనలో దాచుకొన గలిగిన ప్రేమ అనే గంగా ప్రవాహాన్ని మా ఇంటితోటలోని చిన్ని కొలనులో దాచు కోవాలనుకోవడం, అందులో మేమిద్దరమే జలకాలాడదామని అనుకోవడం ఇదంతా ఎంతటి అవివేకమే! అంటే సుందరికి తాముచేసిన తప్పు బోధపడసాగింది.*

**పారములేని తన్మధుర భావసమర్పితపుష్పపీఠిపైఁ**
**దీరుపుకత్తెనై నిలిచి, 'దేహి' యనన్ వరమిచ్చు వేల్పునై,**
**కూరిమిదేవినై మెలపుకొన్న ననుం బదద్రోసి విశ్వసం**
**సారము రాజ్యమేలుకొనసాగెఁగదే తుదిఁ జిల్క నెచ్చెలీ!**

**అర్థాలు:** చిల్కనెచ్చెలీ=నా ప్రియ కీరమా! పారములేని=అంతులేని, తత్=ఆ శృంగారపు, మధురభావ=తీయని తలపులచేత, సమర్పిత=నివేదించబడిన, పుష్ప=అతని హృదయమనే పూవుల, పీఠిపైన్=ఆసనంమీద, తీరుపుకత్తెనై= న్యాయమూర్తినై, నిలిచి=నిలబడి, దేహియనన్=ఇమ్మనగానే, వరమిచ్చు=వరాలుకురిపించే, వేల్పునై=దేవతనై, కూరిమి=ఇష్టమైన, దేవినై=భార్యనై, మెలపుకొన్న=అందంచేత నావాడిగా మలచుకొన్న, ననున్=నన్ను, పదద్రోసి= కాదని, తుదిన్=చివరకు, విశ్వసంసారము=ప్రపంచకుటుంబమనే, రాజ్యము=సామ్రాజ్యాన్ని, ఏలుకొనసాగెఁ గదే=పాలించడానికి వెళ్ళాడు కదా!

**తాత్పర్యం:** *నా ప్రియమైన రామచిలుకా! అంతుదొరకని ఆ శృంగారపు మధురభావాలతో అతడు సమర్పించిన హృదయపీఠంమీద న్యాయమూర్తిగా నిలబడి అడిగినవెంటనే వరాలిచ్చే దేవతనై, ఇష్ట భార్యనై నా వంపుసొంపులచేత నావైపుకు మలచుకొన్న నన్నుకూడా కాదని చివరికి జగమంతా తన కుటుంబమంటూ ఆ సామ్రాజ్యాన్ని ఏలుకుంటానని పోయాడుకదా!*

**కాంతుమది లోఁతు గనక మోఁకాలిబంటి**
**గాఁదలంచి యుప్పొంగితి, గౌతమర్షి**
**యంతరాంతరమున నిధు లరసి యెత్తి**
**శుభ్రమణు లెల్లరకు నెఱచూఱలిచ్చె.**

**అర్థాలు:** కాంతు=నా భర్తయొక్క, మది=హృదయం, లోఁతు=లోతు ఎంతటిదో, కనక=తెలిసికోలేక, మోఁ కాలిబంటిగాన్=పిక్కలు మునిగే లోతేగదాని, ఉప్పొంగితి=మిడిసి పడ్డాను. గౌతమర్షి=విజ్ఞుడైన శాక్యముని, అంతరాంతరాళమున=అది సముద్రమని తెలిసి లోలోతుల వెదకి, నిధులు=అక్కడ దాగిన ధనపురాసులు, అరసి=కనుక్కొని, ఎత్తి=పైకితీసి, ఎల్లరకు=లోకంలోని అందరికీ, శుభ్రమణులు=మచ్చలేని రత్నాలను, నెఱచూఱలిచ్చె= ఘనంగా బహూకరించాడు.

**తాత్పర్యం:** *నా భర్త నావాడనే ధీమాతో అతని హృదయంలోతు తెలిసికోలేకపోయాను. ఎంతలే మోకాళ్ళైనా మునుగుతాయా అనుకున్నాను. చాలా తక్కువగా అంచనా వేసాను. కాని శాక్యముని అది సముద్రం అని తెలిసికొన్నాడు. లోలోపలికి శోధించాడు. అడుగునున్న సంపదల గనులు కనుక్కున్నాడు. ప్రజలందరికీ రత్నరాసులు పంచిపెడుతూన్నాడు.*

**కారు క్రమ్మిన నామనోగహ్వరమున**
**వెలుఁగు మంగళదీపిక విశ్వమెల్ల**

**నేఁడు వెలిఁగించెఁగదె, చెలీ! స్నేహపూర**
**నిర్వికలనిత్య శుభకాంతి పర్వికొనఁగ.**

**అర్థాలు:** చెలీ=నేస్తమా! కారుక్రమ్మిన=అడవిగా మారిన, నా మనోగహ్వరమున=నా మనస్సనే చీకటిగుహాలో, వెలుఁగు=కాంతులు నింపే, మంగళదీపిక=శుభకరమైన దీపం (ఇక్కడ తన ప్రియుడైన నందుడు), నేడు= ఈనాడు, విశ్వమెల్ల=ఈ ప్రపంచమంతా, నిర్వికల=చెదరని, నిత్య=శాశ్వతమైన, స్నేహపూర=వెల్లువలాంటి చెలిమియొక్క, శుభకాంతి=మంగళకరమైన వెలుగు, పర్వికొనఁగ=పరచుకొనే విధంగా, వెలిఁగించెన్ కదె=వ్యాపింపజేసాడు కదా!

**తాత్పర్యం:** *చెలీ! అడవిలా మూసేసిన నా మనస్సనే చీకటిగుహాలో కాంతిని ప్రసరించే అభ్యుదయ దీపం నా ప్రియుడైన నామనోనాథుడు నందుడు. అతడు ఈరోజు ఈ ప్రపంచానికే వెలుగులుచిందే దివ్వెగా మారాడు. ఆ వెలుగు చెలిమికి వెల్లువలాంటిది. వికలం కానిది. ఎల్లప్పుడూ నిలిచేది. అంతటా పరచుకొనేది. ఎంతటి అదృష్టవంతుడే!*

**జగముపున్నెము ఫలియించి స్వామిసేవ**
**లందుకొనుఁగాక, నేను కాదంటినఁటవె?**
**ఈ యభాగినికింగూడ నించుకంత**
**పాలొసఁగ కిట్లు వెలిపెట్టనేల? చిలుక!**

**అర్థాలు:** చిలుక=చిలుకపలుకుల చెలీ! జగము=ఈ ప్రపంచం, పున్నెము ఫలియించి=తాను గతంలో చేసిన పుణ్యంచేత, స్వామిసేవలు=నా స్వామి నందుని పరిచర్యలు, అందుకొనుఁగాక=పొందిన పొందుగాక! నేను=వారి భార్యనైన నేను, కాదంటినఁటవె=ఏమైనా కాదన్నానా? ఈ అభాగినికిన్=ఈ దురదృష్టవంతురాలికి, కూడన్=సహితం, ఇంచుకంత=వారు చేసే సేవలో కొంచెం, పాలు=భాగం, ఒసఁగక=కల్పించకుండా, ఇట్లు=ఈ విధంగా, వెలి పెట్టనేల=వెలి వేసినట్లు దూరంగా ఉంచడం ఎందుకే?

**తాత్పర్యం:** *మృదుభాషిణీ! ఈ ప్రపంచం మొత్తం గతంలో ఎంతపుణ్యం చేసికొందో! నేడు నాస్వామి సేవలు పొందుతోంది. వాని సేవలపై నాకొక్కదానికే అధికారం ఉందని నేనేమైనా అడ్డుచెప్పానటే! వారి సేవలలో ఈ దురదృష్టవంతురాలికి కూడా ఏకొంచెమో భాగం పెట్టకూడదటే? ఇలా నన్ను వెలివేసినట్లు దూరంగా తోసేయడమెందుకే? తానుకూడా ఆ సేవా కార్యక్రమాల్లో పాలుపంచుకోవాలని ఆమె భావం.*

**కాంతుఁడేతెంచు మార్గము క్రొత్త కైసేసి**
**యడుగుదోయికిఁ జల్వమడుఁగు లొత్త**
**నాతఁ డొనర్చు లోకారాధనమునకు**
**నుదకమై పుష్పమై యుపచరింప**

**నార్తసేవా(శాంతుcడగు దయారాశికి**
**సురటినై చెమ్మటల్ సురుగcజేయ**
**నతcడు విహారకుడ్యములc జి(త్రించు భా**
**వములకుc బ్రాణార్పణము నొనర్పc**
**దగనcటే నేను, నెచ్చెలీ! తనకుc గాని**
**భాగ్యమిది నాకు మా(త్రము యోగ్యమcటవె?**
**అడవులకు నేcగి యిల్లు నా కడవిcజేసె,**
**నయ్యడవి దేవళcము జేయనcటవె నేను?'**

**అర్థాలు:** నెచ్చెలీ=ప్రియనేస్తమా! కాంతుcడు=(ప్రియపతిదేవుడు, ఏతెంచు=వచ్చే, మార్గము= దారిని, క్రొత్తకైసేసి= క్రొత్తగా అలంకరించి, అడుగుదోయికిన్=పాదయుగ్మం కందిపోకుండా, చల్వమడుగులు=ఉతికిన వస్త్రాలు, ఒత్తన్=పరచడానికీ; ఆతcడు=నాభర్త, ఒనర్చు=చేసే, లోకారాధనమునకున్=ప్రపంచసేవకు, ఉదకమై= జలముగానో, పుష్పమై=పూవుగానో, ఉపచరింపన్=సహకరించడానికీ, ఆర్త=దుఃఖంలోనివారికి, సేవ=పరిచర్య చేత, అ(శాంతుc దగు=విరామంలేనివాడైన, దయారాశికి=కరుణాసముద్రునకు, సురటినై=వీవననై, చెమ్మటల్= స్వేదజలాన్ని, సురుగన్=తొలగునట్లు, చేయన్=విసరడానికీ; అతcడు=నాభర్త, విహార కుడ్యములన్=ఆశ్రమం గోడలమీద, చి(త్రించు=వెలయించే, భావములకున్=రూపాలకు, ప్రాణార్పణమున్=ప్రాణాన్ని కల్పించడం, ఒనర్పన్=చేయడానికీ, నేను తగనcటే=నేను పనికిరానటే? తనకున్=అతనికి, కాని=పనికిరాని, భాగ్యము=సంపద, ఇది=ఈ మొత్తం, నాకుమా(త్రము=అతని భార్యనైన నాకుమాత్రం, యోగ్యమటcవె=పనికివస్తుందటే? అడవులకున్= వనాలకు, ఏc గి=వెళ్ళి, ఇల్లు=నివాసాన్ని, నాకు=భర్తలేకుండా, ఆడవిcజేసెన్= అరణ్యం చేసాడు. ఆ+అడవి= తానేగిన అడవిని, నేను=సహధర్మచారిణినైన నేను, దేవళcము=దేవాలయంగా, చేయనcటవె=మార్చలేనా?

**తాత్పర్యం:** *ప్రియనేస్తమా! నేను నాపతిదేవుడు వచ్చేమార్గాన్ని క్రొత్తగా అలంకరించి అడుగులకు మడుగులొత్తటానికి పనికిరానటే? అతడుచేసే ప్రపంచసేవకు పత్రంగానో పుష్పంగానో సహకరించనటే? ఆర్తజనాల సేవలో అలసిపోయేవానికి విసనకర్రనై చెమటలు పోగొట్టనటే? ఆశ్రమంలో గోడలపైన అతడు చిత్రించే రూపాలకు ప్రాణంపోయనటే? అతడు చేసే ఏపనికి నేను పనికిరాను! ఇప్పుడతడు వద్దన్న ఈసంపదలన్నీ అతడులేకుండా నేనేం చేసికొనేదే? అతడు అడవికెళ్ళి నాకొంపను అడవిచేసాడు. ఇప్పుడు నేను తనువెళ్ళిన అడవికివెళ్ళి దానిని దేవాలయంగా మార్చలేనా?*

**అనుచున్ మంతనమాడుc జిల్కచెలితో 'నార్తావనమ్మే కదా**
**తనకున్ ధర్మము, ప్రాణిపీడనము పొంతం బోరుగా భిక్షుకుల్,**
**మనమందున్ దను నమ్ముకొన్న నను నిమ్మాడ్కిన్ విసర్జింపరా**
**దని బోధింపcగరాదె నీ వరిగి, చిల్కా!' యంచు దీనాస్యయై.**

**అర్థాలు:** చిల్కా=ఓ వన్నెలరామచిలుకా! నీవు=మంచి మాటకారివైన నీవైనా, అరిగి=వెళ్ళి, ఆర్తావనమ్మేకదా= బాధితులను రక్షించటమే కదా, తనకున్=భిక్షుకుడైన నందునకు, ధర్మము= చేయవలసిన పని; భిక్షుకుల్= బౌద్ధసన్యాసులు, ప్రాణిపీడనము=జీవులను బాధపెట్టటమనే క్రియ, పొంతన్=దగ్గరకు, పోరుగా=వెళ్ళరుగదా! మనమందున్=మనసులో, తను=ఆ నందునే, నమ్ముకొన్న=విశ్వసించిన, ననున్=తన ధర్మపత్నినైన నన్ను, ఇమ్మాడ్కిన్=ఈవిధంగా, విసర్జింపరాదు అని=వదిలిపెట్టి బాధపెట్టకూడదని, బోధింపఁగరాదె=బుద్ధి చెప్పకూడదా, అంచు=అంటూ, దీనాస్యయై=ముఖమంతా దైన్యంతో నిండిపోగా...

**తాత్పర్యం:** *తన చేతనున్న చిలుకతో ఇలా అంటోంది సుందరి. 'ఓ మాటలునేర్చిన చిలుకా! నీవు వెళ్ళి నా నాథునితో ఇలా అను. బాధల్లో ఉన్నవారిని రక్షించటమేకదా నీ ధర్మం! మీ సన్యాసులు ప్రాణుల్ని హింసించరుకదా! మరి మనసంతా నిన్నే నింపుకొని నిన్నే నమ్ముకొన్న నన్నిలా విడిచిపెట్టి బాధించవచ్చా? అని బుద్ధిచెప్పు' అంటూ దీనవదనయై...*

**బుద్ధదేవుని శ్రీపాదమూలమునకు**
**నరిగి శరణమ్ము వేఁడఁగా నాససేయు,**
**నంత తెగుదారితనము మేలాయటంచు**
**నుడుగు నమ్మానవతి; యంత నొక్కనాఁడు.**

**అర్థాలు:** ఆ+మానవతి=ఆ అభిమానవంతురాలు, బుద్ధదేవుని=సిద్ధుడైనతన బావగారియొక్క, శ్రీపాదమూలము నకున్=శుభకరాలైన పాదాలకు స్థానమైన ఆరామానికి, అరిగి=వెళ్ళి, శరణమ్ము=ఆశ్రయాన్ని, వేఁడఁగాన్= అడుగుదామని, ఆససేయున్=ఆశ పడుతుంది. అంత=మళ్ళీ అంతటి, తెగుదారితనము=తెగువతనం, మేలా= మంచిదేనా! అటంచున్=అనుకొని, ఉడుగున్=ఊరుకొంటుంది. అంత=ఇట్లుండగా, ఒక్కనాఁడు=ఒక రోజున...

**తాత్పర్యం:** *అభిమానవతి అయిన సుందరి బుద్ధుడైన బావగారి ఆరామానికే పోయి వారి పాదాలమీద పడదామనుకొంటుంది. కాని, అంతటి తెంపరితనం మంచిదా అనుకొని వెనకడుగు వేస్తుంది. అలా ఉండగా ఒకరోజున...*

**"శరణము బుద్ధదైవము ప్రశస్తపథమ్మగు బౌద్ధధర్మమే**
**శరణ" మటంచు భిక్షుకుఁడు సౌధపురస్థలి నిల్వఁ గాంచి, సుం**
**దరి వడిఁ జేరవచ్చి "శరణ"మ్మనె, నంత నతండు పల్కె 'నో**
**పరమదయామతీ! గురుని పంపున నేఁడిట కేఁగుదెంచితిన్'.**

**అర్థాలు:** బుద్ధదైవము=తథాగతుడే, శరణము=నాకుదిక్కు, ప్రశస్త=ఉత్తమమైన, పథమ్ము అగు=మార్గమైన, బౌద్ధధర్మమే= బుద్ధుడు చెప్పిన నీతిమాత్రమే, శరణము=నాకు దిక్కుకావాలి, అటంచు=అంటూ, భిక్షుకుఁడు=ఒక బౌద్ధసన్యాసి, సౌధ=ఇంటి, పురః స్థలి=ముందు, నిల్వన్=నిలబడగా, కాంచి=చూచి, సుందరి=బుద్ధుడినే తలచు కొంటున్న సుందరి, వడిన్=వేగంగా, చేరవచ్చి=వానిదగ్గరకు చేరి, శరణమ్ము=నాకూ అతడే దిక్కు, అనెన్=అంది.

అంతన్=ఆమె అలా అన్నవెంటనే, అతండు=ఆ సన్యాసి, ఓపరమ దయామతీ=ఎంతో దయగలిగిన ఓ అమ్మా, గురుని=స్వామి యొక్క, పంపున=ఆనతిచేత, నేఁడు=ఈరోజు, ఇటకు=ఇక్కడకు, ఏఁగుదెంచితిన్=వచ్చాను, పల్కె=అని చెప్పాడు.

**తాత్పర్యం:** *దైవమైన బుద్ధునకు శరణము, గొప్పమార్గమైన బుద్ధుని ధర్మానికే శరణము అంటూ ఒక భిక్షుకుడు ఇంటిముందుకు వచ్చి నిలబడగా అదే తలపులలోనున్న సుందరి చూచింది. వెంటనే వానిదగ్గరకు వెళ్ళి శరణం చెప్పింది. అదివిని వచ్చినవాడు ఓ పరమ దయామతీ! మాగురువుగారు పంపించగా ఇక్కడకు వచ్చాను అన్నాడు.*

**అనుడు, నా యింతి మోమింతయై 'భదంత!**
**యెంతసుదినమ్ము నేఁడు? నీకేమి పనిచె?**
**గురుని కీ మందభాగ్యపైఁ గరుణ వచ్చెఁ**
**గావలయు నేఁటి కిఁక ధన్యఁగానె యేను!'**

**అర్థాలు:** అనుడున్=అలా అనగానే, ఆయింతి=ఆ సుందరి, మోము=ముఖం, ఇంతయై=విప్పారగా, భదంత=ఓ భదంతా! (అది భిక్షుకునిపేరు) నేఁడు=ఈ రోజు, ఎంత సుదినమ్ము=ఎంత మంచిరోజు, నీకేమి=నీకు ఏమని, పనిచె=చెప్పి పంపించాడు? గురునికి= శాక్యమునికి, నేఁటికి=ఈరోజుకు, ఈ మందభాగ్యపైన్=ఈ దురదృష్ట వంతురాలి మీద, కరుణవచ్చెన్=దయకలిగింది, కావలయు=కాబోలును, ఇక=ఇంకా, ఏను=నేను, ధన్యన్= కృతార్థురాలిని, కానె=కాకుండా ఎలా ఉంటాను?

**తాత్పర్యం:** *అతడలా అనగానే ఆమెముఖం ఇంతైంది. ఆ భిక్షుకుని గుర్తించినట్లు భదంతా అని సంబోధించింది. ఈరోజెంత సుదినం, ఏమని చెప్పాడు అని ప్రశ్నపరంపర గుప్పించింది. ఆ శాక్యమునికి నాపై ఈనాటికి దయకలిగింది కాబోలు అని దెప్పింది. ఇక నాకంటె ధన్యురాలెవరు అని పొంగిపోయింది.*

**అనవుడు భిక్షుకప్రవరుఁ డాయమతోడ వచించు, 'సోదరీ!**
**వినుము, గురుండు నీ హృదయవేదనఁ గన్గొని, బౌద్ధధర్మమున్**
**గొనఁ మతియించు నీ చరితకున్ మదిమెచ్చి, యనుగ్రహమ్ముమై**
**నిను నిజశిష్యగాఁ బరిగణించె, నిదే కొనుమమ్మ! దీక్షలన్.**

**అర్థాలు:** అనవుడు=ఆమె అలా అనగా, భిక్షుకప్రవరుఁడు=ఆ బౌద్ధముఖ్యుడు, ఆయమతోడ= ఆ సుందరితో, వచించు=ఇలా అంటున్నాడు. సోదరీ=చెల్లెలా! వినుము=వారు చెప్పింది విను. గురుండు=మా ధర్మగురువుగారు, నీ=ఒంటరిగానున్న నీయొక్క, హృదయవేదనన్= మనస్తాపాన్ని, కన్గొని=గమనించి, బౌద్ధధర్మమున్=జగత్తులో వేదనలుతొలగించే నూతన ధర్మాన్ని, కొనన్=అవలంబించటానికి, మతియించు=ఇష్టపడుతున్న, నీ=ఉన్నత

కుటుంబానికి చెందిన నీ, చరితకున్=సాధుచరిత్రకు, మది=మనసారా, మెచ్చి=మెచ్చుకొని, అనుగ్రహమ్మమై=నీ పైన దయతో, నిను=నిన్ను, నిజశిష్యగాన్=తనశిష్యురాలిగా, పరిగణించెన్=స్వీకరించాడు. దీక్షలన్=నూతనధర్మ సంస్కారాల్ని, ఇదే=ఇదిగో ఇస్తున్నాను, కొనుమమ్మ=తీసికోతల్లీ!

**తాత్పర్యం:** *ఆమెమాటలువిని, వచ్చిన భిక్షుకశ్రేష్ఠుడు ఆమెతో ఇలా అంటున్నాడు. 'సోదరీ! నూతనధర్మ గురుడైన మీ బావగారు నీ మనస్తాపం తెలిసికొని, తన ధర్మాన్ని స్వీకరించడానికి ఇష్టపడే నీ ఉత్తమచరిత్రను మెచ్చుకొని నీ మీది దయతో నిన్ను తనశిష్యురాలిగా ఒప్పుకున్నాడు. ఇదిగో ఆ ధర్మసంస్కారాల్ని ఇస్తున్నాను తీసికో తల్లీ!'*

**భద్రమిడుఁగాత! బుద్ధదైవమ్ము నీకు**
**బౌద్ధధర్మము నిను శోకవార్ధిఁ గడవఁ**
**జేయుఁగావుత! నిన్ను రక్షించుఁగాత!**
**భిక్షుసంఘమ్ము, శరణమ్ము వేఁడుమమ్మ!**

**అర్థాలు:** బుద్ధదైవమ్ము=బుద్ధదేవుడు, నీకు=జీవనసమరంలో అయోమయంలోనున్న నీకు, భద్రమిడుఁగాత= రక్షణ కల్పించుగాక! బౌద్ధధర్మము=బుద్ధుని జీవనపద్ధతి, నిను=నిన్ను, శోకవార్ధిన్=దుఃఖసాగరంనుండి, గడవన్= బయటపడుటకు, చేయున్‌గావుత=దారి చూపు గాక! నిన్ను=శోకతప్తవైన నిన్ను, రక్షించుఁగాత=కాపాడుగాక! భిక్షుసంఘమ్ము=మా భిక్షువుల సమూహాన్ని, శరణమ్ము=రక్షణ, వేఁడుమమ్మ=కోరుకోమ్మా.

**తాత్పర్యం:** *'నీకీ సమయంలో బుద్ధభగవానుడు కాపాడుగాక! బుద్ధుని ధర్మం నిన్ను ఈ దుఃఖసాగరంనుండి బయటపడవేయు గాక! నిన్ను ఎల్లప్పుడూ రక్షించును గాక! నీవిక బౌద్ధభిక్షువుల సమూహాన్ని శరణం వేడుకో తల్లీ!'*

**వలపుతెప్ప నెక్కి భవవారిరాశిలో**
**మునుఁగనున్న మిమ్ము మనుచుపొంటె**
**వేఱుసేసె గురుఁడు విశ్వదయాహార**
**తరళయుగముఁ జేయఁదలఁచి తల్లి!**

**అర్థాలు:** తల్లి=అమ్మా! భవ=జన్మలనే, వారిరాశిలో=సముద్రంలో, వలపు=భౌతిక ప్రేమ అనే, తెప్పన్ ఎక్కి= నావలో ప్రయాణించి, మునుఁగనున్న=మునిగిపోవడానికి సిద్ధంగా ఉన్న, మిమ్ము=మీయిద్దరినీ, మనుచుపొంటె= అలా బ్రతకనీయడం కంటె, గురుఁడు=దయాసముద్రుడైన బుద్ధుడు, విశ్వ=ప్రపంచానికే, దయా= కరుణయొక్క, హార=మణిహారంలో, తరళయుగమున్=రత్నాలజంటగా, చేయన్ తలఁచి=మార్చాలనుకొని, వేఱుసేసె=ఇలా విడదీసాడు.

**తాత్పర్యం:** *అమ్మా! మన ఆచార్యుడు బుద్ధుడు దయాసముద్రుడు. భౌతికసుఖాలనే పడవలో*

*సంసారమనే సముద్రంలో ప్రయాణిస్తూ మునిగిపోబోయే మిమ్మల్ని రక్షించి, ప్రపంచానికే దయామణిహారం సమర్పించదలచి అందులో రత్నాలజంటగా పొదుగ బోతున్నాడు.*

**నీకయి పొక్కె, నిన్ దలఁచి నీఱయిపోయెను, రాగవృంతమున్**
**జేకొని త్రుంపలేక కదుజేఁడ్పడె, భిక్షుకధర్మమూన క**
**ట్టాఁకలు పెట్టె నందసుతుఁ, డానెన రేమని చెప్ప! నింతకున్**
**సాకిరు లెల్ల భిక్షుగణనమ్ము, గురుండు, విహారభూమియున్.**

**అర్థాలు:** నందసుతుఁడు=నీభర్త నందకుమారుడు, నీకయి=నీకోసం, పొక్కె=ఎంతో దుఃఖించాడు. నిన్= ప్రేయసివైన నిన్ను, తలంచి=తలచుకొని, నీఱయిపోయెను=గాసిలి పోయాడు. రాగవృంతమున్=మీమధ్య బంధమనే తొడిమను, చేకొని=చేతిలోకి తీసికొని, త్రుంపలేక=దానిని చిదుమలేక, కదున్=బాగా, చేఁడ్పడె=బాధపడ్డాడు. భిక్షుకధర్మము= బుద్ధుని దారిని, ఊనక=పుచ్చుకోకుండా, అట్టాఁకలు=అడ్డంకులు, పెట్టె=కలిగించాడు, ఆ నెనరు=ఆ నీపైగల మమకారం, ఏమనిచెప్పన్=ఎంతని చెప్పను? ఇంతకున్=వీటన్నింటికీ, భిక్షుగణనమ్ము= బౌద్ధ సన్యాసులందరూ, గురుండు=ఆచార్యుడు, విహారభూమియున్=ఆశ్రమ ప్రాంతము, ఎల్ల=మొత్తం, సాకిరులు= సాక్షులు.

**తాత్పర్యం:** *ఆ నందకుమారుడు నీకోసం ఎంతదుఃఖించాడమ్మా! నిన్ను తలచితలచి కృశించి పోయాడు. మీమధ్య బంధమనే తొడిమను తెంపలేక ఎంత దుఃఖించాడో! ధర్మదీక్ష తీసికోవడానికి ఎన్ని అడ్డంకులు సృష్టించాడు! ఆ ప్రేమనేమని వర్ణించను? వీటన్నింటికీ సాక్షులు అక్కడున్న బౌద్ధసన్యాసులూ, గురువుగారూ, విహారభూమి మొత్తమూనూ!*

**సత్యసంకల్పుఁడు గురుండు, సాధు హృదయుఁ**
**డింతకున్ నందుఁ, డీవృత్త మెల్లగతులఁ**
**గాంచె శుభపరిణామమ్ము; కడమ కింక**
**నీమనస్విత వేఱ వర్ణింపవలెనె?**

**అర్థాలు:** గురుండు=మా ఆచార్యుడు, సత్యసంకల్పుఁడు=తలచుకొన్నదానిని నిజంచేసి నిరూపించువాడు. ఇంతకున్=అన్నింటికంటె ముఖ్యం, నందుఁడు=నీ భర్త, సాధుహృదయుఁడు=శాంతస్వభావం కలవాడు. ఈ వృత్తము=జరిగినదంతా, ఎల్లగతులన్=అన్నివిధాలుగా, శుభపరిణామమ్ముగాంచె=మంచిగా పరిణమించింది. కడమకు=చివరికి, ఇంక=ఇకపైన, నీమనస్విత=నీ మంచిమనస్సును, వేఱ=వేరేగా, వర్ణింపవలెనె=ఏమని పొగడగలను?

**తాత్పర్యం:** *అనుకొన్నదానిని అనుకొన్నట్లు నెరవేర్చేవాడు మా గురువుగారు. పరమ సాధు హృదయుడు నీభర్త నందుడు. ఇప్పటిదాకా జరిగిందంతా మంచికే జరిగింది. చివరికి నీ మంచి మనస్సునింకా ఏమని వర్ణించేది?*

**అమ్మ! విషయోపరాగమ్మునందుఁ బొనుఁగు**
**వడిన మీ ప్రేమకణమును భద్రమూర్తి**
**దేశికుఁడు వెలికిందీసి దివ్యదీప**
**కళిక గావించి, విశ్వమ్ము వెలుఁగఁజేసె.**

**అర్థాలు:** అమ్మ=తల్లీ! భద్రమూర్తి=అగ్నికి రూపమైన, దేశికుఁడు=జగద్గురుడు, విషయోపరాగమ్మునందున్= విషయవాంఛలలో, పొనుఁగుపడిన=చల్లారిన, మీ=మీమధ్యనున్న, ప్రేమకణమును=అనుబంధం అనే అగ్నిరవ్వను, వెలికిందీసి=బయటకు తీసి, దివ్య=పరమపవిత్రమైన, దీపకళిక=వెలుగుతున్న జ్యోతిని, కావించి=చేసి, విశ్వమ్ము= ఈ ప్రపంచాన్ని, వెలుఁగజేసె=వెలుగుతో నింపేసాడు.

**తాత్పర్యం:** *అమ్మా! మా గురుదేవులు రూపెత్తిన అగ్నిదేవుడు. అతడు విషయవాంఛల నడుమ చల్లారిపోయిన మీలోని అగ్నిరవ్వను బయటకుతీసి దివ్యమైన దీపకళికను చేసాడు. ఆ కాంతిలో ఈ ప్రపంచానికి వెలుగులు పంచుతున్నాడు.*

**బ్రహ్మచర్యవ్రతము సత్యవాఙ్నియమము**
**జీవకారుణ్యము వహించి, చింతదొఱఁగి**
**భర్తృసహధర్మము చరించు భాగ్యమునకు**
**యోగ్యవగుమమ్మ! గురుఁడు నిన్నోముఁ గాత!'**

**అర్థాలు:** బ్రహ్మచర్యవ్రతము=ఆత్మయందే మనసునిలపడం, సత్యవాఙ్నియమము=నిజం మాట్లాడాలనే సంకల్పం, జీవకారుణ్యము=ప్రాణులన్నింటియందును దయకలిగి ఉండటం, వహించి=నీ జీవన ధర్మాలుగా స్వీకరించి, చింతదొఱఁగి=దుఃఖాన్ని విడిచిపెట్టి, భర్తృ సహధర్మము=మగని చేతలే నీచేతలుగా, చరించు= నడచుకొనే, భాగ్యమునకు=విభవానికి, యోగ్యవు అగుమమ్మ=యోగ్యురాలివి కాతల్లీ! గురుఁడు=మన ఆచార్యుడు, నిన్ను=బేలవైన నిన్ను, ఓముఁగాత=ఆదుకొను గాక!

**తాత్పర్యం:** *దేహవాంఛలకు అతీతంగా, నిజమే మాట్లాడుతూ, ప్రాణులన్నిటినీ కరుణించడమే నీ దీక్షగా స్వీకరించి దుఃఖాలన్నీ విడిచిపెట్టి మగనివలె నడచుకొనే భాగ్యానికి యోగ్యురాలివి కాతల్లీ! నిన్ను తథాగతుడు రక్షించుగాక!*

**అనవుడు, రాగరంజితములౌ నయనమ్ముల మోదబాష్పముల్**
**దొనదొన జాలువాఱఁ దటితో నతినిర్మల శాంతభావమున్**
**గని పులువాయు ముత్తియముకైవడి మోము వెలుంగఁ, గ్రొత్త చె**
**ల్వున మెయిదోఁగఁ, గేలుఁగవ మోడిచి యచ్చెలి నిల్చె నమ్రయై.**

**అర్థాలు:** అనవుడు=అతడలా అనగా, ఆ+చెలి=ఆ సుందరి, రాగరంజితములౌ=ఎఱ్ఱబడిన, నయనమ్ముల=

కళ్ళనుండి, మోదబాష్పముల్=ఆనందాశ్రువులు, దొనదొన=ఒక్కొక్కటిగా, జాలువాఱన్=కారుతూండగా, తఱితోన్= అదనుకు, అతినిర్మల=మిక్కిలి తేటగా, శాంతభావమున్=ఉద్వేగంలేని స్థితిని, కని=పొంది, పులువాయు= మైల తొలగిన, ముత్తియముకైవడి=ముత్యంలా, మోమువెలుంగన్=ముఖం వెలిగిపోతూండగా, క్రొత్త= నూతనమైన, చెల్వున=చైతన్యంతో, మెయిదోగన్=శరీరం తేలిపోతూండగా, కేలుఁగవ=రెండు చేతులు, మోడిచి=జోడించి, నమ్రయై=వినయంగా, నిల్చె=నిలబడింది.

**తాత్పర్యం:** *అతడలా చెప్పగానే ఆ సుందరి సిగ్గుతో ఎఱ్ఱబడిన కనులనుండి ఆనందబాష్పాలు జాలువారుతూండగా ఏవిధమైన ఆవేశంలేని నిర్మలస్థితిని పొంది పులుకడిగిన ముత్యంలా ముఖం వెలిగిపోతూంటే క్రొత్తశక్తి దేహమంతా ప్రవహించగా రెండుచేతులూ జోడించి వినయంగా నిలబడింది.*

ఇది

అష్టమసర్గము

# సహధర్మచర్యము

**దినదినము నా దయామయి దీనజనులఁ**
**బిలువనంపించి యిలువేలుపులకుఁ బోలె**
**భక్తిమై నర్చలొసఁగి యాభరణరాజిఁ**
**బంచియిచ్చును బ్రీతిసంభావనముల.**

**అర్థాలు:** ఆ దయామయి=ఆ కరుణాంతరంగ, దినదినము=బుద్ధభగవానుని పిలుపు అందుకున్నంతనే ప్రతిరోజూ, దీనజనులన్=ఆర్తులయినవారిని, పిలువనంపించి=పిలిపించుకొని, ఇలువేలుపులకున్ బోలె=ఇంటి దేవతలకువలె, భక్తిమై=మిగుల గౌరవంతో, అర్చలు= పరిచర్యలు, ఒసఁగి=చేసి, ఆభరణరాజిన్=తనకున్న సొమ్ము లన్నింటిని, ప్రీతి=ఇష్టంతో, సంభావనముల=సమ్మానరూపంలో, పంచియిచ్చును=పంచిపెట్టింది.

**తాత్పర్యం:** *సుందరి తానుగా చాలా దయాగుణం కలది. అందులో దయాసముద్రుడు బావగారి అనుజ్ఞ లభించింది. ఇంకేం, ప్రతిరోజు బీదల్ని ఇంటికి పిలిపించి ఇంటి దేవతల్లాగా పూజించి తనకున్న సొమ్ములన్నింటినీ వారికి కానుకలుగా సమర్పించి సమ్మానించింది.*

**విడుదులు గావించు వీథులఁ దిరుగు గో**
**శ్వానములకు గృహోద్యానమందు**
**నింటింట బిచ్చమునెత్తు పంగ్వంధుల**
**రావించి తనమందిరమున నిల్పుఁ**
**బథ్యపానములంపు జ్వరితుల, కెచరించి**
**వెజ్జుల వ్రణితుల వెతలు మాన్పు**
**మృత్యువు సొచ్చిన గృహము లదృష్టదే**
**వతవోలెఁ జొచ్చి దుఃఖితుల నోము**

**నాఁడునాఁటికి గేహ మనాథబాల**
**కులకు విద్యాలయమ్ము, రోగులకు వైద్య**
**శాలయై, ధర్మదేవత కాలయమ్ము**
**నగుడుఁ దా నందుఁ బూజారి యయ్యెనబల.**

**అర్థాలు:** అబల=ఆ స్త్రీమూర్తి, వీధులన్=ఎవరికీ కాకుండ బయట, తిరుగు=తిరిగే, గో= ఆవులకు, శ్వానమ్ములకు=కుక్కలకు, గృహోద్యానమందున్=ఇంటితోటలో, విడుదులు= ఆవాసాలు, కావించు=కల్పిస్తుంది. ఇంటింట=ఇల్లిల్లూతిరిగి, బిచ్చమునెత్తు=అడుక్కుతినే, పంగు=కుంటివారిని, అంధుల=గ్రుడ్డివారినీ, రావించి= పిలిపించి, తనమందిరమున= తనింట్లో, నిల్పున్=ఉంచుతుంది. జ్వరితులకు=జ్వరం తగిలినవారికి, పథ్య పానములు=తినతగినవి త్రాగతగినవి, అంపు=పంపిస్తుంది. వెజ్జుల=వైద్యులను, ఎచరించి=హెచ్చరించి, వ్రణితుల=గాయపడినవారి, వెతలుమాన్పు=బాధలు తీరుస్తుంది. మృత్యువుసొచ్చిన= చావు కలిగిన, గృహములు=ఇళ్ళకు, అదృష్టదేవతవోలెన్=లక్ష్మీదేవిలా, చొచ్చి=ప్రవేశించి, దుఃఖితులన్=బాధల్లో ఉన్నవారిని, ఓము=ఆదుకొంటుంది. నాఁడునాఁటికి=రోజురోజుకి, గేహము=ఇల్లంతా, అనాథబాలలకు=అందరినీ పోగొట్టుకున్న పిల్లలకు, విద్యాలయమ్ము= పాఠశాలగాను, రోగులకు=వ్యాధిపీడితులకు, వైద్యశాలయై= చికిత్సాలయంగానుమారి, ధర్మదేవతకు=బౌద్ధధర్మానికి, ఆలయమ్మున్=కోవెలగా, అగుడున్=మారగా, తాను=అంత వరకు ఇవేమీ తెలియని ఆమె, అందున్=ఆలయంలో, పూజారియయ్యెన్=అర్చకురాలైంది.

**తాత్పర్యం:** *అప్పటిదాకా ఏమీతెలియని ఆ స్త్రీమూర్తి బయట తిరిగే ఆవుల్ని కుక్కల్ని తన ఇంటితోటలోకి తెచ్చి మేపసాగింది. ఇల్లిల్లూ తిరిగి బిచ్చమెత్తుకునే కుంటి గుడ్డివాళ్ళను పిలిచి తనింట్లో చోటుకల్పించింది. ఊళ్ళో ఎవరికైనా జ్వరంతగిలితే వారికితగిన తిండీ తిప్పలూ చూడసాగింది. వైద్యులను పిలిపించి ఎవరైనా గాయాలతో బాధపడుతూంటే వారిని కాపాడుతుంది. చావింటికి వెళ్ళి లక్ష్మీదేవిలా బారి బాధలుపోగొడుతుంది. ఇలా రోజురోజుకీ ఆమె ఇల్లంతా అనాథబాలలకు పాఠశాలగానూ, రోగులకు వైద్యశాలగానూ మారి బౌద్ధధర్మానికి ఆలయంగా మారింది. అందులో ఆమె ఒక పూజారిగా మారింది.*

**'హో' యనెడు పిల్పు వీతేర, 'నో' యటంచు**
**నుట్టిపడు స్థూలదేహమ్ము నుజ్జగించి**
**యా తపస్విని శబ్దమాత్రానుమేయ**
**తనుతరాకృతి దాల్చు భూతదయవోలె.**

**అర్థాలు:** హోయనెడు=హో అనే, పిల్పు=పిలుపు, వీతేరన్=వినిపించగానే, ఓ యటంచున్= ఓ అంటూ, ఉట్టిపడు=అగపడే, స్థూలదేహమ్మున్=ఈ భౌతిక శరీరాన్ని, ఉజ్జగించి=వదిలేసి, ఆ తపస్విని=ఆ ధర్మావలంబిని, భూతదయవోలె=సకలజీవులందు దయాలేశంగా, శబ్ద మాత్ర=ధ్వనిమాత్రంచేత, అనుమేయ=ఊహించదగిన, తనుతర=సూక్ష్మాతిసూక్ష్మ, ఆకృతి= ఆకారం, తాల్చు=పొందుతుంది.

**తాత్పర్యం:** *ఆ క్రొత్త సన్యాసిని ఓ అని పిలిస్తే ఓ అని పలుకుతూ కనిపించే శరీరాన్ని మరచిపోయి కేవలం శబ్దంచేతమాత్రమే ఉందనిపించే జీవులయందలి దయవంటి కనిపించని సూక్ష్మరూపాన్ని పొందింది.*

**తళతళమను తొంటితనువు కృశించి ప్ర**
**సన్న శాంతద్యుతి సంపతిల్ల**
**నొయ్యార మెడలిన యొసపరినడక కా**
**ర్తత్రాణ పరత సంభ్రమముఁ గఱప**
**నతను సంజీవనమైన బెళుకుంజూపు**
**నిర్వికారత నిండు నెనరుఁ జింద**
**దరిలేని హృదయసౌందర్య సేకమున వి**
**శ్వమెల్ల రసమయత్వమ్ముఁ దాల్ప**

**సస్మితాననకాంతి వత్సలతఁ గురియ**
**సన్నకావి ధరించి యా సౌమ్యభావ**
**చొచ్చు దుఃఖాంధతమసమ్ము చొచ్చినట్టి**
**యెడలు పరికించి క్రొంబ్రొద్దుపొడుపు వోలె.**

**అర్థాలు:** తళతళమను=మెరుపులతో, తొంటి=ముందున్న, తనువు=శరీరం, కృశించి=చిక్కిపోయి, ప్రసన్న=స్వచ్ఛమైన, శాంతద్యుతి=చల్లనికాంతి, సంపతిల్లన్=పెరిగిపోగా; ఒయ్యారము ఎడలిన=హొయలుపోయిన, ఒసపరినడకకు= అందాలనడకకు, ఆర్తత్రాణపరత=దీనులను ఆదుకొనే పద్ధతి, సంభ్రమమున్=గౌరవాన్ని, కఱపన్=నేర్పగా; అతను=మన్మథుని, సంజీవనమైన=బ్రతికించేదైన, బెళుకుంజూపు=బిత్తరచూపులో, నిర్వికారత= నిచ్చలత్వం, నిండునెనరున్=నిండైనకరుణను, చింద=కురిపించగా; దరిలేని=అంతులేని, హృదయసౌందర్య= ఆంతరమైన సొగసుయొక్క, సేకమున=కానుకగా, విశ్వమెల్ల=ప్రపంచమంతా, రసమయత్వమ్మున్=రాగమయతను, తాల్ప=ధరించగా; సస్మిత=చిరునవ్వుతోటి, ఆననకాంతి=ముఖవర్చస్సు, వత్సలతన్=పుత్ర ప్రేమను, కురియ= కురిపించగా; సన్నకావి=కోమలమైన కావిబట్టలు, ధరించి=తాల్చి, ఎడలు=దిక్కులు, పరికించి=పరిశీలించి, దుఃఖ=బాధలనే, అంధతమసమ్ము=చిమ్మచీకటి, చొచ్చినట్టి=ప్రవేశించిన, క్రొంబ్రొద్దు=క్రొత్త సూర్యుని, పొడుపువోలె= ఉదయంలాగా, ఆ సౌమ్యభావ=ఆ సాధుభామిని, చొచ్చు=ప్రవేశిస్తుంది.

**తాత్పర్యం:** *దేహం శుష్కించి ముందున్న మెరుపులు పోయి చల్లనితేటవెలుగు ప్రవేశించగా, ఒయ్యారాలుపోయే అందాలనడకలు దీనులను చేరుకొనే గౌరవం పొందగా, మన్మథుని సైతం రెచ్చగొట్టగలిగిన బిత్తరచూపులు నిచ్చలంగా దయను ప్రసరించగా, అంతులేని హృదయసౌందర్యం కానుకచేసి ప్రపంచమంతా కరుణారసం నింపగా, చిరునవ్వులు చిందే ముఖకాంతులు పుత్రప్రేమను కురిపించగా, ఆ సన్నకావిబట్టలు ధరించిన సాధుభామిని అన్నిదిక్కులా దుఃఖమనే చిమ్మచీకట్లు పోగొట్టడానికి క్రొత్తసూర్యుడై ఉదయంచింది.*

**ఒకనాఁటి సందెచీఁకటి**
**మొకమున నాయమ గృహాభిముఖియై చనుచో**
**వెకివెక్కి యేడ్చుచున్ బా**
**లకుఁ డొక్కరుఁ డడ్డమై నిలంబడి త్రోవన్.**

**అర్థాలు:** ఆయమ=ఆ సుందరి, ఒకనాఁటి=ఒకరోజున, సందెచీఁకటి మొకమున=చీకటిపడే ముందుగా, గృహాభిముఖియై=ఇంటివైపుకు, చనుచో=వెళ్ళేటప్పుడు, త్రోవన్=ఆ దారిలో, బాలకుఁడు=పిల్లవాడు, ఒక్కరుఁడు=ఒకడు, అడ్డమై=అడ్డంగా, వెకివెక్కి=వెక్కెక్కి, ఏడ్చుచున్= ఏడుస్తూ, నిలంబడి=నిలుచొని....

**తాత్పర్యం:** *ఆ సుందరి ఒకరోజు తనపని ముగించుకొని ఇంటికి వెడుతోంది. చీకటి పడుతోంది. అప్పుడు ఒకపిల్లాడు దారికి అడ్డంగా నిలబడి వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.*

**తనుఁ గాంచినంతనే గ్ర**
**క్కునఁ జేరఁగవచ్చి, కావికొంగు కరమునన్**
**గొనిలాగుచు, వెన్కకు ర**
**మ్మనుచున్ జేసాఁచి చూప నాయమ కరుణన్.**

**అర్థాలు:** తనున్=తనను, కాంచినంతనే=చూచినవెంటనే, గ్రక్కునన్=తొందరగా, చేరఁగ వచ్చి=దగ్గరకు వచ్చి, కావికొంగు=కాషాయపు చెంగును, కరమునన్=చేతితో, కొనిలాగుచు= పట్టుకొని లాగుతూ, వెన్కకు రమ్మనుచున్=వెనక్కిరమ్మని, చేసాఁచిచూపన్=చేయిచాపి ఏదో చూపిస్తూంటే, ఆయమ=ఆమెకూడా, కరుణన్= దయతో....

**తాత్పర్యం:** *తన్నుచూచి పరుగెత్తుకుంటూవచ్చి చీరచెంగును పట్టిలాగుతూ వెనక్కిరమ్మని చేయిచాపి చూపిస్తూంటే ఆమె కూడా....*

**ఒకకేలఁ గనులు నులుముచు**
**నొకకేలన్ దన్ను లాగుచుండిన యా బా**
**లకు చుంచు దువ్వి 'శోకిం**
**పకుమన్నా! యేను వెంటవచ్చెద' ననుచున్.**

**అర్థాలు:** ఒకకేలన్=ఒకచేత్తో, కనులునులుముచున్=కళ్ళునులుపుకొంటూ, ఒకకేలన్= మరొకచేత్తో, తన్ను= తనను, లాగుచుండిన=వెనక్కిగుంజుతున్న, ఆ బాలకు=ఆ బాలుని, చుంచుదువ్వి=వెంట్రుకలు సరిచేస్తూ, శోకింపకుమన్నా=ఏడవకునాన్నా, ఏను=నేను, వెంటవచ్చెదన్=నీతోవస్తాను,అనుచున్=అంటూ....

**తాత్పర్యం:** *ఒకచేత్తో కళ్ళునులుపుకొంటూ, మరొకచేత్తో తనను వెనక్కిలాగుతున్న ఆ పిల్లవానిని తలమీద చేయివేసి ఏడవద్దునాన్నా నేను వస్తానని బయలుదేరగా....*

**దీపికోజ్జ్వల విపణివీథిం దరించి,**
**ధనికులు వసించు వాడలు దాఁటి; యంతఁ**
**గారుచీకట్లఁ దేలు కుటీరపాళి**
**లోన దుర్గంధిలపు సందులోనఁ జనుచు.**

**అర్థాలు:** దీపికోజ్వల=దీపాలవెలుగుతోనున్న, విపణివీథిన్=అంగడిబజారును, తరించి= దాటి, ధనికులు వసించు=డబ్బున్నవారుండే, వాడలుదాఁటి=పేటలుదాటి, అంతన్=తరువాత, కారుచీకట్లన్=కటిక చీకటిలో, తేలు=కాలంగడిపే, కుటీరపాళిలోన=గుడిసెల వరుసలో, దుర్గంధిలపు=చెడుకంపు కొడుతున్న, సందులోనన్= ఇరుకుసందులో, చనుచు=వెడుతూ...

**తాత్పర్యం:** *ఇద్దరూ అలా దీపాలున్న అంగడివీధి దాటి, డబ్బున్నవారుండే వాడలుదాటి, కారుచీకట్లలో మగ్గుతున్న గుడిసెలమధ్య కంపుకొడుతున్న ఒకసందులో నడుస్తూ....*

**చితచితలాడు నీరమునఁ, జేఁపల కంపునఁ బందిముట్టియల్**
**కతికెడి చప్పరింపులను, గైకుయిలాడెడు కుక్కకూఁతలన్**
**బ్రతినినదించు దర్దురరవమ్ముల, నీఁదర మ్రోతలన్ దరి**
**ద్రత తల పేలు గ్రుక్కికొను తావులలో వెలివాడ చక్కటిన్.**

**అర్థాలు:** చితచితలాడు=కాలుపెట్టవీలులేని, నీరమునన్=మురికినీటిలో, చేఁపల కంపునన్= చేపలవాసనలతో, పందిముట్టియల్=పందులు ముట్టెలతో, కతికెడి=మురికినీరు త్రాగే, చప్పరింపులను=శబ్దాలమధ్య, కైకుయిలాడెడు= కైకైలాడుతూ పోట్లాడుకునే, కుక్కకూతలన్= కుక్కల అరుపులమధ్య, ప్రతినినదించు=ప్రతిధ్వనిస్తూన్న, దర్దుర రవమ్ములన్=కప్పల బెకబెకల నడుమ, ఈఁదరమ్రోతలన్=చలిగాలులతో, దరిద్రత=పెద్దమ్మ, తలపేలు గ్రుక్కికొను= తాయితీగా తలలోపేలు ఏరుకుంటున్నట్లున్న, తావులలో=చోటులమధ్య, వెలివాడ=వెలేసినవారిపేట, చక్కటిన్= సమీపంలో....

**తాత్పర్యం:** *మురికినీటిమధ్య చేపలకంపులో పందిముట్టెల చప్పరింపులనడుమ కుక్కల కాట్లాటలలో కప్పల బెకబెకల మారుమోగుతూంటే చలిగాలులు ఈడ్చికొడుతూంటే వాటన్నిటిమధ్య దరిద్రదేవత తీరిగ్గా తలపేలు తీసికొంటున్నట్లున్న ఆ చోట వెలి వేయబడిన వారి పాకల సమీపంలో....*

**ఒక గుడిసెలోనికిన్ బా**
**లకు వెంటం జొచ్చి, తైలలవపుష్టమ్మో**
**మకమకని దివ్వె వెలుఁగున**
**నొకట సమాసన్నమరణ నువిదన్ గాంచెన్.**

**అర్థాలు:** ఒకగుడిసెలోనికిన్=ఒక పూరిపాకలోకి, బాలకువెంటన్=పిల్లవానితో, చొచ్చి=ప్రవేశించి, తైలలవ= కొద్దిపాటి నూనెతో, పుష్టమ్మో=కొద్ది శక్తితో, మకమకని=రెప రెపలాడే, దివ్వె వెలుఁగున=దీపకాంతిలో, ఒకట= ఒకచోట, సమాసన్నమరణన్= చావబోతున్న, ఉవిదన్=ఒక స్త్రీని, కాంచెన్=చూచింది.

**తాత్పర్యం:** *ఆ పిల్లవానితో ఆమె ఒకగుడిసెలోనికి వెళ్ళి అక్కడ ఉండీలేని నూనెతో రెపరెప లాడే దీపంవెలుగులో మరణానికి దగ్గరపడ్డ ఒక స్త్రీని చూచింది.*

**కావులు గట్టియున్ దరుణకంజహితుం బురుడించువాని, దుః**
**ఖావిల నొక్కబాలను దయామతి నక్కునఁ జేర్చి ముంగురుల్**
**ప్రోవిడి ముద్దు గొం చవలిమోమయి నిల్చినవాని, భిక్షు న**
**ప్పావని కాంచి "బుద్ధభగవానుఁ డగున్ శరణమ్ము మా" కనెన్.**

**అర్థాలు:** ఆ+పావని=ఆ పవిత్రమైన మనసున్న సుందరి, కావులు=కావి బట్టలు, కట్టియున్= ధరించి, తరుణ=మంచి వయసులోనున్న, కంజహితున్=నీటిలోపుట్టిన పద్మాలకు బంధువైన సూర్యునికి, పురుడించువాని= సాటివచ్చువానిని, దుఃఖావిల=శోకంతో ఏడుస్తున్న, ఒక్కబాలను=ఒక పసిపాపను, దయామతిన్=దయతో నిండిన హృదయంగలవాడై, అక్కునన్= గుండెలమీద, చేర్చి=పెట్టుకొని, ముంగురుల్=ఆ పాప ముఖంమీది వెంట్రుకలు, ప్రోవిడి= సరిచేసి, ముద్దుగొంచు=ముద్దాడుతూ, అవలిమోమయి=అటుముఖంతో, నిల్చినవాని=నిలబడ్డ వాడైన, భిక్షుని=ఒక బౌద్ధసన్యాసిని, కాంచి=చూచి, బుద్ధభగవానుఁడు=భగవంతుడైన బుద్ధుడే, మాకు=మావంటి వారికి, శరణమ్ము=కాపుదల, అగున్=అగునుగాక, అనెన్=అని వినయంతో పలికింది.

**తాత్పర్యం:** *ఆప్రక్కనే ఆ పావనహృదయగా మారిన సుందరి ఒక భిక్షువును చూచింది. అతడు కాషాయాంబరాలు ధరించి ఉన్నాడు. మధ్యాహ్న మార్తాండునిలా వెలిగిపోతున్నాడు. అతని చేతుల్లో ఒక ఏడుస్తూన్న పసిపాప ఉంది. అతడామెను గుండెలకానించుకొని ముంగురులు సరిచేస్తూ ముద్దులాడుతూన్నాడు. అయితే అతని ముఖం అవతలివైపుకు తిరిగి ఉంటాన ఎవరైందీ అర్థంకావడంలేదు. ఎవరైతేనేం! బౌద్ధమత సంప్రదాయం ప్రకారం 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ పలకరించింది.*

**ఆ పలు కాలకించి యతఁడాయమఁ గన్గొనెఁ, గాంచె వాని మో**
**మాపె, పురఃప్రసారితములైన కరమ్ముల, నారవిచ్చు నా**
**సాపుట నేత్రయుగ్మములఁ జయ్యన నొండొరు డాయఁబోవు వా**
**రై, పదయుగ్మ మెత్తియును 'హా' యని నిల్చి నిరుద్ధచిత్తులై.**

**అర్థాలు:** ఆ పలుకు=ఆ మాటలు, ఆలకించి=విని, అతఁడు=ఆ భిక్షువు, ఆయమన్=ఆ స్త్రీమూర్తిని, కన్గొనెన్= చూచాడు. ఆపె=ఆమెకూడా, వానిమోము=అతనిముఖాన్ని, కాంచె=చూచింది. పురః=ముందుకు, ప్రసారితము

లైన=చాచిన, కరమ్ములన్=చేతులతో, ఆరవిచ్చు=పూర్తిగా విచ్చుకుంటున్న, నాసాపుట=ముక్కుపుటాలతో, నేత్రయుగ్మములన్=కనుల జంటలతో, చయ్యనన్=ఒక్కసారిగా, ఒండొరు=ఒకరినొకరు, డాయఁబోవువారై= దగ్గరకు చేరబోబోయి, పదయుగ్మము=వారి పాదాల జంటలను, ఎత్తియును=ముందుకు వేయబోయికూడా, 'హా' యని=అయ్యో అనుకొంటూ, నిరుద్ధ=బలవంతంగా అడ్డుకోబడ్డ, చిత్తులై=మనసులు కలవారై, నిల్చి=నిలబడిపోయి....

**తాత్పర్యం:** *ఆ మాటలు విన్న ఆ భిక్షువు ఆగొంతువిని వెంటనే తిరిగిచూచాడు. ఆమె కూడా అతనిముఖం చూచింది. ఆశ్చర్యకరంగా వారిరువురు భార్యాభర్తలు. అనుకోకుండా వారి చేతులు ముందుకు సాగినాయి. ముక్కుపుటాలు అదిరాయి. ఇద్దరి కళ్ళూ విచ్చు కున్నాయి. వెంటనే ఒకరినొకరు ఒకటి కాబోయారు. అడుగులుకూడా పైకి లేచాయి. ఇంతలో ఇద్దరికీ వారి ధర్మం గుర్తొచ్చింది. అయ్యో అనుకొంటూ ఆగిపోయారు.*

**'ప్రాణమా' యంచు నొండొరుఁ బల్కరింప**
**సాఁగి, 'ప్రా' మాత్రపర్యవసన్నములగు**
**నెలుఁగులు గళమ్ముఁదగులఁ, దా మెట్టకేని**
**యనిరి 'గచ్ఛామి బుద్ధం శరణ' మటంచు.**

**అర్థాలు:** ప్రాణమా=ఓ నాప్రాణమా, అంచున్=అంటూ, ఒండొరున్=ఒకరినొకరు, పల్కరింప సాఁగి= పలుకరించబోయి, 'ప్రా'మాత్ర=మొదటి అక్షరం ప్రాతోనే, పర్యవసన్నములగు= ఆగిపోయిన, ఎలుఁగులు=స్వరాలు, గళమ్మున్=గొంతులకు, తగులన్=అడ్డుపడగా, తాము= వారిద్దరూ, ఎట్టకేని=ఎలాగోలా, గచ్ఛామి బుద్ధం శరణమ్= బుద్ధుని ఆధీనంలోకి వెడతాము, అటంచు=అంటూ, అనిరి=ముగించారు.

**తాత్పర్యం:** *వారి అడుగులు ఆగిపోయినా పలుకులు ఆగలేదు. ఓ నాప్రాణమా అంటూ పలుకరించుకోబోయారు. ప్రా దగ్గరే వారి గొంతులు ఆగిపోయాయి. ఒక్క క్షణం ఆగి ఎలాగోలా వారి శరణువాక్యం 'బుద్ధం శరణం గచ్ఛామి' అంటూ ముగించారు.*

**అనిలవశమ్మునన్ క్షుభితమయ్యును వెండియు నంతలోన శాం**
**తినిగొని కల్తదేఱి ప్రకృతిస్థములైన కొలంకులట్లు నె**
**మ్మనములు దేఱఁ, జూపులను మాఁటిన మబ్బుతెరల్ తమంత నం**
**తన తెరలన్ నిలంబడిరి నందుఁడు సుందరియున్ బ్రసన్నులై.**

**అర్థాలు:** అనిలవశమ్మునన్=గాలి తాకిడికి, క్షుభితమయ్యును=కలతచెందికూడా, వెండియున్= మరల, అంతలోన=కాసేపటికి, శాంతినిగొని=శాంతపడి, కల్తదేఱి=ఆ క్షోభనుండి బయటపడి, ప్రకృతిస్థములైన= యథాస్థితిని పొందిన, కొలంకులట్లు=సరస్సులవలె, నెమ్మనములు= వేడెక్కిన అంతరంగాలు, తేఱన్=కుదుటపడగా, చూపులను=వారి కన్నుల్ని, మాఁటిన=కప్పిన, మబ్బుతెరల్=కోరికలనే మబ్బు ముసుగులు, తమంతన్=వాటంతట

అవే, అంతన=వెంటనే, తెరలన్=తొలగిపోగా, నందుఁడు=నందకుమారుడు, సుందరియున్=వాని భార్య సుందరికూడా, ప్రసన్నులై=ప్రశాంత చిత్తంతో, నిలంబడిరి= నిలబడిపోయారు.

**తాత్పర్యం:** *ఎన్నో సరోవరాలుంటాయి. అవి మామూలుగా కెరటాలు లేకుండా ప్రశాంతంగా ఉంటాయి. గట్టిగా గాలి వీచిందనుకొండి, సరోవరం అంతా అలలతో క్షోభించిపోతుంది. మళ్ళీ గాలి తగ్గగానే మామూలుస్థితికి వస్తాయి. ఆ విధంగానే చాన్నాళ్ళకు ఒకరినొకరు చూచుకొన్న ఆవేశంలో వారిరువురిమధ్య జరిగిన ప్రేమకలాపాలన్నీ గుర్తొచ్చి వారి మనస్సులు కలతచెందాయి. కొంత సేపటికి తామున్నస్థితి గుర్తుకొచ్చి ఆ మబ్బులనుండి బయటకొచ్చారు. నందుడు సుందరి ఇప్పుడు మనసులు కుదుటపడి సోదర భిక్షువులై నిలబడ్డారు.*

**పిదప మంచములోని యా పేదరాలిఁ**
**గాంచి చెఱియొక దెస నిల్వఁ, గాలమహిష**
**ఘంటికానాదములు వీనుఁగవ నదింప**
**నాపె కనువిచ్చి నలుదెస లరసికొనుచు.**

**అర్థాలు:** పిదప=తరువాత, మంచములోని=పడకమీది, ఆ పేదరాలిన్=ఆ దీనురాలిని, కాంచి=చూచి, చెఱి యొకదెస=చెరొకవైపున, నిల్వన్=నిలబడగా, ఆపె=ఆ నిర్భాగ్యురాలు, కాలమహిష=యముని దున్నపోతుయొక్క, ఘంటికానాదములు=గంటలశబ్దాలు, వీనుఁగవ=రెండుచెవులందు, నదింప=ధ్వనిచేయగా, కనువిచ్చి=కళ్ళుతెరచి, నలుదెసలు=నాలుగు దిక్కులా, అరసికొనుచు=పరిశీలనగా చూస్తూ....

**తాత్పర్యం:** *తరువాత ఆయిద్దరూ ఆ పేదరాలి మంచానికి చెరొకవైపునా చేరారు. ఆ నిర్భాగ్యురాలు తానిక మరణానికి దగ్గరయ్యానని తెలిసికొంది. నెమ్మదిగా కళ్ళుతెరచి నాలుగుదిక్కులా చూచింది.*

**చెంత నిల్చియున్న చిన్ని నిసుంగులఁ**
**జేరఁదీసి, నందు చేతియందుఁ**
**గూఁతుహస్త మిడియె, గొమరుని హస్తమ్ము**
**సుందరీకరమ్మునందు నిడియె.**

**అర్థాలు:** చెంత=తన దగ్గరగా, నిల్చియున్న=రెండువైపులా నిలబడిన, చిన్ని=ఇంకా జ్ఞానం రాని, నిసుంగులన్= తన పసిపిల్లలను, చేరఁదీసి=బాగాదగ్గరకు తీసికొని, నందు=ఆ నంద భిక్షువుయొక్క, చేతియందున్=చేతిలో, కూఁ తుహస్తము=కుమార్తె చేతిని, ఇడియె=పెట్టింది. కొమరుని హస్తమ్ము=తన చిన్ని కుమారుని చేతిని, సుందరీ కరమ్మునందున్=సుందరీ భిక్షువుచేతిలో, ఇడియె=పెట్టింది.

**తాత్పర్యం:** *తనకు రెండువైపులా నిలబడ్డ పసికందులను దగ్గరికి తీసికొని ముద్దాడి అక్కడ నిలబడ్డ నందునిచేతిలో తనకూతురి చేతిని, సుందరిచేతిలో తనకుమారుని చేతిని ఉంచింది.*

**పిమ్మట వారి హస్తములు, బిడ్డలపాణి యుగమ్ము లాత్మహ**
**స్తమ్ముల నూఁది, కన్గొనల జాఱు ముదశ్రులతోడ దీర్ఘదీ**
**ర్ఘమ్ముగ నిశ్వసించుచు, సుఖమ్ము మెయిన్ గనుమోడ్చె; నంతలో**
**సమ్ముఖమందు నిల్చె భవసాగరపోతము గౌతమర్షియున్.**

**అర్థాలు:** పిమ్మట=తరువాత, వారి హస్తములు=నందుని సుందరి చేతులను, బిడ్డల=తన పిల్లల, పాణి యుగమ్ముల=చేతులందు, ఆత్మహస్తమ్ములన్=తనచేతులతో, ఊఁది=ఉంచి, కన్గొనల=కళ్ళతుదల, జాఱు=వెలువడే, ముదశ్రులతోడ=సంతోషం చూచించే కన్నీటితో, దీర్ఘదీర్ఘమ్ముగ=చాలా పొడవుగా, నిశ్వసించుచు=నిట్టూర్పులు వదులుతూ, సుఖమ్ముమెయిన్= ఇక తనపిల్లలగురించిన బెంగతొలగిపోయిందనే సంతోషంతో, కనుమోడ్చెన్= కనులు శాశ్వతంగా మూసివేసింది. అంతలో=అదే సమయంలో, సమ్ముఖమందు=వారికెదురుగా, భవసాగర= సంసారమనే సముద్రంలో, పోతము=ఓడవంటి, గౌతమర్షియున్=శాక్యముని కూడా, నిల్చె=ప్రత్యక్షమయ్యాడు.

**తాత్పర్యం:** *తరువాత ఆ పేదరాలు తనచేతులతో సుందరి నందుల చేతులను తన బిడ్డల చేతులందు ఉంచి, కనులచివరలందు ఆనందబాష్పాలు జారిపోతుండగా, గట్టిగా నిట్టూర్పు విడిచి ఇక తనకేమీ బెంగలేదన్న ధీమాతో సుఖంగా కన్నుమూసింది. అదే సమయానికి వారికెదురుగా సంసార సాగరాన్ని తరింపజేయటానికి పెద్ద ఓడలా భూమిపైకి వచ్చిన గౌతముడనే శాక్యముని ప్రత్యక్షమయ్యాడు.*

**'శరణము బుద్ధదైవ' మని సాఁగిలి మ్రొక్కిన నందసుందరీ**
**శిరముల దీవనల్ కురిసి, చెంతను నిల్చిన బిడ్డలిద్దఱన్**
**జెఱియొక చంక కెత్తికొని, చిర్నగ వాననసీమఁ దోఁప, నా**
**దరమునఁ బల్కె నగ్గురుఁడు తచ్చరితమ్మున కెంతొమెచ్చుచున్.**

**అర్థాలు:** శరణము బుద్ధదైవమని=బుద్ధం శరణం అని, సాఁగిలి=సాష్టాంగపడి, మ్రొక్కిన= నమస్కరించిన, నంద సుందరీ శిరముల=సుందరీనందుల తలలమీద, దీవనల్ కురిసి= మంగళాశాసనాలు కురిపించి, చెంతను నిల్చిన=దగ్గరగా నిలబడ్డ, బిడ్డలిద్దఱన్=ఇద్దరు పిల్లలను, చెఱియొక= ఒకొక్కరిని ఒక్కొక్క చంకన= బాహుమూలానికి, ఎత్తికొని=పైకెత్తుకొని, చిర్నగవు=చిరునవ్వు, ఆననసీమన్=ముఖంమీద, తోఁపన్=తొంగిచూడగా, అగ్గురుఁడు=ఆ గురుదేవుడు బుద్ధుడు, తచ్చరితమ్మునకు=వారి నడవడికి, ఎంతొ=ఎంతగానో, మెచ్చుచున్= అభినందిస్తూ, ఆదరమునన్=మన్ననతో, పల్కెన్=ఇలా అన్నాడు.

**తాత్పర్యం:** *వచ్చిన ఆ గురుదేవుడు బుద్ధం శరణం అంటూ కాళ్ళమీదపడ్డ సుందరీ నందుల తలలమీద చేతులుంచి దీవనలిచ్చాడు. అక్కడే నిలబడ్డ బిడ్డలిద్దరినీ చెరికోచంకలోకి ఎత్తికొన్నాడు. చిరునవ్వు నిండిన ముఖంతో సుందరీనందుల నడవడికను ఎంతో మెచ్చుకొని ఆదరంతో ఇలా అన్నాడు.*

**'తెక్కలించితి మున్ను నేనొక్కనందు**
**సుందరీ! ధర్మసోదరీ! చూడు మిదిగొ!**
**ధర్మ సోదరు నొకనందు, ధర్మతనయు**
**నొక్కరుని బాలనందు నీ కొసఁగుచుంటి.**

**అర్థాలు:** ధర్మసోదరీ=బౌద్ధధర్మం ప్రకారం చెల్లెలివంటిదానా! సుందరీ=సుందరి అను పేరుగలదానా! మున్ను=ఇంతకు ముందు, నేను=ధర్మప్రచారకుడినైన నేను, ఒక్క నందు= ఒక నందుని, తెక్కలించితి=నీనుండి దొంగిలించాను కదా! చూడుమిదిగొ=ఇప్పుడుచూడు! నీకు=ఒక నందుని కోల్పోయిన నీకు, ధర్మసోదరున్= బౌద్ధధర్మాన్నిబట్టి అన్నగా, ఒక నందు=ఒక నందుని, బాలనందున్=బాలుడైన నందుని, ఒక్కరిని= మరొకరిని, ధర్మతనయున్=ధర్మాన్నిబట్టి కొడుకుగాను, ఒసఁగుచుంటి=ఇస్తున్నాను.

**తాత్పర్యం:** బౌద్ధధర్మంలో అందరూ సోదరులు, సోదరీమణులే! అందువలన మరదలు సుందరి ఇప్పుడు సోదరీసమానురాలు. అందుకే బుద్ధుడంటున్నాడు. సోదరీ సుందరీ! ఇంతకుముందే నీనుండి ఒకనందుని దొంగిలించాను. ఇప్పుడుచూడు– నీకొక నందుని సోదరుడుగాను, మరొక బాలనందుని కుమారుడుగాను ఇస్తున్నాను.

**సుందరి బాహుబంధమునఁ జొక్కు నినున్ గొనిపోయినాఁడనో**
**నందకుమార! నాఁ, డిదిగొ! నా ఋణమీఁగితి ధర్మసోదరిన్**
**సుందరి, నీ యనాథశిశుసుందరి నేఁ డిడుచుంటి నీకు, నా**
**నందము సుందరమ్మయి కనంబడుఁగావుత సృష్టి మీకిఁకన్.**

**అర్థాలు:** ఓ నందకుమార=సోదరా నందుడా! నాఁడు=ఆ రోజున, సుందరి=నీ ప్రియురాలు సుందరియొక్క, బాహుబంధమునన్=కౌగిలిలో, చొక్కు=పరవశించే, నినున్= గృహస్థాశ్రమంలోనున్న నిన్ను, కొనిపోయినాఁడ= తీసికొని పోయినాను. ఇదిగొ=ఇప్పుడు చూడు, నా ఋణము=నేను నీకున్న అప్పును, ఈఁగితి=తీర్చుకున్నాను, ధర్మసోదరిన్=మన ధర్మంప్రకారం మనకు సోదరియైన, సుందరిన్=సుందరిని, ఈ అనాథ=ఇప్పుడు తనకంటూ ఎవరూలేని, శిశుసుందరి=కూతురుగా బాలసుందరిని, నీకున్=ప్రేమరూపుడివైన నీకు, నేడు= ఈరోజున, ఇడుచుంటి=ఇస్తున్నాను. మీకు ఇకన్=భిక్షువులైన మీకింకా, సృష్టి=ఈ ప్రపంచమంతా, ఆనందము= పరమసంతోషకరం, సుందరమ్మయి=అందమైనదిగాను, కనంబడున్ కావుత=దర్శనీయం అగునుగాక!

**తాత్పర్యం:** *సోదరా నందా! ఆరోజున నీ ప్రియురాలి కౌగిట్లోనుండి నిన్ను తీసికెళ్ళిపోయాను కదా! ఇదిగో– ఇప్పుడీ ధర్మసోదరి సుందరిని, ఈ అనాథబాల చిన్నసుందరిని నీకిచ్చి నా ఋణం తీర్చుకున్నాను. ఇంక మీకు ఈ ప్రపంచమంతా అందమైనదిగాను, ఆనందమైనది గాను కనిపించునుగాక!*

**మిత్తి మొగమ్ము సొచ్చియును మీకయి వెన్కకు నేగుదెంచి యీ**
**యుత్తమురాలొసంగె దనయున్ దనయన్ మఱి కైకొనుండిదే!**
**మిత్తిప్రసాద మీ మిసిమిమీఁగడలన్, దొలినాఁటి కూర్మి రే**
**కెత్తి యనాథవత్సలత కిమ్మెయి చూలయి పండుఁగావుతన్.**

**అర్థాలు:** ఈ ఉత్తమురాలు=ఈ మంచిమగువ, మిత్తిమొగమ్ము=చావునోటిదాకా, సొచ్చియును=వెళ్ళికూడా, మీకయి=మీకోసం, వెన్కకున్=తిరిగి, ఏగుదెంచి=వచ్చి, తనయున్=కొడుకును, తనయన్=కూతురును, ఒసంగె= ఇచ్చింది. మఱి=ఇంక, ఇదే కైకొనుండు=వీరిని స్వీకరించండి. ఈ=ఈయొక్క, మిసిమిమీఁగడలన్=మిసమిసల తరగలకు, మిత్తిప్రసాదము=మరణమిచ్చే కానుకలు. తొలినాఁటి=అప్పటి, కూర్మి=ప్రేమ, రేకెత్తి=కొనలు సాగి, అనాథవత్సలతకు=దిక్కులేనివారిని పెంచేతత్వమై, ఇమ్మెయి=ఈ వెనువెంట, చూలయి=సంతానమై, పండుఁ గావుతన్=ఫలించుగాక!

**తాత్పర్యం:** *ఈ ఉత్తమురాలు చావునోటిలోకి వెళ్ళికూడా మీకోసం తిరిగివచ్చింది. మీమ్మీ పిల్లల్ని పెంచుకోమంది. స్వీకరించండి. మీ వయోలావణ్యానికి మరణమిస్తున్న కానుక. మీ అప్పటి ప్రేమపెద్దదై పుత్రవాత్సల్యమై ఇది మీ సంతానమై వర్థిల్లుగాక!*

**ఎందరొ నందులున్ మఱియు నెందరొ సుందరు లిట్టిదీనులౌ**
**కందుల, మంటిపుట్టువులఁ గాచి, యఖండము నవ్యయమ్ము నా**
**నందముఁ గొంద్రుగాత' మని నందుని సుందరికిచ్చె, సుందరిన్**
**నందునకిచ్చె, దివ్యకరుణామయుఁ దగ్గురుదేవుఁ డాదృతిన్.**

**అర్థాలు:** ఎందరొ నందులున్=మీలాగే ఎందరో నందులు, మఱియున్=ఇంకా, ఎందరొ సుందరులు=ఎందరో సుందరివంటి ఆడువారు, ఇట్టి=ఇటువంటి, దీనులౌ కందుల=సర్వం కోల్పోయిన పసిపిల్లల్ని, మంటిపుట్టువులన్= ఎవరికీ కాకుండా పుట్టినవారిని, కాచి=రక్షించి, అఖండము=ముక్కలుకాని, అవ్యయమ్మున్=తరిగిపోని, ఆనందమున్=పరమానందాన్ని, కొంద్రుగాత=పొందుదురుగాక! అని=ఈ విధంగాచెప్పి, దివ్యకరుణామయుఁ డు=పవిత్రమైన దయకు నిలయమైనవాడు, ఆ గురుదేవుఁడు=ఆ బుద్ధభగవానుడు, ఆదృతిన్=ఆదరంతో, నందుని=ఆ బాలనందుని, సుందరికి=సుందరీభిక్షువుకు, ఇచ్చె=ఇచ్చాడు. సుందరిన్=ఆ బాలసుందరిని, నందునకు= ఆ నందభిక్షువుకు, ఇచ్చె=ఇచ్చాడు.

**తాత్పర్యం:** *మీలాగే ఎందరో నందులు, ఇంకెందరో సుందరిలాంటివారు ఇటువంటి దిక్కులేని పసికందుల్ని, ఎవరికి పుట్టారోతెలియని అమాయక శిశువుల్ని రక్షించి అఖండమైన, శాశ్వతమైన పరమానందాన్ని పొందుదురుగాక అని ఆ దివ్యకరుణామయుడైన బుద్ధ భగవానుడు ఆదరంతో నందునికి బాలసుందరిని, సుందరికి బాలనందుని చేతుల్లో పెట్టాడు.*

**సుందరీనందు లా బాలనంద సుంద**
**రీకరాబ్జాతముల నూఁది, వ్రేఁకనై తొ**

**లంకు నానందవశత గళమ్ములెత్తి**
**జయము పాడిరి దేశిక స్వామికిట్లు.**

**అర్థాలు:** సుందరీనందులు=ఇప్పుడు సుందరి నందుడు అనే ఇద్దరు భిక్షువులు, ఆ=తాము క్రొత్తగా పొందిన, బాలనంద సుందరీ=చిన్నపిల్లలైన నందుని సుందరియొక్క, కరాబ్జాతములన్=మెత్తని చేతులను, ఊఁది=పట్టుకొని, వ్రేఁకనై=భారంగా, తొలంకున్=పొంగే, ఆనందవశత=విపరీతమైన సంతోషంతో, గళమ్ములెత్తి=గొంతులెత్తి, దేశికస్వామికి=గురుదేవులను, ఇట్లు పాడిరి=ఇలా స్తుతించారు.

**తాత్పర్యం:** *ఇప్పుడా భిక్షువులైన సుందరీ నందులు నూతనంగా తాము పొందిన దైవ సంతానమైన బాలనందు సుందరుల చేతులు పట్టుకొన్నారు. వారి గొంతులకు ఆనందం భారమై అడ్డుపడుతోంది. ఆ పరవశంతో గురుదేవులను ఇలా స్తుతించారు.*

**బుద్ధాయ మహిత ప్రబోధాయ వైరాగ్య**
**భవనాయ దేవ! తుభ్యం జయోస్తు**
**కలికల్మషహరాయ కారుణ్య లతికాల**
**వాలాయ దేవ! తుభ్యం జయోస్తు**
**నిర్జితహింసాయ నిర్మితధర్మ ప్ర**
**పంచాయ దేవ! తుభ్యం జయోస్తు**
**త్యాగస్వరూపాయ దశదిశాగత శిష్య**
**భజనాయ దేవ! తుభ్యం జయోస్తు**

**ఆర్తసంరక్షకాయ తుభ్యం నమోస్తు**
**పరమసత్యవ్రతాయ తుభ్యం నమోస్తు**
**దీనజనబంధు మిత్రాయ తే నమోస్తు**
**విశ్వకల్యాణకర గురవే నమోస్తు.**

**అర్థాలు:** బుద్ధాయ=జ్ఞానసిద్ధుడవు, మహిత=గౌరవించదగిన, ప్రబోధాయ=ఉపదేశాలు చేసేవాడవు, వైరాగ్య=భౌతిక సుఖాలంటే విసుగుకు, భవనాయ=పుట్టుకైనవాడవు, దేవ=భగవంతుడవైన, తుభ్యం=నీకు, జయోస్తు=జయం కలుగుగాక! కలికల్మష=కలియుగ మందలి పాపాలను, హరాయ=పోగొట్టేవాడవు, కారుణ్య=దయ అనే, లతిక=తీగకు, ఆలవాలాయ=నిలయమైనవాడవు, దేవ=భగవంతుడవైన, తుభ్యం జయోస్తు=నీకు జయమగుగాక! నిర్జిత=జయించిన, హింసాయ=సంహారం గలవాడవు, నిర్మిత=క్రొత్తగా నిర్మించిన, ధర్మ ప్రపంచాయ=న్యాయలోకం కలవాడవు, దేవ=భగవంతుడవైన, తుభ్యం జయోస్తు=నీకు జయమగుగాక! త్యాగస్వరూపాయ=దానానికి రూపమైనవాడవు, దశదిశాగత=అన్నిదిక్కులనుండి వచ్చిన, శిష్యభజనాయ= అంతేవాసులచేత స్తుతింప బడువాడవు, దేవ=భగవంతుడైన, తుభ్యం జయోస్తు=నీకు జయమగుగాక! ఆర్త సంరక్షకాయ= బాధితులను రక్షించువాడవైన, తుభ్యం నమోస్తు=నీకు

నమస్కారం, పరమసత్యవ్రతాయ= ఒకటే అయిన నిజమే దీక్షగా కలిగినవాడవైన, తుభ్యం నమోస్తు=నీకు నమస్కారం, దీనజన=దీనులైన, బంధు= కావలసినవారికి, మిత్రాయ=స్నేహితుడవైన, తే నమోస్తు=నీకు నమస్కారం, విశ్వకల్యాణకర=లోకం మొత్తానికి శుభం కలిగించేవాడవైన, గురవే=ఆచార్యా నీకు, నమోస్తు=నమస్కారం.

**తాత్పర్యం:** *జ్ఞానసిద్ధుడవు, గొప్ప ఉపదేశాలిచ్చేవాడవు, వైరాగ్యానికి పుట్టుకైనవాడవు, భగవంతుడవు నీకు జయమగుగాక! ఈ కలియుగమందు పాపాలను పోగొట్టేవాడా, దయాలవాలా నీకు జయమగుగాక! హింసను జయించినవాడా, ధర్మప్రపంచ నిర్మాతా నీకు జయమగుగాక! త్యాగస్వరూపా, దశదిశలనుండి శిష్యులచే స్తుతించబడువాడా నీకు జయమగుగాక! ఆర్తరక్షకా నీకు నమస్కారం! శాశ్వత సత్యమే వ్రతంగాగల నీకు నమస్కారం! దీనజనులందరికీ మిత్రుడా నమస్కారం! విశ్వ కల్యాణకారకా ఆచార్యా నీకు నమస్కారం!*

ఇది

నవమసర్గము

**బంధువు లేక మానసులు బాల్యసఖుల్ సహపాఠులున్ సమ**
**స్కంధులు, పింగళాన్వయుఁడు కాంతుఁడు, కాటురి వేంకటేశుఁడున్**
**సుందరనందరాగరసశోభితవృత్తము, రమ్యతత్త్వ మీ**
**సౌందరనందసత్కృతిని సల్పిరి దేశికుఁ డిచ్చమెచ్చఁగన్.**

**అర్థాలు:** పింగళాన్వయుఁడు=పింగళివంశంలో పుట్టినవాడు, కాంతుఁడు=లక్ష్మీకాంత నామధేయుడు, కాటురి= కాటూరి వంశీయుడైన, వేంకటేశుఁడున్=వేంకటేశ్వర నామధేయుడును, బంధువులు=చుట్టాలు, ఏకమానసులు= ఒకే మనస్తత్వం కలవారు, బాల్య= చిన్నప్పటినుండి, సఖుల్=స్నేహితులు, సహపాఠులున్=కలసి చదువుకున్నవారు, సమస్కంధులు= సమానమైన పాండితీపటిమ కలవారు, దేశికుఁడు=తమ గురుదేవులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు, ఇచ్చమెచ్చఁగన్=మనసారా మెచ్చుకోగా, సుందర నంద=సుందరీనందులయొక్క, రాగరస=ప్రేమభావంచేత, శోభిత= ప్రకాశించే, వృత్తము=కథావిశేషాన్ని, రమ్యతత్త్వము= మనోహరమైన పొందికగల, ఈ=ఈ కావ్యరూపమైన, సౌందరనంద=సౌందరనందమనే, సత్కృతిని=మంచి రచనను, సల్పిరి=చేసారు.

**తాత్పర్యం:** *పింగళి లక్ష్మీకాంతం, కాటూరి వేంకటేశ్వర రావు అనే ఇద్దరూ బంధువులు. అంతరంగాలు ఒక్కటే. చిన్నప్పటినుండీ స్నేహితులు. కలిసి చదువుకున్నవారు. నీవా నేనా అన్న పాండితీపటిమ ఉన్నవారు. ఇద్దరూకలిసి మనోహరమైన పొందికగల ఈ సుందరీ నందుల అనురాగ సంపదచేత శోభితమైన కథావిశేషాన్ని సౌందరనందమనే పేర మంచి కావ్యంగా తీర్చిదిద్దారు.*

**భావ మొక్కఁడుగాఁగ భావన యొక్కఁడై**
**రసభావపరిణతి యెసఁగఁజేసి**

**సరసార్థ మొకఁడుగా శబ్ద మింకొకఁడయి**
**శబ్దార్థసామరస్యము ఘటించి**
**సూత్ర మొక్కఁడుగాఁగ చిత్రణ మొక్కఁడై**
**ప్రాణవత్పాత్రముల్ పాదుకొల్పి**
**తెరయెత్తు టొకఁడుగా దెరదించు టొక్కఁడై**
**రంగనిర్వహణమ్ము రక్తినిల్పి**
**సుందరీనంద జీవితానంద మట్లు**
**పరమమగు కోటికెక్కిన బంధుభావ**
**మిత్రభావము లిమ్మెయి మేళగించి**
**సృష్టిజేసితి మీ కావ్య శిల్పమూర్తి.**

**అర్థాలు:** ఒక్కఁడు=ఒకరు, భావము=ఆలోచన, కాఁగ=కాగా, భావన=అనుస్మృతి, ఒక్కఁడై=మరొకరై, రసభావ పరిణతి=రస భావాలయొక్క పెంపును, ఎసఁగన్ చేసి=కలుగజేసి; సరసార్థము=రసవంతమైన అర్థం, ఒకఁ డుకాన్=ఒకరుకాగా, శబ్దము=పదసంపద, ఇంకొకఁడయి=మరొకడయి, శబ్దార్థ=పదం అర్థం యొక్క, సామరస్యము=మైత్రిని, ఘటించి=పాటించి, సూత్రము=ఎత్తుగడ, ఒక్కఁడుగాఁగ=ఒకరుకాగా, చిత్రణము=కూర్పు, ఒక్కఁడై=మరొకరయి, ప్రాణవత్=సజీవములైన, పాత్రముల్=నటులను, పాదుకొల్పి=ప్రతిష్టించి, తెరయెత్తుట= ప్రారంభం, ఒకఁడుగాన్=ఒకరుకాగా, తెరదించుట= ముగించుట, ఒక్కఁడై=మరొకరయి, రంగ నిర్వహణమ్ము= వేదిక ఏర్పాటు, రక్తినిల్పి=ఆసక్తికరంగా చేసి; సుందరీనంద=సుందరీనందుల, జీవితానందమట్లు= జీవితం ఎంత ఆనందంగా గడచిందో ఆవిధంగా, పరమమగు=మిక్కిలి, కోటికెక్కిన=ఉన్నతంగా సాగిన, బంధుభావ= బంధుప్రేమ, మిత్రభావము=స్నేహధర్మం, ఇమ్మెయి=ఈవిధంగా, మేళగించి=కలిపి, ఈ కావ్య=ఈ ప్రబంధంయొక్క, శిల్పమూర్తి=చక్కదనాల ఆకారాన్ని, సృష్టిజేసితిమి=పుట్టించాము.

**తాత్పర్యం:** *మాలో ఒకరు ఆలోచనకాగా ఒకరు అనుబోధమై రసభావాలను పెంపుచేసాం. ఒకరు అర్థం ఒకరు శబ్దమై శబ్దార్థాల మైత్రిని పాటించాం. ఒకరు ఎత్తుగడగానూ ఒకరు కూర్పుగానూ సజీవ పాత్రలను సృష్టించాం. ఒకరు మొదలుపెట్టడం ఒకరు ముగించడంగా రంగస్థలాన్ని ఆసక్తికరంగా మార్చాం. అలా సుందరీనందుల జీవితంలాగానే పరమోన్నతంగా సాగిన మా బంధుప్రేమను, స్నేహధర్మాన్ని కలిపి ఈ చక్కనైన కావ్యాన్ని రూపొందించాం.*

*సౌందరనందము*

సర్వమును

సంపూర్ణము